# రామకథ సాయిసుధ



- డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ఓం శ్రీ సాయిరామ్

శ్రీ

# రామ కథ సాయిసుధ


**డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం**

కన్వీనర్, ఆధ్యాత్మిక విభాగం, శివం, హైదరాబాదు

మాజీ రాష్ట్రకన్వీనర్, శ్రీ సత్యసాయి అధ్యయన మండలులు

ప్రొఫెసర్, తెలుగు సాహితి, హైదరాబాదు విశ్వవిద్యాలయం

హైదరాబాదు



ప్రచురణ

శ్రీ సత్యసాయి భక్తసేవాసంఘ ట్రస్టు

శివం, ప్రశాంతినగర్,

హైదరాబాదు - 500 044.

# సుధాబిందువులు

మునిపుంగవు డైన నారదమహర్షిని వాల్మీకి యిలా ప్రశ్నిస్తున్నాడు —

"కో న్వస్మి న్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః కః సమర్థ శ్చక శ్చైకప్రియదర్శనః
ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః
కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే
ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే
మహర్షే! త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవం విధం నరమ్."

ఈ భూలోకంలో ఎవడు గుణవంతుడు? ఎవడు వీర్యవంతుడు? ఎవడు ధర్మజ్ఞుడు? ఎవడు కృతజ్ఞుడు? ఎవడు సత్యవాక్యపరిపాలకుడు? ఎవడు దృఢవ్రతుడు? ఎవడు చారిత్రకయుక్తుడు? ఎవడు సర్వభూతముల యందు హితమును పచరించువాడు? ఎవడు విద్వాంసుడు? ఎవడు సమర్థుడు? ఎవడు ప్రియదర్శనుడు? ఎవడు ఆత్మజ్ఞాని? జితక్రోధు డెవడు? ద్యుతిమంతు డెవడు? అసూయలేనివా డెవడు? - ఇత్యాదిగుణములు గల నరు డెవ్వడు?

పరమాత్మను గురించి ప్రశ్నించ వలసిన ఈ పరమ మహర్షి, నారాయణుని గురించి ఆలోచించవలసిన ఈ మహర్షి నరుణ్ణి గురించి యోచిస్తున్నాడు. సర్వ గుణ సమగ్రుడైన నరుడు నారాయణు డని ఆయన భావం. సర్వగుణసమగ్రుడై నరాకృతి దాల్చిన నారాయణుడు భూతలంమీద ఉన్నాడా? వేదపురుషుడు భూలోకంలో మానవాకృతి ధరించి ఎచ్చటైనా ప్రత్యక్షమౌతున్నాడా? అవతరించిన పరమాత్మ ఎక్కడైనా ఉన్నాడా? త్రిలోకజ్ఞుడవైన నారదా! నాకు సెలవిమ్ము. పరమాత్మనుగురించి అన్వేషించటం బ్రహ్మజ్ఞుడైన మహర్షి పచరించే పద్ధతి. అవతారమూర్తియైన పురుషునిగురించి ఆలోచించేపద్ధతి దార్శనికుడైన వాల్మీకి పెట్టినమార్గం. అవతారమూర్తిని ఉపాసించే పద్ధతితో ఆరంభమైంది రామాయణం!

వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడై జన్మించిన కథతో రామాయణం మొదలు కావాలి. నారదు డందుకొన్నాడు - 'వాల్మీకిమహర్షీ! నీవు చెప్పిన గుణాలు నరునియందు ఉండటం దుర్లభం. నేను దర్శించి చూడగా నాకంటికి దశరథాత్మజుడైన రాముడు కనబడుతున్నాడు' అని చెపుతూ -

"ఇక్ష్వాకువంశ ప్రభవో రామోనామ జనైః శ్రుతః
నియతాత్మా మహావీరో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ"

ఇత్యాది లక్షణాలతో శ్రీరాముణ్ణి సమగ్ర మానవమూర్తిగా సంభావించి, అతని గుణసమగ్రత్వాన్ని కీర్తించాడు.

"స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః
సముద్ర ఇవగాంభీర్యే ధైర్యేచ హిమవా నివ
విష్ణునా సదృశో వీర్యే సోమవ త్ప్రియదర్శనః
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః
ధనదేనసమ స్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః
త మేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్."

పైన చెప్పబడిన సర్వగుణాలతో కూడుకొన్నవాడు, కౌసల్యానందవర్ధనుడైన రాముడు. అతడు గాంభీర్యానికి సముద్రుని వంటివాడు; ధైర్యానికి హిమవత్పర్వతం వంటివాడు; వీర్యానికి విష్ణువువంటివాడు; సుందర దర్శనానికి చంద్రుని వంటివాడు; క్రోధానికి కాలాగ్ని వంటివాడు; ఓర్పుకు భూమి వంటివాడు; త్యాగానికి కుబేరుని వంటివాడు; సత్యానికి ధర్ముని వంటివాడు. ఇటువంటి గుణసంపన్నుడైన రాముడు సత్యపరాక్రముడు - అని నారదుడు శ్రీరాముని గుణ సమగ్రత్వాన్ని కీర్తించాడు. దేవతాత్మలతో తుల్యుడైన మానవుణ్ణి ఆయన వర్ణించాడు. రామ కథ నంతా వాల్మీకికి సంగ్రహంగా చెప్పాడు. వేదపురుషుడు మానవాకృతిలో నిర్వహించిన సాధనాత్మకమైన జీవన ప్రవృత్తిని వాల్మీకి హృదయంలో ప్రత్యక్షీకరింప జేశాడు. నారదుడు అంతర్హితుడైనాడు.

రామచరితమంతా శ్రవణామృతంగా విన్నాడు వాల్మీకి. అతనికి సమగ్ర మానవ దర్శనం మనోనేత్రానికి అందింది. అతని దివ్య

చారిత్రం మనన రూపంగా నిలిచింది అది కావ్యరూపంగా ప్రసరించాలి. వాల్మీకి మనస్సు నిర్మలంగా ఉంది. నిర్మలమైన మనస్సుతో వీర్య వంతుడైన ఆ పరమాత్మ యొక్క సగుణ చింతనం చేస్తూ వాల్మీకి తమసానదీ తీరానికి స్నానానికి వెళ్ళాడు. ఆ నది అపూర్వంగా, అతి నిర్మలంగా కనపడింది. శిష్యుడైన భరద్వాజునితో ఇలా అన్నాడు:

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ! నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా!"

ఉత్తముని మనస్సు ఎలా నిర్మలంగా ఉంటుందో అలాగే తమసానది ప్రసన్నమైన జలాలతో అతినిర్మలంగా, రమణీయంగా ఉంది. వినిర్మల మైన చిత్తవృత్తితో ఋషి చూచిన చూపుకు ఆ నది ఒక ఉత్తముని మనస్సువలె అతినిర్మలంగా శుద్ధమైన మణిదర్పణంలా కనపడింది. అది వాల్మీకి చిత్తానికి ప్రతిబింబం. విశుద్ధమైన ఆత్మతో, సత్త్వగుణ సంపన్నమైన హృదయంతో పరమాత్మను దర్శించేటప్పుడు తమసానది వలెనే మనకు లోకమంతా కనపడుతుంది; అకర్దమంగా - బురద లేనిదిగా కనపడుతుంది. నిష్కల్మషంగా గోచరిస్తుంది. అంటే - మన మనస్సు ముందు నిర్మలం కావాలి. నిర్మలమైన హృదయ మణిదర్ప ణము నందే భగవంతుని పవిత్ర దివ్య తేజస్సు ప్రసరిస్తుంది, ప్రతిబిం బిస్తుంది, ప్రకాశిస్తుంది. వాల్మీకి హృదయం ఆర్షమై, నిర్మలమై, అకర్ద మమై, దైవికమైన తేజస్సును తనలో ప్రతిబింబింపచేసికొనే పరిపక్వ దశను సంతరించుకొని పరిపక్వమైన రమణీయవాక్కుకోసం వేచి యున్నది.

ఇంతవరకు కథ ప్రసన్నంగా సాగింది. వాల్మీకి ఆ చల్లని నదీ జలాల్లో దిగి స్నానం చేద్దామని తలంచి - 'శిష్యా! భరద్వాజా! నా శాటిక నిటివ్వరా!' అని వల్కలాన్ని తీసికొన్నాడు. తమసానదిలో దిగాలని మనస్సు ఉల్లాసపడుతోంది. కాని, ప్రక్కనే వన మున్నది. ఆ వనంలో సంచరించాలని వాల్మీకికి ఆసక్తి కలిగింది. వనమునందు ధిగటానికి ఉన్ముఖుడైన వాల్మీకి వనంలో విహరించటానికి ఉన్ముఖు

డైనాడు. 'వనము' అనే పదానికి నీరు అనీ, అరణ్యమనీ రెండర్థాలున్నాయి. నీరూ, అరణ్యం - ఈ రెండూ జీవితాలే. జలంలో విహరించే జీవితం సంసారమయమైన జీవితం; అరణ్యంలో సంచరించే జీవితం ఆర్షమైన జీవితం. రామ కథను రచింపబోతున్న వాల్మీకి పరమాత్మను సగుణంగా, సాకారంగా దర్శించి, గార్హస్థ్యజీవితంలో ధర్మబద్ధమైన ప్రవిమల జీవితాన్ని నిర్వహించిన ఆ అవతారమూర్తియొక్క సంసార మాధుర్య చిత్రణాన్ని నిర్వహింపబోతున్నాడు. వాల్మీకి హృదయం ధర్మబద్ధమైన సంసారజీవిత స్రవంతిలో మునుగబోతున్నది. అలా మునిగితే మనసుకు పరిపక్వదశ ఉండదు అరణ్య జీవితంలో తాను సంపాదించుకొనవలసిన జ్ఞానవిశిష్టమైన తపస్సును సంతరించుకొనకుండా ఆ స్రోతస్వినిలో మునిగితే మునగటమే తప్ప లేవడం ఉండదు. మునిగి లేచే శక్తిని సంపాదించటానికి అతడు అరణ్యంలోకి వెళ్ళాడు; విహరిస్తూ ఉన్నాడు. అంతలో అతనికి అత్యంత మధురమైన శబ్దం వినపడింది. రతిక్రీడాలాలసమైన క్రౌంచమిధునం చేస్తున్న నాద మది. అవ్యక్తమధురంగా ఉంది. ఆ నాదం అతనిలోని సుప్తచైతన్యాన్ని మేల్కొల్పుతున్నది. ఆ నాదాన్ని రమిస్తూ ఆ మహర్షి ఆ వైపు వెళ్ళుతున్నాడు. ఆ రక్తిలో ఉన్న మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు. అంతలో ప్రళయం. ప్రక్కన ఒక బోయవాడు విల్లంబు నెక్కుపెట్టాడు. సతితో క్రీడిస్తున్న మగ పక్షిని కొట్టాడు. అది విలవిల తన్నుకుంటూ నేల మీద పడింది. రక్తపు మడుగు. అందులో ఆ మగపక్షి అటూ ఇటూ కొట్టుకొంటోంది. ప్రాణాలు వదలి పెట్టింది. అలా పడి, విలవిలా తన్నుకొని, కన్నుమూసిన తన పతిని చూచి క్రౌంచి ఆక్రందిస్తోంది. వాల్మీకి ఆ దృశ్యం చూచాడు. విషణ్ణుడైనాడు. ఆ క్రౌంచీరోదనంలో భాసిస్తున్న భావంలో తన్మయుడైనాడు; తానూ శోకమూర్తి అయినాడు; ఏమిటి ఈ శోకమూర్తి కావటంలో విశేషం?

రామకథను నిర్వహించటానికి వాల్మీకిలోని ఋషి సాధింపవలసింది ఏమిటి? తాను ఏ జీవుని చరిత్రను వ్రాయదలచుకొన్నాడో

ఆ జీవునియొక్క అనుభూతితో సహానుభూతి (identity) ని భజించే మానసిక ప్రవృత్తిని సంతరించుకోవాలి. పతిని కోల్పోయి శోకిస్తున్న సతిభావంలో వాల్మీకి తన్మయుడైనాడు. ఆ జీవునివేదన ఈ జీవునివేదన సమస్థితిని పొందాయి. నిష్కారణంగా ఇటువంటి వేదనను కల్పించిన ఆ నిషాదునిపై వాల్మీకికి కోపం వచ్చింది.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిధునా దేక మవధీః కామమోహితమ్."

'ఏమిరా నిషాద! కామమోహిత మైన ఈ మిధునంనుండి మగపక్షిని వధించావు. నీవు చిరకాలం ప్రతిష్ఠను పొందకుందువు గాక! అని అప్రయత్నంగా అతని నోటినుండి ఒక శ్లోకవాక్యం వెలువడింది. తరువాత ఆ శ్లోక వాక్యాన్ని తానే మననం చేసికొంటూ 'ఏమిటి? అద్భుత మైన శ్లోకం నా నోట వెలువడిందే' అని అబ్బురపడుతూ, తమసానదిలో స్నానంచేసి ఆశ్రమానికి వెళ్ళాడు వాల్మీకి.

ఆశ్రమానికి చేరేసరికే బ్రహ్మదేవుడు వచ్చి ఆశ్రమంలో కూర్చొని ఉండటం గమనించాడు. ఆతురతతో ఆయనకు అర్ఘ్యపాద్యాదులిచ్చాడు. జరిగిన సంగతంతా చెప్పాడు. 'క్రౌంచీశోకం నా హృదయం నుండి ఒక శ్లోకాన్ని ఉద్భవింపచేసింది. తంత్రీలయబద్ధమైన ఆ ఛందస్సును మననం చేసికొంటున్నా'నని నివేదించాడు. బ్రహ్మదేవుడు మందహాసంతో ఇలా ఇన్నాడు - 'నాచేత ప్రేరేపింపబడిన సరస్వతి నీలో ప్రతిస్పందించింది; ఒక ఛందస్సుగా నీ వాక్కులో అవతరించింది. ఈ ఛందస్సులోనే రామకథను రచించు.'

"రామస్యచరితం సర్వం కురు త్వం ఋషిసత్తమ
ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః
వృత్తం కథయ వీరస్య యథా తే నారదా చ్ఛ్రుతమ్
రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః".

'నారదునివలన నీవు ఏవిధంగా విన్నావో ఆవిధంగా నీవు రామాయణాన్ని రచించు. రామకథలో రహస్యము లైనవీ, ప్రకటము లైనవీ

అయిన అంశాలన్నీ నీ మనస్సుకు స్ఫురిస్తాయి. నీకు సర్వం అవగత మౌతుంది. దాన్ని నీవు దర్శించి అనుష్టుప్శ్లోకబద్ధం చేయి. నీవు రచించిన రామకథ గిరులు, నదులు, సముద్రాలూ ఎంతకాలం ఉంటాయో అంతకాలం చిరంజీవిగా లోకంలో వ్యాపించి ఉంటుం'దని వాల్మీకికి వరమిచ్చి, రామాయణాన్ని రచించు మని ప్రోత్సహించి బ్రహ్మదేవుడు వెళ్ళిపోయాడు.

ఇక్కడ ముందుగా మనం వాల్మీకి పాత్రను అర్థం చేసికోవాలి. అతడు మహర్షి, బ్రహ్మజ్ఞాని. అయితే, తాను పొందే బ్రహ్మానందాన్ని లోకంకూడా పొందాలని తలచిన కరుణామయుడు. ద్రష్టగా తాను పొందిన అనుభవాన్ని స్రష్టగా లోకానికి అందించాలని అభిలషించాడు. నిర్గుణ బ్రహ్మోపాసనంవల్ల వాల్మీకి బ్రహ్మానందాన్ని పొందగలడు. ఆ నిర్గుణమైన బ్రహ్మమే సగుణంగా శ్రీరామమూర్తిగా అవతరించింది. అతని కథను వర్ణిస్తే లోకులు బ్రహ్మానందాన్ని పొందే మార్గాన్ని తెలుసుకొంటారు. సగుణ బ్రహ్మ ఆదర్శమానవరూపంగా అవతరించి నప్పుడు అతని జీవితం మానవాళికి సహానుభూతితోపాటు సందేశాన్ని కూడా అందిస్తుంది. అందువల్ల రామకథ లోకానికి తరణోపాయం అవుతుందని భావించి మహర్షి మహాకవి ప్రవృత్తిని భజించాడు.

అట్టి కవి యైన ఋషి రామకథను రచించవలసి వచ్చినప్పుడు అన్వేషణ ఎలా సాగించాడో చూడండి: 'అవతారమూర్తి ఎక్కడున్నాడు? ఆయన కథను ఎలా దర్శించాలి? ఎలా రచించాలి?' ఇది ఆయన అన్వేషణ. అది ఆర్తిగా పరిణమించింది. ఆకలౌతున్న శిశువు ఏడుస్తుంటే తల్లి ఏ విధంగా పరుగెత్తుకొని వచ్చి, శిశువుకు స్తన్యాన్నిచ్చి లాలిస్తుందో - అలాగే ఎక్కడ ఆర్తి అత్యుత్కటంగా వెలువడుతుందో అక్కడికి కరుణామయుడైన భగవంతుడు తానే పరుగు పరుగున వస్తాడు, లేదా తన దూతను పంపిస్తాడు. వాల్మీకి ఆర్తిని విని భగవంతుడు పంపిన దూత నారదుడు. ఆ దూత మహర్షికి మార్గాన్ని చూపించాడు. 'రామకథ' అనే మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రాన్ని

వాల్మీకి మననం చేసికొన్నాడు. ఆ మంత్రంలోని రామతత్త్వం ఆయనకు ప్రసన్నమౌతోంది. అప్పుడు 'ఆత్మవత్ సర్వభూతాని' అన్న అనుభవం కలగాలి. కలిగిందా లేదా అని భగవంతుడు పరీక్ష పెట్టాడు. క్రౌంచీ శోకంలో తాదాత్మ్యాన్ని చెంది 'ఆత్మవత్ సర్వభూతాని' అన్న మానసిక స్థితిని వాల్మీకి సాధించుకొన్నాడు. ఇట్టి మానసిక పరిపక్వదశను సాధించుకొన్న వాల్మీకి రామాయణాన్ని రచించటానికి అర్హతను సంపాదించుకొన్నాడు. ఈ కథలో బ్రహ్మ ఆచార్యుడు. ఆచార్యుడు భగవంతుని నమ్మి ముందుకు నడుస్తున్న భక్తునికి మార్గాన్ని చూపిస్తాడు. ఇది భగవంతుని చిద్విలాసం. రామకథను వాల్మీకి భావిస్తూ ఉంటే అతని మనస్సులో రామజీవితం చిత్రంవలె గోచరించింది; దర్శనంలా జాలువారింది.

రామాయణంలో జరిగిన ఈ సన్నివేశాన్ని చెప్పుతుంటే కొందరికి అద్భుతంగా, కట్టుకథగా అనిపించవచ్చు. ఈ నెల (ఏప్రిల్, 1980) సనాతన సారథిలో లారెన్స్ గాలెంటీ వ్రాసిన ఇంగ్లీషు వ్యాసానికి తెలుగు అనువాదం ప్రచురింపబడింది చూడండి. వ్యాసం పేరు - 'బాబా చెప్పిన పాఠం.' లారెన్స్ గాలెంటీ అమెరికాలో పరిశోధన చేస్తున్న ఒక పండితుడు. క్రైస్తవ మతంలో గట్టి నమ్మకమున్నవాడు. బైబిలును, ఏసుక్రీస్తు తత్త్వాన్ని చక్కగా చదువుకొన్నవాడు ఆయనకు బాబాగారి విభూతిని తీసికొని వెళ్ళిన ఒక వనిత పరిచయమైంది. 'ఈ విభూతిని మీ దగ్గరకూడా కొంత ఉంచుకోండి, నుదుట ధరించండి, మీకు తప్పకుండా ఫలితం కలుగుతుంది' అని చెపుతూ కొంత విభూతిని ప్రసాదంగా అతని కిచ్చింది. ఆ విభూతిని ఎడమ అరచేతిలో వేసికొని కుడి చేతితో కొంత నుదుట దిద్దుకొన్నాడు. ఎడమ చేతిలో వేసికొన్న చోట అరచేయి వెచ్చబడింది. ఆశ్చర్యపోయాడు. అప్పుడప్పుడూ అతని అరచేయి వెచ్చబడుతూ ఉండేది. ఏసుక్రీస్తు పటాన్ని చూచినప్పుడూ, క్రైస్తవ మందిరానికి వెళ్ళినప్పుడూ, సద్భావనలు వచ్చినప్పుడూ అలా జరుగుతూండేది. తరువాత కొన్నాళ్ళు నిర్విరామంగా

అరచేయి వెచ్చగా ఉండేది. ఆ మహిమ అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. 'ఇన్ని వేలమైళ్ళ దూరంలో ఉన్న ఆ బాబా ఎవరు? నాలో ఒక అద్భుత చైతన్యాన్ని ఆయన ఎలా కలిగిస్తున్నారు?' అన్న ఆలోచన అతనిలో బయలుదేరింది. బాబాను గురించి ఒకటి రెండు గ్రంథాలు చదివాడు. అందులో చెప్పబడిన మహిమలను చూస్తే ఏసుక్రీస్తు తన జీవితకాలంలో ప్రదర్శించిన మహిమలవంటివిగానే కనిపిస్తున్నాయి. శ్రీ సత్యసాయిబాబావారి అద్భుత శక్తుల మీద ఒక గ్రంథం రచించాలని అతని కనిపించింది. అయితే, అతడు ఏసుక్రీస్తునే భగవంతునిగా నమ్మినవాడు. బాబాగారి మీద ఏమి వ్రాయాలి, ఎలా వ్రాయాలి అనే మధన అతనిలో బయలుదేరింది ఒకనాటికలలో అతనికి 'Sai Baba Contemporary Mystic, Master and God అన్న పేరు చెక్కబడిన గ్రంథం కనపడింది. ఆయన పరిశోధన కదే అంశంగా తరువాత రూపొందింది. కాలం కొంత గడిచింది. అతనిలో జిజ్ఞాస అధికమైంది. బాబాను దర్శించటానికి భారతదేశం వచ్చాడు. తనకున్న అనుమానాలన్నింటినీ 20, 30 ప్రశ్నలుగా వ్రాసి బాబా కందించాడు. ''ఏసుక్రీస్తును గురించి నీవు ఎవరిని అడుగుతావో అతడు దేవుని పుత్రు డని చెప్పినవాడు దివ్యాత్మ డని తెలుసుకో' అని ఏసుప్రభు వన్నాడట. బాబా ఏమంటారో విందామని లారెన్స్ గాలెంటీ కొన్నాళ్ల ఓపికతో వేచియున్నాడు. అంతలో 1976 క్రిస్టమస్ వచ్చింది. స్వామి అతనిని పిలిచి 'నీవు ఏసుక్రీస్తును గురించి ఈనాడు ఉపన్యసించు' అని అనుమతించారట. అతనికి ఆశ్చర్యం వేసింది. ఎవరిని గురించి బాబా ఏమి చెప్పతారో విందామని ఉబలాటపడుతున్నాడో అతనిని గురించి తననే మాట్లాడమన్నారు స్వామి. అప్పటినుండి అతనిలో ఒక దివ్యచైతన్యం ప్రారంభమైంది. ఏసుక్రీస్తు జీవితం అతని కన్నుల ముందు చలనచిత్రంలా కనబడటం మొదలైంది. ఆ అనుభవం అతనికి దాదాపు మూడువారా లున్నదని అతనే వ్రాశాడు.

1976 లో అమెరికన్ పరిశోధకుణ్ణి ఏసుక్రీస్తు తత్త్వాన్ని గురించి ఉపన్యసించాలని స్వామి ఆదేశించటం వాల్మీకిని రామకథను

రచించుమని బ్రహ్మ నిర్దేశించినట్లుగా లేదూ? లారెన్స్ గాలెంటీకి ఏసు క్రీస్తు చరిత్రం చలనచిత్రంగా గోచరించటం వాల్మీకి మనోనేత్రానికి రామ కథ అంతర్బహిశ్చరిత్రంతో దర్శనీయమైనట్లు లేదూ? అటు వంటి దర్శనం ఇవ్వగలిగిన ఆచార్యుడు ఉంటే భగవత్తత్త్వం కన్నుల ముందు కనిపిస్తుంది. దాన్ని దర్శించాలన్న ఆకాంక్ష, ఆర్తి భక్తుని హృదయంలో ఉంటే అది గోచరిస్తుంది. మూడు వారాలపాటు తాను పొందిన దివ్యానుభూతిని మైపులకలతో వర్ణించి చెప్పాడా వ్యాసకర్త. బ్రహ్మదేవుని చేత ఆదేశింపబడిన తరువాత వాల్మీకి కూడా కొన్నాళ్ళు అదే స్థితిలో ఉండి ఉండాలి. అట్టి సమాధిస్థితి నుండి, దర్శనసిద్ధినుండి లేచి గంటం పట్టాడు వాల్మీకి. ఆ సమాధినుండి ఆవిర్భవించిందే అల నాటి వాల్మీకి రామాయణం.

లారెన్స్ గాలెంటీ మరీ ఇలా అన్నాడు: 'స్వామి నన్ను ఉపన్యసించమన్న తరువాతనే నేను ఏసుక్రీస్తును గురించి చాల నేర్చు కొన్నాను.' ఈ మాటలు మన కొక సత్యాన్ని వెల్లడిచేస్తున్నాయి. శ్రీ సాయిరామ తత్త్వాన్ని తెలుసుకోదలచుకొన్నవారు అధ్యయన కేంద్రాల (Study circles) ద్వారా దాన్నిగురించి తెలిసికొనే ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నంలో ఆ తత్త్వం ప్రత్యక్షమౌతుంది. అందు వల్లనే మనం ఈ సమాలోచన కార్యక్రమాన్ని ఆరంభించుకొంటున్నాం. ఇది స్వామి కరుణతో కల్పించిన దివ్యావకాశంగా భావించుకొంటున్నాం. రామ కథలో సాయితత్త్వ సుధను రంగరించుకొని ఆస్వాదించుకొం టున్నాం.

స్వామి రామాయణాన్ని గురించి ఎన్నో దివ్యోపన్యాసా లిచ్చారు. ఈ యుగంలో రామాయణాన్ని ఎలా అవగాహన చేసికోవా లనో మార్గాలను నిర్దేశించారు. అవి వాల్మీకి హృదయానికి దర్పణం పట్టుతున్నాయి. వాల్మీకి సమగ్ర మానవుణ్ణి రామునిలో దర్శించాడు. స్వామి కూడా రామాయణాన్ని చదివేటప్పుడు రాముణ్ణి సమగ్ర మాన వునిగా అర్థం చేసికోవటానికి యత్నించండని మనలను హెచ్చరిస్తు

న్నారు. మానవునిలో ఉన్న మానవత్వాన్ని ముందుగా అర్థం చేసికో లేకపోతే దివ్యత్వాన్ని ఎలా దర్శింపగలుగుతారని మనలను ప్రశ్నిస్తున్నారు.

స్వామిలో రెండంశ లున్నాయి. ఆయన శ్రీరామ, శ్రీకృష్ణావ తార తత్త్వాల సమన్వయమూర్తి. స్వామిలో రామావతార తత్త్వం ఉంది; శ్రీకృష్ణావతార తత్త్వం ఉంది రామావతారంలో అవతార మూర్తియైన రాముడు ఆర్తిని ప్రకటించినట్లుగా మనకు కనపడు తుంది. శ్రీకృష్ణావతారంలో శ్రీకృష్ణుడు ఎప్పుడూ ఆర్తిని ప్రకటించి నట్లు కనపడదు; ఆయన పచరించిందంతా అనురక్తి. ఆర్తిని ప్రతిబిం బించుకొనే అవతారం సాధనకు ప్రతీకగా ఉంటుంది. అనురక్తిని ప్రదర్శించే అవతారం బోధనకు ప్రతీకగా ఉంటుంది. 'నా జీవితమే ఒక సందేశం' అంటున్నప్పుడు స్వామి శ్రీరాముడు. 'నేను అవతార మూర్తిని, నేను ఆనందపరబ్రహ్మను' అంటున్నప్పుడు స్వామి శ్రీకృష్ణుడు. ఈ రెండింటికి తేడా తెలియకపోతే స్వామి తత్త్వం అవ గతం కావటం కష్టం. అందువల్లనే స్వామి రామునిలో ముందు ఆదర్శ మూర్తిని చూడుమంటారు. ఆ తరువాత అద్భుతమూర్తిని దర్శించు మంటారు. రామునిలో ఆదర్శమూర్తి ఎక్కువగా కనిపిస్తుంది; శ్రీకృష్ణు నిలో అద్భుతమూర్తి ఎక్కువగా కనిపిస్తుంది. ఆ అవతార తత్త్వాలే అటువంటివి. ఒకవిధంగా చూస్తే - రాముడు ప్రవాహంలో ఈదుతున్న ఈతగానిగా అనిపిస్తాడు; శ్రీకృష్ణుడు ప్రవాహంలో విహరిస్తున్న పరమహంసలా గోచరిస్తాడు. ఈతగాడు లోతైన నీళ్ళలో దిగినా మునుగకుండా ఈదుతాడు, ఒకచోట నిలబడకుండా ఒడ్డుకు చేరే యత్నం చేస్తాడు. రాముడు సంసారస్రవంతిలో దిగినా తలమునక లుగా మునిగినవాడు కాడు; తలను పైకెత్తే ఉంచి స్రవంతిని తరించిన ఆదర్శమూర్తి. శ్రీకృష్ణుడు వరమహంస. ఎంత లోతు నీరైనా అసలు లోతులో మునగడమన్నది ఆయనకు లేనేలేదు. ఎప్పుడూ తేలుతూ తెప్పతిరునాళ్ళు చేసినవాడే. నీరు తన శరీరంమీద పడినా తామరాకు

మీది నీటిబిందువులా జారిపోవలసిందే. సంసారంలో లీలగా విహరి స్తున్నా ఆ బాధ తనకు అంటనివాడూ, అందువలన ఒడ్డుకు చేరాలన్న ప్రక్రియే లేనివాడూ అయిన పరమహంస శ్రీకృష్ణుడు. స్వామి తమ అవతారతత్త్వాన్ని వివరిస్తూ చెప్పిన కొన్ని వాక్యాలు మనం గమనింప దగినవి.

"ధర్మానికి హాని కలిగి అధర్మం ప్రబలుతున్నప్పుడు నిరాకారు డైన పరబ్రహ్మం నరాకారం ధరించి భూమికి దిగివస్తాడు." "నీళ్ళలో మునిగిపోతున్న మనిషిని రక్షింపదలచుకొన్నవాడు నీళ్ళలో దుముకు తాడు; మానవాకారం ధరించినప్పుడే భగవంతుడు మానవులకు అర్థ మౌతాడు." అవతరించే పురుషుడు ఎప్పుడూ తన దివ్యధామంనుండి ఒక అడుగు క్రిందకు వేయాలి. ఆర్తితో నేలమీద నిలువబడి యున్న భక్తుల్ని ఒక అడుగు పైకి లాగుకోవాలి. అంటే భక్తుల దుఃఖాన్ని తానూ కొంత పంచుకోవటానికే భగవంతు డవతరిస్తా డన్నమాట! నిజాన్ని ఎంత చక్కగా చెప్పారు!! "మానవ శరీరానికి సహజమైన బాధలనుకూడా అవతారపురుషుడు అనుభవిస్తాడు. ఈ రూపంలో పరమాత్ముడు మానవులపట్ల గల ప్రేమవల్ల కొంత సుంకం చెల్లించ వలసి వస్తుంది." బాధపడుతున్న జీవులమీద భగవంతునికి అపారమైన కరుణ. ఆ కరుణతో కరిగి తాను తన నిత్యానంద ధామంనుండి శరీరావరణంలోనికి దిగివస్తాడు. భక్తుల బాధలను పంచుకొంటాడు. ఈ పంచుకోవటం భగవంతుడు అవతరించినందువలన సంతోషంగా చెల్లించే సుంకమని స్వామి వివరించారు. అవతారమూర్తి వస్తుతః ఆనందమూర్తి; భక్తుల ఆర్తిని తాను భరిస్తే ఆయనలో ఆర్తి భాసిస్తుంది. అయినా ఆ ఆర్తి ఆయనకు అంటదు. అంటకుండా అనుభవించటం అవతారమూర్తి తత్త్వం.

రామావతారానికి గానీ, సాయిరామావతారానికి గానీ వర్తించే అవతార తత్త్వ మిదే. తమ అవతారాన్ని గూర్చి స్వామి చెప్పిన మాటలు వినండి-"మతంలో దైవంలో విశ్వాసం అంకురింపచేయటానికి

వచ్చాను. తేలుకుట్టినందువల్ల నేను సాయిబాబాను అయ్యానని కొందరు అంటారు. తేలు కాటుకు గురియై సాయిబాబాలుగా మారండి చూతాం! తేలుకాటుకూ దీనికీ సంబంధం లేదు. అసలు తేలు లేనే లేదు. ధర్మ పునరుద్ధరణంకోసం ఎందరో తపస్వులూ, సాధుపురుషులూ, సాధకులూ ప్రార్థించిన ఫలితం నా అవతరణం."

ఆ దివ్యాత్మకు ఎంత ఆర్తి వినపడిందో - మనకోసం మనమధ్య మన శరీరంతో మానవునిగా అవతరించారు! ఆ తత్త్వం తెలిసికోవటం కష్టం. తెలిస్తే స్వామి మన కొంగుబంగారం! చేతుల కందే కల్పవృక్షం!!

"నా రహస్యం మీకు అంతు చిక్కదు. ఆ తత్త్వంలో మీరు ఓలలాడండి. తర్కవితర్కాలవల్ల ప్రయోజనం లేదు. దిగితే కాని లోతు తెలియదు. తింటే కాని రుచి తెలియదు. ప్రేమ అభివృద్ధిపరచుకోండి. ఇతరములైన కోరికలు కోరనక్కర లేదు. అడుగకుండానే అన్నీ అవంతటఅవే మీకు లభిస్తాయి." ఆర్తిని విని అవతరించే భగవంతుని తత్త్వం ఆలా ఉంటుంది. వాల్మీకిమహర్షి ఆర్తిని విని రాముడు అతని హృదయక్షేత్రంలో అవతరించాడు; వాగ్దర్పణంలో ప్రతిబింబించాడు.

మందిరము నా మనసు
ఇందుండ రావా!
సుందరాకార! ఆ
నంద సాయీశా!

అని మనం పిలిస్తే మన హృదయ మందిరాల్లో స్వామి అడుగుపెట్టాలి. అడుగు పెట్టటానికి తగినంత ఆర్తి మన హృదయాలలో ఉండాలి. రామాయణాన్ని చదివేటప్పుడు ఇటువంటి ఆర్తితో చదువుమన్నారు స్వామి. రాముణ్ణి దైవంగా నీవు తరువాత భావిద్దువు గాని, అవతార పురుషునిగా అతనిలో ఉన్న దైవత్వాన్ని తరువాత గ్రహింతువుగాని, ఆదర్శపురుషునిగా ముందు చూడు - అంటారు స్వామి.—'Although

by Sadhana. one can get the grace of Lord Rama yet, if one does not understand and recognize the human qualities in Him, one cannot comprehend divinity in Him either. It is very necessary, at the present time, to look upon Rama as an ideal human being who is an example for all people rather than simply beleve Him to be an incoronation of God When you cannot understand Rama as an ideal example of human being, how are we going to understand him as God?' (Summer showers in Brindavan - 1977.)

ఆదర్శమానవుని (An ideal man) గానే రాముణ్ణి అర్థం చేసికో లేకపోతే అద్భుతమూర్తి (A man of miracle) గా ఎలా అర్థంచేసికో గలుగుతారు? ఆదర్శపురుషుడు అర్థమైతేనే అవతారపురుషుడు అర్థ మయ్యేది - అని స్వామి మనలను హెచ్చరిస్తున్నారు.

రామకథ ఆదర్శమానవ చరితం చెపుతుంది. భాగవతం అద్భుత మూర్తిని గురించి బోధిస్తుంది. సాయిరామకథ రెండింటిని కలిపి సేతువు కట్టుతుంది.

రామాయణాన్ని అధ్యయనం చేయటానికి 'రామకథారస వాహిని'లో మరొకమార్గం చూపారు స్వామి. "రామాయణము రెండు పాఠములను బోధించుచున్నది. నిస్సంగత్వము ఎంతో విలువైనదనీ, ప్రతి ప్రాణిలోనూ దివ్యత్వమును గుర్తింపవలెననీ బోధించుచున్నది. అయోధ్యానగరపు భోగభాగ్యాలను విసర్జించుటచేత సీతాదేవి వనవాస కాలమున రాముని సన్నిధి పొందగలిగినది. కాంచనమృగమును చూచి మోహములో పడుటవలన ఆమె రాముని సన్నిధిని కోలుపోయినది. పరిత్యాగము వలన ఆనందమూ, మోహబంధము వలన దుఃఖమూ ప్రాప్తించును."

"లోకమున జీవించుచున్నప్పటికీ లౌకిక జీవితమున మునిగి పోరాదు. రాముని సోదరులూ, సహచరులూ అందరూ ధర్మమూర్తులే. దశరథుడు పది ఇంద్రియములున్న భౌతిక కాయము. ఆయన ముగ్గురు

రాణులూ సత్త్వరజస్తమో గుణములు. ఆయన నలుగురు కుమారులూ చతుర్విధ పురుషార్థములు. లక్ష్మణుడు బుద్ధి, సుగ్రీవుడు వివేకము, వాలి దుఃఖము, హనుమంతుడు ధైర్యము భ్రాంతి అనే సాగరమునకు సేతుబంధనము జరిగినది రావణుడు రజస్సు, కుంభకర్ణుడు తమస్సు; విభీషణుడు సత్త్వగుణము. జీవితానుభవముల అగ్నిపరీక్షలో సేకరించు కొనవలసిన బ్రహ్మ జ్ఞానము సీత." - రామాయణాన్ని ఇటువంటి దృక్పథంతో అధ్యయనం చేయుమన్నారు స్వామి.

స్వామి నిర్దేశం ప్రకారం రామాయణాన్ని అనుశీలించటానికి మనం నాలుగు పద్ధతులను ఏర్పరచుకోవచ్చు.

1. సహృదయ దృకృథంతో సమీక్షించటం.
2. ఆదర్శభావ దృక్పథంతో అనుశీలించటం.
3 ప్రతీకాత్మక దృక్పథంతో పరిశీలించటం.
4. ఆధ్యాత్మిక దృక్పథంతో వివేచించటం.

సహృదయ దృక్పథానికి సానుభూతీ, సహానుభూతీ ముఖ్యం. ఆదర్శ దృక్పథానికి రామాయణంలోని జీవితపు విలువలను అనుశీలించటం ప్రధానం. ప్రతీకాత్మక దృక్పథంతో రామాయణ పాత్రలను, కథార్థాలను ప్రతీకలుగా గ్రహించి అన్వయించుకొనే ప్రవృత్తి అవసరం. ఆధ్యాత్మిక దృక్పథంలో రామాయణ కథార్థాలు మానవ జీవితపరమార్థాన్ని ప్రబోధించే పారమార్థిక చింతనాన్ని వివేచించటం విశేషం. ఈ నాలుగు దృక్పథాలను మేళవించుకుంటూ రామకథలోని రామణీయకత్వాన్ని, సాయిసుధలోని సమన్వయ మాధుర్యాన్ని ఆస్వాదిద్దాం.

ఇవ్వేళ మనం చెప్పుకొన్న కథలో-వాల్మీకి క్రౌంచమిధునాన్ని చూడటం, బోయవాడు మగపక్షిని కొట్టటం, అది చనిపోవటం, క్రౌంచి పతి వియోగ శోకంతో ఆక్రందించటం గమనించాం. వాల్మీకి క్రౌంచీ శోకాన్ని విని ఆర్ద్రుడైనాడు, ఆర్తుడైనాడు. అంటే వాల్మీకి సహృదయ ప్రవృత్తిని ప్రకటించాడన్న మాట. పరుల సుఖదుఃఖా

లను చూచి ఆర్ద్రుడై వారి భావాలతో సానుభూతిని, సహానుభూతిని ప్రకటించటం సహృదయ ప్రవృత్తి కవిగా వాల్మీకిలో ఉండదగిన మొదటిగుణం అది. ఆ కథను వింటున్నప్పుడూ, చదువుతున్నప్పుడూ మనంకూడా సహృదయులమై అటువంటి అనుభూతిని పొందుతాం. ఇటువంటిది సహృదయ దృక్పథం. ఇక - ఇందులో ఆదర్శ మేముంది? ప్రతీకాత్మక స్వభావం ఏముంది? ఆధ్యాత్మిక ప్రబోధం ఏముంది? అనే అంశాలను గురించి సంగ్రహంగా నైనా మనం సమాలోచించుకోవాలి.

వనంలో ఉన్న క్రౌంచ మిథునం రామాయణంలోని ఏవో కథార్థాలను మన మనస్సుకు స్ఫురింపజేసేదిలా ఉంది. అది ప్రతీకగా భాసిస్తోంది. ఇటువంటి క్రౌంచ మిథునాలు రామాయణంలో ఆరు జంటలుగా కనిపిస్తాయి. ఒకవిధంగా బోయవాడు వాల్మీకి. వాల్మీకి పూర్వ రూపం బోయవాడు, కిరాతుడు. బోయవానికి సంస్కృతరూపం వాల్మీకి. వాల్మీకి మొదట బోయవానిగా ఉండి వృత్తిధర్మంతో బాటసారులను బాధించి వారి సొమ్ములను దోచుకుంటుండేవాడు. ఒకసారి సప్తర్షులు అడవిబాటన పోతుంటే వారిని పీడించాడు. "ఎందుకురా నీవు ఇలా మమ్ములను బాధిస్తావు?" అని అడిగారు ఋషులు. "ధనంకోసం" అని బోయవా డన్నాడు. "ధనంతో ఏమి చేస్తావు?" "నా పెండ్లాం బిడ్డలను పోషించుకుంటాను." "నీవు పాపం చేసి ధనాన్ని ఆర్జిస్తున్నావు. డబ్బును పంచుకునే నీ భార్య పాపాన్నికూడా పంచుకుంటుందేమో కనుక్కొని వస్తావా?" అని మునులు ప్రశ్నించారు. బోయవాడు భార్య వద్దకు వెళ్ళాడు. ఆ మాటను అడిగాడు. భార్య నిక్కచ్చిగా చెప్పింది: "మమ్మల్ని పోషించే బాధ్యత నీది. నీవు పాపం చేస్తున్నావో, పుణ్యం చేస్తున్నావో నాకు అవసరం లేదు. నీవు చేసిన పుణ్యంలో భాగం వస్తే నాకు అభ్యంతరంలేదు కాని, పాపంతో మాత్రం భాగం పంచుకోను." ఈ మాటలు వినేసరికి బోయవానికి మనస్సు విరిగింది. "నా భార్యవు నా కష్టసుఖాల్లోలాగానే నా పుణ్యపాపాల్లోకూడా భాగం పంచుకుంటా వనుకున్నాను. ఇది సంసార ధర్మమనుకున్నాను. ఇప్పుడు తెలిసింది

నాకు నిజం. భార్యా పుత్రులు నాకు, నా కర్మకు బాధ్యులు కారు. నేను నా కర్మలో ఏకాకిని. నాకు ఎవడు తోడు? నాకు ఎవరు నిజమైన బంధువు?" అంటూ మునుల దగ్గరకు పరుగెత్తాడు. "భగవంతుడే మనిషికి తోడు" అని మునులు చెప్పారు. ఆ భగవంతుణ్ణి చూపుమన్నాడు బోయవాడు. మునులు రామ నామాన్ని విలోమక్రమంలో ఉపదేశించారు. బోయవాడు రామనామ జపంలో నిమగ్నుడైనాడు. ఒక చెట్టు మొదట్లో కూర్చొని సమాధిస్థితికి వెళ్ళిపోయాడు. అతని మీద పుట్ట మొలచినా అతనికి స్ఫురణ లేదు మునులు కొన్నేళ్ళకు తిరిగి ఆ బాటనే వచ్చారు. బోయవాణ్ణి పిలిచారు. వల్మీకంలోంచి లేచి వచ్చాడు బోయవాడు. అతడప్పుడు మంత్రసిద్ధుడు, మహర్షి. వల్మీకంలోనుండి పునర్జన్మ ఎత్తాడు కాబట్టి 'వాల్మీకి' అని మునులు పిలిచారు అతడే రామాయణ కర్త అయినాడు. ఆదికవిగా ప్రసిద్ధిచెందాడు. రామకథను గానం చేశాడు. లవకుశులచేత చేయించాడు. మనకు వందనీయుడైనాడు.

అయితే, ఈ కథలో అసంస్కృతుడైన బోయవాడు ఏం చేశాడు? కామమోహితమైన క్రౌంచమిథునంలో మగపక్షిని కొట్టాడు. అది చనిపోయింది. అతడు ఆడుపక్షిని కొట్టలేదు అందులో ఏదో విశేషం ఉండాలి. రామాయణంలో మగ పక్షులు చనిపోయే సన్నివేశాలు - అంటే భార్యాభర్తల్లో భర్తలు ప్రాణాలు కోల్పోయే సన్నివేశాలు కొన్ని ఉన్నాయి. వాటిని క్రౌంచమిథున సన్నివేశంతో పోల్చుకొని పర్యాలోచిస్తే కొన్ని విశేషాలు గోచరిస్తాయి. బోయవాడు కాలపురుషుడు. కాలపురుషుడు సంధించే మృత్యువు అనే బాణానికి గురి అయి ప్రాణాలు కోలుపోయిన పురుషులు రామాయణంలో కనపడుతున్నారు. ఆ మృత్యువు దేనివలన కలుగుతోంది? జ్ఞానం వలన మృత్యువు లేదు; వెలుగు వలన చావు లేదు. ఆత్మకు అంతం లేదు. దేహానికే చావు ఉంది. దేహాభిమానానికే మృత్యువు కలుగుతుంది. అంతశ్శత్రువులవలన దేహానికి ముప్పు ఏర్పడుతుంది. అంతశ్శత్రువులు

ప్రకోపించినప్పుడు కాలపురుషుడు బోయవానిగా మృత్యుబాణం వేసి వధిస్తాడు. ఇదీ ప్రతీకాత్మక దృక్పథంలో తెలియదగిన విశేషం.

అంతశ్శత్రువులైన కామక్రోధ లోభ మద మోహమాత్సర్యాలకు ప్రతీకలుగా నిలిచే జంటలు రామాయణంలో మనకు గోచరిస్తారు. రావణుడు - మండోదరి కామమోహితమైన జంట. రావణుడు రామ పత్నియైన సీతపై కామాన్ని పచరిస్తాడు. కామమోహితమైన ఈ పురుష పక్షిని కాలపురుషుడు రాముని రూపంతోనే చంపుతాడు. క్రోధానికి వాలి - తార ఉదాహరణం. లోభానికి రాముడు - సీతనే ఉదాహరణంగా ఎన్నుకోవచ్చు. కాంచన మృగాన్ని చూచి సీత లోభపడుతుంది. కాల పురుషుడు రావణుడనే బోయవాని రూపంలో దెబ్బ కొడతాడు. కాని, రామాయణంలో చావని పురుషపక్షి ఒక్కటే. అదే రాముడు! మిగిలిన మగపక్షులు దెబ్బతగిలితే చనిపోతాయి. చావులేని క్రౌంచం శ్రీరాముడు. అలాగే మదానికి - వాలి - తార; మోహానికి - ఇంద్రుడు - అహల్య ఉదాహరణాలు. ఇంద్రునికి శాపరూపంగా బాణం తగులుతుంది. మాత్సర్యానికి దశరథుడు - కైక, ఇంద్రజిత్తు - సులోచన. వీరి కథ లన్నీ ప్రసిద్ధాలే. వివరించి చెప్పవలసిన పనిలేదు.

రామునికి రెండుసార్లు దెబ్బలు తగిలాయి. సీత లోభంతో కనక మృగాన్ని అడిగినప్పుడు, మృగం వెంట రాముడు పోయినప్పుడు వియోగబాధ కలిగించే దెబ్బ తగిలింది. అలాగే, పట్టాభిషిక్తుడైన తరువాత రాముడూ సీతా కలసి సుఖవిలాసాలతో కాలం గడుపుతున్న ప్పుడు చాకలివాని రూపంతో కాలపురుషుడు బాణం వేస్తాడు. దానితో రామునికి సీతావియోగం కలుగుతుంది. దెబ్బ తిన్నది రాముడే, కాని మృత్యువు లేని పరమాత్ముడతడు. అందువలన ఈ క్రౌంచ పక్షికి మాత్రం మృత్యువు లేకుండా చిత్రించటం సహజం. దైవత్వం నింపు కొన్న నరుడు రాముడు. అతనికి కామమోహత్వం లేదు. ఉన్నట్లుగా భ్రమించి బాణం వేస్తే అతనికి తగులదు. దైవత్వం మనిషిలోని అమృతత్వం. దాన్ని సాధించిన ఏ మానవునికైనా కామమోహితమైన

కర్మకలాపం ఉండదు. మృత్యుబాణం అతనిమీద పని చేయదు. రామునినుండి గ్రహింపదగిన ఆధ్యాత్మికతత్త్వం ఇదే.

'మానిషాద' శ్లోకంలో రావణసంహారం చేసే రాముణ్ణి బోయ వానిగా అన్వయించి చెప్పే సంప్రదాయముంది. అప్పుడు రాముదే బోయవాడు. రావణుడనే క్రౌంచాన్ని చంపినవాడు. అన్వయా లెన్నైనా చెప్పుకోవచ్చు. అసలీ క్రౌంచ మిధున వృత్తాంతం ద్వారా వాల్మీకి లోకానికి చెప్పదలచుకొన్న తత్త్వ మేమిటని మనం ముందుగా, ముఖ్యంగా ఆలోచించుకోవాలి.

లోకంలో ప్రజాతంతు విచ్ఛేదం కాకుండా ధర్మబద్ధమైన కామాన్ని నిర్వహించటానికి సతీపతు లిరువురూ కన్యాత్వాన్ని, బ్రహ్మ చర్యాన్ని పరిత్యాగం చేసికొని వివాహధర్మాన్ని స్వీకరిస్తున్నారు. ఆ వివాహధర్మం ద్వారా సంతానాన్ని పొంది, వంశం అవిచ్ఛిన్నంగా సాగేటట్లు భూమిమీద నిలపడమే వారి ధ్యేయం. అంటే, గార్హస్థ్యంలో కామంకూడా ఒక ధర్మమేనన్నమాట. అలాకాక పాశవికమైన కామ వాంఛతో ఆ ధర్మాన్ని కలుషితం చేసినట్లయితే అది పాపకర్మమౌ తుంది. జంతు సహజమైనది కామం; అది మానవులయందు ధర్మ బద్ధమౌతుంది. మను అనే ధాతువునుండి మానవ శబ్దం పుట్టింది. జ్ఞాన విశిష్టుడు మానవుడు. కామాన్ని జ్ఞానంచేత పుటం పెడితే ధర్మం అనే బంగారంగా వెలుగొందుతుంది. సీతను అగ్నిలో ప్రవే శించుమని రాముడు అడిగిందికూడా అందుకనే. తాను సీతను వెంటనే గ్రహిస్తే రాముణ్ణి కాముకుడని లోకం అంటుంది. అగ్నిలో పుటం పెట్టిన సీత ధర్మబద్ధమైన కామానికి ప్రతీక. కామం జంతుభావం, ధర్మం మానవభావం. అదే సర్వమానవులయందు ప్రేమరూపంగా వ్యాపిస్తే దైవభావం అవుతుంది. స్వామి ప్రబోధిస్తున్న ప్రేమ తత్త్వం మన గార్హస్థ్య జీవితంలో కామం నుండి ధర్మంగా, ధర్మం నుండి ప్రేమగా పరిణతి చెంది వికసించే ఆధ్యాత్మిక భావ శతదళ పత్రం. దైవత్వాన్ని అందుకోవాలంటే పశుత్వం నుండి మానవత్వానికి,

మానవత్వం నుండి దైవత్వానికి పయనించాలి. కామం నుండి స్నేహానికీ, స్నేహం నుండి ప్రేమకూ హృదయం పరిణతి చెందాలి. ప్రేమను సాధించిన పురుషుడు స్త్రీయందు అమృతమూర్తిని చూస్తాడు. ఆ అమృత మూర్తియే మాతృమూర్తి పురుషుడు స్త్రీయందు తేజస్సుగా ప్రవేశిస్తున్నాడు - అమృతమైన మాతృ వాత్సల్యాన్ని ఆస్వాదించటానికి. మాతృ వాత్సల్యాన్ని ఆస్వాదించిన తరువాత ఆ స్త్రీయందు మాతృతత్త్వాన్ని చూడటం నేర్చుకుంటాడు స్త్రీ కూడా తాను సతియై పతియందు పచరించిన తరువాత సంతానవతి అయినప్పుడు ఆమెలో వాత్సల్యధారగా స్తన్యం సముద్భవిస్తుంది. ఆ స్తన్యాన్ని తన శిశువుకు ఇస్తున్నప్పుడు తన పతిని ఆ శిశువులోని ప్రతిబింబంగా చూచికొని, ఆ భావాన్ని విశ్వమంతా వ్యాపింపచేసికొని, తాను విశ్వమాత అనే భావాన్ని పెంపొందించుకొంటుంది. ఇటువంటి మాతృ మహత్కళ యొక్క అనుభవం స్త్రీలకే దక్కిందని మాధురీ దర్శనవాదులు పేర్కొంటారు.

మాతృ మహత్కళతో భౌతికంగా మాతృమూర్తియై, అమృత మూర్తియై నిలువగలిగిన శక్తిస్వరూపిణి స్త్రీ పురుషునికి పాంచభౌతికమైన ఆకృతి లేదు. అతడు తేజస్స్వరూపుడు, పరమాత్మ స్వరూపుడు. అతని స్వరూపం తేజస్సు. అందువల్లనే ఈ కథలో పురుష పక్షికి పాంచభౌతికమైన ఆకృతి పోతుంది. తేజస్స్వరూపంగా ఉంటుంది. పురుషుని యందలి పాంచభౌతికమైన స్వరూపాన్నే స్త్రీ దర్శించినట్లయితే ఆమెకు మిగిలేది శోకమే. పురుషుని యందలి తేజస్సును దర్శించినట్లయితే ఆమెకు ప్రేమ ఉపాస్యదైవమౌతుంది. అందువల్లనే సర్వ పురుష జాతియందు నిలిచిన పరబ్రహ్మ తత్త్వమును, సర్వ స్త్రీ జాతియందు నిలిచిన మాతృమహత్వ కళను సంవదించుకొని సాయి రాముడు తన తత్త్వాన్ని ఉన్మీలింప జేసికొన్నాడు. నేడు సాయి తత్త్వంలో మనం దర్శించే ఈ ఆధ్యాత్మిక భావాన్నే వాల్మీకి రామాయణంలో రమణీయంగా ఈ కథ ద్వారా వ్యక్తీకరించాడు స్వామి అందు

వలననే రామాయణాన్ని ఆత్మారామంగా అనుశీలించారు మనకు రామ కథద్వారా సాయిసుధ నందించారు.

మరొక దృష్టితో చూస్తే - బోయవాడు ఆధునిక కాలంలోని భౌతిక దృక్పథానికి (Materialistic outlook) ప్రతీకగా కనపడ తాడు. బోయవాడు ఆహారంకోసం మరొక ప్రాణిని సంహరిస్తున్నాడు. హింసను చేస్తున్నాడు. ఇది భౌతిక దృష్టి. ఇది చేసేది హింస. దాని వలన కలిగేది శోకం, అశాంతి. ఈ భౌతిక దృక్పథంకంటె ఉత్తమ మైంది ప్రేమతత్త్వం. సర్వభూతములలో దైవత్వాన్ని దర్శించే తత్త్వ మది. దానివలన ప్రేమ, శాంతి అనే భావాలు ఏర్పడుతాయి. వాల్మీకి ప్రేమ తత్త్వాన్ని ప్రబోధించటానికి ప్రాతిపదికలు వేశాడు. స్వామి ప్రేమ తత్త్వాన్ని ఆవిష్కరించారు.

నేటి ఆధునిక సమాజంలో ఉన్న ఆర్థిక దృక్పథానికి, భౌతిక దృక్పథానికి, అన్నమయ కోశానికి పరిమితమైన పాశవిక దృక్పథానికి ఆ బోయవాడు ప్రతీక. ఆదర్శ ప్రేమకు పాత్రం కాదగిన గార్హస్థ్య ధర్మంలో దైవత్వాన్ని గుర్తించలేక, కాముకత్వాన్ని కోరే పాశవిక దృక్పథానికి ఆ కామమోహితమైన క్రౌంచ మిథునంయొక్క కాముక కేళి ప్రతీక. కామం నుండి ధర్మం, ధర్మం నుండి ప్రేమ - ఈ ప్రస్థానమే రామ కథలో ఆస్వాదించవలసిన అమృతం. ఆ అమృత ప్రేమ తత్త్వమే రామతత్త్వం - అని వ్యాఖ్యానించడమే సాయితత్త్వం. సాయి ప్రేమ తత్త్వమే - రామాయణంలో వాల్మీకి దర్శించి ప్రతిపాదించిన రామతత్త్వం. సాయిరామ్!

# పాయస పరమార్థం

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు నమస్కారము.

సాయికుటుంబ సభ్యులకు నమస్కారము.

కడచిన శనివారంనాడు క్రౌంచమిధున ఘట్టంలోని ప్రతీకాత్మక-ఆధ్యాత్మిక తత్త్వాన్ని గురించి పర్యాలోచించుకొన్నాము. ఈ రోజు శ్రీరామావతార ఘట్టంలోని పాయస పరమార్థ మనే అంశాన్ని కేంద్రంగా గ్రహించి అవతార తత్త్వాన్ని అనుశీలిద్దాం. ముందుగా సాయి రామావతారాన్ని స్మరిద్దాం:

పల్లవి: అవతరించినాడు భువిని సాయిరాముడు
సర్వధర్మసారరూప ప్రేమధాముడు!

1. పట్టపర్తి పురములోన పుట్టి పెరిగెను
పుడమియెల్ల నా యిల్లని నడచి చూపెను,
నరజాతిని పీడించే
పరపీడన జాడ్యానికి
శరచికిత్స చేయాలని
చిరశాంతిని కూర్చాలని ॥అవతరించినాడు॥

2. భగవంతుడు తానే యని ప్రకటపరచెను
పరమాత్మను లోగనుడని ప్రజకు తెల్పెను,
పరమాత్మను లోగాంచెడి
పరమభక్తశేఖరులకు
పరుడనువాడే లేడని
నరుడే నారాయణుడని ॥అవతరించినాడు॥

3. సందేశమె జీవితమని చాటి చెప్పెను
మనసు కుదుటపడుటకునై మహిమ చూపెను,

నీవు నన్ను చూచినచో
నేను నిన్ను కాచెదనని
'బాబా' యని పిలిచినచో
'బాబూ' అని పలికెదనని ॥అవతరించినాడు॥

రామకథానుశీలనంలో ఉత్తమ పద్ధతిని స్వామి చూపిస్తూ, రామాయణాన్ని లోకాభిరామాయణం మాత్రం చేయవద్దని హెచ్చరించారు. రామకథారసవాహినిలో స్వామి యిలా అన్నారు - "నేటి పాఠకులు పవిత్ర చరిత్రలను పఠించువేళ వ్యక్తి యొక్క సంబంధములను మాత్రమే లక్ష్యమునకు చేర్చుచుండుట పరిపాటి అయిన ఒక పెద్ద పొరపాటు. ఎట్లన, రాములవారి తండ్రికి ముగ్గురు భార్యలు. మొదటి భార్య యిట్టిది, రెండవ భార్య యిట్టిది, మూడవ భార్య యిట్టిది. ఆమె చెలికత్తెలు ఇట్టి వికారులు, ఇట్టి ఆకారులు, దశరథుడు చేసిన యుద్ధములట్టివి, యిట్టివి అని లోకాభిరామాయణములనే లోనికి చేర్చుచుండుటచే పాఠకులకు ప్రధానాంశము పట్టుబడుటలేదు." వ్యర్థములైన అంశముల మీద దృష్టి సారించకుండా రామాయణ కథార్థములలోని సారవంతములైన అంశములమీద దృష్టి సారించండని స్వామి మనకు ఆదేశిస్తున్నారు. దీనికి ఒక చక్కని దృష్టాంతం కూడా చెప్పారు. మనం రసవంతమైన ఒక ఫలాన్ని తింటున్నామనుకోండి. అందులో విత్తనాలుంటాయి, తోలు ఉంటుంది, పిప్పి ఉంటుంది. వీటన్నిటినీ తీసివేసి అందులో నున్న రసాన్ని మాత్రమే మనం ఆస్వాదిస్తాం. అలాగే, రామాయణ కావ్యాన్ని చదువుతున్నప్పుడుకూడా అందులో రాక్షసుల చరిత్రలు అన్న విత్తనాలను, అసురచర్య అన్న తోలును, తదితరములయిన లౌకిక విషయాలు అనే పిప్పిని వదిలేసి, రామకరుణారస సారాన్ని మనం ఆస్వాదించాలని స్వామి మనలను ఆదేశించారు. అందువలన రామాయణ కావ్యకథను పూసగుచ్చినట్లు, వివరంగా చెప్పటం ఇందులో ప్రధానం కాదు. రామాయణంలోని ప్రధాన తాత్పర్యాలను,

సారభూతములైన అంశాలను మాత్రమే అధ్యయనం చేయటం ప్రస్తుత కర్తవ్యం.

రామాయణంలో వాల్మీకి మహర్షి కూడా మూడంశాలను ప్రధానం చేసి చెప్పాడు:

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః."

రాముని యొక్క అయనం, సీత యొక్క చరితం, రావణుని యొక్క వధ - ఈ మూడంశాలూ రామకథలో ముఖ్యం. వీటిని తెలిసికొంటే సారభూతాలైన అంశాలను అనుశీలించినట్లే.

ఈ దృష్టితో చూస్తే ఒకవిధంగా రామాయణం మూడునగరాల ముచ్చటైన చరిత్ర అని అనిపిస్తుంది. **Ramayana is 'A Tale of Three Cities.'** రాముని చరిత్ర అయోధ్యా నగరానికి సంబంధించింది. సీతాచరితం మొదట జనకుని పట్టణమైన మిథిలకు సంబంధించి ఉంటుంది. ఆపైన అయోధ్యకూ, లంకకూ వ్యాపించి ఉంటుంది. పౌలస్త్యుడు లంకకు సంబంధించినవాడు. అయోధ్య, మిథిల, లంక - ఈ త్రిపుర చరిత్రను సంపుటీకరిస్తే రామాయణతత్త్వం మనకు అర్థమవుతుంది. ఈ మూడు నగరాలూ బాహిరంగా అప్పటి భరతఖండంలోనూ, రామాయణ కథలోనూ ఉన్నవి. రామాయణాన్ని ఆత్మపరంగా అన్వయించుకొంటే ఈ మూడు పురాలూ మనలోనే ఉన్నాయి. మనలో హృదయస్థానంలో ఉన్నది అయోధ్య. మిథిల బుద్ధి స్థానీయం. లంక అహంకార స్థానీయం. మనోబుద్ధ్యహంకారాలతో ఉన్న మన జీవ-సంపుటిని మనం సమీక్షించుకోగలిగితే మనలో సహజసిద్ధంగా ఉన్న రామాయణ కావ్యంలోని త్రిపుటిని మనం తెలిసికొన్నవారమౌతాము.

అయోధ్యా నగరాన్ని దశరథుడు పాలిస్తున్నాడు. ఆయన వేదవిదుడు, దీర్ఘదర్శి, మహాతేజుడు, పౌరజానపద ప్రియుడు, ఇక్ష్వాకులలో అతిరథుడు, యజ్ఞయాగాలు చేసినవాడు, ధర్మపరుడు, ఇంద్రియాలను తన వశంలో ఉంచుకొన్న మహర్షికల్పుడు, రాజర్షి, త్రిలోక

కీర్తి గడించినవాడు. ఇటువంటి ఉత్తమగుణాలు కలవాడని వాల్మీకి వర్ణించాడు. దశరథ మహారాజు సూర్యవంశ సంజాతుడైన ప్రభువు. తన పరిపాలన కాలంలో అయోధ్యా నగర వైభవాన్ని పెంచాడు. అందరికంటె ఎక్కువకాలం పాలించాడు. కాని, ఆ వంశప్రభువుల్లో దిలీపుడు మొదలైనవారికి మొదట సంతానం కలుగనట్లుగానే దశరథునికి కూడా సంతానం కలుగలేదు. ఆయనకు వసిష్ఠులవారు గురువులు, మార్గదర్శకులు. సుమంత్రుడు ఆయనవద్ద ఉన్న ఎనిమిది మంది మంత్రుల్లో ప్రధానుడు, ఆంతరంగిక మంత్రికూడా. సుమంత్రుడంటే ఉత్తమమైన మంత్రం కలిగినవాడని అర్థం. రాజుకు కావలసిన మంత్రాన్ని ఉపదేశించేవాడు. రాజుకు సంతానం కలుగలేదన్న విషయం సుమంత్రునికి తెలుసు ఎందుకు కలుగలేదన్న విషయాన్ని అతడు లోతుగా ఆలోచించాడు. ఎంతోమందితో సంప్రదించాడు. ఆయన అలా సంప్రదించినట్లు దశరథునికి మాత్రం తెలియదు ఒకసారి పూర్వయుగంలో సనత్కుమారుడు ఋష్యశృంగమహర్షి దయవలన దశరథుడు ఒకానొక యజ్ఞంచేసి, ఆ యజ్ఞఫలంవల్ల నలుగురు కొడుకులను పొందుతాడు. ఆ నలుగురూ మహావీర్య సంపన్నులై, వంశోద్ధారకులై, లోకోద్ధారకులై, జగత్ప్రసిద్ధి గాంచుతారని దేవతలతో చెప్పిన విషయాన్ని అతడు తెలుసుకొనగలుగుతాడు. కాని, సమయం వచ్చేంత వరకు దశరథునికి ఈ అంశం చెప్పడు. వాల్మీకి ఈ విషయాలన్నింటినీ వివరంగా మనకు చెప్పడు. కథలో గూఢంగా పొదుగుతాడు. ఒక మహామంత్రి తన దేశ యోగక్షేమాలను గురించి అనవరతమూ ఎలా కృషి సల్పుతూ, వాటిలో రహస్యంగా అట్టిపెట్టవలసిన వానిని ఎలా దాచి ఉంచి సమయం వచ్చినప్పుడు ఎలా బయటపెడతాడో రామాయణంలో వాల్మీకి చక్కగా చిత్రించాడు.

దశరథునికి వార్ధక్యం వచ్చింది. వయసు చెల్లిపోతున్న సందర్భంలో సంతానం కలుగలేదన్న బాధ అతిశయించింది. ఆయన మొదట కౌసల్యను పెండ్లాడాడు. ఆమెవలన సంతానం కలుగలేదు. తరువాత

సుమిత్రను వివాహమాడాడు. ఆమెవలనకూడా సంతానం కలుగలేదు. ఆపైన కేకయ రాజకన్యకయైన కైకను వివాహం చేసికొన్నాడు. కైకకు పుట్టిన కొడుకుకు రాజ్యాభిషేకం చేస్తా నని మామగారియెదుట శపథం చేశాడు అలా శపథం చేయటానికి కౌసల్యాసుమిత్రలు కూడ అంగీకరించారు. ఇంత జరిగినప్పటికీ ఎంతకాలానికీ సంతానం కలుగ లేదు. ఒకసారి దశరథుడు నిర్వేదాన్ని భజిస్తున్న సమయాన సుమంత్రుడు వచ్చి తాను పూర్వం విన్న విషయాన్ని చెప్పుతాడు. 'మీకు సంతానయోగ ముంది. ఋష్యశృంగుడనే మహర్షి ఉన్నాడు. విభాండకుని పుత్రుడు, శాంతామహాదేవిభర్త, యోగసిద్ధి గల మహాను భావుడు. అతనిని తీసికొని రావాలి. అతడు ఋత్విజుడుగా మీరు అశ్వమేధయాగం చేయాలి. దానివలన అమోఘమైన పాపాలన్నీ తొలగిపోతాయి. ఆ తరువాత పుత్రార్థివై పుత్రకామేష్టి చేయాలి. దాని వలన నలుగురు కొడుకులు పుడతారు. పూర్వయుగంలోనే మీ జాతకం ఇలా వ్రాయబడి ఉంది' అని వివరిస్తాడు.

దశరథు డీసంగతి విని ఉప్పొంగిపోతాడు. స్వయంగా వెళ్ళి ఋష్యశృంగ మహర్షిని ఆహ్వానించి అయోధ్యకు తీసికొని వస్తాడు. అతని ఆధ్వర్యవంలో అశ్వమేధయాగాన్ని నిర్వహిస్తాడు. ఆ తరువాత ఋష్యశృంగుడు దశరథునిచేత పుత్రకామేష్టిని ప్రారంభింపచేస్తాడు. పుత్రకామేష్టిలో దేవతలందరూ ఆహూతు లౌతారు. అందరూ ప్రసన్ను లౌతారు. తమ తమ హవిస్సులను స్వయంగా స్వీకరిస్తారు. విష్ణువు కూడా తన హవిర్భాగాన్ని స్వయంగా గ్రహించటానికి యాగశాలకు వస్తాడు అదే సమయ మని దేవతలందరూ బ్రహ్మను ముందుపెట్టికొని తాము రావణునివలన పొందుతున్న బాధలను నివేదించుకొంటారు. బ్రహ్మదేవుడు దయార్ద్రుడై యిచ్చిన వరాలవలన రావణుడు మానవుని ఒక్కనిచేత తప్ప లోకంలో మరెవ్వరిచేత కూడా సంహరింపబడటానికి వీలులేని వరశక్తిని సంపాదించుకొని ఉన్నాడు నరాకృతితో మాత్రమే ఎవరైనా అతనిని చంపటానికి వీలుంది. ఆ రాక్షస సంహారకార్యాన్ని

నిర్వహించే భారాన్ని విష్ణువునందు ఉంచుమని దేవతలందరూ బ్రహ్మను ప్రార్థిస్తారు. ఆ యాగశాలలోనే బ్రహ్మ దేవతల పక్షాన విష్ణువును భూతలంమీద అవతరించి మానవాకృతిని ధరించి రావణుని సంహరింప వలసిందిగా ప్రార్థిస్తాడు. ఆ ప్రార్థనను మన్నించి మహావిష్ణువు తాను ఎవరి గర్భాన జనించాలి? అని ఆలోచిస్తుండగా - ఎదుటనున్న దశరథ మహారాజును తండ్రిగా గ్రహింపుడని దేవతలందరూ అర్థిస్తారు. వారి కోర్కెను విష్ణువు అంగీకరిస్తాడు. వారి ముందు ఇలా ప్రతిజ్ఞ చేస్తాడు:

"భయం త్యజత, భద్రం వో, హితార్థం యుధి రావణమ్
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్ర జ్ఞాతి బాంధవమ్
హత్వా క్రూరం దురాత్మానాం దేవర్షీణాం భయావహమ్
దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ
వత్స్యామి మానుషేలోకే పాలయ న్పృథివీ మిమామ్."

'భయాన్ని వదలిపెట్టండి, భద్రంగా ఉండండి. లోకహితార్థమై నేను యుద్ధమునందు రావణుని పుత్రపౌత్రామాత్య బంధుసహితంగా సంహరిస్తాను క్రూరుడైన ఆ దురాత్ముణ్ణి సంహరించి దశ సహస్ర సంవత్సరాలు భూమిని పాలిస్తాను. మానుషాకారంలో ఈ లోకంలో పదివేల సంవత్సరాలుండి, తరువాత ఈ పృథివిని త్యజిస్తాను' అని శపథం చేస్తాడు. ఆ తరువాత తనను తాను నాలుగు భాగాలుగా చేసికొని, అవతరించడానికి ఉన్ముఖుడౌతాడు.

ఇట్టి పరిస్థితుల్లో యజ్ఞకుండంలో నుండి ప్రాజాపత్యపురుషుడు ఉద్భవిస్తాడు. అతని చేతిలో దివ్యపాయస కలశం ఉంటుంది. దాన్ని అతడు దశరథుని కిస్తాడు. 'నీవు ఏ భార్యలయందు అనురక్తుడవై ఉన్నావో వారికి ఈ పాయసాన్ని పుత్రార్థమై పంచిపెట్టు' మని ఆదేశిస్తాడు. దశరథుడు ఆ పాయస భాండాన్ని స్వీకరించి అంతఃపురంలో ప్రవేశిస్తాడు. పెద్దభార్య కౌసల్య కనపడుతుంది. ఆమెకు పాయసంలో సగంభాగ మిస్తాడు. ఆ తరువాత సుమిత్రను చూస్తాడు. ఆమెకు మిగిలిన సగంలో సగ మిస్తాడు. ఆపైన కైక కనపడుతుంది.

మిగిలినదానిలో సగ మామె కిస్తాడు. ఆ మిగిలిన సగాన్ని మరలా సుమిత్ర కిస్తాడు. అంటే మొత్తం పాయసాన్ని 8/8 గా భావిస్తే - అందులో కౌసల్యకు 4/8 భాగం, సుమిత్రకు మొదట 2/8 భాగం, కైకకు 1/8 భాగం, మరల రెండవసారి సుమిత్రకు 1/8 భాగం లభించాయన్నమాట. ఇలా పాయసాన్ని ముగ్గురు భార్యలకు నాలుగు భాగాలుగా పంచి యివ్వటం జరుగుతుంది. వారు పాయసాన్ని క్రమంగా భుజిస్తారు. తరువాత గర్భవతులై తేజోవంతులైన కుమారులను - రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను కంటారు ఇదీ ఈ రోజు మనం సమీక్షింపబోయే కథ.

మొదట ఈ కథను సహృదయ దృక్పథంతో సమీక్షిద్దాం. ఇక్ష్వాకు వంశంలో పుట్టిన ప్రభువులలో కొంతమందికి సంతానం కలగటం ఆలస్యంగా జరుగుతూ వచ్చింది. సుదక్షిణా దిలీపులకు నందినీధేనువును పూజిస్తే తప్ప సంతానం కలుగలేదు. అలానే దశరథు నికి కూడా సంతానం ఆలస్యంగా కలిగింది. పుత్రకామేష్టి చేస్తే కలి గింది. అక్కడ గోపూజా ఫలం సంతానం; ఇక్కడ యజ్ఞ ఫలం సంతానం. సంతు లేని దంపతులు ఎంతగా పరితపిస్తారో అలాగే దశరథుడూ, రాణులూ విలపించారని సహృదయ దృక్పథంతో రామా యణ కర్తలు కొందరు విపులంగా వర్ణించి వ్రాశారు. విశ్వనాథ సత్యనారాయణగా రీసందర్భంలో దశరథుని మనోభావాలను మనోహ రంగా చిత్రించారు :

"అంగళ్ళలోనఁ గ్రయ్యంబులై యుడిన శి
శుశ్రేణి యాటవస్తువులు చూచి
ఏరైన గొని యింటి కేగుచో దారిలోఁ
దోతెంచు నుయ్యెలతొట్లు గాంచి
చిత్రపటంబునన్ జిన్నిపిల్లలు నవ్వు
చున్నట్లు వ్రాసిన యొఱపు లరసి
ఎందైనఁ బసిపిల్ల లేడ్చుచున్నట్లు వి
న్పించిన జెవియొగ్గి విని చలించి

తన మనోవాంఛ యెల్ల సంతానమయము
గాగ నజధారుణిపతి కన్నకొడుకు
అవని రాజ్యకార్యముల మధ్యమునగూడఁ
దన్నె విస్మృతిగని పరధ్యాన మందు."

దశరథుడు రాజకార్యాలలో నిమగ్నుడై ఉన్నప్పుడు కూడా, తన మనోవాంఛలన్నీ సంతానమయమై ఉండటంచేత పసిపిల్లల ప్రసక్తులు వచ్చినప్పుడెల్లా పరధ్యానాన్ని పొందుతుండేవాడట. ఇది సంతానం లేని తల్లిదండ్రులు పొందే మానసిక వేదనలోని ఒక మనోజ్ఞమైన భావావస్థను వర్ణించిన తీరు. ఇలాగే విశ్వనాథవారు గర్భవతులైన రాణుల వర్తనాన్ని చక్కగా చిత్రించారు. పాత్రల చిత్తవృత్తులనే కాక, భావి కథార్థాలను వ్యంజింప చేసేటట్లుకూడా కవితా శిల్పాలను ప్రదర్శించారు.

దశరథుడు దశేంద్రియ సంఘాతరూపమైన శరీరంలాంటివాడని స్వామి చెప్పారు. దశరథుని భార్యలు గుణత్రయం వంటివారు సత్త్వగుణం కౌసల్య; తమోగుణం సుమిత్ర; రజోగుణం కైక. ఈ మూడు గుణాలను ఆశ్రయించి ఆ శరీరం సంతును గాంచిన వృత్తాంతం ఇది. సత్త్వగుణ సమన్వితయైన కౌసల్య అనాసక్త హృదయ. కోరికల నన్నింటిని పరిత్యజించిన ఒక విరక్త చిత్తం ఆమె పెంచుకొన్నది. అమె తత్త్వం అలాంటిది. అందువల్లనే 'కౌసల్యానందవర్ధనః' అని వాల్మీకి శ్రీరాముణ్ణి అభివర్ణించాడు ఆ ఆనందశబ్దం యోగికి వాడేమాట. కౌసల్య గార్హస్థ్య జీవితంలో ఉన్న యోగిని వంటిదని ధ్వని. ఆమె సత్త్వగుణ సంపన్నురాలు కావటం సహజం కైక రజోగుణ ప్రధానురాలు. అహంకారం రజోగుణానికి ప్రధాన లక్షణం. తమోగుణ ప్రధానురాలు సుమిత్ర. తమోగుణం ఏ గుణాన్ని ఆశ్రయిస్తే ఆ గుణం వెంట నడుస్తుంది. తనంతట తనను వదలిపెడితే ప్రమాదానికి గురి అవుతుంది. కౌసల్యను అంటిపెట్టుకొని ఎల్లప్పుడు నడిచేది సుమిత్ర. సత్త్వగుణాన్ని ఆశ్రయించిన తమోగుణమామె.

అందువలన ఉత్తమగుణసేవచేత ఈ తమోగుణం ఉజ్జ్వలమైంది. ఇటువంటి వర్తనం గలిగిన ముగ్గురు రాణులు గర్భవతులైనారు. అప్పుడు వారి చిత్తవృత్తులెలా ఉంటాయో భావించి విశ్వనాథవారు చక్కని కల్పనం చేశారు:

"తా నదేమో పిచ్చితల్లి కౌసల్య యే
ప్రేమఁ బోయిన నదే ప్రేమఁ బోవు
శాంత పంపించిన సన్న జరీచీరఁ
బదునేడు దినము లాపగిదిఁ గట్టె
నెందరు వలదన్న నిది శాంత చీ రంచు
నది యుదికించును నదియ కట్టుఁ
దెలివి యరుంధతీదేవి వల్కల మీయ
నాపైని నది తాల్చె నదియ పనిగఁ
బదియునాల్గు దినంబు లాపగిదిఁ జూచి
కొట్టుపట్టిన వని దాచికొనియె దాసి
పట్టమహిషీ మహాయోగ పరిధులైన
చీర లాపైని దాల్పఁ జేసినది దాసి."

కౌసల్యకు ఏ ధ్యాసపడితే అదే ధ్యాస. సత్త్వగుణానికి సమాధి ప్రధాన గుణం. ఏ విషయమునందు రమిస్తే దానియందే తన్మయత్వంతో సమాధిని భజిస్తుంది. గర్భవతియైన కౌసల్య మంచి చీర కట్టుకోవాలని అనుకొన్నది. ఇంటి ఆడపడుచు శాంత సన్నజరీచీర పంపించింది. అది ఎంతో బాగుంది. దానియం దాతల్లి చిత్తం రమించింది. రమణ భావం అధికంగా ఉండటంచేతనే ఆమె రామునికి తల్లి కాగలిగింది. ఆ సన్న జరీచీరను పదిహేడు రోజులు రోజూ ఉతికించుకొంటూ కట్టింది. అది మహారాణి మర్యాదకు బాగా లేదని అరుంధతీదేవి ఒక సన్నపట్టు నారచీరను పంపించింది. ఆ నారచీర అత్యంత మనోహరంగా ఉంది. దానిమీద మనస్సు రమించగానే పదునాల్గు రోజులు దానిని అదేపనిగా ధరించింది. దాసి చూచింది. ఒకే చీరను అన్నాళ్ళు

మహారాణి కట్టుకుంటే చూచేవారు నవ్వి పోతారని భావించి, అది కొట్టు పట్టిందని చెప్పి, పట్టమహిషి కట్టుకొనడానికి యోగ్యమైన పట్టుచీరను తీసికొని వచ్చి యిచ్చింది. అదీ బాగుందని దానినే కట్టుకొన్నది. ఇదంతా విశ్వనాథవారి సహృదయ కల్పనం. అయితే, ఇందులో చక్కని కథార్థధ్వని ఉంది. గర్భవతియైన కౌసల్య సంకల్పంలో, కట్టుకొన్న చీరల తీరుల్లో పుట్టబోయే శ్రీరామచంద్రుని జాతక చర్యను చమత్కారంగా ధ్వనింపజేశారు విశ్వనాథవారు. శాంత పంపించిన సన్న జరీచీరను 17 రోజులు కట్టుకొన్నదనటంలో రాముడు 17 సంవత్సరాలు రాజకుమారుడుగా అయోధ్యలో కాలం గడుపుతాడనే తాత్పర్యం సూచింపబడింది. ఆ తరువాత 14 రోజులు వల్కలం కట్టుకొన్నదనటంలో శ్రీరాముడు 14 సం॥లు వల్కలధారణం చేసి అరణ్యవాసం చేస్తాడన్నది గమ్యమాన మౌతోంది. మిగతా కథ రాజ్యాభిషిక్తుడైన రాముని చరిత్రను చెపుతోంది. చీరమడతల్లో శ్రీరామ జాతకం చిత్రింపబడడం ఇందులోని వైచిత్ర్యం.

కౌసల్యకు నీడవంటిది సుమిత్ర. ఆమె ఏ పని చేస్తే ఈమె కూడా అదే పని చేస్తుండేది.

"అసలు పూర్వమే మహారాణి నీడ సు
మిత్ర, యిపుడు మఱియు మీఱిపోయె
నామె యేది తాల్చు నది తాల్చు; నెది చేయు
నామె తానుగూడ నదియ చేయు."

రామునివెంట నీడగా నడిచే లక్ష్మణుని కనబోయే తల్లి వర్తనం తదనుగుణంగానే ఉంది. భరతుని వెంట శత్రుఘ్నుడుకూడా నీడలాగా సాగాడు. కవలబిడ్డలను రామభరతులకు ఆమ్రేడితాలుగా నిలిపిన సాధ్వి, త్యాగమూర్తి సుమిత్ర.

కైక రజోగుణ ప్రవృత్తికి ప్రతీక. ఆమెను మంధర దాదిగా పెంచి పెద్దదాన్ని చేసింది. మంధర క్రోధానికి ప్రతీక. అసూయకు ప్రతినిధి. ఆమె చేతిలోని బొమ్మ కైక.

'నుదుటఁ గస్తురిబొట్టుఁ జదురుగాఁ దీరిచి
ముసలిది వలదన్న మొగము తుడుచు—'

ఇలా ఉంటుంది కైక చిత్తవృత్తి. కైక నుదుట కస్తురిబొట్టును అలంకరించుకొంటుంది. మంధర వద్దంటే తుడుచుకొంటుందట. ఈ మాట ముమ్మాటికీ నిజమైపోయింది ఆమె జీవితంలో. మంధర మాట విని కుంకుమబొట్టును కోల్పోయింది కైక. ఇది రజోగుణప్రవృత్తి లక్షణం. ఇలా సహృదయ దృక్పథంతో రామాయణ కథార్థాలకు రమణీయ కల్పనలను జోడించుకొని మనం హర్షించవచ్చు. కాని, మనకు ముఖ్యం వాటిలోని ఆదర్శ ఆధ్యాత్మిక పరమార్థం.

ఇక్కడ కొన్ని మీమాంసలు మనకు ఎదురౌతాయి. దశరథునికి నలుగురు కొడుకులు పుడతారని పూర్వయుగంలోనే సనత్కుమారుడు చెప్పాడు. నలుగురు కొడుకులే ఎందుకు పుట్టాలి? ఇది యొక పెద్దప్రశ్న. ఆ కొడుకులు యజ్ఞం చేయటం వలననే, పాయసం భుజించుటవలననే ఎందుకు కలుగుతున్నారు? అన్నది రెండవప్రశ్న. రాణులు ముగ్గురుకదా? మూడు భాగాలు చేసి పాయసాన్ని పంచితే సరిపోదా నాలుగు భాగాలెందుకు చేయవలసివచ్చింది? అనే ప్రశ్నకూడా ఉదయిస్తుంది. అయితే - నలుగురు కొడుకులు పుడతారని చెప్పారు కాబట్టి పాయసాన్ని నాలుగు భాగాలు చేయటం న్యాయమని ఒక సమాధానం. విష్ణువు తనను నాలుగు విభాగాలుగా చేసికొని అవతరింప సంకల్పించాడు కాబట్టి నలుగురు కొడుకులు కలగటం సహజం. విష్ణువు తనను నాలుగు భాగాలుగా చేసికొనవలసిన అవసరమేమి వచ్చింది? అన్న ప్రశ్నకు అన్వయాన్ని అన్వేషించవలసి వస్తుంది. స్వామి చెప్పే అన్వయాన్ని గ్రహిస్తే తాత్పర్యం ఇలా తేటపడుతుంది:

మానవాకారంతో అవతరిస్తున్న విష్ణువు రామావతారంలో మానవుడు నిర్వహింపవలసిన చతుర్విధ పురుషార్థాలను తన జీవితంలో ఆదర్శప్రాయంగా ఆచరించి చూపింపదలచుకొన్నాడు కాబట్టి నాలుగు శరీరాలతో భూతలంమీద నిలువటానికి సంకల్పించాడు. చతుర్విధ

పురుషార్థ సాధనామయమైన మానవ జీవితానికి ప్రతిబింబంగా తాను తన అంశలను నాలుగు భాగాలుగా మార్చుకొని విష్ణువు అవతరించా డని చెప్పే అన్వయం ఎంతో సమంజసంగా కనపడుతోంది.

ఇక్కడ నాలుగు భాగాలు ఎలా చేయబడినవి? సమవిభాగాలా? అసమవిభాగాలా? - ఆ తర్కానికి తరువాతవద్దాం. వాల్మీకి కథనాన్ని బట్టి భాగాలు సమంగా లేవు. ఎనిమిది భాగాలుగా ఉండే ఒక పూర్ణంలో సగం రాముడు, రెండుభాగాల ఖండం లక్ష్మణుడు, భరతశత్రుఘ్నులు ఒక్కొక్క భాగానికి ప్రతినిధులు. కాని, వాల్మీకియే రామాదుల జనన మైన తరువాత కథార్థాలలో మరోచోట వర్ణిస్తూ విష్ణువులో అర్ధభాగం భరతుడనీ,లక్ష్మణశత్రుఘ్నులు కలిస్తే భరతునితో తుల్యమైన భాగమనీ వివరించి చెపుతాడు. ఈ రెండింటికి సమన్వయం కుదరక ఎందరో వాదోపవాదాలు చేశారు; ఎన్నో సమన్వయాలు చేశారు. విష్ణువులో అర్ధ మంటే రామునికి అన్వయించవచ్చు. అందులో సగంగా చెప్పే భర తుని భాగానికి అన్వయం ఎలా చెప్పాలి? ఇందులోని అన్వయక్లేశాన్ని తొలగించటానికి అధ్యాత్మరామాయణం ప్రయత్నించింది. అందులో కథ యిది - దశరథుడు పాయసకలశాన్ని తీసికొని పెద్దభార్య కౌసల్య దగ్గరకు పోతాడు. ఆమెదగ్గరే కైకకూడా ఉంటుంది. ఇద్దరున్నారు కాబట్టి దశరథుడు పాయసాన్ని రెండుభాగాలు చేసి వారి కిచ్చాడు. అంతలో సుమిత్ర వస్తుంది. ఆమెను చూచి కౌసల్యా కైకేయులు తమ తమ భాగాల్లో సగం సగం చేసి ఆ భాగాలను సుమిత్ర కిస్తారు. ఒక పూర్ణం ముందుగా రెండు ఖండాలయింది. ఆ రెండుముక్కలూ మరలా నాలుగు చెక్కలయ్యాయి. ఈ విభాగంలో రామలక్ష్మణభరతశత్రు ఘ్నులు సమవిభక్తమైన పాయస ఖండాలవలన జనించినట్లు స్పష్ట మౌతోంది. వాల్మీకంలోని అసమవిభాగంలోని క్లిష్టతను తొలగించి అధ్యాత్మరామాయణం సమవిభాగం ప్రవేశపెట్టి విశిష్ట సమన్వయాన్ని సాధించింది. ఇప్పుడు లోకంలో సమవిభాగ సమన్వయానికే బహుళ ప్రచారం ఉంది.

ఆనందరామాయణం ఈ సమస్యను మరోవిధంగా పరిష్కరించింది. దశరథుడు ముగ్గురు భార్యలకూ పాయసాన్ని మూడు విభాగాలు చేసి ఇస్తాడు. కైక తన భాగాన్ని వినియోగించేలోగానే ఒక ఆడుగ్రద్ద ఆ భాగాన్ని తన్నుకొని గగనాని కెగసి పారిపోతుంది ఆ గ్రద్ద శాపగ్రస్తురాలయిన ఒక అప్సరస. ఆ గ్రద్ద ఆకాశమార్గంలో ఎగురుతూ పోతుంటే పాయసం దొసిగిలి నేలమీదపడుతుంది. ఆ ప్రదేశంలో అంజనాదేవి తపస్సు చేసికొంటున్నది. ఆ పాయసం ఆమెకు లభిస్తుంది; దాని నామె సేవిస్తుంది. ఆమె కడుపున ఆంజనేయుడు పుడతాడు. అయోధ్యలో కైక భాగం గ్రద్దపాలు కాగా, కౌసల్యా సుమిత్రలు తమ తమ పాయస భాగాల్లో సగం సగం చేసి కైక కిస్తారు. ఆమె ఆ భాగాలను సేవిస్తుంది.అంటే-ఒకపూర్ణంలో మూడవవంతు తగ్గించగా మిగిలిన 2/3 వ వంతునే ముగ్గురు రాణులు సేవించారన్నమాట. కౌసల్యా సుమిత్రలు తమ వద్దనున్న 1/3 భాగం గలిగిన రెండు ఖండాలను సగం సగం చేసి కైక కిస్తే ఆమె 1/6, 1/6 వంతులను పొందింది. ఈ కల్పన ప్రకారం రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు పాయసంలో 2/3 వ వంతుకు మాత్రమే సమంగా ప్రతినిధులౌతారు. అంతేకాదు, కైక రెండు భాగాలు తిని కవలబిడ్డలను కనవలసి ఉంది. అదీ జరగలేదు. ఒక భాగం తిన్న సుమిత్రకు కవలలు కలగటం విపరీతంగా కనపడుతుంది. అందువలన ఆనంద రామాయణ కల్పనం అతుకుల బొంతగా, దోషభూయిష్ఠంగా ఉంది.

స్వామి ఆనంద రామాయణంలోని దోషాన్ని తొలగించి విశుద్ధ సమన్వయాన్ని ప్రసాదించారు. స్వామి చెప్పిన కథనంలో కౌసల్యకు, సుమిత్రకు, కైకకు మూడు సమాన భాగాలు ఇవ్వడం జరిగింది. కాని, సుమిత్ర తన పాయస భాగం ఉంచిన పాత్రను ప్రక్కన ఉంచుకొని శిరోజాలను ఆరబెట్టుకొంటున్నది. ఆ తరుణంలో గరుత్మంతుడు వచ్చి ఆ పాత్రను తీసికొని వెళ్ళుతాడు. సుమిత్ర ఖిన్నురాలౌతుంది: కౌసల్యా

కైకలు ఆమెయందు గల సౌజన్యభావంతో తమ భాగాలలో సగము, సగము ఆమెకు పంచిపెడతారు. స్వామి చేసిన విభాగంలో సుమిత్రకు కవలలు కలిగే అవకాశం కల్పింపబడింది. ఆనందరామాయణ విభాగం లోని దోషం పోయింది.

ఎలాగైనా పాయసాన్ని నాలుగు భాగాలు చేయడమనేది తప్పటం లేదు. దశరథునికే తెలుసు - తనకు నలుగురు కొడుకులు పుడతారని. ఎవరికి ఒక్కొక్క కొడుకు పుట్టాలి, ఎవరికి ఇద్దరు కొడుకులు పుట్టాలి అని నిర్ణయించుకొనే లౌకికజ్ఞానం దశరథునికి ఉండాలి. లోకన్యాయాన్నిబట్టి చూస్తే కౌసల్యకు పుట్టిన కొడుకు రాజ్యానికి తన తరువాత రాజు కావాలి. తానిచ్చిన వాగ్దానాన్నిబట్టి కైకకు పుట్టే కొడుకు రాజ్యానికి వస్తే రావచ్చు. ఇద్దరు బిడ్డలు పుట్టే తల్లి మాత్రం ఎవరై ఉండాలి? మధ్యభార్యయై ఉండాలి. సింహాసనానికి సంబంధించిన లావాదేవీలు లేని మధ్యభార్యయే ఇద్దరు కొడుకులను కనాలి. ఈ లౌక్యాన్ని మనస్సులో పెట్టుకొని దశరథుడు భాగాలు పంచాలి. వాల్మీకంలోనూ, అధ్యాత్మలోనూ రాజే పాయసాన్ని నాలుగు భాగాలు చేస్తాడు. మరి ఆనంద రామాయణంలో మూడు భాగాలే చేస్తాడు. తెలిసి చేసిన విభాగం మొదటిది; తెలియక చేసిన విభాగం రెండవది. మరి, స్వామి మొదటి విధానాన్ని - అంటే వాల్మీకం, అధ్యాత్మం చేసిన విభాగాన్ని - బలపరచలేదు. ఆనంద రామాయణ కథనాన్ని ఎన్నుకొన్నారు. ఇందులో స్వామి చెప్పదలచుకొన్న తత్త్వం ఒకటి ఉంది. దశరథుడు తెలిసి తెలిసి నాలుగు విభాగాలు చేస్తే దైవ శక్తికి ప్రాధాన్యం ఉండదు. మానవు డొకటి తలిస్తే మాధవుడు మరొకటి చేస్తాడనట్లు జరగాలి. అంతేకాదు, ముగ్గురు భార్యలయందు దశరథుడు సమమైన ఆదరాన్ని చూపటం న్యాయం. ప్రాజాపత్య పురుషుని ఆదేశంకూడా అలాగే ఉంది. దశరథుడు దైవంమీద భార ముంచి తన కర్తవ్యాన్ని ధర్మబద్ధంగా నిర్వహించటానికై మూడు

భాగాలను చేసి ముగ్గురు భార్యల కివ్వటం జరిగింది. తానొకటి తలిస్తే దైవ మొకటి తలచింది ఏమైనా పాయసం నాలుగు భాగాలుగా రాణులచే సేవింపబడింది. మానవేచ్ఛకూ, దైవేచ్ఛకూ ఉన్న తార తమ్యాన్ని మనకు తెలుపటానికి స్వామి తమ సమన్వయాన్ని మన కందించారు

నాలుగు భాగాలు చేయటం ఎందుకు జరిగింది? ఈ అంశానికి ఎన్నో సమన్వయాలు చెప్పవచ్చు. కొన్నింటినైనా నేడు సమీక్షించు కొందాం:

1. పాయసంలోకూడా నాలుగంగాలు ఉన్నాయి. అవి: బియ్యం నీరు, పాలు, బెల్లం. నీరు మొదట బియ్యంలో ఇంకుతుంది. ఆతరువాత పాలు బియ్యంలో ఇంకుతవి. తరువాత బెల్లం బియ్యంలో ఇంకుతుంది. నీరు, పాలు, బెల్లం బియ్యంతో సంపదించటంచేత పాయసం ఏర్పడు తోంది. ఇందులో ప్రధాన ద్రవ్యమైన బియ్యంలాంటివాడు రాముడు. లక్ష్మణుడు నీరులాంటివాడు, భరతుడు పాలవంటివాడు, శత్రుఘ్నుడు మాధుర్యంవంటివాడు. పాయసంలో సహజసిద్ధంగా ఉన్న యీ నాలు గంశాలను సూచించేటట్లు నాలుగు భాగాలుగా చేయటం జరిగిందని చెప్పటం ఒక అన్వయం మరొక అన్వయం చూడండి-

2. తత్త్వసంగ్రహ రామాయణంలో శేషతల్పశాయి అవతారమే శ్రీరాముడని అన్వయం చెప్పబడింది. రాముడు విష్ణువు; ఆయన శయ నించే శేషుడు లక్ష్మణుడు; ఆయన ధరించే శంఖం భరతుడు; చక్రం శత్రుఘ్నుడు. ఈ రామాయణంలో విష్ణువు స్వయంగా సవనాగ్ని కుండలో నుండి వెలువడి శయనంతోనూ, ఆయుధాలతోనూ కలిసి దశరథ సుతులుగా జన్మింపనున్నట్లు వెల్లడిచేస్తాడు. విష్ణువును వదలి శేషతల్పం ఉండలేనట్లే రాముణ్ణి వీడి లక్ష్మణుడు మనలేడు. శంఖ చక్రాలు విష్ణ్వాజ్ఞ ననుసరించి కార్యనిర్వహణం చేసినట్లు రామాజ్ఞను శిరసావహించి భరతశత్రుఘ్నులు పాలించేవారు. ఒక విష్ణువూ,ఒక శయ

నమూ, రెండు ఆయుధాలూ వ్యక్తులై రాముడుగా రామానుజులుగా దశరథాత్మజులై అవతరించారు. అంగాంగి సంబంధ సమన్వయంతో యీ కథలోని తాత్త్వికాభివ్యక్తి భాసిస్తోంది.

3. మరొక అన్వయం. స్వామి చెప్పినట్లు దశరథుడు దశేంద్రియాలతో కూడుకొన్న శరీరం. ఆ శరీరంలో జీవసంపుటి ఉండాలి. జీవసంపుటి ఉన్న శరీరం చైతన్యవంత మౌతుంది. జీవసంపుటి ఆత్మ, సంస్కారం, బుద్ధి, మనస్సు అనే నాలుగంగాలతో కూడి ఉంటుంది. దశరథుని జీవసంపుటిలో రాముడు ఆత్మ; లక్ష్మణుడు సంస్కారం; భరతుడు బుద్ధి, శత్రుఘ్నుడు మనస్సు. అందువల్లనే ఈ నలుగురు కొడుకులు లేనిదే అతడు బ్రతుకలేడు. అందులో మనస్సు, బుద్ధి, సంస్కారం కాస్త దూరమైనా భరింపగలడు గాని, ఆత్మ దూరమైతే విగతజీవుడే అయిపోతాడు. అందువలన ఆత్మస్థానీయుడైన రాముడంటే అతనికంత ప్రాణం. ఈ తత్త్వం ఒక దశరథునికే కాదు- ఏ జీవికైనా వర్తిస్తుంది. మనకది వర్తిస్తే ఆత్మారామ మౌతుంది. ఆత్మ నావరించుకొని సంస్కార ముంటుంది అలాగే రాముణ్ణి ఆశ్రయించుకొని లక్ష్మణుడు వర్తిస్తాడు. ఆత్మసంస్కార బలంవల్ల బుద్ధి ప్రసరిస్తుంది; మనస్సును శాసిస్తుంది. రామశక్తి భరతునియందు ప్రసరిస్తుంది, శత్రుఘ్నుని నియమిస్తుంది. జీవసంపుటి చైతన్యమే రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల స్నేహసూత్రం. రాముడుంటే అందరున్నారు. అతడు లేనిది ఎవ్వరూ లేరు.

4. సర్వలోక రమణభావాన్ని ఆశ్రయించుకొని మరో సమన్వయం భావించవచ్చు. సర్వలోకం రమించేవాడు రాముడు. ఆ రమించటానికి మూలమైన రసపదార్థం? రాముని యందున్నది. లోకంలో మనం వేటిని రమిస్తాం? - అవి - సౌందర్యం, సౌశీల్యం ధర్మం, పరమాత్మ, ఆత్మతత్త్వం. భౌతిక రంగంలో మనం సౌందర్యాన్ని రమిస్తాం. నైతిక రంగంలో సౌశీల్యాన్ని రమిస్తాం. ఆధ్యాత్మిక

రంగంలో ధర్మాన్ని, పరమాత్మను, ఆత్మతత్త్వాన్ని రమిస్తాం. ఈ మూడు భూమికల్లోనూ రమింపగలిగిన తత్త్వం రామునియం దుండాలి. ఉంది. సౌందర్య దృష్టితో రమించినా రామునంతటి అంద గాడు మరొకడు లేడు. 'పుంసాం మోహన రూపాయ.' జితేంద్రియు లైన మునులు రామునిలోని దివ్య సౌందర్య పరిపూర్ణ దశను దర్శించి కౌగిలించుకోవాలని అభిలషించి పరిష్వంగవరాన్ని కోరారు. అంతటి దివ్య భవ్య సౌందర్యం రామునిది. మునుల కోరికను రాముడు శ్రీకృష్ణావతారంలో ప్రసాదించాడు. మునులే ఆ అవతార కాలంలో గోపికలు. ఋషులది ఇంద్రియరమణం కాదు, ఆత్మరమణం. ఆత్మ రమణంలో వ్యక్తులు జీవులు. అవతారపురుషుడు పరమాత్మ. అతడు రాముడు. రాముణ్ణి భక్తితో రమించటానికి బుద్ధికి సమాహితం కావాలి. సమాహితం నిర్మోహత్వం వల్ల సిద్ధిస్తుంది. మోహావృతమైతే మనస్సు చలిస్తుంది. లక్ష్మణుడు మోహం లేని సమాహితం. భరతుడు భక్తి. భక్తి ఎప్పుడూ నిష్కామ భావంవల్ల నిష్పన్నమౌతుంది. భరతుడు నిష్కామ భక్తికి ప్రతీక. శత్రుఘ్నుడు శమ దమ ప్రధానమైన నిశ్చల తత్త్వానికి ప్రతీక. మనం నిశ్చలతత్త్వం, నిష్కామ భక్తి, నిర్మో హత్వం అనే మూడు అవస్థలను దాటి మన ముపాసించే సౌందర్య, సౌశీల్య, ధర్మ, పరమాత్మ తత్త్వాలను పొందగలుగుతాం. కాబట్టి ఈ నాలుగంచెల విధానాన్ని స్ఫురింపజేయటానికి రాముడు నాలుగు రూపాలతో అవతరించినట్లు భావించటానికి వీలుంది.

5. చతుర్విధ పురుషార్థ సమన్వయం. - స్వామి చెప్పినట్లుగా రాముడు ధర్మానికి ప్రతీక. 'రామో విగ్రహవాన్ ధర్మః.' ధర్మ పురుషార్థం వంటివాడు రాముడు; అర్థపురుషార్థం లాంటివాడు లక్ష్మ ణుడు; కామపురుషార్థం లాంటివాడు భరతుడు; మోక్షపురుషార్థం లాంటివాడు శత్రుఘ్నుడు. స్వామి రామాయణంలోని నలుగురు అన్నదమ్ములకు అపూర్వమైన సమన్వయం చెప్పారు. ధర్మానికి

రాముడు ప్రతీక. స్వామి ధర్మానికి సమాంతరంగా చెప్పే లక్షణం సత్యం. రాముడు ధర్మాన్ని సత్యమనే సాధనంతో సాధిస్తాడు. లక్ష్మణుడు అర్థాన్ని ధర్మమనే సాధనంతో సాధిస్తాడు అర్థమూ, ధర్మమూ-రెండూ కలిసి నడవాలంటారు స్వామి. రామలక్ష్మణుల అన్యోన్య సంబంధం అటువంటిది. భరతుడు కామానికి ప్రతీకగా స్వామి చెప్పారు. ఆ కామం లౌకికమైన కోర్కెగా ఉండకూడదు. విశ్వవ్యాప్తమైన ప్రేమభావంగా ఉండాలి. కామం ప్రేమగా మారితే ఆధ్యాత్మిక స్థితిని పొందుతుంది. అందువలన భరతునియందు నిష్కామ భక్తి భావంతో కూడిన ప్రేమ భావాన్ని స్వామి మూడవ పురుషార్థానికి తుల్యంగా చెపుతారు. శత్రుఘ్నుడు శమ దమాలతో నిశ్చల తత్త్వాన్ని సాధించే సాధనకు ప్రతీక. అట్టి నిశ్చల తత్త్వాన్ని సాధించినప్పుడు సాధనకు కలిగేది శాంతి. అయితే - రాము డనే సత్యం గాని, ధర్మం గాని ఒంటరిగా, స్వతంత్రంగా మనగలుగుతాయి. ధర్మం - ధర్మంగా నిలువగలుగుతుంది కాని, అర్థం, కామం, మోక్షం అనే ఈ మూడూ ధర్మాన్ని ఆశ్రయించకపోతే నిలువజాలవు. ధర్మాశ్రితమైన అర్థమే పురుషార్థ మౌతుంది. అలాగే రామ శాసనంలో ఉన్నవారే అతని తమ్ములు. రాముడు తాను స్వతంత్రంగా నిలువగలడు. తమ్ములలో పూసలలో దారంలా వ్యాపించి వారిని నిలుపగలడు. ఇలా అన్వయించు కొంటే చతుర్విధ పురుషార్థ ప్రతీకలే రాముడు, రామానుజులు.

6. రామాయణాన్ని మంత్రంగా దర్శించే మర్యాద మన దేశంలో ఉంది. మంత్రానికి కవచం, విభూతి, రక్ష అనే అంగా లుంటాయి. రాముడు మంత్రబీజం, లక్ష్మణుడు కవచం, భరతుడు విభూతి, శత్రుఘ్నుడు రక్ష. మంత్ర సిద్ధికి కవచాదులు ఎలా తోడ్పడ తాయో రామ తత్త్వాన్ని దర్శించటానికి లక్ష్మణాదుల తత్త్వాలలా సహాయపడతాయి.

7. భాగవత సంప్రదాయా న్ననుసరించి మరొక అన్వయం చెప్పుకోవచ్చు. భగవంతుడు రాముడు, భగవదారాధనం లక్ష్మణుడు,

భాగవతోత్తముడు భరతుడు, భాగవతారాధనం శత్రుఘ్నుడు భగవదారాధనాన్ని లక్ష్మణుడు చేస్తుంటే, భాగవతారాధనాన్ని శత్రుఘ్నుడు చేస్తుంటాడు.

8. శుశ్రూషా సంప్రదాయాన్ని నేర్పేది రామాయణ మని ఒక అన్వయం చెప్పవచ్చు. శుశ్రూష నాలుగువిధా లని అంటారు. మొదటిది స్థాన శుశ్రూష. గురువుయొక్క గృహక్షేత్రాలను రక్షించటం దాని లక్షణం. శత్రుఘ్నుడు ఇటువంటి శుశ్రూషా సంప్రదాయానికి ప్రతీక. రెండవది అంగశుశ్రూష గురువుల పాదసంవాహనం చేయటం, వారికి అభ్యంగనాదులను చేయించటం మొదలైన సేవలు అంగ శుశ్రూషలో ముఖ్యం. భరతుడు రామపాదుకల సేవ చేశాడు. అంగ శుశ్రూషకు ఆయన ప్రతీక. మూడవది భావశుశ్రూష గురువును తల్లిగా, తండ్రిగా, దైవంగా ఎంచి భక్తి ప్రపత్తులను పచరించటం భావశుశ్రూష. దీనికి లక్ష్మణుడు ప్రతీక. చివరిది, ఉత్తమమైనది ఆత్మశుశ్రూష. గురువులకు మహర్షులకు, ఇష్టములైనవి సలిపి, వారి హృదయాలకు సంతుష్టిని కల్పించటం ఆత్మ శుశ్రూషాలక్షణం. రామావతారం ఆ శుశ్రూషకు అపరావతారం. ఈవిధంగా శుశ్రూషా సంప్రదాయాన్ని గ్రహించినప్పటికీ, చతుర్విధ శుశ్రూషలను ఆదర్శప్రాయంగా లోకానికి ఆచరించి చూపించే ఉద్దేశంతో రాముడు నాలుగు రూపాలను ధరించినట్లు చెప్పటానికి వీలుంది.

9. రామాయణాన్ని 'సీతాయాశ్చరితమ్' అనే దృక్పథంతో అన్వయించుకోవచ్చు. మహామాయ సీత. ఆమె విలాసమే రామాయణం. రాముడు సాధకుడు, అతనిప్రక్కన ఉన్న సీత శక్తి, లక్ష్మణుడు శ్రద్ధ, అతని భార్య ఊర్మిళ సమాధి. రామునితో లక్ష్మణుడు అరణ్యవాసం చేసిన పద్నాలుగేళ్లూ ఊర్మిళ నిద్రలో మునిగిఉంది. అది మనకు లౌకికమైన నిద్రావస్థగా కనపడుతుంది. కాని, అది సమాధి. శ్రద్ధకు ఎప్పుడూ సమాధి పోషకంగా ఉంటుంది. ఆ భార్యాభర్తల స్థితి అటు

వంటిది. ఇక భరతుడు భక్తి; అతని సతి మాండవి నిష్కామ బుద్ధి. ఆ సతి తన పతిని ఎన్నడూ ఏ కోరికా కోరిన పాపానపోలేదు. పతి కాసతి శక్తి నిచ్చింది తన ప్రవర్తనతో. శత్రుఘ్నుడు వ్రతానికి ప్రతీక. అతనిభార్య శ్రుతకీర్తి దీక్ష. వ్రతానికి దీక్ష వెన్నెముక. ఇలా ఈ దంపతులందరూ శక్తియుక్తుల సమ్మేళనంగా కనపడతారు. వారందరూ శక్తిరూపిణియైన సీతయే బహురూపాలతో తమను నడుపగా నడిచారు. మాయ యొక్క అపరావతారాలే రామాయణంలోని స్త్రీ పాత్రలు. ఇలా అన్వయించుకుంటే సీతయొక్క అయనమే రామాయణం.

## 10. శ్రీరాముడు - సాయిరాముడు:

స్వామి చెప్పినట్లుగా రాముడు ప్రేమతత్త్వాన్ని, లక్ష్మణుడు ఆత్మార్పణ భావాన్ని, భరతుడు భక్తశరణాగత భావాన్ని, శత్రుఘ్నుడు సేవాభావాన్ని లోకంలో ప్రదర్శించి చూపించటానికి అవతరించారు. ఒక రామ తత్త్వమే నాలుగు పాయలుగా ప్రవహించింది. సాయిరాముడు కూడా తన ప్రేమ తత్త్వాన్ని ఈ అవతారంలో నాలుగు ప్రక్రియల క్రింద విభజించుకొని ప్రసారం చేస్తున్నారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి తత్త్వమే ప్రేమ తత్త్వం అది లోతు తెలియని తత్త్వం. అదే రామతత్త్వం లాంటిది. స్వామిభక్తులు లక్ష్మణ తత్త్వానికి ప్రతీకలు. స్వామిని నమ్మి అనన్యచిత్తంతో, శరణాగత భావంతో, ఆత్మార్పణం చేసి భజించేవారికి, సేవించేవారికి స్వామి రక్షగా నిలుస్తున్నారు. సాయిభక్తులను అడిగితే స్వామి వారిని రక్షించిన ఉదంతాలు వేనకువేలు చెపుతున్నారు. అన్నీ ప్రత్యక్షసాక్ష్యా లున్నవే. పిలిస్తే పలికే సజీవదైవం స్వామి. నిర్మోహభక్తితో సేవించే భక్తులు లక్ష్మణ తుల్యులు. ఇటువంటివారు నేడు ప్రపంచమంతా వ్యాపించియున్నారు. సాయిరాముణ్ణి సేవించుకుంటున్నారు. ఎవ రెక్కడ ఎప్పుడు భక్తితో భజిస్తే అప్పు డక్కడ స్వామి వారికి ప్రసన్నులై రక్షిస్తున్నారు. ఇది అభినవ రామలక్ష్మణ తత్త్వం.

సత్యసాయి భజన మండలులు భరతభక్తికి ప్రతీకలు. భరతుడు రామపాదుకలను సేవించాడు. భక్తులు బాబాపటాన్ని పాదుకలను భగవాన్ ప్రతీకలుగా భావించి కీర్తించి తరిస్తున్నారు. సుప్రభాత సేవలు, నగర సంకీర్తనలు, భజన సమావేశాలూ, నామసంకీర్తన సప్తాహాలూ, అఖండ భజన కార్యక్రమాలూ- ఇలా ఎన్నో ప్రక్రియలు ఈ శాఖలో సాగుతున్నాయి.

సత్యసాయి సేవాదళాలు శత్రుఘ్న సంప్రదాయానికి ప్రతీకలు. సేవాసమితి కార్యక్రమాలు సంఘసేవ కుద్దేశింపబడినాయి. సాటి మానవునిలో సాయిరూప భగవంతుని దర్శించి ఫలం కోరని సేవను పచరించే ప్రస్థానమిది. ఒక్క ఉదంతాన్ని చెపుతాను: నిజామాబాదు కేంద్రంలో సేవాదళ సభ్యులొకసారి ఒక హాస్పిటల్‌లో ప్రొద్దున్నే తమ సేవాకార్యక్రమాన్ని ఆరంభించారట. కొందరు చీపురు కట్టలతో ప్రాంగణాన్ని చిమ్మి శుభ్రం చేస్తున్నారట. వారిని సివిల్‌సర్జన్ పిలిచి 'మీకు ఏం కావాలి? ఏదైనా విరాళం కావాలా? లేక సర్టిఫికేట్ కావాలా?' అని అడిగాడట. అప్పుడా సభ్యులిలా అన్నారట - 'మేము ప్రశంసల కోసం, విరాళాలకోసం, గుర్తింపుకోసం ఈ సేవలు చెయ్యటం లేదు. అలా చేస్తే మా స్వామి తత్త్వానికే విరుద్ధం. మాలో ఉన్న అహంకారాన్ని ఈ సేవా కార్యక్రమంతో తగ్గించుకోవటానికీ, మానవసేవయే మాధవసేవ అనే భక్తిభావాన్ని మాలో పెంపొందించుకోవటానికీ, ఒక భగవదారాధనా విశేషంగా ఈ సేవలు చేస్తున్నాం'' అని అన్నారట. ఆ సివిల్‌సర్జన్ వారి సేవాభావానికి ఉత్తేజితుడైనాడు. వెంటనే వారితో కలిసి చిమ్మినచోట నీరు చల్లటం మొదలుపెట్టాడట! ఇలా స్వామి కార్యక్రమాల్లో పాల్గొని, అంతశ్శత్రువులను జయించే యత్నంతో మానవసేవ చేస్తున్న కార్యకర్తలు శత్రుఘ్నులవంటివారు. స్వామి సేవాసమితుల్లో, సేవాదళాల్లో, విద్యాలయాల్లో వేలకొద్ది, లక్షలకొద్ది యిటువంటివారు వెలువడుతున్నారు. రామావతార తత్త్వాన్ని తమ

యందు సంవదించుకొన్న స్వామి రామునివలెనే తమబలగాన్ని నాలుగు విభాగాలు చేసికొన్నారు. మానవాకృతి ధరించి వచ్చిన అవతారపురుషు డెప్పుడూ తన ప్రవృత్తిని నాలుగు విధాలుగా విభజించుకొని ప్రవర్తి ల్లటం విశ్వజనీనమైన సత్యమని పాయస విభాగ ఘట్టం చెపుతోంది; సాయి రామావతార కార్యక్రమ విభాగం దాన్ని నిరూపిస్తోంది.

అధ్యాత్మరామాయణంలో దశరథుడు మొదట పాయసాన్ని రెండు భాగాలు చేయటంలో కూడా ఒక జీవిత సత్యం వెల్లడి అవు తోంది. రామావతారంలో నిర్వహింపబడవలసినవి రెండు కార్యాలు. ఒకటి దేవకార్యం- అది రావణ సంహారం. రెండవది పితృకార్యం- అది రాజ్యనిర్వహణం పితృకర్మ దానిలోనిభాగం. పాయస భాగద్వయంలో మొదటి ఖండం రామలక్ష్మణ ఖండం; రెండవ ఖండం భరతశత్రుఘ్న ఖండం. రామలక్ష్మణులు ప్రధానంగా దేవకార్యం నిర్వహించారు; భరత శత్రుఘ్నులు పితృకార్యాన్ని నిర్వహించారు. ఈ అవతార తత్త్వాన్ని గమనిస్తే మనకొక విషయం స్పష్టమౌతుంది. ప్రతి మానవుడూ అవ తారపురుషుడే. అవతరించిన ప్రతివానికీ రెండు ధర్మాలుంటాయి. ఒకటి విశ్వధర్మం; రెండవది స్వీయధర్మం. వీటినే సమష్టి ధర్మమనీ- లేక-సమాజ ధర్మమనీ, వ్యష్టి ధర్మమనీ పేర్కొనవచ్చు. పుట్టిన ప్రతి వాడూ తన జీవితంలో సగం భాగాన్ని విశ్వధర్మానికి వినియోగించాలి; మిగిలిన సగం భాగాన్ని స్వీయధర్మానికి వెచ్చించాలి. విశ్వప్రేమతో విశ్వశ్రేయస్సుకు కృషి చేయటం దేవకార్యం, విశ్వధర్మం. తనకూ, తన కుటుంబానికీ అభ్యుదయం కలిగించుకొనే ప్రయత్నం స్వీయ ధర్మం, లేక పితృకర్మ. ఈ రెండుభాగాలూ ప్రతి జీవి జీవితంలోనూ ఉంటాయి. అందులో మనం సమాజ ధర్మానికి అగ్రతాంబూలమివ్వాలి, స్వీయధర్మాన్ని అనుబంధంగా సాధించాలి. ఇదే అవతార తత్త్వాన్ని జీవితాని కన్వయించుకొనే అనువైన ఆదర్శమార్గం.

స్వామి చెప్పిన రామకథలో పాయసం దశరథునిచేత మూడు భాగాలుగా విభజింపబడుతుంది. దీనిలో ఒక అంతరార్థం ఇమిడివుంది.

మానవ జీవితం త్రిగుణాత్మకం. సత్త్వగుణం రామభాగం. అందులో లక్ష్మణుడు అంతర్భాగం. ఒకటి ఆదర్శం, మరొకటి ఆచరణం రజో గుణం భరత భాగం; అందులో శత్రుఘ్నుడు అంతర్భాగం. రామ భాగం దైవత్వానికి ప్రతీక; భరతభాగం మానవత్వానికి ప్రతీక. దైవత్వాన్ని గుర్తించి మానవత్వాన్ని పెంచుకోవటమే రామభరత తత్త్వం. ఇక మూడో భాగం తమోగుణప్రధానం తమస్సు ప్రమాదా నికి చిహ్నం. సుమిత్రలోని తమోగుణం దైవత్వానికి ప్రతీక అయిన పాయసభాగాన్ని ప్రమాదంవల్ల కోల్పోతుంది. దాన్ని సేవాధర్మానికి ప్రతీక అయిన గరుత్మంతుడు గ్రహిస్తాడు; దాన్ని తపస్సు కందిస్తాడు; తమస్సు జ్ఞానాకాశంలోని కెగసి తేజస్వంత మౌతుంది; తపస్సుచేత పరిపక్వమై సాత్త్వికసేవావృత్తిని భజిస్తుంది. అప్పుడు దానికి దైవ త్వాన్ని భజించే శక్తి వస్తుంది. హనుమంతు డాశక్తిని సంపాదించిన సేవాప్రవృత్తికి ప్రతీక. ఈ విభాగాన్ని అనుసరించి తెలియవచ్చే దేమి టంటే - దైవత్వ మానవత్వాలు జీవితంలో ఎంత ముఖ్యమో దైవ త్వాన్ని గుర్తించి, సమాజసేవాభావాన్ని ప్రదర్శించటంకూడా అంతే ముఖ్యమని. దైవత్వం, మానవత్వం, సేవాతత్త్వం - ఈ మూడూ మానవజీవితంలో త్రిగుణాల్లాంటివి. సేవాతత్త్వం తమస్సును వీడి జ్యోతిస్సు వైపు పయనిస్తుంది; మానవత్వం మృత్యువును అధిగమించి అమృతత్వం సాధిస్తుంది: దైవత్వం అసత్తును వదలి సత్తు వైపు గమి స్తుంది. ఈ ప్రస్థానాన్ని ప్రబోధించటానికే స్వామి పాయసాన్ని మూడు భాగాలు చేసినట్లు రామకథలో వర్ణించి చెప్పారు.

స్వామి పాయస విభాగంలో ఇచ్చిన తీర్పు విశిష్టమైంది. తత్త్వ గంభీరంగా ఉంది. ఒక విధంగా చూస్తే - మనకు రామమందిరంలో సీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నులతోపాటు - వారి ప్రక్కన హను మంతుడు లేకపోతే అది పరిపూర్ణంగా భాసించదు. స్వామి చెప్పిన పాయస కథనంలో హనుమంతుడుకూడా పాయసభాగంవల్ల జన్మించిన

వాడే. భాగాలను లెక్క కట్టి చూస్తే రామలక్ష్మణులు ఇద్దరూ కలిసి పాయసంలో 1/3 వ వంతు; భరతశత్రుఘ్నులూ అంతే. కాని, హనుమంతుడుమాత్రం ఒక్కడే 1/3 వ వంతు. ఇలా చెప్పటంలో సార్థక్యం ఉంది. రామలక్ష్మణులను ఇరువురినీ తన భుజాలపై కూర్చుండబెట్టుకొని పోగలిగిన శక్తి హనుమంతునికి ఉంది. అలా ఉండాలంటే ఆ విభాగం అలాగే ఉండాలి. అంటే - దైవత్వంలోని ఆదర్శాన్ని, ఆచరణనూ సేవాభావం గల భక్తుడు సంపూర్ణంగా సమర్థించగలడన్నమాట. దీనినిబట్టి తెలియగలిగిం దేమిటంటే - స్వామి తన భక్తులకు తమ అవతారంలో మూడవ వంతు కల్పించి, తాము రెండువంతుల్లో సర్దుకున్నా రన్నమాట. తమ అవతారతత్త్వాన్ని రామావతారతత్త్వంతో అన్వయించి చెప్పారన్నమాట! రామకథలో సాయితత్త్వ సుధను చిలికించారన్నమాట!

స్వామి యెంత కరుణామయులు! వాల్మీకి చెప్పని, అధ్యాత్మ రామాయణం దర్శించని, ఆనందరామాయణం అందుకోలేని సమన్వయం స్వామి పాయస పరమార్థంలో ప్రతిష్ఠించారు. పండితులు కొందరు స్వామి విరుద్ధకల్పన చేశారని అనుమానించవచ్చు. కాని, స్వామి రామాయణానికి ఒక విశిష్ట దర్శనాన్ని అందించారనీ, అది సాయిరామతత్త్వ ప్రతిపాదకంగా ఉన్నదనీ గుర్తించాలి. స్వామి నోట వెలువడిన 'రామకథా రసవాహిని' అభినవ రామాయణ దర్శనం. ప్రేమతత్త్వ పంచమవేదం!

స్వామి యిచ్చిన అన్వయంలో పాయసంలోని మూడు భాగాలు అయిదు భాగాలుగా మారిన తత్త్వం విశేషం. దశరథ పుత్రులతోపాటు అంజనాతనయునికి కూడా భాగం కల్పించటం అద్భుతం. భక్తులమీద వారికి ఎంతటి దివ్యమైన కరుణయో దానివలన స్పష్టమౌతోంది. పాయస పరమార్థ విచారంలో స్వామి ప్రసరించిన దర్శనం భావి పరిశోధకుల కొక దివ్యసాధనోపాయం. సాయిరామ్!

# ఉత్తిష్ఠ! నరశార్దూల!

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము.
సాయి కుటుంబ సభ్యులకు నమస్కారము.

"కౌసల్యా సుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్."

**పాట**

పల్లవి : సుప్రభాతము పాడినాడు - కౌశికుడు
సుకృత మెంతో చేసినాడు.

1. కౌసల్య పొత్తిళ్ళ కమ్మదనమును మరచి
కుశల పానుపు మీద పవ్వళించిన స్వామి ॥సుప్రభాతము॥

2. దశరథుని కౌగిళ్ళ తన్మయత్వము మరచి
ధరణియే తల్పముగ తనువు నిల్పిన స్వామి ॥సుప్రభాతము॥

3. సౌమిత్రి తనపక్క సవదరించిన చాలు
శేషతల్పము నెంచి స్నిగ్ధుడౌ శ్రీ స్వామి ॥సుప్రభాతము॥

4. బ్రతుకంత బాధపడి బ్రహ్మపదమును గాంచి
బరువంత దించుకొను పరమధామము నెంచి ॥సుప్రభాతము॥

5. కనులు తెరచిన చాలు కరుణారసపు జాలు
వెలుగు రేకలు చల్లి ఏలుకో స్వామి! యని ॥సుప్రభాతము॥

సరయూ నదీతీరంలో తొలిసంజరేకులు తెలతెల్లవారుతున్న ప్రశాంత ప్రభాత సమయంలో, తాను ఆ క్రిందటిరాత్రి పరిచిన లేతపచ్చిక పక్క మీద శ్రీరామమూర్తి లక్ష్మణ సహితుడై శయనించి వున్న సందర్భాన్ని చూసి ఆ స్వామికి విశ్వామిత్రులవారు సుప్రభాతం పాడారు. ఎంత అదృష్టం చేసుకొన్నాడో ఆ మహానుభావుడు! సుప్రభాత సంప్రదాయా

నికి శ్రీకారం చుట్టాడు ఆ కౌశిక మహర్షి. 'ఓ శ్రీరామా! తూర్పు తెల్లవారుతున్నదయ్యా, ఓ నరశార్దూలా! నిద్రలే. దైవికమైన ఆహ్నిక కృత్యాలు నీవు నిర్వర్తించాలి' - ఇదే ఆయన చేసిన మొదటి సుప్రభాతం. స్వామికి సుప్రభాతం పాడుతున్నప్పుడు, ఈ సుప్రభాత తత్త్వాన్ని విశ్వామిత్రులవారు మొదట మనకు ఇస్తున్నప్పుడు, ఈ సుప్రభాతంలో వున్న తాత్పర్యాన్ని కొంత పర్యాలోచనం చేయవలసి వుంటుంది. మనము నిద్రలో మునుగుతున్నాము. నిద్రలో మునిగినపుడు బాహిరమైన స్పృహ మనకు లేదు. ఎవరో మేల్కొల్పుతున్నారు. మనము మేలుకొంటున్నాము. మేల్కొల్పుతున్నవారి శబ్దము విని మనం మేల్కొంటున్నామా? లేక ఆ శబ్దం మనకు వినపడకపూర్వమే మనము మేల్కొంటున్నామా? వేదాంతములో ఇది ఒక చర్చ. ఎవరైనా పిలిస్తే మనము నిద్రనుంచి మేల్కొంటున్నాము. మేల్కొని ఆ పిలుపు వింటున్నామా లేక ఆ పిలుపు విని మేల్కొంటున్నామా? మనము మేల్కొంటేనే ఆ పిలుపు వినపడుతోంది. ఈ పిలుపు పిలుస్తున్న సందర్భాన మన శరీరములో జాగృతి చైతన్యాన్ని తీసుకొనివచ్చే ఒక దైవ చైతన్యం సహజంగా వుంది. అది ఉద్బుద్ధమైనపుడు ఎదుటివారు పెడుతున్న కేక మనకు వినపడుతుంది దైవికమైన ఆ చైతన్యం మనలో జాగృతమయినప్పుడు మాత్రమే ఇంద్రియ జ్ఞానం పనిచేస్తుంది. చెవి వినగలుగుతుంది; కన్ను చూడగలుగుతుంది. శ్రీరాముడు యోగ నిద్రా ముద్రితమైన ఆ నిద్రావస్థలో వున్నపుడు విశ్వామిత్రులవారు స్వామిని మేల్కొల్ప చేస్తున్నారు. మానవాకృతి ధరించి యోగనిద్రను భజిస్తున్న ఆ నారాయణుని 'నీ చైతన్యాన్ని మేల్కొల్పచేయి స్వామీ!' అని సుప్రభాతమును పాడుతున్నాడు. 'నీవు నిద్ర లేచేటప్పుడు ఎలా లేవాలి?' అని అంటున్నాడు? నరశార్దూలంగా లేవాలి! అంటున్నాడు.

వాల్మీకి రామాయణంలో శార్దూల శబ్దాన్ని శ్రేష్ఠవాచకంగా చాల చోట్ల వాడుతాడు. మానవ శ్రేష్ఠుడుగా లే. నిద్ర మేలుకో! "పూర్వా

సంధ్యా ప్రవర్తతే." పూర్వ సంధ్య ప్రవర్తితమౌతోంది. ఈ పూర్వ సంధ్య ఏమిటి? నరశార్దూలుడుగా రాముడు మేల్కోవడం అంటే ఏమిటి? అన్నది మనం కొంత పర్యాలోచనం చేయాలి. శ్రీరాముడు పుట్టిన తరువాత 16 ఏళ్ళ వయస్సు వచ్చింది ఇప్పటికి 16 ఏళ్ళ వయస్సులో శ్రీరామ, లక్ష్మణులను యాగ సంరక్షణార్థమై సిద్ధాశ్రమానికి తీసికొనివెళుతున్నాడు విశ్వామిత్రులవారు. 'నీ జీవితములో తొలి సంజ అంకురిస్తున్నదయ్యా! నర శ్రేష్ఠునిగా మేలుకో' అన్నాడు. రాముని జీవితంలో పూర్వ సంధ్య (తొలి సంజ) విశ్వామిత్రుని యాగ రక్షణ ఘట్టం. మరి మధ్యాహ్న సంధ్య రావణ వధ ఘట్టం. అపర సంధ్య ఉత్తర రామ కథలోని అశ్వమేధయాగ ప్రవర్తన ఘట్టం. ఈ మూడు సంధ్యలలో వ్యాపించివున్న శ్రీరామ జీవితములో మొట్ట మొదటి సంధ్య, పూర్వసంధ్య, ఇప్పుడు ప్రవర్తితం కాబోతున్నది. తొలిసంజ వెలుగు రేకలు విప్పుతున్నది. ఈ సందర్భాన్ని కథార్థ సూచకంగా త్రికాలవేదియైన ఆ విశ్వామిత్రుడు శ్రీరాముణ్ణి మేల్కొల్పుతున్న ఫణితిలో చెప్పుతున్నాడు. ఇక్కడనుంచి నీవు ఉత్తమ పురుషుడవై, ఆదర్శ పురుషుడవై, నీవు నరాకృతితో ఏ కార్యాన్ని సాధించటానికి భూతలంమీద అడుగుపెట్టావో ఆ కార్యాన్ని సాధించడానికి ఉన్ముఖమైన ప్రవృత్తితో సంచరించాలి. ఆ సమయ మాసన్నమైనది. "ఉత్తిష్ఠ!" అని విశ్వామిత్రులవారు శ్రీరాముణ్ణి ప్రబోధిస్తున్నారు.

నిజానికి తలిదండ్రుల దగ్గర కొడుకులు అడ్డంగా పెరుగుతారు. గురువుల దగ్గర కొడుకులు నిలువుగా పెరుగుతారు, తల్లిదండ్రుల యొక్క గారాబంచేత సుతులలో సాహసోపేతమైన పరాక్రమం కొలిల్లజాలదు వారిలోవున్న దైవికమైన చైతన్యం జాగృతం కాజాలదు.తల్లిదండ్రుల వ్యామోహం అనే చీకటిలో ఆ జీవుడు వెలుగునువెతుక్కుంటూ వుంటాడు అందువల్లనే, పూర్వకాలంలో ఏడవ సంవత్సరంలోనే గురుకులానికి కొడుకులను పంపేవారు. గురువు అతనిలో వున్న దివ్య

చైతన్యాన్ని మేల్కొల్పుతాడు. లేచి, నిలిచి నడవమంటాడు. నరోత్త మునిగా ముందుకు నడవమంటాడు మానవునిలో వున్న ఉత్తమ వ్యక్తిత్వాన్ని, ఆధ్యాత్మిక ప్రవృత్తిని, ప్రవృత్తి నివృత్తి శీలాలను జాగృతం చేసి పరిమళింప చేసేవాడు గురువు. శ్రీరాముడు అంతఃపురాలలో పుట్టి పెరిగాడు. తల్లిదండ్రుల వాత్సల్యాన్ని చవి చూశాడు. వారి ముద్దు మురిపాలు తానూ పొందాడు. ఇప్పుడు ఆ అంతఃపురం వదలి వస్తున్నాడు. విశ్వామిత్ర ప్రస్థానం ఒక ఆచార్య ప్రస్థానంలాంటిది. నగరంలో సుఖంగా వున్న శ్రీరాముణ్ణి వనానికి తీసుకొనివస్తున్నాడు. మరల మిథిలా నగరానికి తీసికొనివెళ్ళుతాడు. అయోధ్య హృదయ స్థానీయం,అని మనం చెప్పుకున్నాం. హృదయస్థానమైన అయోధ్యనుండి సిద్ధికి ప్రతీకయైన సిద్ధాశ్రమానికి ఎస్తున్నాడు రాముడు. తాను ఒక పరిణతమైన సిద్ధిని సాధించిన తరువాత బుద్ధిని అందుకోబోతున్నాడు మిథిలానగరంలో. హృదయము, సిద్ధి, బుద్ధి అనేటటువంటి మూడు అవస్థలకు అయోధ్య, సిద్ధాశ్రమం, మిథిల మనకు ప్రతీకలుగా కన్పడతాయి.

అంతఃపురంలో పెరిగిన శ్రీరాముడు తన బాల్యక్రీడలను ప్రకటించినట్లుగా రామాయణములో అంత విస్తృతంగా వర్ణించ లేదు. ఎంతో మమకారంతో శ్రీరాముడు పెరిగాడు. రామునియందు సామాన్య మానవ శిశువుయొక్క లక్షణాలు ప్రకృష్టంగా కన్పడుతున్నాయి తప్ప అతనిలో లోవెలుగుగా ప్రకాశిస్తున్న దైవ చైతన్యం లీలావిభూతితో ప్రకటితం కావడం లేదు వాల్మీకి రామాయణ కథార్థాలలో. కాని, తరువాతి రామాయణ కర్తలు రామునిలో వున్న దైవత్వాన్ని, శ్రీకృష్ణునిలో ప్రకటితమైన లీలా పద్ధతిలో ప్రదర్శింపచేయడానికి ప్రయత్నం చేశారు. అలా ప్రయత్నం చేసిన మొదటి గ్రంథం అధ్యాత్మ రామాయణం. ఆ అధ్యాత్మ రామాయణాన్ని అనుసరించి ఎన్నో రామాయణాలు శ్రీరామునిలో దివ్య చైతన్య విభూతితో భాసిస్తున్న లీలామానుష విగ్రహ స్ఫూర్తిని అభివ్యక్తీకరింపచేయటానికి లీలాభివర్ణం చేయటం జరిగింది. అధ్యాత్మ రామాయణం ప్రకారం శ్రీరాముడు జన్మిస్తున్న

సందర్భంలో మొదట భూమి మీద పడగానే చతుర్భుజుడైన నారాయ ణాకృతిలో వున్నాడట ఆ బాలుడు. తేజోమయమైన ఆ నారాయణ స్వరూపాన్ని చూచి కౌసల్య భక్తిప్రపత్తులతో కీర్తిస్తుంది. 'పూర్వ జన్మలో నీవు నన్ను కుమారునిగా కోరావు. నీకు దివ్యజ్ఞానం ప్రస్ఫు టీకరించేటట్లుగా నేను నిజాకారంతో శిశువుగా జన్మించాను' అని అన్నాడు బాలుడైన మహావిష్ణువు. 'ఈ దివ్య తేజస్సును మానుషమైన నేత్రాలు చూడలేవు. మహావిష్ణువువు నీవు. నా హృదయాన్ని రంజింప చేసే నా ఆనందమును పెంపొందింపచేసే బాలునిగా మారు' అని ప్రార్థిస్తుంది కౌసల్య. అప్పుడు చతుర్భుజుడైన నారాయణుడు ముద్దులు మూటకట్టే బాలునిగా మారుతాడు. ఇది రామాయణంలో లేదు. దీన్ని ఆశ్రయించి అనేక కల్పనలు జరిగాయి. స్వామి రామునిలో వున్న దివ్యలీలా వైభవాన్ని తమ అవతారానికి అనుగుణంగా లీలావిభూతిని చిత్రిస్తూ ప్రకటించారు. కౌసల్య చిన్నపిల్లలైన రామునీ, లక్ష్మణునీ ఉయ్యాలలో పెట్టి, వారిని నిద్రపుచ్చుతుంది. ఇంటిలోకి వెళ్ళి పాయసం వండి దేవతార్చన మందిరంలో పెట్టి దేవునికి నివేదనం చేసింది. శిశు వులు ఏమి చేస్తున్నారో చూడడానికి ఈవలకు వచ్చింది. శిశువులు నిద్రపోతున్నారు. మరల దేవుని మందిరంలోకి వెళ్ళింది. ఆ పాయసపు గిన్నెలో పాయసం లేదు. ఏమిటా పాయసపు గిన్నెలో పాయసం లేదని ఆతురత పడుతుంది. మరల బాలకుల దగ్గరకు వస్తుంది. దేవుని దగ్గరకు, బాలకుల దగ్గరకు ఆ తల్లి తిరిగింది. రాముడు నోరు చప్ప రిస్తున్నాడు; పాయసం తిన్న వాసన ఆ ముఖపద్మం నుండి గుబాళి స్తోంది. చెలికత్తెలను అడిగింది- ఈ బాలుడేమైనా లేచి వచ్చాడా అని. లేదు, అలాగే పవళించి ఉన్నాడు. నిద్రాముద్రితమైన ఆ యోగ సమా ధిలో నున్న ఆ నారాయణుడు ఆ పాయసాన్ని ఎలా భుజించాడు? ఈ విచికిత్సతో ఆ శిశువు ముఖారవిందాన్ని చూస్తుంది. అందులో బ్రహ్మాండమంతా ఒక్కసారి తిరిగినట్లుగా కన్పడుతుంది. కలయో, వైష్ణవమాయో అన్న భ్రాంతి కలిగి, దిగ్భ్రాంతితో మూర్ఛితురాలవు

తుంది. చెలికత్తెలు సేదతీరుస్తారు 'ఏమ్రా! బాలుని ముఖంలో ఏదైనా వికారం కన్పడుతున్నదా?' అని కౌసల్య చెలికత్తెలను అడుగుతుంది. వారి కెవ్వరికి కన్పడలేదు.

దివ్య విభూతిని భగవంతుడు ప్రకటించే విధం విచిత్రంగా వుంటుంది. ఒకసారి - స్వామి, భక్తులమధ్య నడయాడుతున్నప్పుడు, ఒక పాశ్చాత్య భక్తుడు స్వామి మీద భక్తిప్రపత్తులతో మనస్సును లగ్నంచేసి కూర్చొని వున్నాడు. స్వామి ఆ భక్తుని ప్రక్కకుండా వెళుతూవుంటే, దివ్య విభూతి సౌగంధ్యం అతని ముక్కులకు కొడుతుంది. ఈ దివ్య సౌగంధ్యానికి అతడు తన్మయుడై పోతాడు. ప్రక్కనున్న పాశ్చాత్య మిత్రులందరిని చూచి, 'ఎంతటి దివ్యగంధమో!' అని అంటాడు. 'దివ్యగంధం ఏమిటి, మాకు ఎవ్వరికీ కొట్టడంలేదు. నీకు ఒక్కడికే కొట్టినదా?' అని వారాశ్చర్యపోతారు. స్వామి నిన్ను కరుణిస్తున్నారు అన్నదానికి యీ దివ్య విభూతియొక్క సౌగంధ్యమే తార్కాణమని చెప్పడం జరుగుతున్నది. నేను ఈమధ్యనే ఖమ్మం వెళ్ళి వచ్చాను. అక్కడ స్వామి భక్తు లెందరో ఉన్నారు. ఒక భక్తుని యింట స్వామి నైవేద్యము స్వీకరిస్తున్నారు. వేళ్ళ గుర్తులు కన్పిస్తున్నాయి. సింహాసనం వేసి, ఉయ్యాల, శయ్యవేసి ఉత్సవం చేస్తున్న సందర్భములో, తెల్లని వస్త్రముంచి ఆవలకు వెళ్ళివస్తే, స్వామి అడుగుల గుర్తులు ఆ తెల్లని బట్టమీద కన్పిస్తున్నాయి. ఇటువంటి దివ్య విభూతి తాను ప్రకటిస్తున్న యీ సందర్భంలో కౌసల్యానందవర్ధనుడు అయిన శ్రీరాముడు కూడ నైవేద్యాన్ని ఆరగించిన ఘట్టాన్ని, బ్రహ్మాండాన్ని చూపించిన ఘట్టాన్ని కల్పించి స్వామి రామ విభూతిని మనకు ప్రకటితం చేశారు.

శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల విద్యార్జన విధానంలో రాముడు తాను అంతవరకు తనయందే సంగుప్తమై వున్న సర్వ విద్యలను జాగృతం చేసికొని నెమరువేసికొంటున్నట్లుగా కన్పడతాడు. గురువులు చెప్పుతూ వుండగానే అతనిలో సంపూర్ణ విద్యా వికాసం

కలుగుతుంది. అతడు తన్మయుడై పోతాడు. లక్ష్మణ, భరత, శత్రు ఘ్నులు కొంచెం వెనుకపడతారు. అప్పుడు గురువులు 'లక్ష్మణా! భరతా! శత్రుఘ్నా మీరు చక్కగా చదువుకోవాలి, వెనకపడిపోతున్నారు' అంటే వారి సమాధానం- 'మాకు చదువులు అక్కర్లేదు. మేము రాముని ముఖారవిందాన్ని చూస్తూంటే, అదే చాలు, మాకు అదే చదువు.' వెనకపడి పోతున్నాడనుకొన్న లక్ష్మణుడు చదువడు. రాముని ముఖమే చూస్తూ వుంటాడు. తెల్లవారేసరికి ఆ చదువు అతనికి వస్తుంది.

కళాపూర్ణోదయం అనే ప్రబంధములో ఒక కథ వుంది. నారదునికి గంధర్వ సంగీత విద్యాభ్యాసం చేయించటానికి శ్రీకృష్ణుడు అంగీకరిస్తాడు. అంతఃపుర వనితలవద్ద మొదటి మూడు సంవత్సరాలు చదువుమని చెప్పుతాడు. జాంబవతి దగ్గర మొదటి సంవద్సరం చదువమంటాడు. రెండవ సంవత్సరం సత్యభామ దగ్గర చదువమంటాడు. మూడవ సంవత్సరం రుక్మిణీదేవి దగ్గర చదువమంటాడు. నారదుడు నిత్యబ్రహ్మచారి కాబట్టి, దేవర్షి కాబట్టి శ్రీకృష్ణుని అంతఃపురంలో ప్రవేశించటానికి అనుమతి వుంది. నారదుని దగ్గర విద్య నేర్చుకోవడానికి మణికంధరుడు అనే శిష్యుడు వుండేవాడు. 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అన్న న్యాయం చొప్పున అతడు గురువు గారి పాదాలను నమ్ముకొన్నాడు. గాంధర్వ సంగీత విద్యను నారదుడు శ్రీకృష్ణుని అంతఃపురంలో అంతఃపుర వనితల దగ్గర నేర్చుకొంటూ వుండేవాడు. మణికంధరుడు మాత్రం అంతఃపురానికి వెళ్ళడానికి వీలు లేదు. మెట్లవరకు గురువుగారి వీణను మోసికొనివచ్చేవాడు. అక్కడ నిలబడేవాడు. గురువు గారు వీణను స్వయంగా గ్రహించి పైకి వెళ్ళి పోయేవారు. మూడు సంవత్సరాలు అయిపోయిన తరువాత చిట్టచివరి సంవత్సరము శ్రీకృష్ణుని దగ్గర చదువవలసివచ్చింది. మూడు సంవత్సరాల గాంధర్వ గాన విద్య నేర్చుకున్న గురువుగారి ప్రక్కన మూడు సంవత్సరాల చదువు వెనకపడిన శిష్యుడు వచ్చి కూర్చున్నాడు. అచంచలమైన భక్తి విశ్వాసాలు కలిగిన ఆ మణికంధరుని సమాహిత

చిత్తవృత్తిని చూచి శ్రీకృష్ణుడు ఆనందపారవశ్యాన్ని భజించి, మూడు సంవత్సరాల చదువు నంతా, వరరూపంగా అతనికి ఇచ్చివేశాడు. లక్ష్మణుడు చదివిన చదువంతా ఇటువంటిదే. రామునియందలి భక్తియే అతని చదువు. ఆ భక్తివలననే అతనికి సిద్ధి. ఆ భక్తి చేత తన విద్యాశక్తులను సముపార్జించుకొంటున్న లక్ష్మణునియొక్క తత్త్వాన్ని మనము తరువాత కూడ చూద్దాము.

విశ్వామిత్రులవారు ఉపదేశించిన విద్యలు శ్రీరామునికే ఉపదేశించారు. విశ్వామిత్రుడు శ్రీరామునికిచ్చిన మహాస్త్రములన్నీ శ్రీరామునికే దత్తమైనాయి. లక్ష్మణునికి దత్తమైనవి కావు. మరి, లక్ష్మణునికి ఆ శక్తి ప్రపత్తులు ఎలా వస్తున్నాయి? శ్రీరామ గతమైన భక్తి తాత్పర్యం వలననే ఆ లక్ష్మణునికి ఆ విద్యలన్నీ అంటుతూ వచ్చాయి. ఈ తత్త్వాన్ని స్వామి లీలావిలాసరూపంగా బాల్యక్రీడలలో వర్ణించి చెప్పారు.

యువకులుగా నున్న రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు యుక్త వయస్సులోనే దైవచింతనం ఏర్పడడానికి భారతదేశంలోనున్న తీర్థయాత్ర స్థలాలన్నీ వారికి చూపించాలి అని భావించి, ఆసేతుహిమాచల పర్యంతం ఉన్న పుణ్యతీర్థాలను, పుణ్యక్షేత్రాలను శ్రీరామాదులకు సుమంత్రులచేత దర్శింపచేస్తారు. ఈ కల్పనం మరి ఎక్కడా లేదు. స్వామి తమ విద్యాలయాల్లోని విద్యార్థులను ఏవిధంగా తీర్చిదిద్దవలెనని భావిస్తున్నారో ఆ విధమైన ప్రణాళికను రామ బాలక్రీడలలో వర్ణించి చెప్పారు. మొన్న స్వామి బృందావనం విద్యార్థులతో - 'ఈ పరీక్షలో కనుక బాగా వ్రాశారా, అందరూ ఉత్తమ శ్రేణిలో కనుక వచ్చారా, ఆ ఉత్తమ శ్రేణిలో వచ్చినవారిని అందరినీ నేను కాశ్మీరానికి తీసుకు వెళతాను' అని అన్నారట. ఈ మాట విన్నప్పటినుంచి అమృతమయమైన స్వామి దయను పొందటానికి, స్వామితోపాటు విమానములో ఎక్కి కాశ్మీరం దాకా వెళ్ళడానికి ఆ విద్యార్థి జీవులు ఎంతో ఉత్కంఠ వహిస్తున్నాయి. వారు అహోరాత్రాలు చదువుతున్నారు. అది స్వామి

యిచ్చిన ఒక ప్రేరణ. దేశంలో నున్న భారతీయాత్మను వారు దర్శిం చాలి బహురూపములుగా నున్న భగవదాకృతులలో ఏక రూపమైన తత్త్వాన్ని వారు దర్శించాలి. ఇట్టి తాత్త్వికమైన పరిజ్ఞానం శ్రీరామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులకు కలిగించే కల్పనం చాల ఉదాత్తంగా ఉంది.

రామునిలో వైరాగ్యభావం స్వామి చిత్రిందారు. విద్యార్జనం ముగిసిన తరువాత, శ్రీరాముడు 15, 16 ఏళ్ళ వయస్సులో మన స్సులో ఎన్నో కోరికలు చిగురింపవలసిన ఆ సమయంలో అతడు ఏకాంతాన్ని భజిస్తూ, ఎవరితోనూ మాట్లాడకుండా, ఆత్మధ్యాన మగ్నుడై ఒక గదిలో వుంటూవుంటాడు. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అందరూ సమాధిగతుడైన రామునినే దర్శిస్తూ, ఆ గదిలోనే వుంటూ వుంటారు. దశరథునికి, కౌసల్యకు భయము వేసేది - తమ కొడుకు ఎక్కడ విరక్తుడైపోతాడో, సన్యాసి అయిపోతాడో అని. వసిష్ఠులవారిని పిలిచారు. వసిష్ఠులవారితో వేదాంతచర్చ చేశాడు శ్రీరాముడు. అత నిలో సుప్తంగా వున్న పరమాత్మ చైతన్యం జాగృతం అయింది. తాను పరబ్రహ్మను అన్న స్ఫూర్తిని రాముడు భజిస్తున్నాడు. పర బ్రహ్మ తాను నిత్యుడై, అంచలుడై, నిర్వికల్పుడై, తేజోమయుడై భాసిస్తున్న లక్షణం ఆయనలో కన్పడుతోంది నివృత్తిరూపుడు పర మాత్మ. ఇట్టి నివృత్తిరూపుడైన పరమాత్మ ప్రవృత్తిరూపాన్ని భజిం చాలంటే శక్తి కావాలి. మాయ కావాలి. నిర్వికల్పుడైన ఈ పర మాత్మ చైతన్యాన్ని కార్యోన్ముఖంగా నడపగలిగిన సీతామహాదేవి కావాలి. ఆ తరుణం ఆసన్నమైనది. ఆ శక్తికోసమే నిరీక్షిస్తున్న పర మాత్మ తేజాన్ని రామునిలో చూచాడు వసిష్ఠుడు. ఇది మహర్షికే అర్థ మైనది. "నీ కొడుకుకు వచ్చిన అపకారము ఏమీలేదు. నీకు వచ్చిన నష్టము ఏమీ లేదు. అది రాముని సహజ స్వభావము" అని దశరథు నికి వసిష్ఠుడు ధైర్యం చెప్పాడు. అవతారమూర్తిలో అంతర్నిగూ ఢంగా ఉండే ఆత్మశక్తిని, నివృత్తిశీలాన్నీ స్వామి రామలీలాభివర్ణ

నంలో వ్యక్తం చేశారు. ఒక అవతారమూర్తి మరో అవతారమూర్తి లీలలు వర్ణించి చెప్పటంలో ఉండే అనుభవస్ఫూర్తి ఇందులో ప్రత్యక్ష మౌతుంది.

కవిగా విశ్వనాథవారు కొన్ని కల్పనలు చేశారు. రాముడు బాలుడుగా వున్నప్పుడు ఎంతో ముద్దు వస్తున్నాడని ఎవరైనా పురుషులు ఎత్తుకొంటే ఆ పురుషులయొక్క శిరస్సును తడువుతూ వుండేవాడట. పది తలలవాడు ఎవడైనా తగులుతాడేమోనని ఎత్తుకొన్న ప్రతివాని శిరస్సునూ నిమురుతూ ఉన్నట్లు కనిపించేవాడట. లక్ష్మణుని ఎత్తుకొంటే ముక్కు, చెవులు తడువుతూ వుండేవాడట. దశరథమహారాజును సేవించటానికి సామంతరాజులు ఎందరో వచ్చేవారు. ముక్కుపచ్చలారని బాలుడు రాముడు, తండ్రిదగ్గర కూర్చొని వుండేవాడు. ఒక్కొక్క సామంతుడు 'నేను ఇంతమంది శత్రు రాజులను జయించాను, ఈ కోదండంతో జయించాను' అని, చెట్టంత కోదండాన్ని చేత పట్టుకొని దశరథునివద్దకు వచ్చి మ్రొక్కుతూ వుండేవాడు. బాలుడైన రాముడు కోదండాన్ని ధరించి ఎవరైనా వచ్చినట్లయితే, ఎవరైనా నేను ఇంత పరాక్రమాన్ని ప్రకటించాను అని చెప్పుకొంటే ఆ కోదండాన్ని పట్టుకొని, నారిని సారించి, ఆకర్ణాంతము లాగి, విల్లంబులను విరగకొడుతూ వుండేవాడట. నూర్గురు శత్రువులను సంహరించిన దీ మహాధనువు అని చెప్పుకొన్న ఆ ధనువు రాముని చేత పుట్టుమని విరిగిపోతుంది ఆ ధనువు విరిగిపోతే అప్పుడు వారు అనుకొంటూ వుండేవారట 'మేము విదేహులమైనాము' అని. మా శరీర ప్రతిష్ఠకు మూలకారకమైనది ఈ ధనువు. ఆ ధనువునే విరిచేశాడు రాముడు. మేము ఇప్పుడు వికృతమైన దేహులమైనాము. విరిగిన దేహమువంటి వారమైనాము. విదేహుడు అంటే విదేహ రాజ్యాన్ని పరిపాలిస్తున్న జనకుడు అని కూడా అర్థం వుంది. మేము విదేహులమైనామంటూ వుండేవారట.

ఇలా ఎన్నో ముచ్చట్లు మనకు రామలీలలుగా కన్పడతాయి. అందాక ఎందుకు? దశరథుడు పుత్రకామేష్టిచేయబోతున్న సందర్భంలో కౌసల్యాంతఃపురానికి వచ్చి "నారాయణుడు నీ కడుపున పుట్టబోతున్నాడటే! ఆ ప్రభువును ఆకర్షించటానికి అనువైన మంచి బంగారు చీరలను తీసి కట్టుకొని, ఆ యజ్ఞవాటికలో నీవు ఎలా వుండాలంటే- ఆ నారాయణుడు ఉద్భవించగానే ఇదిగో, అదితిదేవి ఎదుట కూర్చున్నదే అన్నట్లుగా నీ రూపం శోభించాలి. మంచి చీర కట్టుకో" అని పెద్ద భార్యను తొందర పెట్టాడు ఆ వృద్ధరాజు. ఆమె ఒక చిరునవ్వు నవ్వి "ఆ నారాయణుడు నా చీరను చూచి నా గర్భవాసమునందు వసిస్తాడా? నా కనుకొలకులవెలిగే ఆనందబిందువులా భాసించే భక్తితత్త్వాన్ని చూచి ఆయన నా కడుపున శిశువుగా జన్మిస్తాడుకాని. నా కన్నులలో భక్తి కావాలి కాని, నా మేనిమీద చీరయా ప్రధానము'' అని భక్తి ప్రపత్తిని ప్రకటిస్తుంది. బాహిరమైన ఆకర్షణలు చూస్తాడు తండ్రి. లోవెలుగును చూస్తుంది తల్లి.

ఈ దృక్పథాల్లో వున్న భేదమును కనుక మనము పరిశీలించినట్లయితే దశరథుడు రామునినుండి పొందే ఆనందానికి, కౌసల్య రాముని నుండి పొందుతున్న ఆనందానికి కొంత భేదం కన్పడుతుంది. స్వామి చెప్పినట్లుగా - దశేంద్రియ సంఘాతరూపమైన శరీరం దశరథుడు. బాహిరమైన ఇంద్రియముల ద్వారా ఒక వస్తువు యొక్క స్పర్శాదులను పొంది హృదయములో ఒక అపూర్వమైన అనుభవాన్ని నెమరువేసుకొనడమనే ప్రక్రియ దశరథునిలో కన్పడుతుంది. రాముడు తన శరీరాన్ని అంటుకోవాలి. తాను రాముని కౌగిలించుకోవాలి. ఆ కౌగిలించుకొన్నపుడు ఆ శరీర దివ్యస్పర్శ తన చర్మము అనే ఇంద్రియము నుండి ఒక అపూర్వమైన అనుభూతిని తన హృదయానికి తీసుకొని వస్తే, ఆ అనుభూతిని స్మరించుకొంటూ తాను ఆనందాన్ని పొందాలి. చంద్రునివంటి ఆ శ్రీరాముని ముఖాన్ని చూచి అహ్లాదభావాన్ని కన్నుల

ద్వారా తాను మనస్సులో పొందాలి. ఇంద్రియాలతో రామునిరూపాన్ని పట్టాలి. నోటితో రామా అని పిలవాలి ఇటువంటిది దశరథుని మనః ప్రవృత్తి. రామా రామా అని పిలువగలిగిన దశరథుడు ఎంత తపస్సు చేశాడో అని త్యాగరాజస్వామి చక్కని కీర్తన ఒకటి వ్రాశాడు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల ద్వారా శ్రీరాముని రూప స్పర్శ రస గంధాది పాంచభౌతికమైన ధర్మములను ఆశ్లేషించి మనస్సులో ఒక అపూర్వమైన ఆనందాన్ని పొందే విశిష్టమైన ప్రేమ దశరథునిది. కౌసల్యది అటువంటిది కాదు పుత్రుని కౌగిలించుకొనడం, పుత్రుని చూచి ఆనందించడం కాదు ఆమెకు ప్రధానం. పుత్రునిలో నున్న, కన్పడుతున్న ఏదో మహత్కళను, ఒక దైవికమైన కళను చింతనామయంగా భావిస్తూ, కొడుకును కౌగిలించుకొన్నా ఆ కొడుకులో కార్తీక ఘటంలోని దీపంలా భాసించే ఆ దివ్యచైతన్య స్ఫూర్తిని మనస్సులో నెమరువేసుకొంటూ అనుభవిస్తుంది. శరీరానికి శరీరము, ఆత్మకు ఆత్మ. శరీర సుఖంకంటె ఆత్మసుఖం అత్యున్నతంగా భావించి ఒక విచిత్రమైన ఆనందానుభూతిని ఆత్మానందానుభూతిని పొందుతుంది కౌసల్య. అందువల్లనే రాముని కౌసల్యానందవర్ధనుడన్నాడు వాల్మీకి. తండ్రి, తల్లి కొడుకులను ప్రేమించడంలో ఇంత తేడా వుంది. బాహిరంగా ఇంద్రియగతమైన పుత్ర వాత్సల్య ప్రేరితమైన భావము గలవాడు కాబట్టే చివరకు రామారామా అంటూ పాంచభౌతికమైన శరీరాన్ని విడిచిపెడతాడు ఆ దశరథుడు. ఇదిలా వుండగా వీరిద్దరి భక్తిని గురించి కూడా కొంత చెప్పుకోవాలి. రాముడు నారాయణుని దివ్యాంశతో పుడుతున్నాడయ్యా అని అయోధ్యలో యజ్ఞశాలలో ఋష్యశృంగ మహర్షి చెప్పాడు. వసిష్ఠుడు చెప్పాడు. ఇంతమంది చెప్పినా దశరథుడు నారాయణుని యొక్క అంశ రామునిలో చూచి తెలిసికోలేడు. కొడుకును కొడుకుగానే చూచుకొంటాడు. తెలిసి కూడ మాయావరణంచేత బుద్ధి కప్పబడగా పుత్ర వ్యామోహదఘ్నమైన బుద్ధితో దశరథుడు ఆ రాముణ్ణి సేవిస్తూవుంటాడు.

మోహావృతమైన ఇటువంటి భావంతో పచరించేదాన్ని ముగ్ధ భక్తి అంటారు మోహంతో కూడుకొన్నది మౌగ్ధ్యం. కొడుకు అన్న భావనే కాని ఆ కొడుకులో నున్న నారాయణుని చూచే ప్రవృత్తి తండ్రి దగ్గర లేదు. తల్లి నారాయణుని చూచే ప్రవృత్తి కలిగి వున్నా, ఆ రూపు కన్నులకు కట్టక, ఆత్మకు తోచక ఏదో సంగీతం విన్నపుడు కలిగే అవ్యక్త మధురమైన ఆనందంలాంటి అనుభవం హృదయంలో కలుగుతూ ఉంటే, ఆ దివ్య చైతన్యం కంటికి కనపడక, కంటికి కనపడేది లౌకికమైన శిశురూపమైతే, శిశు రూపమునే రమిస్తూ వుంటుంది. దివ్యతేజస్సును భావిస్తూ లౌకికమైన ఆకృతిని దర్శించి, స్పర్శించి, అనుభవించే అనుభవ విశేషము ఆ తల్లిది. దశరథుని కన్న ఉత్తమస్థాయి కల్గిన ముగ్ధ భక్తి ఆ కౌసల్యది. వీరిద్దరూ మోహావృతులైన జీవులే.

ఆ నగరంలోనే వసిష్ఠులవారున్నారు. వసిష్ఠుడు గురువు. పరమాత్మ రామాకృతిని దాల్చి వచ్చాడని అనుక్షణం ఆ పరమాత్మనే రామునిలో చూస్తూ వుంటాడు. నరాకృతితో అవతరించిన నారాయణ తత్త్వాన్ని భజిస్తూ వుంటాడు కాని, రామునియొక్క శరీరసౌందర్యం ఆయనకు పట్టదు. ఆయన వయస్సు ఆయనకు పట్టదు. ఆయనలో వున్న పరమ తేజస్సే నేను అని అనుకొంటాడు. 'తత్త్వం అసి' అతడే నేను, 'అహం బ్రహ్మాస్మి' అన్న అనుభవంతో ఆ రాముని తత్త్వమే నేను, నా తత్త్వమే రాముడు అన్న జ్ఞానపూరితమైన భక్తి ప్రవృత్తిని వసిష్ఠుడు భజిస్తాడు.

మరి రామునికోసం మూడు రోజులు ప్రయాణంచేసి అయోధ్యకు వచ్చి ఈ స్వామిని తీసుకొనివెళ్ళుతున్న ఈ విశ్వామిత్రుని భక్తి ఏమిటి? ఈయన ఎందుకు వచ్చాడు? రాముణ్ణి ఎందుకు తీసుకొనివెళ్ళుతున్నాడు? చిత్రంగా కనపడుతుంది విశ్వామిత్ర ప్రవృత్తి విశ్వామిత్రుడు సామాన్యుడు కాదు. ధనుర్వేద సారాన్ని అంతా పరమ

శివుని వరాన మంత్రరూపంగా తనయందు సిద్ధింపచేసుకొన్న మహర్షి అతని శరీరము నిండా మంత్రాలే వున్నాయి బహుశః ఒక్కొక్క మంత్రం ఒక్కొక్క మహాస్త్రం. అనంతములైన మహాస్త్రాలు మంత్ర రూపాలుగా శరీరమునందు నిద్రిస్తున్న ఒక ఆత్మమహాచైతన్యం ఆయన. ఇంత శక్తి తనలో ఇముడ్చుకొన్నా, అందులో ఒక్క అస్త్రాన్ని ప్రయోగించి తన యజ్ఞాన్ని సంరక్షించుకొనే శక్తి తనకు వున్నా, బ్రహ్మర్షి స్థితిని పొందిన ఈ విశ్వామిత్రుడు కోపతాపములకు గురిగాక ఈ కార్యాన్ని నిర్వహించే నారాయణుడు భూతలంమీద అవతరించాడు; కాని, మోహావృతమైన అంతఃపురములో చిక్కుపడిపోయాడు; పంజరంలో చిక్కుకొని వున్నది ఆ చిలుక; ఆ పరమహంస ఒక సరోవరంలో చిక్కుకొని వున్నది; ఈ హంసను తీసుకురావాలి; లోకాన్ని చూపించాలి; అతనిలోని దైవికమైన శక్తులన్నిటినీ జాగృతం చేయాలి. అలా జాగృతుడైన శ్రీరాముడు సిద్ధుడు కావాలి. ఆ సిద్ధునికి మాయను జయింపగలిగిన శక్తి రావాలి. రాముడు సీతను పరిగ్రహించాలి. దైవ కార్యానికి చైతన్యోన్ముఖుడు కావాలి. ఇదీ విశ్వామిత్రునిలో అంతః ప్రేరితమైన బ్రహ్మచైతన్యం. ఇట్టి అంతఃప్రేరితమైన బ్రహ్మ చైతన్యంతో అతడు యజ్ఞవాటికనుండి బయలుదేరి వస్తాడు. రాముని తనతో పంపుమని దశరథుని అడుగుతాడు. మొదట మాటయిచ్చి తరువాత జంకుతాడు రాజు. ఆ యజ్ఞ రక్షణభారాన్ని తెలిసికొని "బాలుడు రాముడు, అగృహీతాస్త్రుడు. కోమలుడు, అతడు మహా బలసంపన్నులైన ఆ మారీచ సుబాహులను జయింపగలడా? అక్షౌహిణి సైన్యంతో నేను బయలుదేరి వచ్చినా ఆ మహాబలుల్ని సాధించలేను. అట్టివారిని ఈ బాలుడు జయింపగలడా?' అని ఆర్తిని భజిస్తాడు. విశ్వామిత్రుడు అంటాడు-"పుత్ర వ్యామోహంతో నీవు శ్రీరామ తేజాన్ని తెలుసుకోలేక పోతున్నావు. నాకు ఆ రామ తత్త్వము తెలుసు. సత్యపరాక్రముడైన ఆ శ్రీరాము డెవరో నాకు తెలుసు. కాని, నేనేమో నీకు పరాయివాణ్ణి.

నీకు అంత నమ్మకం కావాలంటే నీ పురోహితుడైన వసిష్ఠుని అడిగి తెలుసుకో. మేమిద్దరమూ కూడబలుక్కొని మాట్లాడుతున్నామని నీవు ఏమైనా అనుకొంటావేమో, ఈ సభలో కూర్చొన్న మహర్షుల నెవ్వరి నైనా అడుగు. సత్యపరాక్రముడైన నీ కుమారుడు నారాయణుని అంశతో పుట్టాడు. ఈతడు చేయవలసిన కార్యం అనంతముగా ఈ లోకంలో వున్నది. దానిని చేయించటానికి నేను ప్రేరకునిగా ఇక్కడకు వచ్చాను' అని విశ్వామిత్రుడు దశరథునికి వివేకం కలిగేటట్లు ప్రబోధిస్తాడు.

మహర్షులు శ్రీరామునియందలి దివ్యచైతన్యాన్ని చూస్తున్నారు. ఇది మోహావృతం కాని జ్ఞానదృష్టి. రామాయణంలో మూడుతరగతుల మనుష్యులు ముఖ్యంగా కనపడతారు మోహావృతులైన వ్యక్తులు. భక్తులు; ఋషులు, రాక్షసులు మోహావృతులైన భక్తులు, శ్రీరాముని బంధువులు వీరందరూ రాముడు నారాయణుడని తెలిసి కూడ అతనిలో నరునియొక్క ఆకృతినే భజిస్తూ వుంటారు. ఋషులు 'ఈతడు నరుడు, కాని, నరుని యొక్క ఆకృతితో వచ్చిన నారాయణుడు' అని భజిస్తూ వుంటారు రాక్షసులో - రాముడు నారాయణుడు కాడు సామాన్య నరుడు అని నరైకదృక్పథంతో చూస్తూవుంటారు. ఈ మూడు దృక్పథాలలో జ్ఞాన దృక్పథం ఋషులది. అజ్ఞాన దృక్పథం అసురు లది. మోహ దృక్పథం దశరథాదులది. ఈ మోహావరణం నుండి శ్రీరాముణ్ణి తప్పించటానికి అతనిలో వున్న దివ్య తేజాన్ని జాగృతం చేయటానికి విశ్వామిత్రులవారు వసిష్ఠులవారి ప్రబోధంతో దశరథుడు అనుమతించగా రాముణ్ణి తీసికొనివస్తాడు.

విశ్వామిత్రుడు రామాయణంలో దశరథుని అడిగింది రాముని ఒక్కనినే. రాముడే రాక్షసులను సంహరిస్తాడు అని అంటాడు. అతని వెంట లక్ష్మణుడు వస్తాడు. దశరథుడు కాదనలేదు. విశ్వామిత్రుడు కాదనలేదు. రాముని శరీరంలో అవిభక్తమైన భాగంగా లక్ష్మణుని

అందరూ భావించారు. ఆయన శేషతల్పశాయికి ప్రతీక. శేషుడు సర్వ విద్యా స్వరూపుడు. సర్వవిద్యలు - దైవికమైన, మానుషమైన, అతి మానుషమైన సర్వ విద్యలు - ఆదిశేషుని ముఖమునందు వసిస్తూ, వుంటాయి. వేయి ముఖాలతో, రెండువేల నాల్కలతో సర్వవిధ విజ్ఞానాన్ని పుక్కిట పట్టిన మహాత్ముడు ఆయన. అట్టి మహాత్ముడు ఎప్పుడూ సహస్ర ఫణములను విప్పి, నారాయణున్ని సేవిస్తూ అతని యందున్న సర్వ విద్యాస్ఫూర్తిని ప్రతిబింబింపచేస్తూ వుంటాడు. రాముని యందు నరాకృతిలోనున్న నారాయణుని యొక్క దివ్యాంశ విద్యల యొక్క పరిస్ఫూర్తి, చైతన్యవంతమై ఉన్నవి అని చెప్పడానికి లక్ష్మణుడే సాక్షి. అట్టి లక్ష్మణునికూడా తీసికొనివస్తాడు విశ్వామిత్రుడు.

రాముని గైకొని అయోధ్యానగరాన్ని వదిలి 12 మైళ్ళు హుటాహుటి నడుస్తాడు వెనుకకు తిరగకుండా. ఈ బాలకులు అతని వెంట పరుగెత్తుతూ వుంటారు. ఎక్కడ అయోధ్య పౌరులు వచ్చి పట్టుకొంటారో, రాముని వెనుకకు తీసికొనిపోతారో అని భయమో- ఏమో! తెలియదు. నిజానికది కారణం కాదు. సరయూనదీ దక్షిణ తీరానికి వచ్చేసరికి సూర్యాస్తమయం అవుతోంది. సూర్యాస్తమయం అయ్యే లోపల శ్రీరాముని నరశార్దూలునిగా నిర్మింపచేయడానికి ప్రాతిపదికలైన రెండు మహా మంత్రాలను ఆయనకు ఉపదేశిస్తాడు. అవి: బల, అతిబల. ఈ బల, అతిబల లన్నవి సర్వ విద్యలకు తల్లుల వంటివి అని విశ్వామిత్రుల వారంటారు. సర్వ విద్యలు వాటినుండే పుడుతున్నవి. ఇట్టి సర్వవిద్యా ప్రపంచ విభూతికి మూలభూతమైన, మాతృస్థానీయమైన బల, అతిబల మంత్రాలను ఆయన రామునికి ఉపదేశిస్తాడు. "రామా! ఇది మంచి ఘడియ, ఈ సాయంకాలంలోపల నీకు ఈ మంత్రాలన్నీ ఉపదేశించాలి. ఈ బరువు నా జన్మ అంతా మోశాను. ఒక్కొక్కటి నేను బరువు దించుకొంటాను. మొదట బల, అతిబల తీసుకో!" అని అత్యంత వాత్సల్యంతో రామదత్తం చేశాడు.

స్వామి! అంటారు - 'మాయ ఎంత చమత్కారమైనది. దానిని గెలవడం ఎంత అసాధ్యం? ఓ దశరథా! రాముడు నీ సుతుడని నీవు భ్రమించి మాయావృతుడవై ఆయనను వదిలిపెట్టలేకుండా వున్నావు' అని జ్ఞానసూత్రాన్ని పఠించిన ఈ విశ్వామిత్రుడు నదీ తీరం దగ్గరకు వచ్చేసరికి ఈయన జ్ఞానం ఏమైంది? 'రామా! రా! నీకు నేను ఒక మంత్రమును ఉపదేశిస్తాను; నీవు బాలుడవు, నీకు శక్తి రావాలి' అని అన్నాడేమిటి? సాక్షాత్తు విష్ణువు అని భావిస్తున్న ఆ రామునికి ఈయన యివ్వబోయే శక్తి ఏమిటి? ఈయన యిస్తున్నది కాదు. ఈయన మేల్కొల్పుతున్నది కాదు. విశ్వామిత్రుడు మేల్కొల్పితే తప్ప మేల్కొనలేని ప్రవృత్తి ఆ నారాయణునిది కాదు. అది నిరంతర జాగృతం; అనంత శక్తియుతం.

ఇక్కడ ఒక చిన్న ఉదంతం. ఎవరో చెపితే విన్నాను. ఒక సారి - దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు స్వామి నిద్రపోతే ఎలా వుంటుందో చూద్దామని అనుకొన్నారట. స్వామితో రాత్రి పన్నెండూ ఒంటిగంట వరకు మాట్లాడుతూనే వున్నారట. చివరకు పిచ్చయ్యశాస్త్రిగారే ఆవులించారట! స్వామి నవ్వి 'ఏమి పిచ్చయ్యశాస్త్రీ! నేను నిద్రపోతే చూద్దామని కూర్చున్నావు కదూ! నీకే నిద్ర వచ్చింది. నేను నిద్ర పోవడ మేమిటి? నీవు చూడడమేమిటి? నేను నిద్రపోతే నీవు మళ్ళీ మేల్కొంటావా?' అన్నారట. నిద్రలోనున్న మనలను రక్షిస్తూ, తల్లి గాగ మరలా జాగృతం చేయగల్గినటువంటి సత్త్వ చైతన్యమూర్తి ఐయిన ఆ పరమాత్మను ఈయన మేల్కొల్పేది ఏమిటి? ఆయనా, నరాకృతిని భజించిన ఆ నారాయణునియందు సహజంగా నున్న వాసనారూపమైన చైతన్యాన్ని జాగృతం చేస్తున్నవి ఆ మంత్రాలు. విశ్వామిత్రుడు ఉపదేశిస్తూంటే రాముడు వానిని గ్రహించాడు. తనకు ఒక గురు పదాన్ని తానే నిర్మించుకొని విశ్వామిత్రుడు రామునిలో సహజంగా నున్న శక్తులను జ్ఞాపకం చేసి 'రామా! నీకు అవసరం వస్తోంది. 'పూర్వాసంధ్యా ప్రవర్తతే' - అని ప్రబోధించాడు.

అక్కడనుండి ముగ్గురూ మరియొక అడుగు ముందుకు వేశారు. రాముడు తాటకను సంహరించాడు. తాటకను సంహరించిన రాముని చూచి ఆ విశ్వామిత్రుడు ఆనందపారవశ్యాన్ని భజించి, ఉన్మత్తునివలె నాట్యం చేశాడు. 'రామా! నీ అంతటి పరాక్రమవంతుడు నాకు మరొకడు లేడు. రా, నా జన్మంతా పరమశివుని తపస్సు చేసి నా శరీరము నిండా మహామంత్రములను,అస్త్రాలను దాచిపెట్టుకొన్నాను. ఈ అస్త్రాలన్నీ నీకు ఒకేసారి యిచ్చి వేస్తాను. ఈ శైవసంపదనంతా నీకు దత్తం చేస్తున్నాను, తీసుకో -' అని మంత్రాలన్నీ ఉపదేశించాడు. రాముడు ఒకసారి ఆ మంత్రాలను స్మరించేసరికి దివ్యాకృతులతో ఆ మంత్రశక్తులన్నీ ఎదుట నిలుచున్నాయి.ఆయన కవి వశమైపోయాయి. లిప్తలో సర్వ మహామంత్ర శక్తిని తన వశం చేసుకోగల్గిన దివ్య చైతన్యం ఆయనలో వుంది. విశ్వామిత్రుడు ఒకజన్మలో సాధించినటువంటి మంత్రసిద్ధిని శ్రీరాముడు ఒక్క క్షణంలో సాధించాడు. ఆ క్షేత్రబలం విశ్వామిత్రునకు తెలుసు.

స్వామి హాస్టల్‌లో విద్య నేర్చుకొనడానికి వచ్చే విద్యార్థులకు అంత కఠినమైన ఇంటర్‌వ్యూస్ ఎందుకు పెడుతూ వుంటారా అని ఆలోచిస్తే - ఎక్కడో గాలిలో విన్నాను. ఇంద్రియనిగ్రహంతో బ్రహ్మచర్యాన్ని సాధిస్తూ సమాహితచిత్తంతో ఆ పరమతత్త్వాన్ని వ్యాఖ్యానం చేసికొని, సమన్వయించుకొనగల్గిన ఒక తేజస్సుకోసం స్వామి వెతుకుతున్నారట. అనుక్షణం వేయికళ్ళతో ప్రతి విద్యార్థిలో ఎంత చైతన్యం వున్నదీ చూసుకొంటున్నారు. అట్టి దివ్యచైతన్య స్ఫూర్తికోసం శిష్యుల కోసం వెదకుతున్న గురువులా కన్పిస్తారు స్వామి. శిష్యవాత్సల్యంతో శ్రీరామునియందు దివ్యచైతన్యాన్ని జాగృతం చేస్తున్న విశ్వామిత్రుడా స్వామి! అని అనిపిస్తుంది ఒక్కొక్కసారి - ఆ విద్యార్థుల ప్రక్కన నిలబడి వుంటే.

దివ్యచైతన్యాన్ని రామునిలో విశ్వామిత్రుడు మేల్కొల్పాడు. తనతో తీసికొనివెళ్ళాడు, యాగరక్షణం చేయించుకొన్నాడు. యాగ

రక్షణానంతరం మిథిలా నగరానికి పయనిస్తున్నపుడు శోణానదీతీరంలో శ్రీరామునికి తన వంశపురుషులను గురించి చెప్పుకొంటాడు. ఆ కీర్తన మంతా మనసారా చేసి, ఆ రాత్రి రాముడు శయనించిన తరువాత, ఆ తెల్లవారుజామున మరల ఒక సుప్రభాతం పాడతాడు. రామాయ ణంలో విశ్వామిత్రుడు పాడిన రెండు సుప్రభాతాలు సుప్రసిద్ధాలు. తన యాగానికి వెళ్ళుతున్నపుడు మొదటిరాత్రి తెల్లవారుతున్నపుడు పాడింది మొదటిది. యాగసంరక్షణం అయిన తరువాత మిథిలానగరానికి వెళ్ళు తున్నపుడు మొదటి రాత్రి తెల్లవారుతున్నపుడు పాడినది రెండవది. విశ్వామిత్ర ప్రస్థానంలో మొదటియాత్ర 10 రోజులు. మిథిలా నగరా నికి నడిచింది 3 రోజులు. మిథిలలో యాగం 12 రోజులు. ఆ 12 రోజుల తరువాత సీతారాముల వివాహం. వివాహానంతరం రాముడు సీతాసహితంగా అయోధ్యకు తిరిగి రావడం జరుగుతుంది.

విశ్వామిత్ర ప్రస్థానంలో రాముడు పొందుతున్న సిద్ధులు ఏమిటి? మొదట బల, అతిబల అన్న మంత్రాలను రాముడు పొందు తాడు. ఈ మంత్రబలం చాలు - రావణుని సంహరించటానికి. రాముని సహజబలం చాలు-తాటకను సంహరించటానికి. స్వామి ఒక అన్వయం చెప్పారు. శ్రీరాముడు అయోధ్య నుంచి బయలుదేరి మిథిలకు చేరే లోపల ముగ్గురు స్త్రీలను కలుసుకొన్నారు. మొదటి వనిత తాటక. రెండవ వనిత అహల్య. మూడవ వనిత సీత. తాటక తమోగుణ ప్రధానురాలు. తమోగుణ ప్రధానురా లయిన తాటకను రాముడు సంహరించాడు.రజోగుణ ప్రధానురాలు అయిన అహల్యను ఉద్ధరించాడు. సత్త్వగుణ ప్రధానురాలయిన సీతను తాను పరిగ్రహించాడు. తమో గుణాన్ని సంహరించి, రజోగుణాన్ని పుణ్యకర్మలయందు ప్రసరింప చేయటానికి ఉద్ధరించి, సత్త్వగుణాన్ని స్వీకరిస్తాడు భగవంతుడు. ఈ ప్రబోధం తాను ముగ్గురు స్త్రీలయందు వర్తించిన వైఖరిలో రాముడు చెప్పుతున్నాడని స్వామి వ్యాఖ్యానించి చెప్పారు.

తాటక తాను వేయి ఏనుగుల బలము కలిగి, ఆ మలద కరూశా దేశమంతా నాశనం చేసి, ఋషులంతా అక్కడినుండి పారిపోయేటట్లుగా

చేసి, ఏ జీవమూ అక్కడ బ్రతకడానికి వీలులేకుండా జీవహింసయే ప్రధానంగా జీవితం గడుపుతున్న రాక్షసి. ఆమెను సంహరించడం కంటె గత్యంతరము లేదని విశ్వామిత్రునిచేత ప్రబోధితుడై రాముడామెను చంపాడు. ఆమె మాయ ఆసురీమాయలో స్త్రైణమైన మాయ. యాగ సంరక్షణంలో రాముడు మారీచ సుబాహు లనే యిద్దరు రాక్షసులను ఎదుర్కొంటాడు. మరీచిక లంటే ఎండమావులు. ఎండమావుల కాంతి మాయ. మారీచుడు ఈ ఎండమావుల యొక్క స్వభావం గలవాడు. మాయయొక్క స్వభావం గలవాడు. అందువలన అతనిని సంహరించకుండా సముద్రములో కూలవేస్తాడు రాముడు. సుబాహుడంటే పెద్దవైన బాహువులు కలిగినవాడు పాశవికమైన బలానికి ప్రతీక సుబాహుడు. రాక్షస బలానికి ప్రతీక. ఆ పాశవిక బలాన్ని రాముడు సంహరిస్తాడు. మారీచ సుబాహు లిరువురూ రావణుని బంధువులు. "రావణా! స్త్రైణమైన మాయలను జయించగలను; పౌరుషమైన మాయను నేను జయించగలను; పాశవికమైన బలాన్ని, ఆసురమైన బలాన్ని నేను జయించగలను" అని టెలిగ్రాఫిక్ లాంగ్వేజిలో రావణునికి పంపిన సందేశం ఇది. అసుర శక్తి మీద ప్రథమ విజయాన్ని సాధించిన నరశార్దూలుడే రాముడు. రామావతారమూర్తికి రావణుణ్ణి సంహరించటానికి కావలసిన బలసిద్ధి ఏర్పడింది. సిద్ధాశ్రమానికి వచ్చేంతవరకు రాముడు సాధకుడు. విశ్వామిత్రుని ఆశ్రమంలో యాగ రక్షణచేసిన రాముడు సిద్ధుడు. యాగ ఫలంగా పుట్టిన రాముడు మొట్టమొదట చేసిన ఘనకార్యము యాగరక్షణం. కర్మప్రవృత్తిని, ధర్మప్రవృత్తిని, తాను సంవదించి సాగించే జీవిత వ్రతానికి శిక్షణ యాగ సంరక్షణ. ఆ తరువాత మిథిలకు ప్రయాణం కట్టిన ఘట్టం చిత్రంగా కన్పిస్తుంది. రామునికోసమే విశ్వామిత్రుడు యాగం చేశాడు. అక్కడే, ఆ సిద్ధాశ్రమంలోనే విష్ణువు ఇదివరకు కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ గడ్డమీదనే వామనావతారం ధరించిన విష్ణువు దైవ కార్యాన్ని పూర్తి చేసుకొని కొన్నివేల సంవత్సరాలు ఉన్నాడు.

కశ్యపప్రజాపతి సర్వసృష్టి చైతన్య వ్యాపారాన్ని నిర్వహించటానికి అనువైన తపస్సు ఆ గడ్డమీదే చేశాడు. విష్ణువుకే సిద్ధి కల్పించిన ఆ దివ్యక్షేత్రములో విశ్వామిత్రుడు యాగము అన్న నెపముతో నివసించాడు. రాముడు యాగ సంరక్షణ చేయగానే 'సిద్ధాశ్రమంతో నాకు పని అయిపోయింది. నా జీవితముతోనే నా పని అయిపోయింది. జీవితమంతా మూటకట్టుకొన్న తపస్సునంతా రామునికి అప్పగించాను. నా జీవితసారాన్నంతా ఆ రామునికే నైవేద్యమిచ్చాను: ఇక నేను ఎక్కడుంటే ఏమిటి?' అని తపోవనానికి వెళ్ళిపోతాడు. రామునికి తన సర్వ చైతన్యాన్ని నైవేద్యంగా యిచ్చిన ఈ మహర్షి వసిష్ఠునిలాగా 'అహం బ్రహ్మాస్మి' అని కూర్చొన్నవాడు కాడు. లోకహితార్థమై దివ్య చైతన్యాన్ని ప్రబోధం చేసిన జ్ఞాని.

స్వామి ఇలా అన్నారు రసవాహినిలో - 'జ్ఞానులు లోకంలో ముక్కు మూసుకొని ఆత్మానందాన్ని నెమరువేసుకొంటూ కూర్చోకూడదు. లోకహితార్థమై కృషి చేయాలి. ఆ కృషిలో వారికి స్వార్థమనేది లేదు. సరోవరములోని హంసలాగ లౌకికవ్యాపారము తనకు అంటకుండా విశ్వశ్రేయస్సే ప్రధానముగా జ్ఞాని వ్యవహరించాలి.' ఒకవేళ జ్ఞాని విశ్వశ్రేయస్సుకై ప్రేమతో వ్యవహరిస్తే ఎలా వుంటుంది అనుకొంటే విశ్వామిత్రునివలె వుంటుంది. సత్యశాయి వలె వుంటుంది. ఒక్కొక్కసారి స్వామి విశ్వామిత్రుని యొక్క అవతారమా లేక విశ్వామిత్రుని యొక్క సిద్ధులన్నీ తనయందు బంధించుకొని, ఆదిశేషువునే శిరోజమండలంగా కలిగినటువంటి రాముడా? ... ఈ దివ్య చైతన్యము యొక్క పరమార్థము ఏమి? అని ఆలోచిస్తూంటే 'లోతులు అందరకు అందవు నాయనా!' అని స్వామి పలికినట్లుగా వుంటుంది.

మిథిలకు పయనమై విశ్వామిత్రుని వంశ వృత్తాంతము, ఇక్ష్వాకుల వంశ వృత్తాంతము అంతా విని తనకు పూర్వులైన రాజులు ధర్మ, కర్మ నిర్వహణలో ఎంత కృషి చేశారో, స్వర్గంలో వున్న గంగను భూతలానికి ఎలా తీసికొని వచ్చారో తెలిసికొన్న శ్రీరాముడు

ధర్మకర్మములందు నిష్ఠామయమైన ప్రవృత్తి కలిగినవాడై, సర్వ శక్తిమంతుడై మిథిలకు చేరుతాడు. అక్కడ జ్ఞాని అయినవాడు, బుద్ధికి ప్రతీకయైనవాడు అయిన జనకుడు ఉన్నాడు. జ్ఞాననేత్రంతో వారిని చూశాడు. 'విశ్వామిత్రా! ఈ ఉజ్జ్వలరూపు లెవరు? నరనారాయణులా అన్నట్లున్నారు! అందులో అనీలమేఘశ్యాముడు ఎంత అందంగా ఉన్నాడు? చూస్తే కౌగిలించుకోవాలని బుద్ధి పుడుతున్నది.' దగ్గరకు వెళ్ళి మాట్లాడాలి అనుకున్నాడు జనకుడు. విశ్వామిత్రు డందు కొన్నాడు - 'దశరథ పుత్రులయ్యా వీరు! రామలక్ష్మణులు. వస్తూ త్రోవలో బూడిదబుగ్గిగా పడివున్న ఒక స్త్రీని, అహల్యను ఉద్ధరించినా డయ్యా రాముడు. ఇతని పాదాలకు అంత శక్తి ఉన్నది' అన్నాడు. 'అహో! ఇది ఏదో దివ్య చైతన్యము. నేను ఎన్నాళ్ళనుండియో చూడ వలయునని పరితపిస్తున్న ఒక దివ్య చైతన్యం నాకు కళ్ళకు కట్టినట్లుగా కన్పడుతోం'దని లీలగా భాసిస్తున్న బ్రహ్మజ్ఞానమును దర్శిస్తున్న జ్ఞానివలె రామునివైపు కన్నులప్పగించి చూశాడు జనకుడు. 'ఇతడు భగవంతుడా? చరణములకే యింతటి శక్తి వున్నదే - చేతులకు ఎంత శక్తి వుండునో!' అని అనుకొన్నాడు. 'నీ దగ్గర శివధనుస్సు వున్నది కదా! చూడాలని వచ్చాడు చిన్నవాడు' అని విశ్వామిత్రుడు అంటే, వెంటనే తెప్పించాడు యజ్ఞశాలకు శివధనువును. 10 వేలమంది బలిష్ఠులైన భటులు భోషాణంలో పెట్టి పూజాద్రవ్యాలతో పూజింపబడుతున్న ధనుస్సును తెచ్చారు. రాముడు విశ్వామిత్రుని కనుసంజ్ఞలను గ్రహించి ఆ శివధనువును ఎత్తుతాడు. నారిని అనుసంధిస్తాడు. ఆకర్ణాంతము లాగుతాడు. ధనువు ఫెళ్ళుమని విరిగిపోతుంది. విశ్వామిత్రుడు, జనకుడు, లక్ష్మణుడు, రాముడు - యీ నలుగురికి చైతన్యము ఉంది. మిగతావారు అందరూ మూర్ఛాగతులై పోయారు.

ఈ నాదం ఏమిటి? ఈ శివధనుస్సు ఏమిటి? త్రిపురాలను సంహరించు సందర్భంలో పరమశివుడు తన చేత పట్టిన గొప్ప విల్లు;

మయుడు నిర్మించిన శైవ ధనువు వైష్ణవ ధనువు. శివ ధనువు అనే రెండు ధనువులను మయుడు నిర్మించాడు. శైవరూపమైన ధనువు ప్రళయరూపమైన ధనువు. ఇట్టి ప్రళయరూపమైన ధనువును ధరింప గల్గినవాడు ఎవడు? ఇక్కడ జనకుడు తన కన్యను ఇచ్చి వివాహం చేయటానికి ఒక దివ్య శుల్కాన్ని పెడతాడు. 'ధనువును కనీసము బరువు తూచినవాడు, ఎత్తగల్గినవాడు, లేదా నారిని అనుసంధించిన వాడు, నారిని ఆకర్ణాంతము లాగగల్గినవాడు, ఏ స్థాయికి చెందిన వాడైనా చాలు. కనీసం దాని బరువును ఎత్తుకొంటే చాలు; వాడికైనా నా కుమార్తెను ఇస్తాను.' రాముడు బరువును ఎత్తడమేకాదు - వింటిని విరిచాడు. 'ఓ జనకరాజా! నీ కుమార్తె అయోనిజ; యోగమాయ; ఈ మాయను నేను గ్రహించగలను; భర్తగా భరించగలను, ఆమెను నియమించగలను, శాసించగలను. అవసరం వస్తే, నేను హృదయము నందు మహాయోగిని కాబట్టి ఆమెను త్యజించగలను. ఈ మూడు విధాలైన ప్రవృత్తులు కల్గిన జ్ఞానిని నేను. సీతకు తగిన భర్తను' అని మామగారికి ధనుష్టంకార రూపమైన భాషలో వ్యాఖ్యానం చెప్పాడు రాముడు. ఆ ఓంకారనాదంలో నారాయణ తత్త్వాన్ని శ్రవణానంద ముగా విన్నారు జనకమహర్షి, విశ్వామిత్ర మహర్షి. 'ఇదిగో నాయనా, నా కూతురు సీతను నీకు అర్పిస్తున్నాను, నీవు దీన్ని చేపట్టు, సహ ధర్మ చారిణిగా నడుపుకో, నీకు ఛాయగా ఎప్పుడూ వర్తిస్తుంది' అన్నాడు జనకుడు, శ్రీరాముని చేతిలో సీతను పెడుతూ. వాల్మీకి రామాయణంలో జనకుడు అన్న మాటలు ఇవి :

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా
పతివ్రతా మహాభాగా ఛాయేనుగతా సదా."

"ఇదే నా కూతురు సీత, నీవు గ్రహించు. సహధర్మచారిణి, పతివ్రత, మహాభాగ, ఛాయవలె నిన్ను అనుసరించి వుంటునది." ఈ మాటలు

జనకుడు కావలయుననే అన్నాడు. మరల అయోధ్యాకాండలో దీని ప్రసక్తి వస్తుంది. ఇలా సీతను శ్రీరాముని చేతిలో పెట్టి, మహామాయను భరింపగల్గిన భర్త ఎవరు అని అన్వేషిస్తున్న ఆ జ్ఞాని, రాముడు నారాయణ స్వరూపుడుగా కన్పడగా అతనికి సీతనుఇచ్చి కృతార్థు డయ్యాడు. మనస్సునుండి బయలుదేరిన సంకల్పము దైవికమైన శక్తులను సంవదించుకొని ఒక సిద్ధిని పొంది, బుద్ధిలో వివేకాన్ని పచరించి నారాయణ తత్త్వాన్ని తెలుసుకొని మాయను జయింపగలిగి ఆధ్యాత్మిక ప్రగతిని సాధించే ఒక ఆచార్య ప్రస్థానానికి అయోధ్య నుండి మిధిల దాకా సాగించిన యాత్ర ప్రతీకగా మనకు కనపడు తుంది. రాముడు నారాయణుడు అని స్థిరీకరింపబడింది మిధిల. నారా యణుడు అని వ్యక్తీకరించింది పరశురామ కథ.

శివుని ధనుస్సు విరిచిన రాముడు రాక్షస సంహార కార్యంలో రుద్రునివలె భాసిస్తాడు. దుష్టశిక్షణ రూపమైన చైతన్యం అతని యందు భాసిస్తోంది. పరశురాముని వైష్ణవాస్త్రాన్ని గ్రహించి వైష్ణవ తేజాన్ని తనయందు సంతరించుకొన్న శ్రీరాముడు లోకాన్ని రక్షించగల్గిన స్థితిలో భాసిస్తాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ ఈ రెండు ప్రవృత్తులకు నేనే సిద్ధుడను అని చాటి చెప్పాడు. శివధనుస్సు విరిచి, పరశురామ ధనుస్సును వంచి. ఇట్టి శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ అనునటు వంటి ప్రవృత్తులయందు సిద్ధుడై ప్రతి యుగమునందు నేనే జన్మిస్తూ వుంటాను, యుగావతారునిగా జన్మిస్తూంటాను - అని చెబుతూ సీతను తీసుకొని అయోధ్యకు వస్తాడు. ఈ విధంగా సీతా కరగ్రహణం, విశ్వామిత్రుని సంకల్ప మూలం. 'చైతన్య రహితుడైన పరమాత్మ శక్తితో కూడుకొంటే ప్రవృత్తిని భజిస్తాడు. రామ అయనం జరగాలి. రాముడు ముందుకు సాగాలి. కథ సాగాలి' అని విశ్వామిత్రుని ప్రయత్నం.

మూడు ప్రొద్దుల ప్రగతి రామాయణకథ. పూర్వసంధ్య తొలి రేకలు విప్పుతున్నది. ఆ పరబ్రహ్మ తేజానికి మాయను కూర్చాడు విశ్వామిత్రుడు. ఇక చాలు. ఆ మాయ రాముని నాశ్రయిస్తుంది; రామాయణం ముందుకు సాగుతుంది. మూడు అడుగులు వేసే రామాయణంలో మొదటి అడుగును వేయించిన ఆచార్యుడు విశ్వామిత్రుడు. మూడు పురుషార్థాలను సాధిస్తూ మోక్షంలో అడుగుపెట్టడానికి ఉన్ముఖమయ్యే మనలాంటి జీవులయొక్క జీవిత రామాయణంలో ఆత్మారాముడై మొదటి అడుగు వేయించే గురుమూర్తి స్వామి. అట్టి గురుమూర్తి అభినవ విశ్వామిత్రుడు. విశ్వానికి మిత్రుడు అయినవాడు. విశ్వప్రేమ సిద్ధాంతాన్ని వ్యాప్తిచేస్తున్న మహర్షి. ఆర్ష సంప్రదాయంతో తాను నిలచిన స్వామి. 'అహం బ్రహ్మాస్మి' అన్న న్యాయముతో వసిష్ఠ స్థానంలోకి వస్తే రాముడే ఆచార్యుడు ఆచార్యుడే రాముడు. ఈ విధంగా సాయి రామ తత్త్వాన్ని 'ఉత్తిష్ఠ! నరశార్దూల!' అని ప్రబోధం చేస్తున్న విశ్వామిత్రుని వాక్యాలతో అన్వయించుకుంటే ప్రతి తెల్లవారు జామున నిద్రపోతున్న మనలను దశరథపుత్రుల మనుకొని స్వామి 'ఉత్తిష్ఠ! నరశార్దూల! ఉత్తిష్ఠ! నరశార్దూల!' అని మనలో వున్న దివ్యచైతన్యాన్ని మేల్కొల్పుతున్నారు. ఆ మేల్కొల్పును విని నరశార్దూలము కావలసిన బాధ్యత మనలో వుంది. మేల్కొల్పిన గురువు యొక్క హృదయాన్ని మెప్పించాడు రాముడు. అలాగే సాయిభగవానుని పిలుపును సార్థకం చేసే బాధ్యత మనయందున్నది. సాయిరామ్!

# రెండువరాలు

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము.

సాయి కుటుంబ సభ్యులకు నమస్కారము.

కైకేయి దశరథుని కోరినవి వరములా
కానలో దాశరథి కోదండ శరములా?
మంథరకు తోచినది మాత్సర్య భావమా
మధుసూదనుని దివ్యమార్గణ ప్రభావమా?
తండ్రి యానతి తీర్చు తనయుని వివేకమా
దనుజులను చెండాడు దైవ ప్రకోపమా?
పతి వెంట నడచినది సతి సీత శీలమా
పది తలలు తెగనరుకు పసిడి కరవాలమా?
సౌమిత్రి నడపినది సౌభ్రాతృ భావమా
పరమాత్మ నర్చించు పరహిత విభావమా?
దశరథుడు వీడినది దశవిషయదేహమా
తనువు నంటిన మోహ దావాగ్ని దాహమా?
భరతునకు వరము లవి పురుషార్థఫలములా
పాదుకల కడిగించు పరమార్థ జలములా?

అయోధ్యాకాండం చదువుతున్న మన హృదయాల్లో కథార్థములైన కొన్ని ప్రశ్నలు, అంతరార్థములైన మరికొన్ని ప్రశ్నలు ఇలాగే నిలుస్తాయి. కైకేయి దశరథుని కోరినవి వరములా, కానలో దాశరథి కోదండ శరములా - ఇట్టివి ప్రశ్నలు. మూడు నగరాల చరిత్ర అయిన రామాయణంలో అయోధ్య మనస్థానీయమని ఇదివరకే చెప్పుకొన్నాము. అయోధ్యలో జరుగుతున్న ఈ ప్రధానమైన కథాఘట్టాన్ని భౌతికంగా, ఆధ్యాత్మికంగా మనము భావించినట్లయితే హృదయక్షేత్రంలో జరిగిన

ఈ కథామథనం ఏమిటి? అయోధ్యలో రాముని పట్టాభిషేకప్రయత్నం విఫలం కావడం, కైక కోరిన వరములను ఆశ్రయించుకొని రాముడు అరణ్యానికి వెళ్ళడం, భరతుడు రాజుగా నియమితుడు కావలసిన పరిస్థితులు ఏర్పడడం అన్న యీ కథార్థాలను ప్రతీకాత్మకంగా మనం పరిశీలించినట్లయితే అయోధ్యాకాండ ఒక క్షీరసాగర మథనంగా స్ఫురిస్తుంది. మహాభారతంలో కాని, పురాణాలలో కాని క్షీరసాగర మథన వృత్తాంతం ఎట్టి ప్రతీకాత్మక ప్రవృత్తిని సంవదించుకొని ప్రవర్తిల్లుతున్నదో అట్టి ప్రతీకాత్మక ప్రవృత్తిని సంవదించుకొని రామాయణంలో అయోధ్యాకాండ ప్రవర్తిల్లుతున్నది. హృదయం క్షీరసాగరం, కామం మంథర పర్వతం, పురుషయత్నం కవ్వపుత్రాడు అయిన శేషుడు. దైవాసుర ప్రవృత్తులు దేవతలు రాక్షసులు. హాలాహలం దుఃఖము, అమృతం దివ్యత్వం. ఇవి ఆ కథలోని ప్రతీకాత్మక ప్రవృత్తులు. మరి అయోధ్యాకాండకు వాటిని వర్తించినట్లయితే అయోధ్య హృదయం. కామం మంధరం, పురుషయత్నం కైక. దైవాసుర ప్రవృత్తులు త్యాగ, భోగ ప్రవృత్తులు. హాలాహలం రామవియోగ శోకం, లేక దశరథ మరణం, అమృతం: పాదుకాపట్టాభిషేకం ఈ విధంగా అయోధ్యలో సాగుతున్న ఈ క్షీరసాగర మధన వృత్తాంతాన్ని మనం సమీక్షించాలి.

స్వామి 'రామకథారసవాహినిలో' ఇలా పేర్కొన్నారు: "రామాయణంలో మంథర, శూర్పణఖ పేర్లు కొన్ని లైనులలో మాత్రమే చూపినారు కాని అంతకంటె ఎక్కువ చెప్పలేదు. ఇంత చిన్న శూర్పణఖ, మంథరల ద్వారానే రామాయణము అంతా జరిగింది. అయోధ్యలో, రాముడు అరణ్యానికి పోవడం, అరణ్యములో సీత లంకకు చేరటానికి ఆ శూర్పణఖ,మంథర కార్యకర్తలుగా వుంటున్నారు. ఇంతకీ వీరు ఎవరు? శూర్పణఖ కామము, మంథర క్రోధము. వీరిరువురే మన జీవిత రామాయణానికి కారకులు" అని రామాయణాన్ని మన జీవితానికి అన్వయిస్తూ అందులో కామము శూర్పణఖ అనీ, క్రోధము

మంథర అనీ స్వామి పేర్కొన్నారు. సర్వ కార్య ప్రవృత్తులకు కామము మూలము భగవద్గీత తృతీయాధ్యాయములో కర్మయోగాన్ని చెపుతున్న సందర్భంలో అర్జునుడు శ్రీకృష్ణుని నిలా ప్రశ్నిస్తాడు:

"అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః." (3.36)

'వార్ష్ణేయా, కృష్ణా। తన యిచ్ఛ లేకపోయినప్పటికి మనుష్యుడు తనను ఎవరో బలాత్కరిస్తున్నట్లు పాపము చేస్తున్నాడు. అతనిని యిలా పాప కార్యానికి ప్రేరేపించేది ఏమిటి?' అని అర్జునుడు కృష్ణుని ప్రశ్నిస్తాడు. శ్రీ భగవానువాచ!

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్." (3.37)

'ఆ ప్రేరేపించేది కామము; అదే క్రోధము రజోగుణములోనుండి అవి ఉద్భవిస్తాయి. కామము అనే దాని ఆకలికి అంతు లేదు. మహా పాపిష్టిది. అదే వైరి అని తెలుసుకో.'

"ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్." (3.40)

'ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఇవి కామము వుండే నెలవులు. వీటితో జ్ఞానాన్ని కమ్మివేసి ఆ కామమనేది జీవుని మోహపరుస్తుంది. భ్రమపరుస్తుంది. ఇటువంటి కామాన్ని జయించటము దుష్కరము. బుద్ధికన్న పరమైన దానిని-ఆత్మను తెలుసుకొని ఆత్మ బలముచేతనే ఆత్మను స్థిరముగా, నిలకడగా వుండేటట్లు చేసుకొని పట్టుకోడానికి చాల కష్టమైన కామమనే రూపాన్ని ధరించినట్టి ఆ శత్రువును ఓ బలశాలీ, అర్జునా! సంహరించు" అని కృష్ణుడు భగవద్గీతలో ప్రబోధించిన విషయాన్ని మనం గమనిద్దాం. సర్వేంద్రియ వ్యాపారానికి కామక్రోధాదులనే అంతఃశత్రువుల ప్రకోపానికి మూలమైన బీజము కామం.

దశరథుడు అయోధ్య అన్న హృదయంలో దశేంద్రియ సంఘాత రూపుడుగా బ్రతుకుతున్నాడు. రాముడు సీతాసమేతుడై అయోధ్యా నగరంలో నివసిస్తున్నాడు. లక్ష్మణుడు ఊర్మిళాసహితుడై నివసిస్తు న్నాడు. భరతుడు, శత్రుఘ్నుడు భార్యాసమేతులై మేనమామ యింట వుంటున్నారు. సీతారాములు ప్రణయైక జీవితాన్ని నిర్వహిస్తున్న యీ సందర్భంలో అయోధ్య పరమానందభరితంగా వుంది. వృద్ధుడైన రాజుకు శ్రీరాముడు అన్ని విధముల సహాయపడుతున్నాడు. అయో ధ్యలో వున్న ప్రజల హృదయాల్లో తలలో నాలుకవలె రాముడు వ్యవ హరిస్తున్నాడు సర్వమానవ హృదయరంజకుడై సర్వహృదయ చిత్త రమణుడై రాముడు కోసల రాజ్యాన్ని మనస్సుతో దోచుకొన్నాడు. అట్టి సర్వజనప్రీతికరుడైన శ్రీరాముడు నివసిస్తున్న అయోధ్యలో నిండు పాలకుండలో ఒక విషబిందువువలె మంథర ప్రయోగం ప్రారంభ మవుతుంది. దీనికి కారణం సర్వ ప్రజాపరిషత్తు ఎదుట దశరథుడు తన పెద్దకొడుకైన శ్రీరామునికి యౌవరాజ్యపట్టాభిషేకం చేయటానికి నిశ్చయించటం. తెల్లవారితే యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవం. ఉన్నది ఒక రోజు. సంభారాలు నిర్వహింపవలసినవి చాల ఉన్నాయి. నిండుసభలో రామునికి ఈ నిర్ణయాన్ని దశరథుడు చెప్పుతాడు. తాను కౌసల్యకు ఈ సంగతిని నివేదిస్తాడు. రాముడు కౌసల్యకు, సీతకు ఈ సంగతి తెలియపరుస్తాడు. లక్ష్మణాదులు అత్యంతానందాన్ని భజిస్తూ వుంటారు. నగరంలో వున్నవారందరూ శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ సంభార కార్యక్రమాలను ఉత్సాహంతో నిర్వహిస్తూ వున్నారు. నగరమంతా కోలాహలంగా వుంది.

ఈ కోలాహలముగా వున్న అయోధ్యానగర వైభవాన్ని కైకేయి అంతఃపురముయొక్క పైభాగము నుండి గూనిదాసి అయిన మంథర చూస్తుంది. కళ్ళలో నిప్పులు పోసుకొంటుంది. అపూర్వమైన కామ క్రోధ చైతన్యం ఆమె హృదయంలో జనిస్తుంది. కైకేయి రేపటినుండి యువరాజుకు తల్లి కాదు. కౌసల్యకు యువరాజుతల్లికి వచ్చే వైభవ

మంతా ఏర్పడుతుంది. కౌసల్యకు సుమిత్రా, కైకలు దాసులుగా ఉండ వలసివస్తుంది. కైక యోగక్షేమమే ఎల్లప్పుడూ భావించే యీ దాసి ఆమె దగ్గరకు వచ్చి ఒక చిత్రమైన కామాన్ని ప్రేరేపిస్తుంది. 'రేపు రాముడు రాజు అవుతున్నాడు. కౌసల్య రాజమాత కాబోతున్నది. రాజ మాత అయిపోయిన తరువాత నీకు ఇప్పటి గౌరవాలు చెల్లవు. వృద్ధ రాజూ, కౌసల్యా కలిసి ఒక పన్నాగం పన్నారు. రామునికి రాజ్యం కనుక యిచ్చినట్లయితే భరత, శత్రుఘ్నులు ఇప్పుడూ దూరంగా వున్నారు కాబట్టి వారి రాజ్యభాగాన్ని వారు కోరరు. ముందు శ్రీరాముని సింహాసనం మీద కూర్చొనబెట్టాలి అన్న ఆత్రం కనపడుతోంది వారిలో. తరువాత నీకు దాస్యం తప్పదు" అని క్షుద్రరాజ్యవాంఛ అనే కామాన్ని బీజతుల్యంగా కైక హృదయములో నాటుతుంది. అంతవరకు కైక హృదయం కడు నిర్మలమైనది. శ్రీరామ పట్టాభిషేక వార్తాశ్రవణం చేసిన కైకేయి—

"యదా మే భరతో మాన్యః తథా భూయోఽపి రాఘవః
కౌసల్యాతోఽతిరిక్తం చ సోఽనుశుశ్రూష తే హి మామ్
రాజ్యం యది హి రామస్య భరతస్యాపి తత్తదా
మన్యతే హి యథాత్మానం తథా భ్రాతౄంశ్చ రాఘవః."

'నేను భరతుడిని ఎలా ప్రేమిస్తానో, ఎలా మన్నిస్తానో రాఘవుణ్ణి కూడ అలాగే మన్నిస్తాను ఆ రాఘవుడు కూడ కౌసల్యకంటె అతిరిక్తమైన భక్తితో నన్ను సేవిస్తాడు. రామపట్టాభిషేకం అయితే నా హృదయంలో భరతపట్టాభిషేకమైనట్లే. ఆ రాముడు తమ్ములనందరను తనవారిగనే భావిస్తాడు.' ఇంత వినిర్మలమైన వాత్సల్యబుద్ధితో నున్న కైకయొక్క నిర్మలహృదయంలో మంథర క్రమంగా విషాన్ని ఎక్కిస్తుంది. రాముడు అత్యంత పరాక్రముడనీ, అతడు రాజ్యానికి వచ్చినట్లయితే కైక కొడు కుకు రాజ్యావకాశమే లేకుండా పోతుందనీ, దశరథునియొక్క అను రాగం కైక పొందలేకపోతుందనీ, సపత్నులు ఆమెమీద మాత్సర్యాన్ని ప్రకటిస్తారనీ మూడు అంచెలతో ప్రబోధం చేస్తుంది. మొదటిది అత్మ

గౌరవానికి సంబంధించినది. కైక రజోగుణానికి ప్రతీకగా మనం యిది వరకే సంభావించాం. రజోగుణంనుండే కామక్రోధాలు పుట్టుతవని భగవద్గీత చెప్పింది. కామ బీజాన్ని దాసి నాటుతున్నది కైక హృదయంలో. సపత్నులైన కౌసల్యాదులపై క్రోధము, ఈర్ష్య, అసూయ అన్న భావాలు మోసులెత్తుతున్నాయి. తన కొడుకుకు మాత్రమే రాజ్యభోగం కావాలి అన్న కామనం మోసులెత్తుతున్నది. రాముడు కనుక అయోధ్యలో నివసించినట్లయితే అవక్రవిక్రముడైనటువంటి రాముని చూచి ప్రజలు భరతునికి రాజ్యాభిషేకం చేయటానికి అంగీకరింపరు. రామునివలన భరతునికి ముప్పు రావచ్చును. అందువలన రాముణ్ణి అరణ్యానికి పంపించాలి. పదునాలుగేళ్ళ అరణ్యవాసం కనుక అతడు చేసినట్లయితే భరతుడు రాజ్యంలో స్థిరపడతాడు. స్థిరపడిన రాజును రాముడు కదిలించలేడు. 14 సంవత్సరాలు తాపస వేషంతో అరణ్యవాసం చేసిన రామునికి సహజంగా విరక్తిభావం కలుగుతుంది. రాజ్యం మీద ఆశ అతనికి లేకుండా పోతుంది. ఆవిధంగా భరతుడు రాజుగా స్థిరపడతాడు- ఇదీ మంథర నూరిపోసిన కామబీజ తాత్పర్యం. దీన్ని మనస్సులో పెట్టుకొన్న కైక తన పథకాన్ని నిర్వహించడానికి ప్రయత్నం చేస్తుంది. దశరథుడు ఇంద్రియ సంఘాతమైన శరీరం వంటివాడని ఇదివరకే చెప్పుకొన్నాం. ఇంద్రియ ప్రాబల్యం శరీరమునందు అధికముగా ఉంటుంది. భగవద్గీత ద్వితీయాధ్యాయంలోని సాంఖ్యయోగ కథనంలో చెప్పినట్లుగా -

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి." (2.62,63)

కైకేయీ హృద్గతమైనటువంటి కామం ఇంద్రియసంఘాతరూపుడైన దశరథుని యందు ప్రయోగింపబడితే అతడు విషయాసక్తుడు కాబట్టి, విషయాలకు వశమైనటువంటి శరీరము కలవాడు కాబట్టి, అతడు విషయ

సంగుడు అవుతాడు విషయ సంగం ఎప్పుడైతే ఏర్పడుతోందో 'సంగాత్ సంజాయతే కామః-' కామము జనిస్తుంది. కామతప్తుడవుతాడు. ఆ కామం నుండి క్రోధం జనిస్తుంది. ఆ క్రోధంనుండి సమ్మోహం జనిస్తుంది. సమ్మోహం వలన మతివిభ్రమం కలుగుతుంది. మతి విభ్రమం బుద్ధి నాశనాన్ని కల్గిస్తుంది. బుద్ధి నశించిన తరువాత ఆ నరుడు నశించడం తథ్యం. కైకేయి అంతఃపురంలో ప్రవేశించి కోపగృహంలో శయనించి యున్నది. కైక సమీపంలో కూర్చున్న దశరథుడు కామమోహితుడు. కామమోహితమైన పురుష క్రౌంచమువలె ఈ దశరథుడు క్రౌంచివంటి కైక సమీపంలో కామమోహితుడై వున్నాడు. నిజానికి, కైకను వివాహం చేసుకొన్న తరువాత దశరథుడు కౌసల్యనే సరిగా ఏలుకోలేదు. ఆమె తరువాత రామునితో చెప్పుకొని దుఃఖిస్తుంది. 'కైక కాపురానికి వచ్చినప్పటి నుంచి రామా! నావైపు దశరథుడు చూడనేలేదు. ఆ మధ్య పాయసం పెట్టినది మొదలు,నీవు(రాముడు)పుట్టినది మొదలుకా స్త నన్ను గౌరవిస్తున్నాడు. రామునిబట్టే నాకు గౌరవము. రామా! నీవు అరణ్యా నికి వెళితే ఇక నన్ను ఎవరు చూస్తారు?' అని వాపోతుంది ఆ తల్లి. 'తల్లీ! నీ హృదయంలో ఇంత శోకం కరుడు కట్టుకొని వున్నదా?' అని రాముడు ఆశ్చర్యపోతాడు. ఈమెయందు పూర్వం బద్ధానురాగుడైనటు వంటి యీ వృద్ధనృపతి కామమోహితుడై యిప్పుడు కైక ప్రక్కన చేరినపుడు 'అలనాడు దేవాసుర యుద్ధంలో నాకు ఇస్తాను అని చెప్పిన రెండు వరాలను ఇప్పుడు ఇస్తాను అని ముందు వాగ్దానం చేయండి' అని వాగ్దానంతో దశరథుని ముందుకాళ్ళకు బంధం వేస్తుంది కైక. దశరథుడు కామమోహితుడై వుండటంచేత-

"అవలిప్తే! నజానాసి త్వత్తః ప్రియతమా మమ
మనుజో మనుజవ్యాఘ్రాత్ రామాదన్యో నవిద్యతే"

'నేను నా జీవితంలో వనిత అంటే నీవే అనుకొని నీయందు రమిస్తు న్నాను. ఇక పురుషులలో పురుషవ్యాఘ్రముదైన, పురుషశ్రేష్ఠుడైన రాముని తప్ప నేను ఇతరులను ఎరుగను. పురుషులలో రాముడు, స్త్రీలలో నీవు నా హృదయాన్ని ఆవరించి వున్నారు.'

"యం ముహూర్త మనుపశ్యంతు నజీవేయ మహం ధ్రువమ్
తేన రామేణ కైకేయి శపేతే వచనక్రియాం."

"ఏ నయనాభిరాముడైన ఆ శ్రీరాముని వదిలిపెట్టి ఒక్క క్షణమైనా నేను బ్రతుకలేనో అట్టి రామునిమీద ఒట్టు పెట్టుకొని చెప్పుతున్నాను. నీ కోరికలు తప్పక తీరుస్తాను" అన్నాడు దశరథుడు. రామునిమీద ఒట్టు పెట్టుకొన్న తరువాత కైక నయభాషణాలతో తన కోరికలను బయటపెడుతుంది. 'రామునికి పట్టాభిషేక సంభరాలు సిద్ధం చేశారు. సిద్ధం చేయబడిన ఈ సంభారాలతోనే భరతుని యువరాజుగా అభిషికించవలెను - ఇది మొదటి వరం. రెండవది - తాపస వేషంతో రాముడు పదునాలుగేళ్ళు దండకారణ్యంలో వసింపవలెను. మొదటిదానికంటె రెండవది ముందుగా నా కళ్ళయెదుట ఈనాడే ప్రవర్తిల్లవలెను. రాముడు ఈనాడే వల్కలధారియై దండకారణ్యానికి ప్రయాణం కట్టవలెను.' ఈ రెండు కోరికలు కైకేయి కోరినవి. రాముడు కౌసల్యకంటె అమితమైన ప్రేమను ఏ తల్లియందు చూపిస్తున్నాడో ఆ తల్లి రాముణ్ణి గురించి, తన కొడుకును గురించి అడుగుతున్న రెండు వరాలివి. కథలో చూస్తే, దశరథుని విలాపం చూస్తే యివి వరాలా? శాపాలా? అనిపిస్తుంది మనకు. రాముడు అరణ్యానికి వెళ్ళితే ఒక్క క్షణమైనా రాముని దర్శనాన్ని వీడి బ్రతకలేని దశరథుడు చనిపోతాడు. ఆత్మానందవర్ధనుడైన ఆ కుమారుని వియోగదుఃఖంచేత కౌసల్య విగత జీవ అవుతుంది. దశరథుడు మరణిస్తే రాణులకందరికీ వైధవ్యం ఏర్పడుతుంది. ఆ తరువాత భరతుడు రాజ్యం చేయాలి. కైక మాట ప్రకారం భరతుడు రాజ్యం చేస్తాడో లేదో అనుమానం. రాముడు అంటే బహిఃప్రాణం భరతునికి. మన స్త్రీల పాటలలో రాముణ్ణి, భరతుణ్ణి వర్ణిస్తూ వీరిద్దరూ నీలమేఘశ్యాములనీ; లక్ష్మణుడూ, శత్రుఘ్నుడూ బంగారపు వన్నెగలవారనీ చెప్పుతారు. పుష్పక విమానంలో శ్రీరాముడు వస్తూవుంటే చివరి రోజు దాటి ఒక్కక్షణము ఆలస్యమైనా నేను అగ్నిలో దూకుతాను అని శపథం చేసిన భరతుడు నందిగ్రామంలో

పెద్ద అగ్నికుండాన్ని పేర్చుకొని దాని ఎదుట నిలబడి వున్నాడు. 14 సంవత్సరాలు పూర్తి అయిన మరుక్షణమే రాముడు కంటపడక పోతే భరతుడు అగ్నిలో దూకుతాడు కాబట్టి సమయం మించి పోతుం దేమోనని రాముడు హనుమంతుణ్ణి ముందు దూతగా పంపుతాడు. అతడు ఆకాశంలో వస్తూంటాడు. అగ్నికుండం ముందు నించున్న భరతుడు కనపడతాడు. హనుమంతుడే ఒక్కసారి దిగ్భ్రాంతిచెంది 'యిక్కడ ఎలా రాముడు నించున్నాడు?! సీతను అగ్నిలో ప్రవేశించు మని చెప్పిన దోషాన్ని పరిహరించుకోవడానికి ఇప్పుడు అగ్ని పేర్చు కొని తనంతట తాను అగ్నిలో దూకడానికి నించొని ఉన్నాడా? అయినా పుష్పకములో నున్న రాముడు భూతలంమీద ఎలా నిలి చాడు?' అని ఆశ్చర్యపోయాడట! హనుమంతునికే భ్రాంతిని కల్గించే రూపసామ్యం కల్గిన ఆకృతి విశేష వైభవం కలవాడు భరతుడు. ఆకృతిలోనే కాదు, గుణవైభవంలో కూడ. పైపెచ్చు విష్ణువు ధరించే శంఖం ఆయన. అతని ప్రాణవాయువు పూరిస్తేనే ఆ శంఖం మ్రోగేది. రాముడు అన్న ప్రాణవాయువు భరతుని శరీరములో ప్రసరించకపోతే అతని హృదయంలో ఓంకారమే లేదు. అలాగే శత్రుఘ్ననకు. రాముడు అన్న వేలు కనుక లేకపోతే చక్రం తిరగదు. ఈ రెండిం టికి ప్రాణభూతమైన ఆధారం రాముడు. ఆధార - ఆధేయ భావంతో నున్న సంబంధం వున్నవాడు శత్రుఘ్నుడు. ప్రాణభూతమైన చైత న్యాన్ని రామునియందు సర్వత్రా భజించే భరతుడు వంశపారంపర్యా నుగతంగా వస్తున్న జ్యేష్ఠ రాజ్యభాగాన్ని గైకొని కనిష్ఠుడైన తాను సింహాసనం ఎక్కుతాడా? అతడు రాజ్యానికి రాకపోతే గతి ఏమిటి? దశరథుడు నయానా, భయానా ఇవన్నీ చెబుతాడు కైకకు. 'నీవు పిచ్చికోరిక కోరుతున్నావు. భరతుని తత్త్వం నాకు తెలియదా? అతడు రాజ్యాన్ని స్వీకరించడే!' అని బ్రతిమిలాడతాడు కాని, మొండి పట్టు పడుతుంది కైక. క్రోధాన్ని భజిస్తుంది. ఈర్ష్యను విరజిమ్ము

తుంది. మదాన్ని ప్రకటిస్తుంది. ఆరు విధములైన అంతఃశత్రువుల యొక్క అపరావతారాన్ని కైక ప్రదర్శిస్తుంది. దశరథుని శరీరంలో వసిస్తున్న అంతఃశత్రువులే అతని చిన్నభార్యగా అవతరించి లాస్యం చేస్తున్న వైఖరి దశరథుడు చూస్తాడు. అంతఃశత్రువుల ప్రకోపంతో వృద్ధుడైన తాను తన యింద్రియాలను జయింపలేక వాటికి వశగతుడవుతాడు. వాల్మీకి అంటాడు - బోయవాడు ఒక వలను పన్ని వింతయైన కేక వేస్తే మచ్చికతో ఒక మృగం వచ్చి ఆ వలలో చిక్కుకొన్నట్లుగా ముందు తానుచేసిన శపథం అన్న వలలో దశరథుడు అనే మృగము చిక్కుకొన్నది అని. తాను ఆడి తప్పలేడు. ఇస్తాను అన్న వరాలను ఇవ్వలేడు. రాముని పాయలేడు. కైకకు ఇచ్చిన వరమా ముఖ్యం? నిండు పరిషత్తులో వసిష్ఠాది మహర్షుల యెదుట రేపు శ్రీరామునికి పట్టాభిషేకం చేయనున్నానని చేసిన ప్రతినయా ముఖ్యం? దేనిని ఆచరించాలి? ఏది సత్యం? ఏది ధర్మం? వివేకం కోలుపోయిన దశరథుడు వేదన పడతాడు. కైక ఇలా వాదిస్తుంది - 'సత్యం ఉన్నది. నీవు నా కిచ్చిన మాటయే సత్యం. నీవు ఏ విధంగానైనా నా వరాలను తీరుస్తానన్నావు. నీవు సత్యపరాక్రముడవైతే నీ మాట తీర్చు.' భార్యయొక్క వలలో చిక్కుకొన్న ఆ భర్త మరణవేదన పడుతున్నాడు.

తెల్లవారితే రామ పట్టాభిషేకం. సూర్యోదయం అయింది. యజ్ఞ సంభారాలన్నీ సిద్ధమై వున్నాయి. వసిష్ఠుడు సుమంత్రుని పిలిచాడు. 'మహారాజును తన కుమారుని తీసికొని యజ్ఞశాలకు రమ్మనమను. అక్కడినుండి యౌవరాజ్య పట్టాభిషేక సంభారాలతో నిండుసభకు వెళ్లుదాము' అని నిర్దేశిస్తాడు. కైకేయి అంతఃపురములో సొమ్మసిలి వున్న దశరథ మహారాజు దగ్గరకు సుమంత్రుడు వెళ్ళుతాడు. ఆయన మాట్లాడే స్థితిలో లేడు. మూర్తీభవించిన శోకంగా ఉన్నాడు. కైకేయిని తిడుతున్నాడు. 'నరరూప రాక్షసీ!' అని నిందిస్తున్నాడు. రాముణ్ణి వనానికి వెళ్ళుమని నోటితో చెప్పలేడు. రామనామ స్మరణము మాత్రం చేస్తున్నాడు. ఇట్టి పరిస్థితులలో సుమంత్రుని ఎదుటకు కైక వచ్చి

'రాముణ్ణి యిక్కడకు పిలుచుకురా!' అని ఆజ్ఞాపిస్తుంది. సీతారాములు అంతఃపురంలో పట్టాభిషేకానికి అనువైన ఆభరణాలను ధరించి, యాగకృత్యాలన్నీ నిర్వహించి పట్టాభిషేకోత్సవ ప్రయాణానికి సిద్ధంగా వున్నారు. సుమంత్రుడు వచ్చాడు. 'మీ తండ్రిగారు పిలుస్తున్నారు అని కైకేయి మిమ్ములను వెంటనే తీసుకురమ్మన్న' దని నివేదించాడు. సుమంత్రుని మాట విన్న తరువాత రాముడు ఎటువంటి అనుమానం పొందలేదు. 'బహుశః నా తల్లికంటె చాల ప్రీతిగా చూచే నా పినతల్లి గారి యింటినుండి రథంలో ఊరేగింపచేస్తూ తీసుకువెళ్లాలని మోజుపడు తున్నట్లున్నాడు నా తండ్రి. సీతా! నీవు సిద్ధంగా వుండు. నేను ఇప్పుడే వెళ్ళి వస్తాను' అని బయలుదేరివస్తాడు రాముడు.

అక్కడకు వస్తే సన్నివేశం విచిత్రంగా వుంది. దశరథుడు మాటలాడలేని స్థితిలో, మోహావస్థలో మూర్ఛితుడై పడివున్నాడు. రాముని చూస్తాడు, ఏడుస్తాడు. సంగతంతా కైక రామునితో చెప్పు తుంది. 'నీ తండ్రి నీమీద వున్న మమకారంచేత ఈ మాటలు నీతో అనలేకపోతున్నారు. నీ తండ్రి సత్యసంధుడుగా నిలవవలయునంటే నీవు సత్యపరాక్రముడవు కావాలి' అని ఆదేశించింది. రాముడు, మరు క్షణంలో యువరాజు అవుతాను అని అనుకొంటున్న ఆ రాముడు, పిడుగుపాటువంటి ఆ మాటలు వింటే విషణ్ణుడు కావలసింది. కాని, అతని ముఖంలో ఎటువంటి వికారమూ లేదు. నిర్వికారచిత్తుడైన రాముని మోమును చూచి కైక ఆశ్చర్యపోతుంది. ఆ రాముడు ఎటు వంటివాడు? భగవద్గీతలో చెప్పినట్లుగా—

"రాగద్వేషవిముక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి
ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే". (2,64,65)

'ఇంద్రియాలను ఆత్మవశంలోనే నిలిపివుంచి, రాగద్వేషాలనుండి వాటిని తరలించి తనను తాను శాసించుకోగల్గినవాడు, విషయాలయందు సంచ

రించినప్పటికి ప్రసన్నస్థితిని పొందుతాడు. ఆ ప్రసన్న స్థితిలో సర్వ దుఃఖాలు నశించిపోతాయి. అట్టి ప్రశాంత మనుస్కుని బుద్ధి త్వరగా స్థిరపడుతుంది.' ఇట్టి స్థితప్రజ్ఞుడు రాముడు. సుఖమూ, దుఃఖమూ రెండూ తాను ఎదుర్కొనవలసి వచ్చినపుడు ఆ రెండింటినీ సమ బుద్ధితో స్వీకరింపగల్గిన పరిపక్వ చిత్తస్థితి గలవాడు. నిర్వికార చిత్తుడైన రాముడు అంటాడు- 'అమ్మా! నా తండ్రి అనలేకవున్నాడని అనలేకపోతే నీవు చెబితే మాత్రం నేను నీ ఆజ్ఞను మీరుతానా? నీ మాటను ఎప్పుడైనా జవదాటేనా? ఇప్పుడే నీ కోరికలను తీరుస్తాను. కాని, నా తల్లిని, నా భార్యను చూచి వారివద్ద వీడ్కోలు తీసుకొని వస్తాను. ఈ మాత్రం సమయం నా కిప్పించు' అని రథాన్నీ, చామరా లను, విభూషణాలను, బంగారు పావుకోళ్ళను స్వీకరించకుండా పాద చారియై కౌసల్య మందిరానికి వస్తాడు.

యౌవరాజ్య పట్టాభిషేకానికి తరలిపోతూ తనకు నమస్కరించ టానికి కొడుకు వస్తాడని దేవమందిరంలో సర్వవిధములైన అర్చనలు చేసి మంగళాక్షతలు సిద్ధం చేసికొని, ఆ మాతృమూర్తి వేయికన్నులతో ఎదురు చూస్తున్నది. రాముడు వచ్చాడు. తన కొడుకు యువరాజు కాబోతున్నాడు అని భ్రమించి సంబరపడింది. కాని, రాముడిలా అన్నాడు: 'అమ్మా! నేను గద్దె నెక్కడానికి పోవడంలేదు. తండ్రి ఆజ్ఞ చొప్పున 14 ఏళ్ళు వనవాసం చేయటానికి పోతున్నాను.' కన్నతల్లి కడుపు చెరువైపోయింది. రామాయణంలో దశరథుని శోకం, కౌసల్య శోకం, సీతాశోకం, సుమంత్రుని శోకం, పౌరుల శోకం వాల్మీకి అధ్యాయాలు, అధ్యాయాలు వ్రాశాడు. కథ లేదు అయోధ్యాకాండలో- ప్రజల శోకమే. రామవియోగతప్తులైనటువంటి జీవులయొక్క వేదన అయోధ్యకాండ అంతా నింపివేశాడు వాల్మీకి. ఆమె ఇలా అంటుంది: 'భరతుని రాజుగా చేయుమని కోరడం న్యాయం. నా కొడుకైన నిన్ను ఏ దోషంచూచి అడవులకు పంపుతున్నారు? దోషం అన్నది లేని నిన్ను అడవులకు పంపవలసిన అగత్యం ఏమి వచ్చింది? ఇది ధర్మమా?

పోవడం నిశ్చయమైతే నిన్ను వదిలి నేను వుండజాలను. నేనూ నీ వెంట వస్తాను, అలా వీలులేకపోతే నేను చనిపోతాను.' కౌసల్యా ప్రతిపాదించిన మాటలలో ప్రధాన తాత్పర్యాలు యివి. తల్లి కొడుకు మీద వున్న అవ్యాజమైన వాత్సల్యమనే మోహంతో రాముని రమిస్తోంది. అతడు అడవికి పోతే తాను కూడ వస్తాను అంటున్నది. పోవడంలో ధర్మాన్ని ప్రశ్నిస్తోంది. దానికి సమాధానం చెప్పాలి రాముడు. రాముడు తండ్రి దగ్గర కూడ చెప్పనటువంటి ఒక విశేషాన్ని మొదటిసారి తల్లిదగ్గర ప్రకటిస్తాడు: 'అమ్మా! నిజానికి కైకేయి ఎన్నడూ యింతవరకు నాకు ఎట్టి అపకారం చేయలేదు. ఈరోజు ఇటువంటి విపరీతమైన కోరిక కోరిన మాట నిజం. అటువంటి వ్యక్తి యిటువంటి కోరిక ఎందుకు కోరివుంటుంది? లౌకికంగా చూస్తే సపత్నీ మాత్సర్యం అన్న హేతువు కనపడుతున్నది. ఆమెకు నామీద ఎటువంటి కోపము వుండటానికి వీలులేదు. భౌతికంగా మన కంటికి, మన బుద్ధికి తోచనటువంటి దైవికమైన కారణం ఏదో వుండివుండాలి. ఇటువంటి విపరీతమైన సంఘటనలు జరుగుతున్నప్పుడు మనం ఆ విపరీతసంఘటన వలన దుఃఖం చెందకూడదు. అందులో దైవికమైన హేతువును చూచి జ్ఞానులమై ఆ హేతువును చింతించి రమించాలి' అని రాముడు తల్లికి బోధిస్తాడు. కాని, తండ్రికి చెప్పడు దీన్ని. తల్లి కుమారునిలోని దైవతత్త్వాన్ని ఉపాసించే ముగ్ధభక్తురాలు. ఆమె రామునిలో నారాయణ తత్త్వాన్ని భజిస్తుంది. అందువల్ల రాముడు తత్త్వగంభీరంగా అలా చెప్పాడు. 'మహావిష్ణువునైన నేను భౌతికంగా నరాకృతి చెందివున్నానమ్మా! నేను అడవులకు పోతున్నాను అంటే బయట కనపడుతున్న కారణం నా పినతల్లి. దీనివెనుక ఒక దైవికమైన కారణం ఉన్నది అని నా తత్త్వాన్ని ఉపాసించే నీవు తెలుసుకో. ఆ తత్త్వాన్ని నీవు ఉపాసించగల్గితే నీకు నేను ఆనందవర్ధనుడ నవుతాను. అది ఆనందదాయకమైన తాత్త్వికాంశము.' ఇట్టి తత్త్వబోధ తల్లికి చెబుతున్నపుడు లక్ష్మణుడు ప్రక్కన ఉన్నాడు. అతనికి ఆ తత్త్వం అవగాహనం కాదు. తల్లికూడా మొదట

అర్థం చేసుకోదు రెండవసారి చెబుతాడు రాముడు అప్పుడు తల్లి గ్రహిస్తుంది. 'నీవు ఏదో దైవికమైన కారణమని చెబుతున్నావు. అయి వుండవచ్చును. నీవు నేను ఆపితే నిలిచేటట్లుగా లేవు, నీవు కృతనిశ్చయుడవయి నావు. అయితే, నా గతి ఏమిటి?' అని కౌసల్య విల విల లాడుతుంది. రాము డప్పు డిలా అంటాడు: 'నేను ఇక్కడనుండి వెళ్ళిన తరువాత నీదంతా సుప్తావస్థ అమ్మా! ఆ సుప్తావస్థలో లోన నీకు భాసించేటటువంటి ఆత్మానందమే నా తత్త్వామృతం.' వాల్మీకి రామావతార తత్త్వాన్ని ఇందులో ధ్వనింపచేశాడు. రామాయణంలో లక్ష్మణుని భార్య నిద్రపోతుందనుకొంటాము మనం. కాని, '14 ఏళ్ళు నీవు విచిత్రమైన నిద్ర పోతావమ్మా! ఆ విచిత్రమైన నిద్రలో నా తత్త్వం నీకు సుషుప్తావస్థలో భాసించే అవ్యక్తాత్మానందంవలె నీకు భాసిస్తూ వుంటుందమ్మా!' అని చెప్పుతాడు కౌసల్యానందవర్ధనుడైన రాముడు ఆ మాటకు కట్టుబడుతుంది ఆ తల్లి. అంగీకరిస్తుంది. సర్వదేవతలు నీకు రక్షనిచ్చుగాక అని ఆశీర్వదిస్తుంది. కొడుకుకు రక్షరేకు కట్టి పంపిస్తుంది.

లక్ష్మణుడు క్రోధావేశాన్ని ప్రకటిస్తాడు. 'ఇది అధర్మం. చిన్నవాడు రాజ్యానికి రావడం న్యాయం కాదు. అన్నా! నన్ను ఆజ్ఞాపించు. నా కోదండ పరాక్రమంచేత అయోధ్యను ఒక్కక్షణంలో నా వశం చేసుకొంటాను. అప్పుడు నీకు రాజ్యం ఇస్తాను. అడ్డు వస్తే తండ్రిని చంపుతాను, తల్లిని చంపుతాను' అని ఆవేశపడతాడు. రామునికోసం, రామునికి ధర్మబద్ధంగా రావలసిన రాజ్యాన్ని అధర్మంగా అపహరిస్తున్నారని భావించి, కృద్ధుడౌతాడు ఆ శేషుడు. కోపము వస్తే బుసలు కొడతాడు. నారాయణుడు సుఖంగా తనపై శయనించాలని అనే ప్రవృత్తి కలిగినవాడు. అతని సుఖానికి అడ్డు వస్తున్నారు. అరణ్యానికి పంపుతున్నారు. రాముని సుఖానికి అడ్డు వచ్చినవారిని కాదనడమే అతని లక్షణము. అప్పుడు రాముడు ఇలా అంటాడు: 'నిర్ణయము తీసుకొనేది నేను. ఇక్ష్వాకువంశ ప్రభువులు సత్యముచేతనే బ్రతుకుతున్నారు. సత్యాన్ని

నిలపడానికి పరాక్రమాన్ని ప్రకటించటమే నా వ్రతం. నేను సత్యపరాక్రముడను. సత్యము కొరకై పరాక్రమము వెలార్చువాడను. సత్యస్థాపనము కొరకు నా పరాక్రమాన్ని వెలార్చేవాడను. తండ్రిమాట నిలబెట్టడానికి, తల్లి మాట నిలబెట్టడానికి సత్య వ్రత దీక్షను పూనటానికి, తండ్రియే ప్రత్యక్ష దైవమని నిరూపించటానికి నేను వ్రతాన్ని పూని వెళుతున్నాను. నన్ను నీవు అడ్డగించలేవు.' లక్ష్మణుడు అంటాడు - 'వరాలు నిన్ను బంధిస్తే బంధించవచ్చు. కైక వరాలు నన్ను శాసించలేవు. కాని, రామా! నీ ఆజ్ఞ లేనిది మాత్రము నేను అడుగు ముందుకు వేయను.' రాము డప్పుడు లక్ష్మణుని దగ్గరకు తీసి ఇలా నిర్దేశిస్తాడు- 'నేను అరణ్యానికి వెళుతున్నాను. నా తల్లిని, నీ తల్లిని రక్షించవలసిన బాధ్యత నీయందు ఉన్నది' అని అంటాడు. లక్ష్మణుడు - 'నాకు ఈ ప్రపంచంలో ఒక్కటే లక్ష్యం. అది రాముడు. రాముడు వినా తల్లి, తండ్రి, మిత్రుడు, భార్య అన్న స్పృహ నాకు లేదు. నేను రామాంశలో ఒక భాగమే, నన్ను నీ సేవ చేయటానికి అంగీకరించు' అని తన ఆభరణాలను తీసివేసి, తానూ వల్కలాలను ధరించటానికి సిద్ధమవుతాడు లక్ష్మణుడు. కౌసల్య ఎదుట లక్ష్మణుని కూడ తనతో తీసికొని వెళ్ళటానికి రాముడు అంగీకరిస్తాడు. ఆ తరువాత సీత దగ్గరకు వెళతాడు. సీత చాల ప్రౌఢురాలు. భర్తను వదిలి వుండటం న్యాయం కాదు అంటుంది రాముడు కాదు అంటాడు. 'నీవు నా తల్లి సేవ చేయాలి, నా పినతల్లుల సేవ చేయాలి, నా తండ్రి సేవ చేయాలి. భరతుడు కనుక రేపు రాజు అయితే, అతన్ని కించపరిచే మాటలు అనకు. అతనిని రాజుగా గౌరవించు' అని బోధలెన్నో చేస్తాడు. ఈమె కూడ నయానా, భయానా చెప్పి చూస్తుంది. రాముడు వినడు. అరణ్యానికి వస్తే చాల యిక్కట్లు పడవలసి వస్తుందని, అరణ్యవాసంలో పొందే కష్టనిష్ఠురాలన్నీ వివరిస్తాడు. సీత వినదు. చివరకు—

"కిం త్వాఽమన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం

అనృతం బత లోకోఽయమ జ్ఞానా ద్యద్ధి వక్ష్యతి
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే."

"ఏమయ్యా! మా నాన్నగారు నీకు కన్యాదానం చేస్తున్నప్పుడు నీవు పురుషసింహుడ వని నమ్మి, భార్యను భరించగలవాడవని విశ్వసించి, నీకు ఛాయగా వర్తించే పద్ధతిలో సహధర్మచారిణిగా నన్ను నీకు అప్పచెప్పాడు. ఒకవేళ నన్ను ఇక్కడ వదిలిపెట్టి నీవు అరణ్యావాసానికి వెళ్ళావు అన్న విషయం కనుక తెలిస్తే మా నాన్నగారు అనుకొంటారు - 'నేను పొరపాటుపడి ఒక స్త్రీకి నా కన్యను ఇచ్చాను' అని. ఇవి సీత అన్న మాటలు. ఇంతకంటే సాత్త్వికుడైన పురుషునికి మరొక తీవ్రమైన కశాఘాతం అవసరం లేదు. 'నీవు సూర్యుని వంటి తేజస్సు గలవాడవు అని లోకులు అందరూ అనుకొంటున్నారు. ఒక అబలను రక్షించలేక, ఇంట వదిలిపెట్టి పోయిన పరాక్రమ హీనుడా రాముడు అని లోకం నిందిస్తుంది. నీవు దివాకర తేజస్సమన్వితుడవని లోకంలో ప్రతిష్ఠను పొందవలయును అంటే నన్ను నీ వెంట తీసికొనిపో. నీవు ఏమీ భయపడకు. నీతో నేను బ్రహ్మచర్యాన్ని వహిస్తాను' అని రామునికి ధైర్యం చెప్పుతుంది.

ఆ మాట అన్న తరువాత మరి రాముడు భయపడే ఒప్పుకొన్నాడో లేక ధర్మాన్నే చూచి ఒప్పుకొన్నాడో, సీతను కాదనలేక ఒప్పుకొన్నాడో కాని, సీతను తీసికొని వెళ్ళటానికి అంగీకరించి, 'నిన్ను పరీక్ష చేయటానికి ఇలా అన్నాను కాని, నీవు లేకపోతే నేను జీవింపగలనా? భర్తకు భార్య ప్రాణం, నా భార్యను అయోధ్యలో వదిలిపెట్టి నేను దండకారణ్యంలో ఉండగలనా?' అని రాముడు సీతను సమాశ్వాసించి అడవికి తనతోపాటు తీసికొనిపోవటానికి అంగీకరిస్తాడు. ఆ తరువాత రాముడు కైక దగ్గరకు వెళ్ళడం, కైక స్వయంగా వల్కలాలను ఇవ్వడం, రాముడు ధరించడం, లక్ష్మణుడు ధరించడం, సీతకు ఇచ్చిన వల్కలం చాల చిన్నది కావడం, ఆమెకు వల్కలం ధరించడం చేతకాకపోవడం, శ్రీరాముడే సీతకు ఆ చీర

ఎలా కట్టుకోవాలో నేర్పడం- ఈ ఘట్టాలన్నీ చూచి దశరథుని అంతః పుర వనితలు బావురుమని దుఃఖిస్తారు. రాముడే సీతకు నారచీర కట్టుట నేర్పవలసిన అగత్యం ఏర్పడింది. లక్ష్మణుని, సీతను తన వెంట తీసికొనిపోవడానికి రాముడు తండ్రిని అనుమతి కోరతాడు.

దశరథుని మాట పడిపోయింది. తిడితే భార్యను తిడుతున్నాడు లేకపోతే రామా అని పిలుస్తున్నాడు. కామ వ్యామోహ దగ్ధుడైన ఆ జీవి అంతవరకూ తనకు మోహావస్థను కల్గించిన ఆ కామబీజాన్ని తెలిసికొని దానిని తిరస్కరిస్తున్నాడు. కామమును తిరస్కరిస్తున్నాడు, నిందిస్తున్నాడు, అధిగమించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ శక్తి ఎక్కడనుండి వచ్చింది? రాముడు అతని కిచ్చిన సత్యపరాక్రమం వలన వచ్చింది. సత్య పరిపాలనంవలన వచ్చింది. దశరథుడు తాను స్వయంగా నిర్వహింపలేని ధర్మాన్ని రాముడు నిర్వహిస్తున్నాడు. రాముని ధర్మనిర్వహణమే ఆ దశేంద్రియ సంఘాతంలోనున్న ధార్మిక చైతన్య శక్తి. ఆ ధార్మిక చైతన్య శక్తితో కైకను తృణీకరిస్తాడు దశరథుడు. చివరకు కైకతో అంటాడు - 'భరతుడు నిజంగా రేపు వచ్చి నీవు చెప్పినట్లుగా రాజ్యాన్ని స్వీకరిస్తే వాడు నా తలకొరివి పెట్టడానికి యోగ్యుడు కాడు. వాడు నాకు తర్పణా లివ్వటానికి యోగ్యుడు కాడు, నీవు నా భార్యవు కావు. ఇంతటితో నీ సంబంధం తెగింది' అని. రాముని రథం పోతున్నపుడు కౌసల్యా దశరథులు లేగ దూడ పరుగెత్తుతూవుంటే ఆవూ, ఆబోతూ దాని వెంట పరుగెత్తు తున్నట్లుగా రామా, రామా అని అరుస్తూ పరుగెత్తుతారు. అంతే.

అక్కడినుండి దశరథుడు కౌసల్యాంతఃపురానికి చేరుతాడు. 'రాముణ్ణికన్న కౌసల్యయే నన్ను ఉద్ధరించింది. రాముడు పుట్టిన ఆ మందిరములోనే వుంటాను' అని సంకల్పిస్తాడు. కామమును త్రోసి రాజన్న ఇంద్రియం ఎవరిని ఆశ్రయిస్తోంది? రాముని ఆత్మస్వరూపాన్ని భజించే భక్తి తత్త్వాన్ని అండగా తీసికొని నిలిచింది. దశరథునికి కను చూపు తరిగిపోతున్నది. ఆ కన్నులలో తాపసవేషం ధరించిన రాముడే

కనపడుతున్నాడు. తాపస వేషంలోనున్న రాముడు ధర్మనిర్వహణ సమర్థుడైన దివ్యతేజస్సు. "విగ్రహవాన్ ధర్మః" - విగ్రహరూపుడైన ధర్మమూర్తి. నిష్ఠాగరిష్ఠమైన ఆత్మ ధర్మానికి ప్రతీకగా నిలిచిన ఆ కుమారుని రూపం కన్నులముందు నిలుస్తోంది. భౌతిక దృష్టి నశించింది. అంతర్దృష్టిలో రాముడు ప్రసన్నుడవుతున్నాడు. రామనామ స్మరణం, రామరూప భావనం-ఇవే ఆ దశరథునిలో నిలిచాయి. అతడు చివరకు 'రామా, రామా, రామా' అని స్మరిస్తూ కౌసల్య శరీరం మీద ఒరిగిపోయి కన్నుమూస్తాడు. ఏ శ్రీరాముడు ఆత్మానందవర్ధనం చేయటానికి భక్తిప్రపత్తులను ఏ తల్లియందు నిక్షేపం చేశాడో, ఆ భక్తి అనే ఆలంబనంతో దశరథ శరీరం ఒరుగుతుంది. ఇంద్రియవ్యామోహరూపమైన అతని శరీరం సర్వేంద్రియ వ్యామోహానికి మూలమైన కామాన్ని పరిత్యజించి శ్రీరాముణ్ణి ఆనందవర్ధనునిగా భావించే భక్తిమార్గాన్ని ఆశ్రయించి, రామ స్మరణ మననరూపమైన జ్ఞానసమాధిలో నిలిచి, భౌతికమైన కాయాన్ని వదిలిపెడుతుంది. భౌతికమైన, శుష్కమైన శరీరానికి స్వర్గంచేరే ప్రస్థానాన్ని రాముడు కల్పించాడు. రాముడు దగ్గర వుంటే యింద్రియవ్యామోహంతో రాముణ్ణి కౌగిలించుకొంటాడు దశరథుడు. రాముడు దివ్యమంగళ విగ్రహుడై నిలిస్తే అతనిలో నున్న బాహిరమైన అందాన్నే చూస్తాడు. జడదారియై నిలిచినపుడు అతనిలో వున్న తేజస్సును చూశాడు. దూరంగా వెళ్ళిపోయినపుడు అతని రూపాన్ని, తత్త్వాన్ని స్మరించాడు. దశరథునికి ముక్తి వచ్చింది.

సర్వ భౌతిక ప్రవృత్తులు కల్గిన మానవులు భగవానుని యొక్క ఆకృతి, భగవానునియొక్క తేజస్సు, భగవానునియొక్క తత్త్వము - ఈ మూడు అంచెలతో సేవించినట్లయితే ఎంత భౌతికదృష్టి కల్గినటువంటి జీవితమైనా చివరకు ముక్తిని పొందుతుంది. అందువల్లనే స్వామి అప్పుడప్పుడు అంటూవుంటారు: 'నేను యీ దివ్యమంగళాకృతితో మీ మధ్యన తిరుగుతూవుంటే నా తత్త్వము మీకు తెలియదు. ఆకృతిని చూచి రమిస్తున్నారు మీరు' అని. శ్రీరామునివలె దివ్యమంగళ

విగ్రహాన్ని ప్రపంచిస్తున్న స్వామియొక్క రూప వ్యామోహంలో మనం మునిగిపోకూడదు రూపసౌందర్యం వెనుక వారి తేజస్సు వుంది. ఆ తేజస్సు వెనుక తత్త్వము ఉంది. రాముడు అరణ్యవాసానికి వెళ్ళుతూ తండ్రికి బోధించిన తత్త్వం యిది. తల్లి మొదటినించీ తత్త్వాన్నే అనుసరిస్తున్నది కాబట్టి భౌతికకాయాన్ని వదిలిపెట్టవలసిన అవసరం లేదు. యోగసమాధిగతమైనటువంటి విచిత్రమైన, లౌకిక నిద్రలో ఆమె మునిగిపోతోంది.

ఇలా, మనస్సులో వున్న, మనస్థానీయమైన అయోధ్యలో వున్నటువంటి దశరథుని యొక్క మృతికి ఒక విశిష్టమైన లక్షణం వుంది. పుత్రవ్యామోహం అనే యీ మహాసముద్రాన్ని మంథర అనే మంథర పర్వతముతో రాముడు అన్న దైవిక ప్రవృత్తి, కైకేయి అన్నటువంటి ఆసుర ప్రవృత్తి మథనం చేయగా అందులోంచి మొదట శోకం అన్న హాలాహలం పుట్టింది. ఈ శోకానికి బలి అయినవాడు ఎవడు? ఈ శోకరూపాన్ని వ్యక్తీకరించినవాడు ఎవడు? దశరథుడు. శ్రీరామ వియోగంచేత జీవచ్ఛవమైనది అయోధ్య, విగత జీవుడైనాడు దశరథుడు. ఇది శోకమునకు పరాకాష్ఠ. ఇది హాలాహలం. ఈ హాలాహలం పెచ్చు పెరిగినపుడు, దానిని మ్రింగి మరల మంగళాన్ని చేకూర్చ గలిగిన సమర్థుడైన శివు డెవ్వడు? భరతుడు. ఈ శోకాన్నంతా, తల్లి కల్పించిన యీ దారుణమైన అపనిందనంతా, అయోధ్య భరిస్తున్న యీ మరణవేదన నంతా తన కంఠంలో నిలిపాడు భరతుడు. ఈ హాలాహలాన్ని మ్రింగి అమృతాన్ని తీసుకురావాలి, అమృతమధనం చేయాలి అని రాముని దగ్గరకు వెళ్ళాడు. పాదుకలు తీసికొనివచ్చాడు. ఆ పాదుకల యొక్క దర్శనమే, ఆ పాదుకలయొక్క స్పర్శనమే, శ్రీరామ ప్రతీక అయిన ఆ తేజస్సే మరల అయోధ్య అన్న హృదయంలో ఉద్భవించిన అమృతం. ఆ అమృతాన్ని సేవించే దైవికమైన ప్రవృత్తి, శివంకరమైన ప్రవృత్తి, ఇంద్రియ నిగ్రహ రూపమైన ప్రవృత్తి భరతుడు, శత్రుఘ్నుడు. నిష్కామ భక్తితో శమ, దమ రూపమైన ఇంద్రియ నిగ్రహంతో ఆ భరతుడూ, ఆ శత్రుఘ్నుడూ ఆ అమృత

రూపమైన పాదుకలను సేవిస్తారు. మనఃక్షేత్రంలో కలిగిన ఇటువంటి క్షీరసాగర మధన వృత్తాంతం అయోధ్యాకాండంతా వ్యాపించి వుంది.

ఇంత చేసినటువంటి కల్పనలో వాల్మీకి రాముణ్ణి మానవునిగా చిత్రించాడు కాని, ఒకటి రెండు చోట్ల 'లౌకికమైన కారణాలను మీరు చూస్తున్నారు. దైవికమైన కారణము చూడండి -' అని అనిపిస్తాడు అంతకు తప్ప రాముడు విష్ణువు, రావణాసురుణ్ణి సంహరించటానికి అడవికి వెళ్ళుతున్నాడు అన్న స్పృహ మనకు ఎక్కడా కలిగించడు. మరి రాముని అవతారం, రావణ సంహారం కోసము కదా! అతడు రాజై అయోధ్యలో పరిపాలనం అన్న ఉచ్చులో చిక్కుకొనిపోతే దైవకార్యం ఎవరు నిర్వహిస్తారు? మానుషప్రయత్నంతో దశరథుడు, వసిష్ఠుడు మొదలైన వారందరూకూడ రాజుగా రాముణ్ణి ప్రతిష్ఠించాలని అనుకొన్నారు. రాముడు దైవంగా 'నా కార్యము వేరు ఉన్నది. ఈ పితృకార్యాన్ని నిర్వహింపదగినవాడు నా తమ్ముడు భరతుడు - రెండవ భాగము - ఉన్నాడు' అని తానే ఈ క్రియను చేశాడా? అవతార పురుషుడైన రామునికి ఆ సంగతి తెలియదా? - తెలిసినట్లుగా వర్తించడం వ్యవహారం కాదు. మానవాకృతి చెందిన దైవం ఎప్పుడూ కూడ మానవులలో కలిసి తిరుగుతున్నట్లుగా వుంటాడు. కాని, రామునిలో దివ్యాంశను, అద్భుతమూర్తిని చూడగలిగిన భక్తులు, అధ్యాత్మ రామాయణాది కర్తలందరూ రామునిలో విష్ణ్వంశను ప్రతిబింబించే కథార్థాలను కల్పన చేశారు. వాటి ప్రకారం రామునికి తాను రాక్షసులను సంహరించటానికి పుట్టినట్లుగా స్మృతి వున్నది. దేవతలందరూ రాముడు మరల రాజ్యాభిషిక్తుడై పోతాడేమో, సంసారబద్ధుడైపోతాడేమో, రావణుని సంహరించేది ఎలా? అని బ్రహ్మదేవునితో మొరపెట్టుకొంటే, ఆ బ్రహ్మదేవుడు సరస్వతిని ఆ కైక నాలుకమీద ఆవాహనం చేసి అపూర్వంగా రెండు కోరికలు కోరేటట్లు చేసినట్లుగా చిత్రించారు. కైక వరాలవెనుక దేవతల పన్నుగడ ఉన్నది, దైవకార్య నిర్వహణార్థమై దేవతలే యీ పని చేశారు అని చిత్రమైన కల్పనం చేశారు. ఆ తరువాతి రామాయణ కర్తలు చాల విపులమైన కల్పనలు చేశారు.

అత్యంత ఆధునికమైనది విశ్వనాథ సత్యనారాయణ గారి కైక పాత్ర. ఆమె రామునియందు అపారమైన వాత్సల్యం గలిగిన తల్లి. ఉపనయనం జరుగుతూంటే రామునికి అందరూ విలువైన ఆభరణాలు పెడితే ఆ తల్లి ఒక విలువైన ఖడ్గాన్ని భిక్షగా ఇస్తుంది. రామునికి మొదట్లో కోదండం నేర్పిన గురువు కైకేయట! విశ్వనాథ సత్యనారాయణగారు Light of Asia లో బుద్ధుని యొక్క చరిత్రలో నున్న ఘట్టాన్ని కొంత తీసికొని ఇందులో ప్రవేశపెట్టారు. బుద్ధుడు అంతఃపుర శయ్యాగతుడై వుంటే దేవతలందరూ వచ్చి అతని చెవులలో ఒక దివ్య నాదాన్ని చేస్తారు. 'నీవు ఎందుకు పుట్టావు? లే, ఉత్తిష్ఠ! పద, సన్యాసం తీసుకో' అన్న నాదం విని అశ్వాన్ని ఎక్కి అర్ధరాత్రిపూట వెళ్ళి పోతాడు. అలాగే తెల్లవారి పట్టాభిషేకము అంటే ఆ రాత్రి రెండవ జామునుంచి రాముని చెవులలో రింగుమని ధ్వనులు వినపడుతున్నాయి. దేవతల ఆక్రందనలు విన్పిస్తున్నాయి. 'నారాయణా! నీవు ఎందుకు పుట్టావు, నీవు ఏమి చేయబోతున్నావు? తెల్లవారితే రాజుగా సంసార బద్ధుడవు కాబోతున్నావా? ఇక మా గతి యేమిటి? నీ అవతార ప్రయోజన మేమిటి?' అన్న దేవతల ఆక్రందనలు విన్న యీ అవతార మూర్తి తనతల్లి ఎట్లాగూ తనను అడవులకు పంపలేదు కాబట్టి కైక దగ్గరకు పోయి 'తల్లీ! దేవతలు నేను రాజును కావడానికి అంగీకరించడం లేదమ్మా! ఇది బయటకు చెప్పుకోలేని నా దివ్యవేదన. నీవు ఏదైనా ఒక మార్గాన్ని నాకు చూపించాలి' అని ప్రార్థించాడు. 'ఏమి చేయమంటావయ్యా?' 'భరతునికి రాజ్యం కట్టింపచెయ్యి. నన్ను అడవులకు పంపు. ఈ కోరిక నీవు తప్ప మరొకరు కోరటానికి వీలులేదు' అప్పుడు అంటుంది కైక. 'నేను ఇంతగా నిన్ను ప్రేమించినందుకా నాకు ఇంతటి శిక్ష వేస్తున్నావు? నీవు రహస్యంగా అర్ధరాత్రిపూట వచ్చి ఈ కోరికలు కోరుమని చెప్పావు. ఈ కోరికలవల్ల నేను ఎంత అపప్రథకు గురి అవుతాను? వాటి వలన ఎన్ని విపత్తులు వస్తాయి? వాని కన్నింటికి కారణం నేను అని లోకమంతా అనుకొంటూ వుంటే నీవు నివురుకప్పిన

నిప్పులా అడవికిపోతావు కదా! ఈ దుఃఖాన్నంతా, ఈ విషాన్నంతా, ఈ హాలాహలాన్నంతా నేను భరించాలనా?'. ఆ మాట విని రాముడు చివరకు అంటాడు: 'అమ్మా! చిన్నప్పుడు నాకు కోదండం ఎందుకు నేర్పావు? నీవు నేర్పిన కోదండ పాండిత్యమంతా తుప్పుపట్టవలసినదేనా? నా కోదండం ప్రయోగిస్తే అసురల ప్రాణాలు తీరితే నా తల్లి నేర్పిన విద్య ఫలించింది అని నేను చెప్పుకోవద్దా? నీవు చూపించిన బాటే కదమ్మా! గాయిత్రిని జపించవలసిన నాకు ఖడ్గమును ఇచ్చావా? కోమలంగా బ్రతకవలసిన నాకు కోదండాన్ని యిచ్చావా? ఎందుకు ఇచ్చావమ్మా? రాక్షసులను సంహరించటానికి కాదా?' అని బ్రతిమిలాడతాడు రాముడు. 'రామా! నీకోసం ఈ విషాన్ని భరిస్తాను' అని వెర్రిగా నవ్వుతుంది ఆ తల్లి. 'ఇక్కడినుండి నేను చిత్రమైన అవతారాన్ని ధరిస్తాను; విలయతాండవం చేస్తా'నని నాటకమారంభిస్తుంది కైక. దేవతలకు ఒక మేలు చేస్తూ, లోకంలో అపకీర్తికి పాల్పడుతున్న ఆ త్యాగమూర్తి యొక్క రూపాన్ని అమృతంగా, అమోఘంగా మనం భావించవచ్చు. చివరకు భరద్వాజాశ్రమంలో, చిత్రకూటానికి వెళ్ళినపుడు వసిష్ఠ మహర్షితోసహా అందరూ ఆ కైకను నిందిస్తారు. ఆమె ఒక్కమాట అంటుంది: 'వసిష్ఠా! నీవు కూడ ఈ మాట అంటున్నావు. లోకంలో సూర్యచంద్రులదగ్గరనుంచి అందరూ నన్ను తూలనాడండి. ఆ రాముడు ఒక్కడూ నా ప్రయత్నాన్ని హర్షిస్తే చాలు. అతడే నాకు దేవుడు; నా ఆత్మ చైతన్యం' అని ఒక్క పరమాత్మకోసం బాహిరంగా తన కీర్తికాయాన్ని ఆహుతి చేసిన ఆ మాతృమూర్తి యొక్క గొప్పతనం ఎటువంటిది? విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో చిత్రించిన కైక పాత్ర ఆలోచనామృతాన్ని అందించే అపూర్వ పాత్ర. రామతత్త్వాన్ని రసలోకంలో చిత్రించే త్యాగమూర్తి.

దశరథుడు చనిపోవటానికి శ్రవణ కుమారుని తండ్రి యొక్క శాపం ఒకటి వుందని మనకు తెలుసు. దానిలోని ప్రతీకాత్మకమైన లక్షణం తెలుసుకోవాలి. శబ్దవేదిని నేర్చుకొంటున్న యువకుడైన దశ

రథుడు అర్ధరాత్రిపూట నదిలో నీళ్ళు ముంచుకొంటున్న ఋషి కుమారుని చంపుతాడు. అతడు బ్రహ్మజ్ఞాని. 'బ్రహ్మజ్ఞాని అయిన నన్ను నీవు చంపావు, నీకు పుట్టగతులు లేవు. కాని, సత్యాన్ని నీవు ఒప్పుకొని నా తల్లిదండ్రులకు చెప్పితివా, నీకు ఉపశాంతి వుంటుంది' అని అంటాడు మునిబాలుడు. చివరకు దశరథుడే ఆ బాలునికి చితి పేరుస్తాడు. ఆ చితిలో ఆ బాలుని తల్లిదండ్రులు పడిపోతారు. ఆ చితిలో మృతులై పోతారు. జ్ఞానము అన్న యజ్ఞకుండికలో బాహిరమైన దృష్టి లేకుండా అంతరమైన దృష్టితో జీవిస్తున్న యిద్దరు యోగులు ఆహుతి కావడం, జ్ఞానమునందు తమ్ముతాము సమర్పించుకోవడం అన్నది శ్రవణకుమారుని చితిలో తమంతట తాము సమర్పించు కొంటున్న ఆ వృద్ధ, అంధ మాతాపితరుల మరణ తాత్పర్యం. దశరథుడుకూడ రామ తత్త్వము అన్న అగ్నికుండంలో కామవిరహితమైన బుద్ధితో, రామస్మరణము అన్న అమృతాన్ని సేవిస్తూ, ఏకైక చిత్తంతో, రాముని భజిస్తున్న హృదయంతో తనను తాను ఆత్మార్పణం చేసికొంటాడు. ఇది భౌతికంగా కనపడుతున్న రూపం. అది ఆధ్యాత్మికముగా కనపడుతున్న తాత్పర్యం. భౌతికమైన ఈ దశరధుని మరణ వృత్తాంతాన్ని, ఆ శ్రవణకుమారుని వృత్తాంతాన్ని ఇలా అన్వయం చేసుకోవలసి వుంటుంది.

జ్ఞానదగ్ధమైన హృదయసంపుటిని రామనామస్మరణంచేత స్వర్గ ధామాన్ని అలంకరింప చేసికొనే యత్నంలో దైహికమైన ఇంద్రియాలకు అవతారపురుషుని యొక్క స్పర్శవలన ఉత్తమ తేజస్సును కల్గించుకొని, ఆ అధికారంతో కామమును త్యజించి, స్వర్గధామమును చేరుకొన్న సామాన్య జీవుని మహాప్రస్థానం అయోధ్యాకాండలో దశరధుని కన్నుమూత. ఈ కన్నుమూత భౌతికంగా ఒక శాపంగా మనకు కనపడ్డా ఆధ్యాత్మికంగా ఒక వరం. రామునికి రాక్షస సంహారావకాశం కలగటం మరో వరం. నిజానికి కైక కోరినవి వరములే. అవి ఎవరికీ శాపాలు కావు అందువల్లనే 'రెండు వరాలు' అన్న పేరు కైక కోరిన వరాలకు ప్రసిద్ధమై చిరస్థాయిగా నిలిచిపోయింది. సాయిరామ్!

# భరత భక్తి

భగవాన్ శ్రీ సత్యసాయి దివ్యచరణారవిందాలకు ప్రణామము.
సాయి కుటుంబసభ్యులకు నమస్కారము.

"యావ న్న రామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్
వైదేహీం వా మహాభాగాం న మే శాంతి ర్భవిష్యతి.
యావ న్న చంద్రసంకాశం తద్ ద్రక్ష్యామి శుభాననమ్
భ్రాతుః పద్మవిశాలాక్షం న మే శాంతి ర్భవిష్యతి.
యావ న్న చరణౌ భ్రాతుః పార్థివ వ్యంజనాన్వితౌ
శిరసా ప్రగ్రహీష్యామి న మే శాంతి ర్భవిష్యతి.
యావ న్న రాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితిః
అభిషిక్తో జలస్విన్నో న మే శాంతి ర్భవిష్యతి."

చిత్రకూటాశ్రమంలో నివసిస్తున్న శ్రీరామచంద్రుని దర్శనార్థమై ప్రపన్నుడై భక్తి ప్రస్థానాన్ని సాగిస్తున్న భరతుని హృదయంలో మ్రోగిన చతుర్విధ ముక్తితంత్రీ నినాదం యిది. 'నయనాభిరాముణ్ణి, శ్రీరాముణ్ణి, మహా బలుడైన లక్ష్మణుణ్ణి, మహాభాగ అయిన వైదేహిని నేను చూచేంతవరకు నా మనస్సు శాంతిని భజించదు. పూర్ణచంద్రుని వంటి శుభాననం కల్గిన ఆ రామచంద్రుని పద్మవిశాలాక్షుని దర్శించు నంతవరకు నా మనస్సుకు శాంతి లేదు. నా అన్న అయిన ఆ శ్రీరామ చంద్రుని చరణారవిందాలకు శిరస్సుతో నమస్కరించునంతవరకు నా మనస్సుకు శాంతిలేదు. పితృపితామహక్రమమైన అయోధ్యకు ఎవడు రాజ్యార్హుడో అట్టి శ్రీరాముణ్ణి అభిషేకజలాలతో అభిషేకించునంతవరకు నా మనస్సుకు శాంతి లేదు.' వాల్మీకి రామాయణంలో అత్యంత ప్రసిద్ధి చెందిన శ్లోకాలు ఈ నాలుగు. చతుర్విధముక్తులను పొందే ప్రపత్తుల కివి ప్రతీకలుగా చెప్పబడుతాయి. మొదటి శ్లోకం సాలోక్య ముక్తి.

భగవంతుడున్న లోకాన్ని పొందే ముక్తిని సాలోక్యముక్తి అంటారు. సామీప్యముక్తి రెండవ శ్లోకం భజిస్తుంది. భగవత్సాన్నిధ్య లాభమును నిత్యమూ అనుభవించేదానిని సామీప్యముక్తి అని అంటారు. సారూప్య ముక్తి మూడవ శ్లోకంలో మనకు ధ్వనిస్తుంది. భగవంతునితో సమాన మైన రూపత్వాన్ని పొంది, దివ్యభోగాలను అనుభవించేటటువంటిది సారూప్యముక్తి. చివరిది సాయుజ్యముక్తి. భగవంతునితో ఐక్యం పొందేది సాయుజ్యముక్తి ఈ నాలుగు విధాలైన ముక్తులను భక్తి విశేషంచేత సాధించటానికి ఉన్ముఖమైన భరతుని మానసిక ప్రవృత్తిని ఈ నాలుగు శ్లోకాలలో వాల్మీకి నిబంధించాడని పెద్దలు చెప్పుతారు.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులలో వారి వారి పేర్లు వారి వారి తత్త్వాలను వ్యక్తీకరిస్తూవుంటాయి. భరతుడు - 'భ' అంటే ఏకాక్షర నిఘంటువునుబట్టి ఈశ్వరుడు అని అర్థం. ఈశ్వరునియందు రతి కలవాడు భరతుడు. దైవ విషయకమైన రతి అంటే భక్తి. దేవుని పొందవలయునని అనవరతం మనస్సు చింతిస్తూ వున్నట్లయితే ఆ చింతనామృతభావప్రవాహరూపమైన స్థాయిభావం భక్తి అనబడుతుంది. 'రతి ర్దేవాదివిషయా' అని మధుసూదన సరస్వతి చెప్పాడు. భగ వంతుని గురించిన చింతనచేత, ఆ భగవంతుని చేరవలయునన్న ఆర్తి చేత మనస్సు ద్రుతమై, ద్రవించి, లక్కవలె కరిగిపోతున్న సంద ర్భంలో ఆ భగవంతునియొక్క ఆకృతి ఆ అర్ద్రమైన చిత్తమునందు నిలిచి ఘనీభవించినట్లయితే అది భక్తిభావమని మధుసూదన సరస్వ తులు చెబుతున్నారు. రామాయణంలో రాముణ్ణి పొందటానికి ప్రయ త్నించిన భక్తులలో ప్రధానులు రాముని తమ్ములే. లక్ష్మణుడు ఎలా రాముణ్ణి పొందటానికి ప్రయత్నం చేశాడు? ఎలా రాముణ్ణి పొందాడు? భరతుడు ఎలా పొందాడు? శత్రుఘ్నుడు ఎలా పొందాడు? ఈ ముగ్గురిలో వున్న సామ్యం ఏమిటి? భేదం ఏమిటి? - ఇదివరకే కొంత మనం పరిశీలించాము.

లక్ష్మణునిది మోహవిరహితమైన భక్తి; భరతునిది కామవిరహిత మైన భక్తి. ఈ యిరువురిలో మోహరాహిత్యం, కామ రాహిత్యం అన్నటువంటి లక్షణాలు విశేషంగా కనపడతాయి. ఆ ప్రవృత్తులను భగవంతుడు అనవరతం పరీక్షిస్తూ వుండటం, ఆ పరీక్షలు అనునటు వంటి అగ్నిలో ఆ లక్ష్మణ భక్తి చిత్తపరిపాకం, భరతుని చిత్తపరి పాకం పుటం పెట్టబడి వన్నెతేరిన బంగారంవలె ప్రస్ఫుటీకరింపబడటం మనకు రామాయణ కథలో స్పష్టంగా తెలుస్తూంది. రాముడు అరణ్యా నికి ప్రస్థానమై వెళ్ళుతూ వున్న సందర్భాన్ని మనం పరిశీలించి, ఆ తరువాత భరతుడు రాముణ్ణి తీసుకొనిరావటానికి వెళ్ళిన ప్రస్థానాన్ని కూడ పరిశీలిద్దాం.

రామునితోపాటు అరణ్యవాసానికి బయలుదేరుతున్న లక్ష్మణ స్వామిని తల్లి ఆశీర్వదించి యిలా ప్రబోధిస్తుంది:

'రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖం.'

'రాముణ్ణి దశరథునిగా భావించు. జనకాత్మజ యైన సీతను నన్నుగా తెలుసుకో. అడవిని అయోధ్యగా భావించు. సుఖంగా రాముని వెంట వెళ్ళి రా.' ఇందులో శ్లేషార్థంకూడా వుంది - దశరథ శబ్దంలో, అయోధ్యాశబ్దంలో, మా అనే శబ్దంలో. దశరథుడు అంటే విష్ణువు అని అర్థం చెప్పవచ్చును. రాముణ్ణి విష్ణువుగా భావించు. మా అంటే లక్ష్మి. సీతాదేవిని లక్ష్మిగా భావించు. అయోధ్య అంటే స్వర్గం. అడవియే స్వర్గంగా నీవు భావించు. నీవు ఆదిశేషావతారంగా జన్మించినవాడవు. నీకు నారాయణుడు ఆ రాముడు. ఆ లక్ష్మి సీత. ఆ స్వర్గము నారాయణ ధామమే, నీకు అడవి.' ఇట్టి మానసిక పరిపాకాన్ని అందిస్తున్న ఆ తల్లి సుమిత్ర కూడ మహా భక్తురాలు. కౌసల్య తన పుత్రుడు వెళ్ళుతున్నాడే అని శోకించింది. సుమిత్రకు కూడ కన్నీరు ఊటవలె కన్నులలో ఊరు తున్నా పుత్రవియోగానికి సంబంధించిన శోకాన్ని వ్యక్తీకరించలేదు. ఆ శోకబాష్పాలమధ్య ఆధ్యాత్మిక దృష్టిని ప్రసరించే ఒక దివ్య

సందేశాన్ని యిచ్చింది. లక్ష్మణుని భక్తిమార్గానికి ఒక వెలుగుబాటను ఆ తల్లి ప్రసారం చేసినది. లక్ష్మణుని మనస్సులో కూడ ఇటువంటి అభిప్రాయమే వుంటుంది.

అయోధ్యానగరిలో ప్రజలు శ్రీరాముని రథం వెంట తమసా నదీతీరం వరకు వెళ్ళుతారు. ఆ రాత్రి రాముడు ఉపవసించి అక్కడ శయనిస్తాడు. ప్రజలందరూ అక్కడ శయనించి వుంటారు. అర్ధరాత్రి కాగానే, ఆ ప్రజలందరూ నిద్రలేచేలోపలనే, 'సుమంత్రా! మన రథాన్ని ముందుకు పోనీ' అని పయనం సాగించి వెళ్ళిపోతాడు. రాముని వెంట పరుగెత్తిన పురుషులు అందరూ తిరిగి అయోధ్యకు వస్తారు విషణ్ణులై. అప్పుడు భార్యలు ఆ భర్తలను అధిక్షేపిస్తారు. 'ఇంతగా మీరు ఆ రాముని తీసుకువస్తామని అతని వెంట వెళ్ళారు కాని, ఆయనను తీసుకురాకనే తిరిగి వచ్చారు. ఇక్కడ ఏమి వుందని వచ్చారు?

"కింను తేషాం గృహైః కార్యం కిం దారైః కిం ధనేన వా
పుత్రైర్వా కిం సుఖైర్వాపి యే నపశ్యన్తి రాఘవమ్?
ఏక స్సత్పురుషో లోకే లక్ష్మణ స్సహ సీతయా
యోఽనుగచ్ఛతి కాకుత్థ్సం రామం పరిచర న్వనే."

ఈ యిళ్ళలో ఏముందని వచ్చారు? ఈ పుత్రులు, ఈ ధనం మీకు సుఖాన్నిస్తాయా? నిజానికి లోకంలో సత్పురుషుడు అంటే లక్ష్మణుడు ఒక్కడే. రాముని వెంట సీతను సేవిస్తూ అరణ్యానికి వెళ్ళాడు. మీరందరూ సత్పురుషులు కారు. రాముని వెంట నిర్మోహమైన భక్తిభావంతో వెళ్ళగలిగిన ఉత్తముడు లక్ష్మణుడు.' అయోధ్యా నగరవాసులైన స్త్రీపురుషులందరూ రామ భక్తిభావంలో పరాకాష్ఠను చెందినవానిగా లక్ష్మణుణ్ణి భావిస్తూ వున్నారు. అట్టి ఉదాత్తమైన భక్తి ప్రస్థానంతో లక్ష్మణుడు ముందుకుసాగుతాడు.

రాముడు తమసానదీ తీరంలో మొదటి రాత్రి శయనించి, అయోధ్యానగరాన్ని గురించి ఆలోచిస్తూ, భరతుని గురించి కొన్ని వాక్యాలంటాడు లక్ష్మణునితో:

"భరతః ఖలు ధర్మాత్మా పితరం మాతరం చ మే
ధర్మార్థకామసహితై ర్వాక్యై రాశ్వాసయిష్యతి
భరతస్యానృశంసత్వం విచింత్యాహం పునః పునః
నానుశోచామి పితరం మాతరం చాపి లక్ష్మణ!
త్వయా కార్యం నరవ్యాఘ్ర! మా మనువ్రజతాకృతం
అన్వేష్టవ్యా హి వైదేహ్యా రక్షణార్థే సహాయతా.'

'నేనూ, నీవూ అయోధ్యా నగరాన్ని వదలిపెట్టి వచ్చిన తరువాత మన తండ్రి, తల్లులు మనలను గురించి ఎంతగానో దుఃఖిస్తారని నా మనస్సు చింతిస్తోంది. అయినా, రేపు భరతుడు తప్పక వస్తాడు. అతడు ధర్మాత్ముడు. మన తండ్రిని, తల్లులను భక్తితో సేవిస్తాడు. అతని చిత్తవృత్తిని నేను మనస్సులో భావించినప్పటినుండి నా తండ్రిని గురించి, నా తల్లులను గురించి నేను విచారపడవలసిన అవసరం లేదనిపిస్తోంది. అతడు మనం లేని లోటును అయోధ్యలో తీరుస్తాడు. అతడు ఉత్తమ చరిత్రం కలవాడు. లక్ష్మణా! నీవు నా వెంట వచ్చి మంచి పని చేశావు. లేకపోతే, యీ సీతను రక్షించటానికి మరొకరిని నేను వెతుక్కోవలసివచ్చేది' అన్నాడు రాముడు. సీతను రక్షించటానికి లక్ష్మణుడు, తల్లులను, తండ్రిని పోషించటానికి భరతుడు మిగిలారని సంతోషిస్తాడు రాముడు. రాముని హృదయంలో లక్ష్మణునికి, భరతునికి సమానమైన స్థానం వున్నట్లుగా ఆ తమసానదీతీరంలో రాముడు పలికిన వాక్యాలవల్ల మనకు తెలుస్తున్నది.

ఇది యిలా ఉండగా, సుమంత్రునిచేత భరతునికి సందేశం పంపుతాడు రాముడు. 'నాయనా! కైకేయి నీ తల్లి, ఆమెను నీవు తప్పకుండా గౌరవిస్తావు. సుమిత్ర శత్రుఘ్నుని తల్లి. నీకు శత్రుఘ్నుడు అంటే ప్రాణం. శత్రుఘ్నుని చూచి అయినా ఆ తల్లిని గౌరవిస్తావు. కాని, అడవికి పోయిన రాముని తల్లి కౌసల్య ఉన్నది. ఆ కౌసల్యను గౌరవించడమే నీగొప్పతనం.' ఇది భరతునికి పంపిన సందేశం. భరతునియందు ఎంతో విశ్వాసం వున్నదని, అతడు అయో

ధ్యలో వుండే కౌసల్యకు ఎటువంటి లోపమూ రాదని ధైర్యాన్ని ఏకాంతంలో ప్రకటించిన రాముడు సుమంత్రుని ద్వారా భరతునికి నీ తల్లుల నందరిని సమంగా చూడు, కౌసల్యను గౌరవిస్తే ప్రతిష్ఠ వుంటుంది అని ప్రబోధరూపంగా సందేశాన్ని పంపుతాడు. అంటే అంతరంగంలో అనుమానం లేకపోయినా లోకమర్యాదను పాటించి సందేశాన్ని పంపాడన్న మాట! దూరంగా ఉన్న తన కన్నతల్లి యోగక్షేమాలను మరచి పోకుండా భరతునికి ప్రబోధించా డన్నమాట!

ఇలా సాగుతూ మరికొంత దూరం వెళ్ళిన తరువాత రాముడు లక్ష్మణుని చూచి, 'లక్ష్మణా! మనమూ యింక నడవబోయేది అరణ్యమార్గం. అది సజనమై వుండవచ్చు, విజనమై వుండవచ్చు. సజనమైనా, విజనమైనా ఈ అరణ్యమార్గాన మనం నడుస్తున్నపుడు మమ్ముల నిద్దరినీ రక్షింపవలసిన బాధ్యత నీది' అని సీతారాముల యొక్క రక్షణ బాధ్యతనంతా లక్ష్మణునియం దుంచుతాడు. అతని రక్షణలో తాము సుఖంగా ఉండగలమను ధైర్యాన్ని ప్రకటిస్తాడు. లక్ష్మణుడు అది మహాప్రసాదంగా స్వీకరిస్తాడు.

'ముందు నీవు నడు, తరువాత సీత నడుస్తుంది, మీ వెనుక నేను నడుస్తాను' అంటాడు రాముడు. రామాయణంలో ఇది ఉపాసనకు సంబంధించిన సమస్య. లక్ష్మణుడు, సీత, రాముడు ఈ క్రమములోనా మనం రామతత్త్వాన్ని ఉపాసించవలసింది? లేక రాముడు, సీత, లక్ష్మణుడు ఈ క్రమంలోనా ఉపాసించవలసింది? వాల్మీకి రామాయణంలో రెండు మార్గాలూ ఉన్నాయి. భాసుడు మొదలైన వారందరూ లక్ష్మణుడు, సీత, రాముడు అన్న క్రమాన్ని అంగీకరించకుండా రాముడు, సీత, లక్ష్మణుడు అన్న క్రమాన్ని చెప్పారు. క్రమం ఏది అయినా సీతమాత్రం మధ్య ఉంటుంది. రామలక్ష్మణులు ఆమెకు ఇరుప్రక్కలా వుంటారు. దండకారణ్యంలో ప్రవేశింపబోతున్న యీమూర్తిత్రయానికి ఎదురుపడిన ప్రతివారికి మొదట కనపడేది లక్ష్మణుడు. లక్ష్మణుడు

రక్ష. ఆ రక్ష వున్నంతవరకు ఈ సీతారాములకు ఎట్టి విప్రతిపత్తి వుండదు. లక్ష్మణుడు తొలగితే మాయ కనపడుతుంది. ఆమాయకు విచ్ఛిత్తి కల్గితే రాముడు కనపడతాడు. లక్ష్మణుడు చూసేది ఎవరిని? సీతారాములకు ఎవరైనా యిక్కట్లు కల్గిస్తారేమో అని ఎదుటివారిని చూస్తూ వుంటాడు. సీతారాములకు ఎట్టి ఆపద రాకుండా చూస్తూ వుంటాడు. ఎట్టి ఆపద రాకుండా చూచే లక్ష్మణుడు భక్తుడు, సేవా నిరతుడు. లక్ష్మణ తత్త్వాన్ని సేవాతత్త్వంతో కనుక అన్వయించు కొంటే ఈ క్రమంలో రామాయణంలో చెప్పబడినట్లుగా అర్థం చేసి కోవాలి.

ఉపాసనాక్రమం సేవాక్రమం కంటె విలక్షణంగా ఉంటుంది. రాముడు ముందు నడుస్తూ వుంటాడు. సీత రామునివెంట నడుస్తూ వుంటుంది. లక్ష్మణుడు ఆ వెనుక వుంటాడు. అధ్యాత్మరామాయణాదులలో కూడ ఇటువంటి కల్పనం కనపడుతుంది. స్వామి ఉపాసనా క్రమాన్ని భావించి యీ క్రమాన్ని మనకు ఉపదేశించారు. దీని తత్త్వం ఇది - లక్ష్మణుడు మాయాసహితుడైన పరమాత్మను చూస్తాడు. ఈతడూ ఈశ్వరభక్తుడే. అద్వైతంలో మాయారహితమైన బ్రహ్మము పరబ్రహ్మము. మాయాసహితమైన పరబ్రహ్మమును ఈశ్వరుడు అంటారు రాముడు సీతతో కూడి వున్నట్లయితే అతడు ఈశ్వరుడు. సీతా సహితుడైన రాముణ్ణి ఉపాసించే భక్తిభావం కల్గినవాడు భరతుడు; ఈశ్వరుణ్ణి రమించేటటువంటి వారు, లక్ష్మణుడు మోహవిరహితమైన బుద్ధితో రాముని సేవిస్తారు. మాయాసహితుడైన యీశ్వరునియందు సహజమైన బ్రహ్మతేజం మోహవిరహితుడైన ఉపాసకునికి ప్రత్యక్షమవుతుంది. మాయవున్నా మాయావరణాన్ని చీల్చుకొని దృష్టిని సారించి పరబ్రహ్మతత్త్వాన్ని చూడగలిగిన భక్తిభావం నిర్మోహభక్తికి ప్రతీక అయిన లక్ష్మణుడు కలిగి ఉంటాడు. దీనికి యిక్కడ కాదు తార్కాణం మనకు దండకారణ్యంలోని పంచవటిలో దొరుకుతుంది. లక్ష్మణా అని మారీచుడు కేక వేసినపుడు రామునికి ఏదో ఆపద

వచ్చిందయ్యా అని సీత అంటే, రామునికి ఏమిటి? ఆపద రావడం యేమిటి? అతడు పరమాత్ముడు అని అతని పరమాత్మ తత్త్వాన్ని గ్రహించి తెలిసికొనగలిగినవాడు లక్ష్మణుడు. సీత ఎన్ని చెప్పినా అతని మనస్సుకు మోహం ఏర్పడదు. ఇట్టి నిర్మోహవ్యాపారశీలమైన భక్తి ప్రవృత్తితో సంచరించే లక్ష్మణుడు సీతవెనుక వుండి పరమాత్మను దర్శిస్తూవుంటాడు. ఇది ఉపాసనాక్రమంతో చెప్పే పద్ధతి.

లక్ష్మణుని నిర్మోహత్వాన్ని పరీక్ష చేయడానికి శ్రీరాములవారు ఒకసారి ఒక పన్నుగడ పన్నుతాడు. గంగానది దాటిన తరువాత రాముడు లక్ష్మణునితో ఇలా అన్నాడు - 'ఇప్పుడు అయోధ్యలో కైకేయి సౌభాగ్యమదమోహితయై కౌసల్యను, సుమిత్రను ఎంతగా బాధపెడుతూ ఉంటుందో? నా కారణంగా నా తల్లికి ఎలాగూ దుఃఖం ఏర్పడింది. నిష్కారణంగా సుమిత్రాదేవికి కూడ దుఃఖం కలిగింది, లక్ష్మణా! మన తల్లులకు దురవస్థ ఏర్పడిందయ్యా! నీవు అయోధ్యకు వెళ్ళి ఆ తల్లులకు కలిగిన యీ దుఃఖాన్ని నివారించు. నేనూ సీతా ఎలాగో ఈ దండకారణ్యవాసాన్ని నిర్వహించి తిరిగి వస్తాము. రేపు తెల్లవారి నీవు బయలుదేరు, అయోధ్యకు వెళ్ళు' అని లక్ష్మణుని ఆదేశిస్తాడు. అప్పుడు లక్ష్మణునిలో మాతృవ్యామోహం ఏమైనా వుంటే, ఆ అయోధ్య మీద మమకారం ఏమైనా వుంటే, తల్లి పేరు చెప్పుకొని భార్య దగ్గర సుఖ సంతోషాలతో ఉండవచ్చునన్న కామభావనం కనుక వుంటే యిదే సందుకదా అనుకొని, రాముడు ఆజ్ఞాపించాడు కదా అని, లక్ష్మణుడు అయోధ్యకు పోవడానికి అవకాశం వుంది. ఇది చాల సున్నితంగా పెట్టిన అగ్నిపరీక్ష. లక్ష్మణుని మనస్సులో అట్టి మోహావేశాలకు ఎటువంటి అవకాశం లేదు. 'సీతనేమో వదిలిపెట్టకుండా తాను తీసుకు వెళ్ళుతాడా, నన్ను మాత్రం అయోధ్యకు పొమ్మనమంటాడా' అని లక్ష్మణుడు భావించి, సమాధానం నిపుణంగా ఇలా ఇస్తాడు.

"న చ సీతా త్వయాహీనా న చాహ మపి రాఘవ!
ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యావివోద్ధృతౌ

న హి తాతం న శత్రుఘ్నం న సుమిత్రాం పరంతప!
ద్రష్టు మిచ్ఛేయ మద్యాఽహం స్వర్గంవాఽపి త్వయా వినా"

"సీతా, నేనూ నీవు లేకపోతే ఒక్కక్షణంకూడ జీవించలేం. నీటి నుండి ఆవలకు పారవేసిన చేపల్లా మేము విగతజీవులమైపోతాము. రామా! నాకు తండ్రి లేడు, తల్లి లేదు, శత్రుఘ్నుడు లేడు, సుమిత్ర లేదు, నాకు ఎవ్వరూ లేరు. నేను ఎవరినీ చూడ నిచ్ఛగించటం లేదు. నీవు తప్ప నాకు స్వర్గం వేరే లేదు' అని నిర్మోహభక్తి ప్రపత్తులతో నీవు తప్ప నాకు అన్యథా శరణం లేదని రాముని పాదాల మీద పడతాడు లక్ష్మణుడు. ఈతని నిర్మోహభక్తిని పుటం పెట్టి పరీక్షించి తనకు అనుచరునిగా తీసికొని అరణ్యానికి బయలుదేరాడు శ్రీరాముడు. సీతా, లక్ష్మణులతో కలిసి, గంగను దాటి భరద్వాజాశ్రమానికి వెళ్ళి ఆయన ఆశీస్సులను అందుకొని 'నేను సుఖతరంగా ఎక్కడ నివసించ టానికి వీలుంటుందో చెప్పు'మని రాముడు భరద్వాజుణ్ణి కోరితే, 'నాయనా! నీవు సుఖంగా నా ఆశ్రమంలోనే వుండవచ్చు లేదా యిక్క డకు పదిక్రోసుల దూరంలో చిత్రకూటమనే పర్వతం వుంది. ఆ చిత్ర కూట పర్వతశిఖరాలను ఎవరైనా చూస్తే వారి మనస్సుల్లో పాపచింతన లుండవు. అక్కడ ఎందరో మహర్షులు వేల సంవత్సరాలకొద్దీ తపస్సు చేసి మోక్షాన్ని పొంది వున్నారు. అటువంటి పవిత్ర స్థలంలో, నీకు యజ్ఞ సంభారాదిద్రవ్యాలన్నీ దొరికే ఆ పుణ్య స్థలంలో, నీవు నివసించ వచ్చును' అని చెప్పుతాడు. రాముడు భరద్వాజాశ్రమంలో నివసించ టానికి అంగీకరించడు. 'అయోధ్యకు చాల దగ్గర అవుతుంది; నేను ఇక్కడ వున్నానని తెలిస్తే ఆ ప్రజలు రేపు ఇక్కడకే వచ్చి నివాసం ఏర్పరచుకోవచ్చు - నేను ఏకాంత స్థలాన్ని కోరుతాను' అని చెప్పి భరద్వాజాశ్రమానికి 10 క్రోసుల దూరములోనున్న చిత్రకూట పర్వతం మీదకు వెళ్ళి అక్కడ ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని సుఖంగా ఉంటాడు. ఎక్కడ పాపచింతలకు తావులేదో, ఎక్కడ మహర్షులు తపస్సుచేత మోక్షాన్ని సాధించగల సిద్ధక్షేత్రమని ప్రసిద్ధి కల్గిందో,

అట్టి చిత్రకూట పర్వతంపై తానూ, సీత, లక్ష్మణుడూ నివసిస్తూ ఉన్నారు. ఇది రాముడు చిత్రకూటం వరకు సాగించిన ప్రస్థానం.

ఇక భరతుడు రాముని దగ్గరకు ఎలా వస్తాడు? ఏ పరిస్థితులలో వస్తాడు? అతని ప్రస్థాన మేమిటి? అనే ప్రశ్నలున్నాయి.

"అనన్యా శ్చిన్తయన్తో మామ్ యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్"(9.22)

భక్తిమార్గంలో భగవద్గీత చెప్పిన ఉత్తమమైన పద్ధతి యిది. ఎవరు అనన్యచింతతో భగవంతుణ్ణి భజిస్తూ వుంటారో, వారి యోగక్షేమాలను ఆయన వహిస్తూ వుంటాడు. సీతా లక్ష్మణు లిద్దరూ అనన్యచింతతో రాముణ్ణి సేవించినవారే. వారి యోగక్షేమాలను రాముడు చూచాడు. కర్మ మార్గం నుండి భక్తి మార్గంలోకి అడుగు పెట్టడానికి భగవంతుని సాయుజ్యాన్ని పొందటానికి, ఫలాభిసంధిరహితమైన కర్మతో కూడుకొన్న భక్తిమార్గం భగవద్గీతలో చెప్పబడింది. భగవంతుణ్ణి సేవిస్తూ ఆ చర్యల వలన వచ్చే ఫలాన్ని తాను కోరకుండా భగవద్దత్తం చేసినట్లయితే, అట్టి విశిష్టమైన మార్గంలో నన్ను సేవించిన వారి యోగక్షేమాలను కూడ నేను వహిస్తాను అని భగవంతుడు చెప్పాడు. భగవదర్చనలో కామస్ఫూర్తి వుంది. కాని, ఆ కామము యొక్క ఫలాన్ని మాత్రం భక్తుడు కోరకూడదు. అది భగవద్దత్తం కావాలి. లక్ష్మణునికి కోరిక లేదు. కోరిక లేకపోవటంచేత ఫలం అవసరం లేదు. ఆ ఫలం భగవంతుని పేర యివ్వవలసిన అవసరంలేదు. మరి, భరతునికి మాత్రం ఏమైనా కోరిక వున్నదా? అతనికి కూడా కోరిక లేదు. కాని, అతని తల్లి ఒక కోరిక కోరింది. తన కుమారుడైన భరతునికి కోసలరాజ్య పట్టాభిషేకం జరగాలి అని. ఈ రాజ్యకామనం అన్నది తల్లిచేత చేయబడింది. అది కుమారునియందు ఆరోపించబడింది. భరతుడు స్వయంగా రాజ్యాన్ని కోరకపోయినప్పటికీ, భరతునియందు కైకచేత కోరబడిన కామం ఆరోపితం కావడంచేత అతనియందు నిజంగా కామం వున్నదా లేదా అని తెలిసికొనవలసిన

అగత్యం ఏర్పడింది. ఈ అయోధ్యాకాండలోనే, మనం ఇదివరలో చెప్పుకొన్నట్లు 'రేపు భరతుడు వచ్చి కైకా! నీవు కోరినట్లుగా రాజ్యాన్ని అంగీకరించినట్లయితే, అతడు నాకు తలకొరివి పెట్ట కూడదు. అతడు నాకు కర్మ చేయకూడదు. అతడు నా కొడుకు కాడు, నీవు నా భార్యవు కావు" అని దశరథుడు నిర్దేశించాడు. రేపు భరతుడు వచ్చి 'నా తల్లి కోరినట్లుగా నేను రాజ్యాన్ని స్వీకరిస్తాను' అని అంటాడా? 'నాకు రాజ్యం వద్దు' అని అంటాడా? ఇది అయోధ్యలో ఒక పెద్ద ప్రశ్న. 'నాకు రాజ్యం కావాలి' అంటే భరతునిచేత అపర క్రియలు చేయించకూడదు. 'వద్దు' అంటే భరతుడు తండ్రికి అపర క్రియలు చేయవచ్చును. ఇది వసిష్ఠులవారికే ఒక పెద్ద సమస్య అయి పోయింది. దశరథుడు చనిపోయిన తరువాత మంత్రుల నందరిని సమావేశపరచి 'ఏమి చేద్దాము? ఇప్పటి కర్తవ్యం భరతుని కొరకు కబురంపుటయే కాని, అయోధ్యలో జరిగే విషయాలు ఏమియూ అతనికి తెలియకూడదు' అని నిశ్చయిస్తాడు. అలాగే కబురంపుతారు. అతడు శీఘ్రంగా అయోధ్యకు తిరిగివస్తాడు.

భరతునికి ఎవరూ ఆహ్వానం చెప్పరు. నిశ్శబ్దమై ఉన్నది అయోధ్య. ఎవరూ పలకరించేవారు లేరు. దీనమై వున్నది. శోకావృతమై వున్నది. కళ లేని ఆ నగరాన్ని చూచి, మంగళవాద్యాలు లేని ఆ నగరాన్ని చూచి, ఎవ్వరూ తనను పలుకరించని ఆ నగరాన్ని చూచి, భరతుడు దిగ్భ్రాంతుడవుతాడు. మృత్యునిశ్శబ్దంలో నడిచి వస్తున్నాడు భరతుడు. దశరథుని కొలువుకూటంలోకి వస్తాడు. అతని నగరిలోకి వస్తాడు. దశరథుడు తనను పిలవలేదు. రాజు ఉన్న జాడయే లేదు. దీపము లేని యిల్లువలె దశరథుని మందిరం కనపడుతోంది. భయభ్రాంతుడై నాడు. తల్లి యింటికి వెళ్ళాడు. తల్లి కొడుకును ఆహ్వానించింది. తాతగారింట్లో క్షేమసమాచారములను అడిగింది. భరతుడు వెంటనే అడిగాడు - "ఏమిటి యీ నగరం యిలా వుంది? తండ్రిగారి యింటికి వెళ్ళాను. అక్కడ ఎవ్వరూ లేరు. ఇక్కడ ఏమైనా వున్నా

రేమో అని వచ్చాను. అందరూ సుఖమేనా?' తండ్రి చనిపోయిన వార్త మొదట చెబుతుంది కైక. 'తండ్రి చనిపోయినాడా?' అని అతడు వేరు తెగిన వృక్షంవలె క్రింద పడతాడు. ఆక్రోశిస్తాడు. తండ్రి తరువాత తండ్రివంటివాడు రాముడు. బహుశః నేను వస్తున్నానన్న విషయం రామునికి తెలియదేమో. నేను పోయి రాముని పాదాలమీద వాలాలి. ఆయనే నా తండ్రి తరువాత తండ్రి అంతటివాడు' అని రామునిదగ్గరకు వెళ్ళబోతాడు. రాముడు అరణ్యానికి వెళ్లాడు అని చెప్పుతుంది కైక. ఈ రెండు విషయాలు తెలిసిన భరతునికి పట్టరాని కోపం వస్తుంది. తల్లిని నిందిస్తాడు.

"రాజానం ప్రేతభావస్థం కృత్వా రామం చ తాపసమ్
త్వంతు రాజ్యఫలం భోక్తు మద్యతిష్ఠసి దుర్మతే!
రామప్రస్థాపికాయా శ్చ పతిమ్నాృశ్చతవోదరే
దశమాసా మయానీతా హా లోకే నిందితో హ్యహమ్.
కంఠేఽవసజ్య పాశం వా విషం పీత్వాథవా శఠే!
త్యజ ప్రాణాం శ్చ దుర్మేధే! జల మగ్నిం ప్రవిశ్యవా
త్వా మద్య నిహనిష్యామి నోచే ద్రామస్యదుర్యశః
రాఘవస్యానుజో భ్రాతా భరతో మాతృహా ఇతి"—

'రాజును ప్రేతగా మార్చావు, రాముణ్ణి తాపసిగా మార్చావు, నీవు రాజ్యమును భుజించాలని అనుకొంటున్నావా దుర్మతీ! రాముని వనప్రస్థానానికి పతియొక్క మృతికి నీవే కారకురాలవయ్యావు. నీ గర్భవాసాన పది మాసాలు పెరిగిన కారణం వలన ఆ నిందకు నేను భాజనుడ నయినాను. ఇంకా ఎందుకు జీవిస్తావు? ఉరిపోసుకొని చావరాదా? విషం తిని చావరాదా? అగ్నిలో దూకి చావరాదా' అని తల్లిని నానావిధాల పరుషంగా నిందిస్తాడు.

"మాతృరూపే మమామిత్రే నృశంసే రాజ్యకాముకే
న తేఽహ మభిభాష్యోఽస్మి దుర్వృత్తే! పతిఘాతిని!"
ఓ పతిఘాతినివైన తల్లీ! నీతో నేను మాట్లాడను.

"కౌసల్యా చ సుమిత్రా చ యాశ్చాన్యా మమమాతరః
దుఃఖేన మమతావిష్టా స్త్వాం ప్రాప్య కులదూషిణీమ్"

'నా తల్లులైన కౌసల్య, సుమిత్ర మొదలైనవారికి నీవలన ఎంత కష్టం వచ్చింది?' అని వారిని పలకరించటానికి వెళ్ళుతాడు. ఇలా కౌసల్యా-సుమిత్రాదులను కైకేయిని సమబుద్ధితో భావిస్తున్న భరతునికి తల్లి హృదయం నుండి జనించిన ఆ కామభావాన్ని చూసేసరికి పట్టరాని కోపం వస్తుంది.

తల్లి దగ్గర యీ మాటలు మాట్లాడుతూవుంటే భరతుడు వచ్చాడు అన్నవార్త తెలుస్తుంది. మంత్రులు వస్తారు. ఆ మంత్రుల యెదుట మొట్టమొదటిసారి భరతుడిలా ప్రకటిస్తాడు.

"రాజ్యం నకామయే జాతుం మంత్రయే నాపి మాతరమ్
అభిషేకం నజానామి యోఽభూత్ రాజ్ఞా సమీక్షితః
విప్రకృష్టే హ్యాహం దేశే శత్రుఘ్న సహితోఽవసమ్
వనవాసం న జానామి రామస్యాహం మహాత్మనః
వివాసనం వా సౌమిత్రే స్సీతాయా శ్చ యథా భవత్".

'ఈ రాజ్యం నేను కోరింది కాదు. రామునియొక్క అభిషేకం ఆగిపోయిన విషయం నాకు తెలియదు. నేను శత్రుఘ్నసహితంగా దూరంగా మా తాతగారింట్లో వున్నాను. రాముని వనవాస విషయం నాకు తెలియదు. అతనివెంట సీత, సౌమిత్రి వెళ్ళిన విషయం కూడ నాకు తెలియదు. నాకు ఈ రాజ్యం వద్దు. రాముడే రాజ్యార్హుడు' అని భరతుడు ఆక్రందిస్తూ పలికాడు. 'నాకు రాజ్యం వద్దు, రాముడే రాజ్యార్హుడు' అన్న కేక వినపడిన తరువాత వసిష్ఠుడు కదలివస్తాడు భరతునిచే పితృకర్మ చేయించవచ్చు అని. భరతుడు కైకగృహంలో అమితంగా శోకిస్తాడు. శోకించి చివరకు తల్లితో అంటాడు (కల్ప వృక్షంలో). 'తల్లీ! పుట్టినప్పటినుండి నామీద యింత మమకారాన్ని చూపిన జాడ నాకు తెలియదు. నీ కడుపులో ఇన్ని రోజులుగా దాగి వున్న మమకారాన్ని యిప్పుడు ఒక్కసారిగా నామీద పొంగించావు,

నాకు రాజ్యాన్ని కట్టబెట్టావు. నేనా యిప్పుడు విరక్తుణ్ణి. నాకీ దర ఎందుకు, నేనే రాముడనని నీవు భావించు, అతడే భరతుడని నీవు భావించు. ఆ రఘూత్తంసుడు చేయవలసిన కాననవాసాన్ని నేను చేస్తాను. అతనిని తీసికొనివచ్చి రాజ్యాభిషేకం చేస్తాను. నీ ఆలోచన ఎంత విపరీతమార్గం పట్టిందమ్మా!' అని భరతుడు వేదనపడతాడు. విశ్వనాథ సత్యనారాయణగారు కైకపాత్రను ఎలా చిత్రించారో చెప్పాను ఆ కైక అంటుంది—

"ఏమయ్యా! రాముడు అరణ్యానికి పోవడం, నీవు అరణ్యానికి పోవడం ఒకటేనా? ఆయన దానవసంహారవ్రతాన్ని పట్టిన అపర నారాయణుడు. నీవు అడవికి వెళ్ళి ఏమి చేస్తావు? 'నేను అడవికి వెళ్లుతాను' అని నీవు సంకల్పిస్తూంటే నాకు హృదయంలో భయసాగరం ఏర్పడుతోంది' అని కైకేయి గూఢంగా మాట్లాడుతుంది.

కౌసల్య దగ్గరకు వెళ్ళుతాడు భరతుడు. ఆమె భరతుని కౌగిట పొదువుకొంటుంది. పసిపిల్లవానిలా దుఃఖిస్తాడు భరతుడు. ఆమె అతనిని తొడమీద కూర్చొనపెట్టుకొంటుంది. ఇలా నెమ్మదిగా అంటుంది— "ఏమయ్యా భరతా! ఎందుకు నీవు దుఃఖిస్తావు. నీతల్లి నేర్పువలన నీకు రాజ్యం వచ్చిందికదా! ఇక రాముడా, అడవులకు పోయినాడు. అది వేరుమాట. నీకు దొరికిన యీ రాజ్యాన్ని నిక్షేపంగా ఏలుకోరాదా? ఇక ఎందుకు నీకు దుఃఖం?'. భరతుడు అయోధ్యలో అడుగుపెట్టిన దగ్గరనుండి అతని హృదయంలో 'రాజ్యకామము' అన్న బీజం ఎక్కడైనా వున్నదా అని ప్రతి జీవి పరీక్షిస్తుంది. కౌసల్య 'నీతల్లి అయాచితంగా రాజ్యాన్ని సంపాదించి పెట్టిందికదా. నీవు ఏలుకోరాదూ; ఎందుకు నీకి దుఃఖం' అని భరతుని హృదయంలో కోరిక ఉన్నదా లేదా అని పరీక్షిస్తుంది. భరతునికి కన్నుల వెంటనీరు తిరుగుతుంది. కౌసల్య తొడమీదినుండి క్రిందకు దిగుతాడు. దోయిలించి యిలా అంటాడు.' అమ్మా. నన్ను అనవలసిన మాటయా యిది? గోరంతఖేదం కొండంత అయిందా? మా అమ్మ ఒక్క కోరిక కోరిందని నన్నే

శంకిస్తున్నావా? నేనే నీ కడుపున పుట్టియున్నట్లయితే నన్నిటువంటి మాట అనేదానివేనా? ఎవరైనా నన్ను 'నీవు ఎవరి బిడ్డవయ్యా' అని అడిగితే 'నేను కౌసల్యబిడ్డను' అని చెప్పుకుంటూ ఉంటానే. ఆభావాన్ని అయినా నీవు మనస్సులో పెట్టుకోవద్దా!' అని ఆక్రందిస్తాడు దీనంగా. రామునికి, భరతునికి అభేదప్రతిపతి ఉండేది. రాముణ్ణి అడిగితే నాతల్లి కంటె నా పినతల్లి నన్ను ఎక్కువగా గౌరవిస్తుంది' అని చెప్పు కొంటాడు. భరతుని అడిగితే, 'నేను కౌసల్య కొడుకును' అని చెప్పు కొంటాడు. అద్వైతసిద్ధిని భాసింపచేయటానికి చివరకు మోక్షమును, సాయుజ్య భక్తిని సాధింపచేయడానికి ఆకృతిలో, గుణంలో, మానసిక స్థితిలో భరతునికి రామునికి ఇట్టి అభేదప్రవృత్తిని భాసింపచేస్తారు విశ్వనాథవారు. ప్రక్కనేవున్న సుమిత్రను చూచి భరతుడు 'ఏమమ్మా! దశరథుని అంతఃపురాన్నంతా రక్షింపగలుగుతున్న దానవే. నీవు నాలో ఏమి లోపం చూచి ఇన్నిమాటలు అనిపిస్తున్నావమ్మా! తల్లి అమృతాన్నే ఇస్తుంది. చేదును ఎప్పుడైనా పెడుతుందా? కౌసల్యా, నీవూ కలసి యిటువంటి చేదు మాటలు మాట్లాడడం చెల్లుతుందా! ఇది కాలప్రభావమా యేమి? నేను ఆరణ్యవాసానికి వెళ్ళే కొడుకును. రాముడు అయోధ్యలో వుండేకొడుకు, ఈ విధంగా మారుస్తాను. నాతల్లి కట్టుకొన్న ఆశాసౌధాలు కూలిపోవాలి. ఆ కూలిపోయిన యింటిలో ఆమె గుడ్లగూబవలె పరితపించాలి. లోకంలో ఎవరికైనా ఒక్కొకసారి శోకము రావచ్చు, మరొకసారి నింద రావచ్చు. ఈ రెండూ నాకు ఒకేసారి వచ్చాయి. తండ్రి పోయినాడు, అన్న అరణ్యానికి వెళ్ళాడు. ఇది శోకం. నామీద రాముని రాజ్యాన్ని అపహరిస్తున్నానేమో నన్న నింద ఏర్పడింది. ఈ రెండు దుఃఖాలను నేను ఎట్లా సహించ గలుగుతాను?" అని చెప్పి, తాను ఏవిధంగానైనా రాముణ్ణి అయోధ్యకు తీసికొనివస్తానని తల్లులయెదుట శపథం చేస్తాడు.

ఈ శపథం విన్న క్షణమే తండ్రికి అపరక్రియలు చేయుటకు భరతుడు యోగ్యుడు అని నిశ్చయించి వసిష్ఠుడు దశరథుని శవాన్ని

తైలకాండంనుండి బయటకు తీయిస్తాడు.ఆ తండ్రియొక్క శవంపైబడి భరతుడు బాలునివలె రోదిస్తాడు రామునికీ, భరతునికీ చిన్నప్పుడు జరిగిన ఒక సంభాషణాన్ని గుర్తుచేసుకొని శోకిస్తాడు. "ఒకప్పుడట రాముడు భరతా! నాకు ఈ రాజ్యంమీద యిష్టంలేదయ్యా! నీవే యీ రాజ్యాన్ని పరిపాలిస్తూ వుండు, నేను ప్రశాంతంగా వుండిపోతాను. అదీ గాక నీవు అయోధ్యలో వుండటం తక్కువ. తాతగారింట వుండటం ఎక్కువ, అయోధ్యా ప్రజలందరికి నిన్ను చూడాలని కోరిక అమితంగా ఉంటుంది. నీవు కనపడవు. నిన్ను రాజుచేసి కట్టివేస్తే తప్ప అయోధ్య లోనే వుండవు' అని నవ్వులాటకు మాఅన్న ఎప్పుడో అన్నాడు. ఆ పరమాత్ముడు నవ్వుల కన్నమాటకూడ సత్యం అవుతున్నది కాబోలు. ఈరోజు ఆ మాట సత్యం చేసి వెళ్ళాడు" అని ఆ తండ్రి శవాన్ని చూచినపుడు పూర్వస్మృతిని నెమరువేసికొంటూ భరతుడు శోకిస్తాడు. అపరక్రియలు అయిపోతాయి. 13 వ రోజున అస్థిసంచయనం చేస్తాడు. రథముమీద పురానికి తిరిగివస్తూ వుంటారు.

సూతకం అయిపోతుంది. అందరూ క్రొత్తవస్త్రాలు కట్టుకొంటు న్నారు. మంధర తెల్లనివస్త్రాలు కట్టుకొని అపూర్వమైన ఆభరణాలను పెట్టుకొని, దాదాపు ఒక వందమంది చెలికత్తెలు కలిసిరాగా, ఇక రేపు భరతుడు యౌవరాజ్య పట్టాభిషిక్తుడు అవుతాడన్న సంతోషంతో విర్ర వీగుతూ, బజారులో నడుస్తోంది. ఆ మంధరను చూచేసరికి భటులకు ఒళ్ళు మండింది. శత్రుఘ్నుడు ముందు వస్తున్నాడు. 'మీ వంశములో ఇటువంటి కలతలు రావడానికి మూలశక్తి యీమే' అని ఆ మంధరను అతనికి చూపిస్తారు. శత్రుఘ్నునికి ఒళ్ళు మండుతుంది. లక్ష్మణునికి, శత్రుఘ్నునికి సమానమైన లక్షణాలు వున్నాయి. వారికి ఆవేశం ఎక్కువ. అప్పుడప్పుడు క్రోదాన్ని ప్రకటిస్తారు. రాముని అరణ్యవాసా నికి వెళ్ళమని కైక చెప్పినదని వినినప్పుడుకూడ అడ్డమువచ్చిన తల్లిని అయినా, తండ్రిని అయినా చంపుతాను అని, అయోధ్యను అక్రమించి రామున కిస్తానని ఆగ్రహించాడు లక్ష్మణుడు. తమోగుణ ప్రధాను

రాలైన తల్లికి పుట్టిన కారణంగా అప్పుడప్పుడు ఇతనికి ఇటువంటి కోపం రాకతప్పదు. దానిని ఉపశమింప చేయడం రామునికి తప్పదు. శత్రుఘ్నునికి కూడ అన్నగారి పోలికలే వున్నాయి. అతడు మంధర మీద విరుచుకపడ్డాడు. 'పాలు త్రాగుతావా పత్తివిత్తులు తింటావా అంటే తల ఊపి ధర్మాన్ని నిర్వహించే రాముణ్ణి కాను నేను. రాముడు ఏమి చెప్పితే అది తలవంచుకొని చేసే లక్ష్మణుణ్ణి కాను నేను. నీవు ఇంతవరకు నీ పన్నాగాలతో అయోధ్యా రాజ్యాన్ని భుజించాలని ప్రయత్నం చేస్తున్నావు, నీవు తిన్నది కక్కిస్తాను' అని ఆవేశాన్ని ప్రకటిస్తాడు. భరతుడు అప్పుడు వస్తాడు. ఇలా అంటాడు. 'తమ్ముడా! దానిని చంపడం గొప్ప కాదు, ఈ దాసిని చంపితే ప్రయోజనం ఏమిటి? ఈ దాసి మాటను విన్న నా తల్లిని కూడ చంపాలి. ఈ దాసిని, యీ తల్లిని చంపటం రామునికి చేతకాక కాదు. అతడు తలచుకొంటే కొనగోటితో ఈ అయోధ్యను ధ్వంసం చేయగలడు. వీరందరిని ఉపే క్షించి ఆయన ఎందుకు వెళ్ళాడు? ఆ ధర్మమూర్తి యెదుట రేపు మనం నించున్నప్పుడు నా తల్లిని సంహరించి నేను వెళ్ళితే నా మొగం చూడడు. నీవు కోపగించి ఈ మంధరను కాని, నా తల్లిని కాని హింసిస్తే నీ మొగం కూడా చూడడు. రేపు రాముడు మనలను గౌరవించాలి. మనము నియతాత్ములమై వుండాలి. అతడు చూపించిన ధర్మమార్గాన మనం నడవాలి. అందువలన దీనిపై చెయ్యి చేసుకొనడం కాదు. మన భక్తి ప్రవృత్తితో రాముని మనదగ్గరకు తెచ్చుకోవాలి" అని లక్ష్మణు నికి రాముడు ఎలా నీతిని బోధిస్తాడో అలాగే భరతుడు శత్రుఘ్నునికి బోధిస్తాడు.

కైక రజోగుణానికి ప్రతీకగా ఇదివరకు మనం చెప్పుకొన్నాము. ఇట్టి రజోగుణప్రధానురాలైన యీ తల్లికి కుమారుడు భరతుడు. తనకు అపకీర్తి ఎక్కడ వస్తుందో, తనను రాముడు ఎక్కడ శిక్షిస్తాడో అని తాను, తనకు అపకీర్తి రాకుండవలయునన్న అహం ప్రవృత్తితో అతడు వ్యవహరిస్తాడు. తల్లిని నిందిస్తాడు. ఈ విధంగా రజోగుణ ప్రధానురాలైన తల్లికి పుట్టడంచేత భరతునియందు ఇట్టి అహంకార

భావం కొంత కనపడడానికి కారణమైనది. ఇట్టి భరతుడు క్రమంగా తన అహంకారాన్ని చంపుకొంటూ, మోహాన్ని పరిత్యజిస్తూ, తాను శ్రీరామ పదాన్ని చేరటానికి ప్రయత్నం చేస్తాడు. పితృకర్మలు పూర్తి చేసిన తరువాత 14 వ రోజు తెల్లవారుతూండగా వందిమాగధులు వచ్చి భరతునికి 'భరత మహారాజా' అని స్తోత్రాలు మొదలుపెట్టారు. మంత్రులు కొందరు వచ్చి శ్రీరామునికి సిద్ధం చేయబడిన పట్టాభిషేక సంభారాన్ని తీసికొనివచ్చి ఆయన ఎదుట పెట్టారు. 'నాయనా! పితృ కార్యాన్ని నిర్వహించావు, నీ తండ్రి యొక్క ఆనతి చొప్పున నీవు ఈ రోజు పట్టాభిషిక్తుడవు కావాలి. ఇదిగో రాజ్య సంభారాన్ని స్వీక రించు' అని ఆ పట్టాభిషేక వస్తు సముదాయాన్ని అతని యెదుట ఉంచుతారు. అప్పుడు భరతు డిలా అంటాడు: 'ఈ రాజ్యానికి జ్యేష్ఠ భ్రాతయే రాజు. నేను ఈ రాజ్యానికి తగను, నాకు ఆ కోరిక లేదు. ఇది రామునికై సిద్ధంచేసిన పట్టాభిషేక ద్రవ్యం. ఎప్పటికైనా అతనినే యీ జలాలచేత అభిషేకం చేయవలెను. నేను అభిషేకార్హుడను కాను. నన్ను రాజు అని యికనుంచి మీరు ప్రస్తుతి చేయకూడదు' అని శాసి స్తాడు. అప్పుడు మంత్రులందరూ కలిసి ఇలా అంటారు: 'భరతుడా! ప్రజాహృదయం అనే సముద్రముయొక్క లోతును తెలిసినవాడవు నీవయ్యా! అందరూ సంభారాన్ని తీసికొని వచ్చి నిన్ను రాజును చేయాలనుకొంటున్నారు. కాని, వారి అంతరాంతరములయందు ప్రభువు ఎవడు? రాముడే. రాముడే ప్రజాహృదయాన్ని శాసిస్తున్న రాజు అని తెలిసినటువంటివాడవు నీవు' అని వారందరూ ఆనందంతో అంటారట భరతుడు అంటాడు: 'మరి ఎందుకయ్యా, మనస్సులో రాముని పెట్టు కొని భరతుణ్ణి రాజు అని యింతవరకు స్తుతించారు మీరు? ఈ కోసల రాజ్యానికి, ప్రజాహృదయంలోను, భరత హృదయంలోను కూడ రాముడే రాజు' అని మంత్రులు చూపించిన ఆ అభిషేక ద్రవ్యాలను చూచికూడ అతడు కామమోహితుడు కాలేదు. నిష్కామమైన భక్తిని పచరిస్తూ దైవసమర్పితంగా భావిస్తాడు. నిండుకొలువులో కూడ అదే

మాట అంటాడు. ప్రజాప్రతినిధుల సమ్ముఖంలో కూడ 'రాముడే రాజు. నేను అయోధ్యలోని ప్రధానుల నందరిని తీసికొని వెళ్ళి రాముని ఇక్కడకు తెస్తాను. నేను ఒక్కడినే వెళ్ళితే రామునికి నమ్మకం కుదురుతుందో, కుదరదో! రాణులను తీసికొని వెళ్ళుతాను. పురోహితు లను, చతురంగబలాన్ని, ప్రజలను, మంత్రులను వెంటపెట్టుకొని వెళ్ళుతాను. ఆ కైక కడుపున పుట్టిన దోషాన నా మాట విని రాముడు అయోధ్యకు రాకపోయినా ఇంతమంది పుణ్యాత్ములున్నారు. వీరందరి కోరికయినా విని రాముడు వస్తాడేమో. ఈ అభిప్రాయానికి ప్రతీకగా నేను వస్తున్నాను' అని అయోధ్యనంతా తరలించుకొని రామునివైపు నడుస్తాడు.

గంగానదీ తీరంలో సైన్యాన్నంతా భరతుడు ఒక రాత్రి విడిది చేయిస్తాడు. గుహుడు గమనిస్తాడు. భరతుడు ఇంత సైన్యాన్ని వెంట పెట్టుకొని వెళ్ళుతున్నాడు. బహుశః రాముని జయించి, అతనికి వచ్చే రాజ్యాన్ని శాశ్వతంగా గ్రహించటానికి వెళ్ళుతున్నాడేమో'నని భ్రమి స్తాడు. భరతునికి ఎదురుపడి 'రాముని మీదకు సైన్యంతో దాడి వెడలు తున్నావా? నేను రామ భక్తుణ్ణి నేను బ్రతికియుండగా రాముని మీద ఈగ వాలనీయను. నా శవంమీదకుండా నీ సైన్యం నడవాలి. నన్ను చంపి వెళ్ళు. నీ సైన్యాన్ని ప్రాణాలతో వదిలిపెడతానని అనికోబోకు. నా శర పరాక్రమాన్నంతా చూపి నీ సైన్యానంతా మట్టుపెడతాను. రామ ద్రోహులను నేను మన్నించను' అని గుహుడు అడ్డం నించు న్నాడు. నిర్మలాత్ముడైన భరతుణ్ణి ప్రతివాడూ లోకంలో శంకిస్తు న్నాడు. ఆ గుహుని శంక బాణమువలె నాటుతుంది భరతుని హృద యంలో. నిజాభిప్రాయాన్ని వెల్లడిస్తాడు. గుహుడు తెలుసుకొంటాడు. భరతుణ్ణి ప్రశంసిస్తాడు. రామాయణంలో గొప్ప శ్లోకం-

"ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీపతే
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మిహేచ్ఛసి?"

'లోకంలో అయాచితంగా వచ్చిన రాజ్యాన్ని ఎవడూ వదులుకో లేదు. అయాచితంగా, సుఖంగా వచ్చిన, రాజ్యాన్ని వదులుకొంటున్న

కామరహితుణ్ణి నిన్నే చూస్తున్నాను.' అప్పుడు భరతుడు అంటాడు - 'రాముడు పున్నాగవృక్షమయ్యా! ఆ పున్నాగవృక్షానికి లక్ష్మణుడు, నీవు పూలవలె వెలసినారు'. రాముడూ సీతా ఒక రాత్రి గంగానదీ తీరంలో చెట్టుక్రింద దర్భశయనాల మీద పండుకొన్న ప్రదేశాన్ని గుహుడు భరతునికి చూపిస్తాడు. ఆ రాత్రంతా లక్ష్మణుడు, తానూ ముచ్చట్లు చెప్పుకొంటూ ఎలా రక్షణ చేశారో వివరించాడు. 'ఓ గుహుడా! నీవు సాక్షాత్తు లక్ష్మణునివంటివాడ' వైనావు. నీవు రెండవ లక్ష్మణుడివి. నీవు ఎంత అదృష్టవంతుడివయ్యా. కాని, సీతా రాములు దర్భశయనములమీద శయనించవలసివచ్చెనే'' యని ఆ రాత్రల్లా భరతుడు దుఃఖిస్తాడు. భరద్వాజాశ్రమానికి చేరుతాడు. భరతుడు అంత సైన్యాన్ని వెంట తెస్తున్నందుకు భరద్వాజుడు అనుమానపడతాడు. 'తాపస వేషంతో నీ అన్నా, లక్ష్మణుడూ, సీతా అరణ్యానికి వెళ్ళారు. వారిని బాధించటానికి నీవు ఎందుకు వెళ్ళుతు న్నావయ్యా. వారిని చంపకపోతే నీ రాజ్యం నిష్కంటకం కాదా? రాముడు వచ్చి నీరాజ్యాన్ని ఆక్రమిస్తాడా? అతనిని ప్రాణాలతో కూడ బ్రదుకనియ్యవా?' అని అంటాడు భరద్వాజుడంతటివాడు. ఆమాట అనేసరికి భరతుడు నిర్విణ్ణుడైపోతాడు. 'కైకేయి గర్భమునందు పుట్టి నందుకా నన్ను ఇంత పరీక్ష చేస్తున్నారు మీరందరూ. నాకు ఎట్టి కామము లేదు. నేను ఎన్నడూ రాజ్యాన్ని కోరలేదు. ఆ రాముడే నా దైవము ఓ ఋషివర్యా! నీవైనా చెప్పు. నీవైనా తెలుసుకో. నాకు ఒక మార్గం చూపించు" అని ముని పాదాలపై పడతాడు. భరద్వాజుడు 'అయితే మంచిదే నాయనా!' 'ఈ రాత్రల్లా నీ సైన్యంతో నీవు ఇక్కడే వుండాలి. నా ఆతిథ్యం స్వీకరించాలి' అని కోరాడు. తపోబలంచేత దేవతలందరిని పిలిపిస్తాడు. మహావైభవంగా దేరాలను నిర్మింపచేస్తాడు. సర్వభోగాలను కల్పిస్తాడు. సర్వద్రవ్యాలను నిర్మిస్తాడు. షడ్రసోపేత మైన భోజనాలను కల్పిస్తాడు. భరతునికి ఒక విశిష్టమైన మందిరాన్ని నిర్మిస్తాడు. ఆ మందిరంలో రత్నఖచితమైన సింహాసనాన్ని సృష్టి స్తాడు. ఆ సింహాసనం మీద కూర్చుండుమని భరతుని పంపిస్తాడు.

భరతుడు సింహాసనం మీద కూర్చుంటాడేమో, కూర్చుంటే రాజ్యకాంక్ష వున్నది - అని భావించవచ్చు ననుకొంటాడు భరద్వాజుడు. కాని, భరతుడు సింహాసనం దగ్గరకు వెళ్ళి సింహాసనానికి నమస్కరించి, పాదపీఠిదగ్గర కూర్చొని ప్రక్కనున్న చామరాన్ని తీసికొని ఆ సింహాసనానికి విసురుతూ వుంటాడు. భరద్వాజుడు భరతభక్తి కాశ్చర్య పోతాడు. కనపడకుండా యోగులు, భక్తులు భరతుడు 'నేను రాముణ్ణి తీసికొనిరావడానికి వెళ్ళుతున్నా'నని బయటకు ఎంత చెపుతున్నా అనుక్షణం అతని భక్తిశీలాన్ని పరీక్షించారు. అతని మనస్సులో ఎక్కడా కామం వున్నట్లుగా తోచలేదు.

చిత్రకూటంలో లక్ష్మణుడు, రాముడు, సీత, ఉంటున్నారు. చిత్రకూటం దగ్గరకు భరతుడు సైన్యంతో చేరాడు. దూరంగా సైన్యాన్ని నిలిపాడు. శత్రుఘ్నుని, వసిష్ఠుని వెంటగొని కాలినడకతో రాముని చిత్రకూటాశ్రమం దగ్గరకు వస్తూ వుంటాడు. సవ్వడి ఎక్కువగా వుంది. ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింపులు ఇవన్నీ వినపడుతూ వుండేసరికి ఏమిటా అని లక్ష్మణుడు ఎత్తయిన చెట్టుమీదకు ఎక్కి చూస్తాడు. భరతుని ధ్వజం కనపడుతుంది. సైన్యం కనపడుతుంది. భరతుడు రామునిమీదకు దండెత్తి వస్తున్నాడని భ్రమపడతాడు లక్ష్మణుడు. నిర్మోహమైన భక్తి కలిగినటువంటి ఇతనికి రాముని యందు మోహం లేదు. కాని రామునికి అపకారం జరుగుతుందేమో అని అనుక్షణం మోహపడే లక్షణాలు అక్కడక్కడా కనపడతాయి. ఇక్కడా కన్పడుతున్నాయి. భరతుడు రాముని సంహరించటానికి వస్తున్నాడని అనుకొంటాడు. వెంటనే అక్కడినుండి క్రిందకు దిగుతాడు. 'రామా! భరతుడు వస్తున్నాడు. నీవు సీతను తీసికొని లోపలకు వెళ్ళు, నాకు కోదండం పట్టుకొడానికి అనుజ్ఞ నివ్వు. ఇప్పుడే ఈ సైన్యాన్నంతా మట్టు పెడతాను' అని ఆవేశపడతాడు. అప్పుడు అంటాడు రాముడు: 'లక్ష్మణా! భరతుడు నీవు అనుకొంటున్నట్లుగా మాత్సర్యబుద్ధితో ఇక్కడకు రావడం లేదు. అతడు నా ప్రాణంకంటె అధికుడు.

"న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమాః"

'తమ్ములలో ఎవరూ భరతునితో తుల్యమైనవారు లేరయ్యా!'. ఈమాట వినేసరికి లక్ష్మణుడు తల వంచుకొన్నాడు. చేసిన తప్పుకు క్షమాపణ కోరుకొన్నాడు. "మన తండ్రివలె భరతుడు వస్తున్నాడు. బహుశః ఆతను తాతగారింటినుండి వచ్చి వుంటాడు. మనం వనానికి వచ్చిన సంగతి తెలిసికొనివుంటాడు. నన్ను దర్శించటానికి వస్తూ వుంటాడు. అతనిని మనం శంకించకూడదు. అతడు నిర్మలాత్ముడు" అని రాముడు భరతభక్తిని, అతని నిర్మలచిత్తవృత్తిని ప్రశంసిస్తాడు.

భరతుడు చిత్రకూటాశ్రమాన్ని సమీపిస్తున్నాడు.

"మహనీయ మణిమయ మందిరంబుల నుండు
ప్రభుఁడు నేఁ డున్నాఁడు పర్ణశాల
మెత్తని పాన్పున మే నొత్తు సుఖి నేఁడు
తనువు చేర్చినవాఁడు దర్భశయ్య
లలితమాల్యంబులు లలిఁ బూను పతి నేఁడు
వలనొప్పఁ గయికొన్నవాఁడు జడలు
మృదులాంబరంబుల మెఱయు పుణ్యుఁడు నేఁడు
వలనొప్పఁ గట్టెను వల్కలములు
కోరి రాజన్యలోకంబు గొల్చు రాజ
మౌళిమణి నేఁడు మునిసేవ మరగినాఁడు;
వలసె నా కిప్పు డీ దురవస్థ చూడ
కైక కడుపున పుట్టిన కారణమున" (భాస్కర రామాయణం)

అని వేదనపడుతూ భరతుడు రామాశ్రమానికి వస్తాడు. రామునితో సమాగమం జరుగుతుంది. రావడంతోనే "నీవు అయోధ్యకు తిరిగి రావాలి; పట్టము కట్టుకోవాలి' అని అర్థిస్తాడు రాముణ్ణి. ఆ తరువాత పితృవియోగ విషయాన్ని వెల్లడిచేస్తాడు. శ్రీరామలక్ష్మణులు తండ్రికి పిండ ప్రదానాదులు చేసిన తరువాత సభ తీర్చి కూర్చుంటారు. రాముడు అప్పుడు అంటాడు - "మన తండ్రి నాకు అడవి అనే

సామ్రాజ్యాన్నియిచ్చాడు. నీకు అయోధ్య అనే సామ్రాజ్యాన్ని యిచ్చాడు. మనమిద్దరమూ వాటిని ఏలుకొంటున్నాము" అప్పుడు భరతు డిలా అంటాడు. నిండు సభలో: "నా తల్లిని గౌరవిస్తూ నీవు అరణ్యానికి వచ్చావు. నాకా రాజ్యం వద్దు. ఆ రాజ్యాన్ని ఏలగలిగిన సమర్థుడవు నీవే. ప్రజలందరూ నిన్ను కోరుతున్నారు. నీవే వచ్చి ఆ రాజ్యాన్ని పరిపాలించు" అని శతము వేసి కూర్చుంటాడు. రాముడు- "భౌతికమైన కారణాలు చూడబోకు. దీనివెనుక దైవఘటితమైన ఒక సంఘటనం వున్నది. దశరథ మహారాజు అభీష్టాన్ని మనం నిలపాలి. ఈ దైవరహస్యాన్ని మాత్రం నీ మనస్సులో వుంచుకో. రాజ్యభార మును వహించు" అని ప్రబోధిస్తాడు. భరతుడు: "క్షత్రియ ధర్మం రాజ్యపరిపాలనం చేయడం, గార్హస్థ్య ధర్మం మనకు నిర్దేశింపబడిన ఉత్తమ ధర్మం. ఇవి రెండూ వదిలిపెట్టడానికి వీలులేదు. నేను నిన్ను శిరసా నమస్కరించి వేడుకొంటున్నాను. మహేశ్వరుడు ప్రాణకోటిని పరిపాలించేటట్లుగా నీవు అయోధ్యను పరిపాలించు. నా ప్రార్థనను నీవు కాదన్నావా నేనూ నీతోపాటు వనవాసానికి వస్తాను." అప్పుడు రాముడు: 'తండ్రి నిన్ను రాజుగా చేయుమని వరమిచ్చాడు. నా బదులు నీవు అరణ్యవాసము చేయడానికి వీలులేదు. నీ బదులు నేను రాజ్య వాసం చేయటానికి వీలులేదు. రాముడు, భరతుడు అని పేర్లతో నిర్దే శించి చెప్పడంచేత రాముడు అరణ్యమునందే వుండాలి; భరతుడు అయోధ్యలోనే వుండాలి. ఈ సత్యాన్ని మాత్రం మనం పాటించాలి' అని జాబాలి మొదలైనవారు చెప్పిన వాక్యాలను కూడ తృణీకరిస్తాడు. రాముడు ధర్మనిష్ఠాగరిష్ఠునిగా నిశ్చలంగా మాట్లాడుతాడు. ధర్మ నిర్ణయంలో మాత్రం అతనికి ఎటువంటి అర్ధ్రమైన ప్రవృత్తి లేదు.

వసిష్ఠులవారు చివరకు ఇలా అన్నారు: 'తండ్రి, తల్లి, గురువు అంటారయ్యా! తల్లిదండ్రుల తరువాత గురువు చెప్పిన మాట వినాలయ్యా. ఇంత మంది నీ తమ్ముళ్లు, గురువులు, మంత్రులు, తల్లులు, అందరూ వచ్చి నిన్ను అడుగుతున్నారు. నీవు అయోధ్యకు

రా' అని అంటే గురువుగారి మాటను ధర్మబద్ధంగా రాముడు కాదం టాడు. భరతునికి మరేమార్గాంతరం లేక ప్రాయోపదేశానికి పూను కొంటాడు. రామాశ్రమానికి ఎదురుగా దర్భశయ్య వేసికొని ప్రాణం త్యజించేంతవరకు శయనించి వుంటాను అని ప్రాయోపవేశానికి పూను కొంటాడు. అప్పుడు రాముడు 'ప్రాయోపవేశం చేయడం వలన నేను అయోధ్యకు వస్తా నని కాదు. నన్ను అనవసరంగా బాధ పెడుతున్నావు నీవు. నీవు మరొకవిధంగా ఇప్పుడు ప్రాణాన్ని వదిలి పెట్టినా నేను అయోధ్యకు వెళ్ళి రాజునయ్యే ప్రవృత్తిమాత్రం లేదు. కాని, భరతుడు నామాట వినకుండా ప్రాయోపవేశం చేశాడు అన్న బాధమాత్రం నాకు మిగులుతుంది." ఆ మాట అనేసరికి మళ్ళీ ఏమీ మాట్లాడలేక 'ఓ ప్రజలూ! రాముడు నామాట వినడం లేదు. మీరయినా కోరండి' అని ప్రజలను ప్రార్థిస్తాడు. ప్రజలు, అదంతా చూస్తూ విచారించి, 'చూస్తూంటే అన్నదమ్ముల ప్రేమ బాగా వున్నది. రాముడు మాత్రం ఏవిధంగానూ అయోధ్యకు వచ్చేటట్లు కనపడటం లేదు. రాముని వాక్యాలలో ధర్మం వున్నట్లుగా వుంది' అన్నారు. దీనితో భరతుని కేసు పోయింది. ప్రజలు రామునివైపు తిరిగారు. అప్పుడు 'నేను రామునితో అరణ్యవాసం చేస్తాను, రాజ్యం కోరింది నాతల్లి. నాకు రాజ్యం వద్దు, నేను విరక్తుడనై పోయాను. నేను రామునివెంట వెళ్ళు తాను. నాకోరికను మీరెవ్వరూ కాదనటానికి వీలులేదు' అని భరతుడు మారాం చేస్తాడు. రాము డందు కొంటాడు: 'తమ్ముడూ! ఇది వ్యక్తిగతమైన ధర్మంగా నీవు భావిస్తున్నావు. ఇది రాజ్య ధర్మం. తండ్రి సత్యవాక్య పరిపాలకుడు కావాలంటే నీవు రాజుగా వుండాలి. అయితే ఇంతగా నీవు ప్రార్థిస్తున్నావు కాబట్టి 14 ఏళ్ళు అయిన తరువాత నేను రాజ్యాన్ని స్వీకరిస్తాను" అని చివరకు రాముడు చెప్పిన తరువాత భరతుడు 'నేను నీ పదములనంటి ఆవలకు వెళ్ళటాలకుండా వున్నా' నని ప్రార్థించినపుడు వసిష్ఠులవారు "భరతుడు ఇంతగా ప్రార్థిస్తున్నాడు. నీవు ఒకసారి ఆ బంగారు పాదుకలమీద నిలువవయ్యా, నీకు ప్రాతి

నిధ్యాన్ని విహించే ఆ పాదుకలను తీసికొనివెళ్ళి అయోధ్యలో నిలిపి, నీవు రాజుగా అతడు పాలిస్తాడు. ఈ సంధిపత్రానికైనా అంగీకరించు" అని ప్రబోధిస్తాడు.

"రాముడు అంగీకరించి, పాదుకలమీద నిలబడతాడు. తన తేజస్సునంతా ఆ పాదుకలలో నిలుపుతాడు." ఇక్కడే మనం ఒక విషయం గమనించాలి. స్వామికి మంగళహారతి యిస్తున్నపుడు సగుణమైన బ్రహ్మమునందు ఆశించే తేజస్సును మంగళహారతి రూపంగా మనం భజిస్తాము. మంగళహారతి రెండురకాలు. మనం తలంట్లు పోసుకోబోయేముందు మనతల్లి మనకు మంగళహారతి యిస్తుంది· ఆ మంగళహారతి మన కళ్ళకు అద్దుతుంది తల్లి భగవంతునికి ఇచ్చిన మంగళహారతి భగవంతుని కళ్ళకు అద్దకూడదు. అది భగవంతుని యొక్క తేజస్సుగానే మనం భావించాలి. దాన్ని మనం కళ్ళకు అద్దుకోవాలి. అందువల్లనే భగవంతునిలోని తేజస్సును మంగళహారతి రూపంగా భావిస్తాము. సగుణమైన ఆకృతిలో నున్న నిర్గుణమైన లక్షణాన్ని మనం అందులో ఆరాధిస్తాము. అలాగే రాముని విగ్రహ రూపమునుండి అతని రూపము నిలిచిన సగుణమునుండి నిర్గుణమైన రూపాన్ని పాదుకలు గ్రహిస్తున్నవి. అలాగే శివలింగాకృతి భగవంతుడికి ప్రతీక. సగుణమైన బ్రహ్మనికి ప్రతీకాత్మకమైన ప్రతినిధిగా శివలింగాన్ని పూజించడంలో ఎంత ఆరాధనాతత్త్వం వున్నదో పాదుకార్చనలో కూడ అంతే ఉంది. లింగము అంటే సంజ్ఞ, గుర్తు, సింబల్. అలాగే దైవాన్ని భజించేటప్పుడు ఇట్టి ప్రతీకాత్మకమైన ప్రవృత్తితో భగవద్రూప సంజ్ఞను తేజస్సుగా స్వీకరించాలి. రామపాదుకలు శ్రీరామతత్త్వానికి ప్రతీకలు. ఆ ప్రతీకను ఆరాధించి భరతుడు 'అహం బ్రహ్మాస్మి' అన్న అద్వైతసిద్ధిని పొందుతాడు. 'అహం రామోఽస్మి' అన్న ఆరాధనాతత్త్వమే భరతభక్తి తాత్పర్యం. ఈ తాత్పర్యాన్ని స్వామి యిలా ఒక సన్నివేశంలో ప్రబోధించారు.

'రాముడు తిరిగి వచ్చినతరువాత రథములో కూర్చొని అయోధ్యా నగరంలోకి రాముణ్ణి తీసుకువస్తున్న భరతుని వర్ణిస్తూ

ప్రజలు రామ, భరతులు ఇరువురూ తాపసవేషాలలో వుండటముచేత, భరతుడు అయోధ్యలో లేకపోవడముచేత, 14 సంవత్సరాలనుంచి రాముడు అయోధ్యలో లేకపోవటం చేత, ఎవడు రాముడు, ఎవడు భరతుడు అని తెలుసుకోలేక రామునికి వేయవలసిన దండలు కొన్ని భరతునిమెడలో వేస్తున్నారట! ... ఆ భరతుడేమో నేను కాదయ్యా రాముడు ఆయన అని చూపిస్తున్నాడట! రామభరతుల వేషాలలోని, ఆకృతులలోని సామ్యంవలన అలా జరిగిందనుకొన్నా, దానివెనుక ఒక తత్త్వం వ్యక్తమౌతుంది 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి,' అన్నట్లు బ్రహ్మమును ఉపాసిస్తున్న భక్తుడు చివరకు తానే బ్రహ్మపదార్థంగా మారిపోవునటువంటి అద్వైతభక్తి, మోక్షసిద్ధి, కలుగుతుంది. అటువంటి భక్తికి భరత భక్తి ప్రతీక అని స్వామి ఒక దివ్యోపన్యాసంలో చెప్పారు మొన్న శ్రీరామ నవమినాడు స్వామి యిచ్చిన దివ్యోపన్యాస భాగం ఈ నెల సనాతన సారథిలో ప్రచురితమైంది, 'నలుగురు కొడుకులు' అన్న శీర్షికతో. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులయందున్న అమలమైన ప్రేమభావాన్ని చిత్రిస్తూ ఒక చక్కని గొప్ప దివ్యోపన్యాసాన్ని భగవాన్ యిచ్చారు.

"యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా
భరతోనామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః"

రాముడు సత్యపరాక్రముడు. రాముడు ఎంత సత్యపరాక్రముడో భరతుడు అంత సత్యపరాక్రముడు అని రామాయణ కథార్థములయందు వాల్మీకి మనకు విన్పింపచేశాడు నిష్కామమైన భక్తితో భగవంతుణ్ణి అర్చించిన భక్తునికి అద్వైతసిద్ధి లభిస్తుంది అన్నది భరతభక్తి తాత్పర్యం. నిర్మోహమైన భక్తితో భజించిన భక్తునికి అద్వైతసిద్ధి లభిస్తుందని లక్ష్మణభక్తి తాత్పర్యం. రామాయణంలో వారిరువురి భక్తితత్త్వ వైవిధ్యాన్ని ప్రపంచిస్తూ వాల్మీకి ఆ యిరువురి తమ్ముల యొక్క చరిత్ర చిత్రణాన్ని చేశాడు. భరతభక్తి అద్వైతసిద్ధికి అమృత మార్గం. ఇదే సాయి చెప్పిన భక్తి తత్త్వం. సాయిరామ్.

# పంచవటి

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము,
సాయికుటుంబ సభ్యులకు నమస్కారము.

## పాట

పల్లవి : పంచవటీపతి కోదండరామా
పరమానందా హే సాయిరామా!

1. రాముడ వగు నీ రమణీయాకృతి
రాక్షసహృదికే రక్తి గూర్చెనా
మోక్షము నీ పదపంకజములలో
మోసు లెత్తినది కారడవులలో ॥పంచవటీపతి॥

2. యోగులు, భక్తులు, రక్తులు, ముక్తులు
ఓంకారాకృతి దర్శించిరిగా
శిష్టరక్షణము దుష్ట శిక్షణము
చిగురించినవా సీతాలతపై ॥పంచవటీపతి॥

3. దండకవనిలో దావాగ్నివి వై
దానవకోటిని దమియించితివా
సత్యపరాక్రమ సాధనసారము
సకల జనులకొక ఇహపర యోగము ॥పంచవటీపతి॥

అరణ్యకాండలో శ్రీరాములవారు పంచవట్యాశ్రమంలో నివసించే ఘట్టం భక్తులకు యోగులకు, ముముక్షువులకు ఉపాస్యమైన ఒక మహత్తర సన్నివేశం. పంచవటి అనే పేరు దానికి పరమసార్థకమైనది. ఐదు వట వృక్షాలు కలిగినది కాబట్టి పంచవటి. ఐదింటిచేత చుట్టబడింది కాబట్టి పంచవటి వటవృక్షాలు అక్కడ ప్రసిద్ధములైనవి. జటాయువు మొదలైన వారు వటవృక్షాల మీదనే దర్శనమిస్తారు. 'వటతి మూర్తైః

స్వస్థానం వేష్టయతి వటః - వట వేష్టనే' అని గురుబాల ప్రబోధిక. ఊడలచేత స్వస్థానమును చుట్టుకొని వుండునది అని వటవృక్ష శబ్దము నకు వ్యుత్పత్తి. ఊడలచేత తనదైన స్థానమును తానే చుట్టుకొని వుండు స్వభావం కలిగిన వటవృక్షాలు ఏ క్షేత్రంలో ఉంటే దానిని పంచవటి అని చెప్పడానికి వీలున్నది. రామాయణంలో అయిదు వట వృక్షాలు కనపడవు; కాని, సజీవ వటవృక్షాలు మాత్రం అయిదు కనపడతాయి. మర్రిచెట్టు తాను వేళ్ళతో మొదట మొలుస్తుంది. శాఖ లను విస్తృతం చేస్తుంది. కొమ్మల బరువు వేళ్ళు మోయలేని పరిస్థితు లలో ఆ కొమ్మలను మరల కొనసాగించుకోడానికి మరియొక వేరుగా మరియొక పాదంగా ఒక ఊడను దింపుకొంటుంది. ఆ ఊడను ఆధా రంగా చేసికొని ఆ శాఖను ముందుకు సాగిస్తుంది. తాను తన విస్తృ తిని సాధించుకోడానికి ప్రధానమైన మూలమే కాకుండా ఊడలు అనే పాదాలను ఆధారంగా చేసికొని వ్యాప్తి చెందే లక్షణం వటవృక్షానికి వున్నది. ఈ పంచవటిలో మనకు ప్రధాన వటవృక్షం రాముడు. రామునికి సత్యము మూలము. సత్యపరాక్రమంతో పంచవటిలో ప్రవే శించి దానవ సంహార వ్రత నిర్వాహణాన్ని సాధించటానికి ప్రయత్నం చేస్తున్నది రామవటం. ఏ ప్రయత్నంకోసం మరియొక పాదాన్ని వేస్తున్నది? లంకాగమనం. లంకకు వెళ్ళాలి అనే ప్రయోజనంతో మరి యొక పాదాన్ని, మరియొక ఊడను దింపుకొంటున్నది. సీత మరి యొక వటవృక్షం. ఈమెకు శీలం మూలం. అశోకవన ప్రస్థానం అనే ప్రయోజనంతో మరియొక ఊడను దింపుకొని తన అయనాన్ని సాధించుకొంటోంది. లక్ష్మణుడు మరియొక వటం. ఆయనకు సేవయే మూలం. నిష్కామభక్తి సాధనం పెంపొందింప చేసుకొనడానికి ఈ పంచవటి క్షేత్రంలో ఆయన ప్రయత్నం చేస్తాడు. శూర్పణఖ మరియొక వటవృక్షం. ఈమెకు కామం మూలం. సీతాపహరణానికి కావలసిన ప్రేరణాన్ని సంసిద్ధం చేసే కార్యాన్ని కొనసాగించుకోడానికి తనదైన ఒక ఊడను దింపుకొంటుంది. రావణుడు మరియొక మర్రి

చెట్టు. ఆ మర్రిచెట్టుకు అహంకారం ప్రధానమైన మూలం. సీతాపహరణ మనే కారణాన్ని ఊడగా దింపుకొని తన వ్యాపారాన్ని ముందుకు సాగిస్తాడు రావణుడు. ఈ అయిదు వటవృక్షాలు తమ తమ కార్యక్షేత్రాలు ఇదివరకే వుండగా, కొత్తవైన కార్యక్షేత్రాలను సాధించుకోడానికి తమవైన, కొత్తవైన ఊడలను దింపుకొంటూ వ్యాప్తిని సాధించే ప్రవృత్తి ఈ పంచవటి క్షేత్రంలో కనపడుతుంది కాబట్టి ఈ పంచవటి సార్థకనామధేయ.

ఈ పంచవటి దండకారణ్యగర్భంలో వుంది. దండకారణ్యమంటే ఏమిటి? దండకలోని 'దండః' అన్న ప్రకృతిని ముందు చూద్దాము. 'దమ్యతే అనే నేఽతి దండః - దము ఉపశమే (గురుబాల ప్రబోధిక) "దీనిచేత శిక్షింపబడును కావున దండము. శిక్షింపబడుట అనే అర్థం కలిగి శబ్దం 'దండః', 'క' ప్రత్యయం అల్పార్థంలో వాడబడుతుంది. అంటే - శ్రేష్టమైన శిక్ష కాదు. అల్పమైన శిక్ష - ఈ దండకారణ్యంలో ఏదో జరుగబోతోందన్నమాట. 'సామదానే భేద దండా విత్యుపాయాః చతుష్టయం' సామదానభేదదండా లని ఉపాయాలు నాలుగువిధాలు. అందులో దండోపాయం మరలా మూడు విధాలు. చంపుట, ధనమును అపహరించుట, బాధపెట్టుట అను మూడు మార్గాలలో దండోపాయం సాగుతుంది. ఈ దండకారణ్యంలో జరుగబోయే రామాయణకథార్థాలను మనం సమీక్షిస్తే దండోపాయంలో వున్న మొదటిది - చంపుట లేక వధ - ఖరదూషణాదులను పంపే కార్యమునందు ప్రపంచితమవుతోంది. పరిక్లేశము లేక బాధపెట్టుట - శూర్పణఖ ముక్కు, చెవులను కోయటంలో వ్యక్తమవుతోంది. అర్థహరణం రావణుడు రాముని భార్యను దొంగిలించటంలో విదితమవుతోంది. ఈ విధంగా దండోపాయానికి అనుగుణంగా మూడు విధాలైన ప్రక్రియలు ఇందులో నిర్వహింపబడుతున్నాయి.

దండకము అను పేరు కలిగిన అరణ్యం అది. 'ఇయర్తి మృగాది రత్ర అరణ్యం' - ఋ గతౌ', మృగాదులు దీనియందు సంచ

రిస్తూవుంటవి కాబట్టి అరణ్యము అని పేరు దీనికి వచ్చింది. మృగ ప్రసక్తి యీ దండకారణ్యంలో వుంది. దండకారణ్యం మృగాలకు ప్రసిద్ధి. మాయామృగం వలన రామకథ ముందుకు సాగబోతున్నది. రావణవధకు అంకురారోపణ జరుగబోతున్నది. తద్వారా మృగప్రసక్తి ఏ అరణ్యమునందు వస్తుందో, రావణునకు వేయవలసిన దండములో ఖరదూషణాధివధ అనే అల్పదండనం ఎక్కడైతే వేయబడుతుందో అట్టి అరణ్యానికి దండకారణ్యము అని పేరుపెట్టి పిలువడానికి వీలున్నది. ఆ విధంగా దండకారణ్య గర్భంలోని పంచవటి క్షేత్రంలో పంచవటాల వంటి అయిదు పాత్రలయొక్క చరిత్రములను సమీక్షించటానికి అనువుగా వున్న కథార్థం అరణ్యకాండలోని పంచవటీక్షేత్ర వృత్తాంతం.

కడిచిన ఉపన్యాసంలో శ్రీరాముడు చిత్రకూటాశ్రమంలో భరతునకు పాదుకల నిచ్చి పంపించిన ఘట్టాన్ని సమీక్షించాం. చిత్రకూటాశ్రమం నుండి కథ పంచవటికి వచ్చేలోపల ఒక విషయాన్ని గమనించాలి. మనస్థానీయమైన అయోధ్యతో సంబంధం చిత్రకూటంతో ముగుస్తుంది. మరి చిత్రకూటం దేనితో సంబంధం కలుపుతుంది? మనం ఇదివరకు చెప్పుకొన్నట్లుగా మూడు నగరాల చరిత్ర రామాయణం. అయితే మిథిల, అయోధ్య ప్రసక్తులు అయిపోయినవి. ఇక మిగిలిన నగరం లంక. చిత్రకూటం దగ్గర మొట్టమొదటిసారి లంకా నగరము యొక్క ప్రతిధ్వని వినపడుతుంది. రాముడు చిత్రకూటంలో నివసిస్తున్నపుడు ఋషులందరూ భయపడుతూ వుంటారు. రామునితో మాట్లాడడానికి జంకుతూ వుంటారు. భయం భయంగా రామునివైపు చూస్తూ వుంటారు. భయానికి కారణమేమిటని రాముడు వారిని అడుగుతాడు. కులపతి అయిన ఋషి - 'రామా! ఇంతవరకు చిత్రకూట పర్వతం నిర్భయంగా ఉండేది. కాని, యీ మధ్యనే రావణుని తమ్ముడైన ఖరుడు రాముడు చిత్రకూటాశ్రమంలో నివసిస్తున్నాడన్న సంగతి తెలిసికొని తన భటులను కొంతమందిని ఈ చిత్రకూటాశ్రమం వైపుకు

పంపిస్తున్నాడు. వారు ఋషులను బాధపెడుతున్నారు మరికొద్దికాలం నీవు ఇక్కడే వుండేటట్లయితే ఖరుడు తన సైన్యంతో దాడిచేస్తాడు. మమ్ములనందరిని బాధిస్తాడు. మేము క్షేమమైన మరొక ప్రాంతానికి వెళ్ళాలని అనుకొంటున్నాము. ఇది నీతో చెప్పడానికి మేము చింతిస్తున్నాము. నీవు భార్యతో, తమ్మునితో వున్నవాడవు. మీరు ఇక్కడ వుండడం క్షేమం కాదు. మాతో పాటు ఒక సురక్షితమైన ప్రాంతానికి వస్తే బాగుంటుంది' అని రామునితో విన్నవించుకొంటాడు. 'మీరు రాక్షసులవలన ఎట్టి భయమూ పొందవలసిన అవసరం లేదు. నేను నాకోదండంతో ఆ రాక్షసులనందరిని సంహరిస్తాను. మీరు నిర్భయంగా ఇక్కడే వుండండి' అని రాముడు అభయప్రదానం చేసి ఎంత ధైర్యం చేప్పినప్పటికీ ఋషులు అక్కడ వుండకుండా చిత్రకూటాన్ని వదిలి పెట్టి వెళ్ళిపోయారు ఋషులు చెప్పిన కథనాన్నిబట్టి చూస్తే ఆ రాక్షసులు వచ్చి ఆశ్రమాలలో అపరిశుద్ధ పదార్థాలు, అమంగళ పదార్థాలు పడవేస్తారట. ఆశ్రమాలలో దాక్కొని తాపసులను చంపుతూ వుంటారట. అగ్నిహోత్రాలను ఆర్పివేసి కర్మహాని, ధర్మహాని చేస్తూ వుంటారట. ఋషులను చంపి, వారి మాంసాన్ని భక్షణం చేస్తూ వుంటారట. ఆ విధంగా యజ్ఞనాశనం, మాననాశనం, ప్రాణనాశనం కలిగించే రాక్షస బాధలకు భయపడి ఋషివర్గమంతా చిత్రకూటాన్ని వదిలిపెట్టి వెళ్ళింది. రాముడు అభయమిచ్చినా ఋషులు ఆగలేదు. చిత్రకూటంలో నివసిస్తున్న ఋషులు రాముడు అవతారమూర్తి అన్న అంశాన్ని గ్రహించిన జ్ఞానులు కారు. శుద్ధకర్మఠులు. అందువల్ల రామావతార తత్త్వాన్ని గ్రహించలేక రాముని వదిలి వారు వెళ్ళిపోయారు.

రాముడు కొంతకాలం అక్కడే ఉన్నాడు. భరతుడు వచ్చి పాదుకలు తీసికొని వెళ్ళినప్పుడు, తమ బంధువర్గమంతా కలిసినటువంటి సన్నివేశం చిత్రకూట ఆశ్రమంలో జరగడంచేత ఆ బంధు వ్యామోహానికి సంబంధించిన కొన్ని భావనలు మనస్సులో రావడం

మొదడుపెట్టాయి. అందువలన రాముడు చిత్రకూటాశ్రమం వుండ తగింది కాదని నిశ్చయించి, అక్కడినుంచి దండకారణ్యానికి బయలు దేరాడు; మార్గమధ్యంలో అత్రిమహర్షి యొక్క ఆశ్రమాన్ని దర్శిం చాడు. అత్రి, అనసూయ ప్రసిద్ధులైన ఋషిదంపతులు. త్రిగుణాతీతుడు త్రిగుణరహితుడు అనే వ్యుత్పత్త్యర్థం కలిగిన నామం తనకు ఉంచు కొని త్రిగుణాతీతమైన జ్ఞానసిద్ధిని వడసిన మహర్షి ఆ అత్రి. అసూయ లేని నిర్మలమైన ప్రేమభావాన్ని పెంచుకొన్న ఋషిపత్ని అనసూయ. ఆ అనసూయ ఒక పది సంవత్సరాలు అక్కడ వానలు లేకపోతే, కాటకము ప్రబలితే, తినడానికి తిండి, త్రాగడానికి నీరు లేకపోతే, తన తపోమహిమవలన ఋషిమండలి కందరికి కావలసిన వస్తుసంభారా లను కల్పించి యిచ్చిన మహాతపస్విని. పాతివ్రత్యధర్మానికి, పాతి వ్రత్య వ్రతదీక్ష ఎంత మహిమను ప్రకటించటానికి వీలున్నదో అంత ఉత్తమమైన మహిమ ప్రకటించగలిగిన ఆదర్శ ఋషిపత్ని అనసూయ. అత్రిమహర్షి సీతాదేవిని అనసూయను సేవించుమని నిర్దేశిస్తాడు. రాముని అనుమతితో అనసూయను సీత సేవిస్తుంది. సీత తన కథనంతా ఆమెకు చెబుతుంది. పతివ్రతా ధర్మాన్ని అనుసరిస్తూ పతివెంట వస్తున్న సీత యొక్క చరిత్రను విని అనసూయ ముగ్ధురాలవుతుంది. తన తపో మహిమవలన ఒక దివ్య పుష్పమాలిక, ఒక చీర, ఒక ఆభరణం, అంగరాగం (శరీరానికి పూసుకొనే మై పూత) సృష్టించి సీతకు సమర్పి స్తుంది. ఆ దివ్యపుష్పమాలిక ధరిస్తే ఆమెకు ఎటువంటి భయమూ వుండదు. ఆ చీర సౌమంగళ్యానికి రక్ష. ఆ ఆభరణం భర్త యొక్క క్షేమానికి ప్రతీక. అంగరాగం శ్రీరామునికి సీతయందు ఎల్లప్పుడూ అధికమైన అనురాగభావాన్ని ప్రవృద్ధి చేయ కలిగిన శరీర కాంతిని సమర్పించే దివ్యప్రసాదం. ఆ నాలుగింటిని తన తపోమహిమవలన సృష్టించి అనసూయ సీతాదేవికి ఇస్తుంది. ఆ నాలుగింటిని ధరించిన సీతను చూసి రాముడే మోహితుడవుతాడు. దివ్యమంగళ విగ్రహుడైన శ్రీరాముడు, పురుషులను కూడ ఆకర్షించగలిగిన సౌందర్యాతిశయం

కలిగిన మహితాత్ముడు, సీతా సౌందర్య విశేషాన్ని చూచి ఆశ్చర్య పోతాడు. అనసూయ ప్రసాదంగా యిచ్చిన ఆ నాలుగు ఆభరణాలను ధరించటంచేత సాక్షాత్తు లక్ష్మి యొక్క అంశ ఆమెయందు దేదీప్యమానమయిందని వాల్మీకి ప్రశంసిస్తాడు. ఇలా సీత, అనసూయ వరప్రసాద లబ్ధమైన దివ్యాభరణాదులను ధరించి రామునివెంట నడుస్తూ వున్నది.

దండకవనంలో రాములవారు ప్రవేశించారు. ఇది ఒక క్రొత్త లోకం. అప్పటి దండకవనాన్ని మనం భావిస్తే తిలతండులన్యాయంగా వుంటుంది. నువ్వులు, బియ్యం కలిపి ఆరబోస్తే ఎలా వుంటుందో అలావుండటం తిలతండులన్యాయం. తిలలు నల్లగా వుంటాయి. తండులాలు తెల్లగా వుండాయి. తెల్లగావున్న తండులాలేమో దైవ ప్రవృత్తికి చిహ్నాలు. నల్లగావున్న ఆ నువ్వులేమో అసుర ప్రవృత్తికి చిహ్నాలు. దండకారణ్యం ఫలపుష్పశోభితమై పరమ రమణీయంగా వుంది. సరోవరాలతో చెట్లతో లతలతో అపూర్వమైన శోభతో నిండివుంటుంది. అందులో జ్ఞానులైన మహర్షులు వేలకొలది సంఖ్యలో నివసిస్తున్నారు. దానవులు కూడ వేలకొలది నివసిస్తున్నారు. దాదాపు 14 వేల మూల బలాన్ని చేతిలో పెట్టుకొన్న ఖరుడు ఆ అరణ్యంలోనే నివసిస్తున్నాడు. శ్రీరాముడు ప్రతియింట ఒక రోజు వుంటూవుంటే 10 సంవత్సరాల పాటు అతిథ్యాన్ని స్వీకరించటానికి సరిపడ్డ ఆశ్రమపదాలు ఆ దండకారణ్యంలో వున్నాయి.

ఇటు మహర్షులు, అటు దానవులు. భగవద్గీతలో చెప్పబడిన దైవాసుర సంపద్విభాగ యోగమంతా ఈ దండకారణ్యంలో భౌతికంగా పరచబడినదా అన్నట్లు వుంటుంది. దైవికప్రవృత్తులు, అసుర ప్రవృత్తులు. ఆశ్రమ మండలంలో నివసిస్తున్న ఋషులు, శరభంగ మహర్షి, వైఖానసకోటి, సుతీక్ష్ణ మహర్షి, అగస్త్యుడు, జటాయువు, శబరి వీరందరూ పుణ్యాత్ములు; దైవప్రవృత్తి కలిగినవారు. శూర్పణఖ, ఖరుడు, దూషణుడు, మారీచుడు, అయోముఖి, కబంధుడు వీరందరూ ఆ దండకారణ్యంలోనే అసురప్రవృత్తికి ప్రతినిధులుగా కనపడుతున్నారు. వీరితోపాటు శాపగ్రస్తులుకూడ కొందరున్నారు.

విరాధుడు, కబంధుడు మొదలైనవారు ఆ కోవకు చెందుతారు. ఈ విధంగా దైవాసుర సంపద్విభాగయోగానికి భౌతికమైన ఆకృతిని సంతరించుకొన్నదిగా తిలతండులన్యాయాన్ని భజిస్తూ తెలుపు, నలుపుల పటముగా ఆ దండకారణ్యం మనకు కనపడుతుంది.

ఇందులో రాముడు సత్యపరాక్రముడై నడుస్తున్నాడు. సత్యపరాక్రమ శబ్దానికి రెండర్థాలున్నాయి సత్యముచేత మోక్షముయొక్క క్రమమును సాధించుట సత్యపరాక్రమము మోక్షక్రమాన్ని, మోక్ష మార్గాన్ని సాదించు విధానాన్ని సత్యపరాక్రమ మని చెప్పవచ్చును. సత్యంచేత పరులయొక్క అక్రమాన్ని తొలగించే పద్ధతికూడ సత్య పర అక్రమము. రాముడు ఈ రెండు అర్థాలను అన్వర్థంగా సాధించాడు. మునులకు సత్యపరాక్రమమును చూపించాడు. దానవులకు సత్య పర అక్రమమును చూపించాడు. సత్యముకంటె వారు ఎంత అక్రమంగా వ్యవహరిస్తున్నారో చూపించి వారిపట్ల తానుకూడ విపరీత క్రమంగా వ్యవహరించాడు. ఈ విధంగా సత్యపరాక్రమవ్రతాన్ని దండకారణ్యంలో ప్రదర్శించటం మనకు కనపడుతుంది.

మరొకటి. మహర్షుల దగ్గరకు వెళ్ళినపుడు వారు అందరూ శ్రీరాముని కొరకు వేచివున్నట్లుగా కనపడతారు. 'రామా! నీవు ఇక్కడకు వస్తావని మాకు తెలుసు నీకొరకే వేచివున్నాము. మాతపః ఫలములచేత మోక్షసిద్ధిని సాధించాము. కాని, మా సర్వసిద్ధులు నీకు సమర్పించటానికే ఇక్కడ వున్నాము' అని ఫలాభిసంధిరహితమైన భక్తిప్రవృత్తులతో ఆ జ్ఞానులు నిలిచారు. తనను విష్ణువుగా, యజ్ఞ రూపునిగా, మోక్షప్రదాతగా భావిస్తున్న ఆ జ్ఞానులలోని దార్శనిక శక్తిని రాముడు గ్రహిస్తాడు. నేను విష్ణువునని మాత్రం రాముడనడు. 'మీరు సాధించిన ఫలాలను మీరే అట్టిపెట్టుకోండి. నా ఫలాన్ని నేను సాధించుకొంటాను. మీ ఫలములకు తగినటువంటి లోకాలను మీరు

పొందండి' అని ఆ మునుల కందరికి జ్ఞానభిక్ష పెట్టడం, మోక్షాన్ని ప్రసాదించడం అనే దివ్యవిభూతులను రాముడు ప్రకటిస్తాడు. మాట్లాడే రాముడు మానవుడు; మహిమ చూపించే రాముడు పరంధాముడు. దండకారణ్యం ఆ సత్యపరాక్రమునిలోని ఈ అవతార తత్త్వాన్ని ఆవిష్కరిస్తుంది.

మరొకటి. దండకారణ్య ప్రవేశం చేయగానే ఎన్నో ఆశ్రమ పదాలు, మండలాలు రామునకు కనపడ్డాయి. రాముడు ఆ దండకారణ్యంలోకి ప్రవేశించాడో లేదో దుష్టమృగాలు, సాత్త్వికమృగాలు, పక్షులు, సర్వజీవకోటి రాముణ్ణి ఏదో వింతగా చూడడం మొదలు పెట్టాయి. అపూర్వమైన రామ రూపవైభవాన్ని చూస్తూ కనురెప్పలార్పకుండా తన్మయత్వాన్ని భజిస్తూ వున్నవి. సర్వజీవకోటిలోని జీవాత్మలు సగుణమైన ఆ పరమాత్మ యొక్క ఆకృతిని, తేజోవైభవాన్ని చూసి తమలోనున్న దివ్యత్వం తమకే తెలియకుండా మేల్కొంటూ వుండగా ఆ పరమాత్మను చూచి ఆధ్యాత్మికమైన అనుభవ తాదాత్మ్యాన్ని భజిస్తూవున్నారు. ఒక అవతారమూర్తిని చూచినపుడు మనకు కలిగే అనుభవం ఎటువంటిదో దండకలోని ఆ దృశ్యం మనకు వ్యాఖ్యానించి చెపుతుంది. స్వామిని మనం దర్శిస్తున్నపుడు, ఆ దివ్య మంగళ విగ్రహాన్ని చూస్తూంటే మన హృదయాల్లో, సుప్త చైతన్యంలో నిద్రపోతూ వున్న దివ్యత్వం మేల్కొని మనకు తెలియకుండానే ఆ మూర్తిలోని దివ్యత్వాన్ని రమిస్తూ వుంటే, మనం నిమిత్తమాత్రంగా, ఘటప్రాయులుగా కూర్చొన్నటువంటి వైఖరిని ఎలా పొందుతామో, మన కన్నులు మనకు తెలియకుండానే నీరుకారుస్తూ వుంటే, ఎక్కడిది యీ కన్నీరు అని ఆశ్చర్యపోతూ మనం కూర్చుంటామో, అటువంటి విచిత్రమైన దివ్యానుభూతిని పొందుతూ వున్నాయి సర్వజీవకోటులు అక్కడ. అవతారమూర్తి దర్శనం ఒక ఆధ్యాత్మికానుభూతి నందించే అమృత సేచనం.

"రమంతే యోగినోఽనంతే నిత్యానందే చిదాత్మని
ఇతి రామపదేవాసౌ పరబ్రహ్మాభిధీయతే"

'యోగులు ఏ చిన్మయ, అనంత నిత్యానందమయ పరతత్త్వంలో రమిస్తూ ఆనందిస్తూ వుంటారో ఆ తత్త్వమే రాముడు అని పిలువబడు తోంది!' అనే యీ శ్లోక తాత్పర్యాన్ని మనం గ్రహించినట్లయితే యోగులే కాదు, ప్రాకృతజీవులుకూడ ఆ దైవత్వాన్ని చూచి రమిస్తూ వుండటం మనకు కనపడుతుంది. ఋషిమండలులందరూ రాముని చూచి దిగ్భ్రాంతులై, ఆయన దేవుడా, మానవుడా అనే విచికిత్స లేకుండా హృదయాలన్నీ ఆకర్షింపబడుతూ వుంటే అవ్యక్తానందావేశంతో ఆతనికి ఆతిథ్య మిచ్చి తమ్ము రక్షించటానికి వచ్చిన ఒక దివ్యతేజస్సమన్వితు డైన మహారాజులా భావిస్తూ శ్రీరాముని సంభావించారు.

"ధర్మపాలో జనస్యాస్య శరణ్య స్త్వం మహాయశాః
పూజనీయ శ్చ మాన్య శ్చ రాజా దండధరో గురుః"

నీవు కోసలరాజ్యాన్ని పరిపాలిస్తున్న ప్రభువు వయినప్పటికీ, ఈ దండక అంతా నీ రాజ్యం, మేమంతా నిన్ను ఆశ్రయించుకొని వున్నాం. నిన్ను శరణువేడుతున్నాము. నీవు ధర్మపాలుడవు. మమ్ములను రక్షించు. దండకారణ్యంలోని మొదటి పదంలో వున్న ఋషులు విష్ణువుగా స్తుతిం పక పోయినా రాముని విష్ణ్వంశ కలిగిన రాజుగా భావించి మునులను రక్షింప వలసిన బాధ్యత ఆతనియం దున్నదని చెప్పి రాముని శరణు వేడారు. ఈ శరణువేడిన ఋషులను రాముడు దయార్ద్రహృదయంతో సమీక్షించి మిమ్ములను రక్షిస్తాను అని శపథం చేశాడు.

ఋష్యాశ్రమాలను దాటి లోనికి వెళ్ళితే విరాధుడు అనే ఒక మహా రాక్షసుడు ఎదురౌతాడు పెద్ద నోరు, గుంటకళ్ళు, మిట్టపల్లాలైన పెద్ద పొట్ట, విశాలవక్షం, సమపరిమాణం లేని అవయవాలు, శరీర మంతా రక్తంతో బీభత్సంగా ఉంటాడు. ఆతడేమో పెద్దగా అరుస్తు న్నాడు, కేకలు వేస్తున్నాడు. దండక అంతా మారుమ్రోగేటట్లు

అరుస్తున్నాడు. అతనివృత్తి ఋషులను చంపి, తిని జీవించడం. ఇటు వంటి విరాధుడు ఆ దండకారణ్యంలో నివసిస్తున్న ప్రాంతానికి రాముడు వెళ్ళుతూ వుండే ప్రకృతి అంతా స్తంభించి వుంది. ఏ జంతువూ కదలడంలేదు. ఆ విరాధునియొక్క నాదం ఒక్కటే ఆ దండకారణ్యమంతా మారుమ్రోగుతోంది. అతడు చూచాడు. అపూర్వ సౌందర్యవతి అయిన సీత కంటికి కనపడింది. కామమోహితుడైన అసురునకు మాయయైన సీతమీద మరులు కలిగాయి. ఆ సీతను బుజము మీదకు ఎక్కించుకొన్నాడు. 'నేను సీతను వివాహం చేసికొంటాను, మిమ్మల నిద్దరిని చంపుతాను' అని రామలక్ష్మణుల మీదకు ఉరికాడు. రాముడు పరాక్రమవంతుడు. సీతను ఎప్పుడైతే విరాధుడు తన బుజం మీద కూర్చోపెట్టుకొన్నాడో అప్పుడు రాముడు లక్ష్మణునితో అంటాడు -

"పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతర మస్తి మే
పితుర్వియోగాత్ సౌమిత్రే స్వరాజ్యహరణాత్ తథా."

'నాకు తండ్రి చనిపోయినపుడు కలిగిన దుఃఖంకంటె, రాజ్యం పోయినప్పుడు కలిగిన దుఃఖంకంటె నాసీతను పరుడు స్పర్శించడంచేత కలిగిన యీ దుఃఖం అతీతంగా వుంది' అని రాముడు వేదనపడతాడు. లక్ష్మణుడు తాను ఆ విరాధుని సంహరించటానికి అనుజ్ఞ నివ్వవలసిన దని రాముని కోరుతాడు. భార్యను అపహరిస్తున్నా డన్న కోపం చేత రాముడు ఏడుబాణాలు ఆ విరాధుని శరీరంమీద వేస్తాడు. అతడు ఆ బాధకు తట్టుకొనలేక సీతను క్రిందకు దింపి రామలక్ష్మణులమీద విజృంభిస్తాడు. వారిద్దరిని భుజాల మీద ఎక్కించుకొంటాడు. పరుగెత్తుతూ వుంటాడు పెద్దగా అరుస్తూ. రాముడు సంతోషిస్తాడు, నడిచి పోకుండా ఆ విరాధుని శరీరంమీద మరికొంత దూరం పోవడానికి వీలయిందని. కాని, రాముడు సంతోషిస్తూ వున్న తరుణంలో సీత క్రిందనుంచి దుఃఖిస్తుంది. 'నేను ఇక్కడ మిగిలిపోయినాను. మీరిద్దరూ వాటిబుజాలమీద ఎక్కి వెళ్ళుతున్నారు, నాగతి ఏమిటి' అని. సీతా

దుఃఖం వినపడగానే రాముడు విరాధుని కుడిబుజాన్ని నరుకుతాడు. లక్ష్మణుడు ఎడమబుజాన్ని నరుకుతాడు విరాధుడు శాపగ్రస్తుడైన ఒక గంధర్వుడు. అతనికి శాపవిమోచనం కలుగుతుంది. తుంబురుడు అనే గంధర్వునికి కుబేరుని శాపంవలన ఇటువంటి వికృతమైన రూపం కలిగింది. అతనిని పూడిస్తే ఆ ఆకృతి పోయి నిజాకృతి వస్తుంది. ఆ భీకరమైన ఆకారాన్ని, లక్ష్మణుడు పెద్ద ఏనుగు పట్టేటంతటి గుంట తీయగా, అందులోకి దొర్లిస్తారు మీద పెద్ద పెద్ద రాళ్ళువేసి పూడ్చేస్తారు. ఆ పూడుస్తున్నపుడు అతడు ఘోరమైన నాదం చేస్తాడు. పూడ్చేసిన తరువాత ఆతనిలోనుంచి దివ్యగంధర్వ రూపం వెలువడుతుంది రామాదులకు నమస్కరించి ఆ గంధర్వుడు 'శరభంగాశ్రమానికి వెళ్ళి అతనిని ఆశ్రయించండి, మీకు భావిమార్గాన్ని ఉపదేశిస్తాడు' అని రామునికి ఉపదేశించి నిజలోకానికి వెళ్ళుతాడు.

శంభంగాశ్రమాన్ని సమీపిస్తున్నప్పుడు ఇంద్రుడు శరభంగ మహర్షి వసించే ఆశ్రమంలోకి రథం దిగి వెళ్ళుతూ వుండటం రామునికి కనపడుతుంది. ఇంద్రుడు శరభంగమహర్షి వద్దకు వచ్చి "ఏమయ్యా! నీ తపఃఫలం వలన నీకు మోక్షం సిద్ధిస్తోంది, నిన్ను స్వయంగా తీసికొని వెళ్ళడానికి నేను వచ్చాను. కాని, రాముడు వస్తున్నాడు. రాముడు వచ్చేంతవరకు నీవు ఇక్కడ వుండకూడదు. నీవు త్వరగా రావా'లని అడుగుతాడు. 'నేను మోక్షమును సాధించిన సంగతి నాకు తెలుసు. నీవు దానిని గుర్తించావు. సంతోషం. కాని, దివ్యమంగళవిగ్రహుడైన ఆ శ్రీరాముని రాకకోసమే నేను వేచియున్నాను. శ్రీరాముని సేవ చేసికొనిగాని నేను రాజాలను' అని ఇంద్రుని తిరిగి పంపుతాడు శరభంగమహర్షి ఇది లౌకికంగా ఇంద్రుడు వచ్చి శరభంగమహర్షిని ఆహ్వానించిన ఘట్టంగా మనకు కనపడవచ్చు. రసపరంగా మనం అన్వయించుకుంటే ఇంద్రుడు ధర్మానికి, వీరమునకు ప్రతినిధి అయిన దేవత. ఇంద్రుని దర్శనం దొరికిన వీరునికి వీరరససిద్ధి కలుగుతుంది

రాముడు రాక్షస సంహారోన్ముఖుడై దండకారణ్యంలో ప్రస్థానాన్ని సాగిస్తున్న ఆ తరుణంలో శరభంగాశ్రమంలో ఇంద్రుని దర్శనం కావడంచేత రామునియొక్క సత్యపరాక్రమం సఫలం కాబోతున్నది. శుభశకునం అయినది అని మనం గ్రహింపవచ్చును

రాముడు శరభంగాశ్రమం చేరి అతని ఆతిథ్యాన్ని పొందుతాడు. రాముని సేవించిన తరువాత ఆ మహర్షి 'ఇంద్రుడు వచ్చి నాకు చెప్పాడు నాకు మోక్షసిద్ధి కలిగించే తపఃఫలం చేకూరిందని. ఆ తపః ఫలాన్ని అంతా రామా! నేను నీకు అంకితం చేస్తున్నాను, తీసుకో,' అంటాడు. రాముడు దానిని గ్రహించడు. 'నీ తపఃఫలానికి ఫలం నీవే అనుభవించాలి. నేను నా కృషిచేత నా జీవితంలో నేను సాధించు కొంటాను, నా కర్మఫలాన్ని నేను పొందుతాను' అని చెప్పి శరభంగ మహర్షిని పరమాదరంతో గౌరవిస్తాడు. రాముని పాదాలమీద శరభంగ మహర్షి పడి యోగాగ్నిలో తన శరీరాన్ని దగ్ధం చేసికొంటాడు. దివ్యాకృతితో అతడు మోక్షమార్గాన వెళ్ళుతాడు. శరభంగ మహర్షి శ్రీరామ పాదాలను అంటి వాటినే మోక్షపదానికి ద్వారాలుగా భావించి, భజించి తన భౌతికమైన కాయాన్ని అగ్నిలో త్యజించి, జ్ఞానమార్గంలో అతడు మోక్షాన్ని అందుకొంటాడు. ఇట్టి మోక్షమార్గ ప్రస్థానాన్ని చూపించిన పరమపదము శ్రీరామపదము.

ఎప్పుడైతే విరాధుణ్ణి చంపి శరభంగమహర్షికి మోక్షప్రదానం చేశాడో అప్పుడే శ్రీరామునితత్త్వం అక్కడున్న మహర్షి మండలికి అర్థమైపోయింది. ఇతడు దుష్టశిక్షణం, శిష్టరక్షణం చేయగలిగిన నారాయణమూర్తి, అవతారమూర్తి అని తెలిసికొని మహర్షి మండలి అంతా రాక్షసులవలన తమకు కలుగుతున్న ఘోరావమానాల నన్నీ రామునితో నివేదించుకొని, అతని పాదాలపైబడి శరణువేడుతారు. ఆ ఋషుల శరణు విని రాముడు 'రాక్షసులనందరిని సంహరిస్తాను, ఋషు లను రక్షిస్తాను' అని అభయమిచ్చి ఆ వైఖానసులను తన వెంటపెట్టు

కొని సుతీక్ష్ణుని ఆశ్రమానికి బయల్దేరుతాడు. సుతీక్ష్ణుడు బహుకాలం తపస్సు చేసినవాడు. అతని శరీరంపై పుట్టలు మొలిచి వున్నాయి. ధూళిధూసరితమై వుంది అతని శరీరం. రాముడు అక్కడకు వెళ్ళి అతని పాదములమీద వ్రాలుతాడు. ఆయన కన్నులు తెరచి 'రామా! నేను నీకోసమే ఎదురుచూస్తున్నానయ్యా! దైవకార్యాన్ని నిర్వహించ టానికి నీవు ఎప్పుడు దండకలో అడుగుపెడతావా అని వేచియున్నాను, నాతపఃఫలాన్నంతా నీకు సమర్పిస్తాను' అని ఆయన అంటాడు. రాముడు హర్షించి ఇలా అంటాడు - ఎవరితపఃఫలం వారే అనుభ వించాలి, నే కోరేదల్లా ఏమంటే నాకు ఉచితమైన నివాసస్థలం ఏదైనా చూపించు.' 'నా ఆశ్రమంలోనే వుండిపొ'మ్మంటూ సుతీక్ష్ణుడు 'ఈ ప్రాంతంలో మృగాల బాధ అధికంగా వుంటుంది. ఇక్కడ తపస్సు చేసుకొంటున్న వారందరిని మృగాలు వ్యామోహపెడుతూవుంటాయి. ఆ ఒక్క అవలక్షణం తప్ప అన్నీ ఇక్కడ బాగున్నవయ్యా! మృగాలపట్ల జాగరూకుడవై ఉంటే నీవు ఇక్కడే వుండిపోవచ్చు'అని హితవు చెప్పు తాడు. ఆ ఋషికులమంతా సుతీక్ష్ణుని ఆశ్రమానికి వచ్చిన శ్రీరాముని తమ తమ ఆశ్రమపదాలకు భక్తితో ఆహ్వానిస్తారు. ఆ ఆశ్రమపదాలలో రాముడు ఒక్కొక్క తపస్వియింట 1, 2 రోజులు నివసిస్తూ పది సంవత్సరాల కాలం ఆ ప్రాంతంలో గడుపుతాడు. అరణ్యవాసంలో పది సంవత్సరాలకాలం ఋషులయొక్క సాహచర్యంలో రాముడు ఉన్నాడు.

సీత ఈ ఆశ్రమపదాలకు వెళ్ళుతున్నపుడు రాముణ్ణి ఒక విచిత్ర మైన ప్రశ్న వేసింది. 'నేనేమో స్త్రీని, మీరు పురుషులు, నేను ఏదో మీకు చెప్పుతున్నా ననుకోవద్దు. నా మనస్సులో వున్నమాట చెప్పు తున్నాను. మీరా ఆ ఋషులయెదుట రాక్షసులనందరిని సంహరిస్తాను అని ప్రతిజ్ఞ చేశారు ఆ ప్రతిజ్ఞ చేసినప్పటినుంచి నాకు చాల భయంగా వుంది మీరు అన్నమాట నిలబెట్టుకొంటారు, సత్యపరాక్రములు మీరు

నిజానికి అగ్నులు ఆయుధాలు ఎవరివద్ద వుంటవో అవి వారినే తమ వశం చేసుకొంటాయి ఇలాగే పూర్వం ఒక మహర్షి ఎవరో యిచ్చిన ఆయుధాన్ని సంరక్షిస్తూ చివరకు తన తపస్సునే మానుకొని ఆ ఆయుధాన్ని రక్షించడంలోనే మునిగిపోయాడట. మనం ఈ తపస్వుల మధ్య తిరుగుతున్నపుడు ఈ క్రోధాన్నీ, పరాక్రమాన్నీ వదిలిపెట్టి జ్ఞానసమన్వితమైన ఋషిమార్గంలో నివసించడం న్యాయం. మీరు కోదండాన్ని పట్టుకొని రాక్షసులను సంహరిస్తాను అని ప్రతిజ్ఞ చేశారు, మీయందు క్రోధం అధికమవుతుంది. రాక్షసులు మీమీద పగపడతారు. మీమీద అనవసరంగా చేయి చేసికొంటారు. వారిని సంహరించవలసిన అవసరం వస్తుంది. మనకు ఎందుకు వచ్చిన జంజాట మిది? మీరు మునిలాగా వర్తిస్తూ అరణ్యవాసం పూర్తిచేయండి, చాలు. ఈ ప్రతిజ్ఞలు చేయడం నాకు ఇష్టంలేదు. కావలసివస్తే మీ శస్త్రాస్త్ర పరాక్రమమంతా అయోధ్యకు పోయిన తరువాత చూపిద్దురుగాని' అని రామునికి ప్రబోధం చేస్తుంది. అప్పుడు రాముడు అంటాడు: 'సీతా! నీవు స్త్రీ ప్రవృత్తికి తగినట్లుగా నాకు ప్రబోధం చేశావు, మీనాన్నగారు మహా జ్ఞాని- నాన్నగారి కూతురు వనిపించుకొన్నావు. నన్ను కూడ ఒక జడ దారిగా తయారు చేద్దామనుకొంటున్నావు. కాని, నేను జ్ఞానోపాసనం చేసి మోక్షాన్ని సాధించటానికి, యోగిగా జీవించటానికి ఇక్కడకు రాలేదు. ఏ మహాయోగులకు నేను నమస్కరించి నాకు జ్ఞానభిక్ష పెట్టండని అర్థింపవలసివున్నదో ఆ జ్ఞానులే నా పాదములమీద పడి శరణువేడి మమ్ములను రక్షింపుమని అడుగుతున్నారు. జ్ఞానానికి ఈ లోకంలో రక్షలేదు. యజ్ఞానికి ఈ లోకంలో రక్షలేదు. ఋషుల జీవితాలకు భద్రతలేదు. ఇట్టి అరాచకమైన దండకలో, యిట్టి అరాచకాన్ని సృష్టిస్తున్న అసుర ప్రవృత్తులను సంహరించవలసిన బాధ్యత నాయందు వున్నది. ఎవరిని నేను కోరవలయునో వారే నన్ను కోరినారు. అందులో బ్రహ్మణ్యులు, బ్రహ్మ జ్ఞానము కలిగినవారు కోరే కోరిక

లను తీర్చకపోతే మహాపాతకం. ఇది నా స్వీయమైన సంకల్పం కాదు. ఋషులయందు నేను పచరించవలసిన ధర్మం. నీవు నా భార్యవు, సహధర్మచారిణివి. నీవు నేను ఏ మార్గాన నడిస్తే ఆ మార్గాన నడు. ఇకముందు ఇటువంటి ప్రస్తావనను తీసుకొనివస్తే నీకూ, నాకూ మర్యాదగా వుండదు' అని చెప్పి సీతను అదుపులో పెట్టుకొని వెంట తీసుకొనివెళ్లాడు

దండకారణ్యంలో ఋష్యాశ్రమాల వెంట రాముడు ముందు, తరువాత సీత, ఆ వెనుక లక్ష్మణుడు నడుస్తారు. లక్ష్మణుడు, సీత, రాముడు ఈ క్రమం సేవాధర్మ సూచిక. కాని, ఇది ఉపాసనాధర్మ సూచిక. ఋషులకు ఉపాసనామార్గాన్ని ప్రసన్నం చేస్తున్న పరమాత్మ తాను ముందుగా నిలుస్తున్నాడు. 'రాముడు, సీత, లక్ష్మణుడు' అనే ప్రస్థానంతో ఋష్యాశ్రమాల్లో రాముడు సంచరిస్తాడు. 10 సంవత్స రాలు అయిపోయిన తరువాత సుతీక్ష్ణాశ్రమానికి వస్తాడు. అక్కడి నుండి అగస్త్యాశ్రమానికి పయనిస్తాడు.

ఆ అగస్త్యమహర్షి శ్రీరామునికోసమే వేచివున్నాడు. శ్రీరాముడు రాక్షసులను సంహరించటానికై బ్రహ్మచేత తనకు ఈయబడిన విష్ణు చాపాన్ని, అక్షయ తూణీరాలను పూజయందు వుంచి తన తపఃఫలాన్ని అంతా, దైవీసంపదనంతా దానియందు పొదిగి, దానిని పరిపూర్ణం చేసి పెట్టాడు. రాముడు రాగానే అతనికి ఆ వైష్ణవీ ధనువును, అక్షయ తూణీరముల జంటను ఇచ్చి, 'నాయనా! రామభద్రా! నీవు ముందు నిర్వహింపబోతున్న కోదండరామ వ్రతాన్ని ఈ వైష్ణవ ధనువుతో నిర్వహించు, అసురులను సంహరించు' అని దీవిస్తాడు. అగస్త్యుడు రామునికి వీడ్కోలు చెప్పుతాడు. రాముణ్ణి పంచవటీ క్షేత్రంలో నివ సించ వలసినదని ప్రబోధం చేసి పంపుతాడు.

పంచవటికి వెళ్ళుతూవుంటే జటాయువు సందర్శనం జరుగు తుంది. అతడు తన పూర్వ వృత్తాంతమంతా రామునికి నివేదిస్తాడు. జటాయువు దశరథుని మిత్రుడు. రామదర్శనార్థమై అక్కడ వేచి

వున్నాడు 1000 సంవత్సరాల వృద్ధు. పక్షీంద్రుడు. అతడు రామునికి అభివాదనం చేసి యిలా అంటాడు: "రామా! నీవు సీత, లక్ష్మణుడు పంచవటిలో వుంటే ఎవరైనా రాక్షసులు వస్తారేమో, నేను పైన కాపు వేసుకొని వుంటాను. నాకు ఆ సేవాభాగ్యం ప్రసాదించు." జటాయువుకు ఆ సేవాభాగ్యం కల్పిస్తాడు రాముడు. పంచవటి పరిసరాలను, ఎత్తయిన చెట్టుమీద కూర్చొని చూచి, ఏ ఆపద రాకుండా శ్రీరాముని సేవ చేయడం జటాయువు యొక్క ధర్మం. రాముడు పంచవటిలో ప్రవేశిస్తాడు. లక్ష్మణుని పిలిచి 'తమ్ముడూ, ఏదైనా ఒక మంచి ప్రదేశాన్ని, నీకు ఇష్టమైన ప్రదేశాన్ని చూసి ఒక ఆశ్రమాన్ని నిర్మించవయ్యా అని కోరుతాడు లక్ష్మణుడు వెంటనే కంటతడి పెట్టుకొని 'రామా!' నీకు ఏది ఇష్టమో చెబితే దానిని ఆచరించటం తప్ప నా కంటూ వేరే ఇష్టానిష్టాలు లేవు. నాకు విశేషం, సంకల్పం అనేవి లేవు. నీవు రా, నీ యిష్టం వచ్చిన చోటు చూపించు, నేను నీవు కట్టమన్నట్లుగా ఆశ్రమాన్ని నిర్మిస్తాను" అంటాడు. రాముడు, సీత లక్ష్మణుని భక్తికి మెచ్చుకొని ఒక ప్రదేశాన్ని ఎన్నిక చేస్తారు. గోదావరి తీరం, తెలుగు దేశం, తెలుగు వాతావరణం, తెలుగు గాలి వీస్తోంది. గోదావరితల్లి శీతలమైన తరంగాలమీద నుంచి వచ్చే చల్లని గాలి శ్రీరాముడు సేవిస్తున్నాడు. ఆ పంచవటి క్షేత్రంలో లక్ష్మణుడు సాయంకాలానికల్లా చిత్రమైన ఆశ్రమాన్ని నిర్మించాడు. ఆ ఆశ్రమ సౌందర్యాన్ని చూచి మురిసిపోయి లక్ష్మణుని ఆప్యాయంగా కౌగిలించుకొంటాడు. శ్రీరాముని కౌగిలింత పొందడమంటే జీవాత్మ, పరమాత్మ యొక్క పరమ దయను పొందటమన్నమాట! అదే దివ్య సాయుజ్యం. ఆ లక్ష్మణస్వామి శ్రీరామ పరిష్వంగ సౌఖ్యాన్ని పారవశ్యంతో స్వీకరిస్తాడు. ఆ వేయితలల ఆదిశేషువు పారవశ్యంతో తల ఊపుతున్న వైఖరిని సీతామ్మవారు చూచి ఎంతో ముగ్ధురాలవుతుంచి తాను నిత్యం ఏ పరమాత్మ పరిష్వంగం వలన ఏ అమృతానందానుభూతిని

పొందుతున్నదో, అట్టి పరిష్వంగ సౌఖ్యం ఆ తల్లి తన మరది కన్ను లలో లీలామాత్రంగా భాసించినపుడు 'ఆత్మవత్ సర్వభూతాని' అన్నట్లు తాను ఎట్టి దైవానుభూతిని పొందినదో, అట్టి దైవానుభూతిని లక్ష్మణునియందు చూసి ఆమె పారవశ్యాన్ని భజిస్తుంది

అంతలో శరదృతువు వస్తుంది ప్రకృతి నిర్మలంగా వుంది. లేతమంచు కురుస్తూన్న ఒక సుప్రభాత సమయంలో శ్రీరాముడు ఆశ్రమంలో సీతను ప్రక్కన కూర్చొపెట్టుకొని ముచ్చట్లు చెబుతు న్నాడు. లక్ష్మణస్వామి కొంత దూరంగా ఏదో సేవలో నిమగ్నుడై వున్నాడు. ఆ సందర్భంలో రావణుని చెల్లెలు శూర్పణఖ ఆశ్రమంలోకి ప్రవేశిస్తుంది. కొందరి లెక్క ప్రకారం ఆమె రావణాసురుని కంటె పెద్దది. ఏమైనా ఆమె వృద్ధురాలు. అతి భయంకరముగా వుంటుంది ఆమె ఆకృతి. ఏనుగులను అప్పడాలవలె తింటుంది. ఇక ఆమె సౌకుమార్యం, పరాక్రమం సంగతి వేరే చెప్పవలసిన పనిలేదు. ఇట్టి ఆసురీ ప్రవృత్తి కలిగిన ఆ శూర్పణఖ రాముణ్ణి చూస్తుంది.

"సాతు శూర్పణఖా నామ దశగ్రీవస్య రక్షసః
భగినీ రామ మాసాద్య దదర్శ త్రిదశోపమమ్.
సింహోరస్కం మహాబాహుం పద్మపత్రనిభేక్షణం
అజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శినం
గజవిక్రాంతగమనం జటామండలధారిణమ్.
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యంజనాన్వితమ్
రామ మిందీవరశ్యామం కందర్పసదృశప్రభమ్
బభూవేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా"

దివ్యమంగళ విగ్రహుణ్ణి రాముణ్ణి చూసే సరికి రాక్షసియైన శూర్పణఖ కామమోహిత అయింది. రాముడా కందర్పసదృశ విగ్రహుడు. రాముని సౌందర్యమునందు రాక్షసి రమిస్తున్నది. ఆమెకు తన సౌందర్యం సంగతి తెలియదు. తాను దుర్ముఖి, ఆయన సుముఖుడు. ఆమె

మహోదరి అతడు సింహమధ్యముడు ఆమె విరూపాక్షి. అతడు విశాలాక్షుడు ఈమెది వికృత రూపం ఆయనది దివ్యమంగళ విగ్రహం. కాని, రాక్షసప్రవృతిలో కూడ జీవుని లక్షణం ఉంటుంది. ఆనందాన్ని పొందవలయునన్న ఆకాంక్ష ఉంటుంది. అది ఆ జీవుని వేదన. పరమ సమగ్ర ఆనందస్ఫూర్తిని కలిగించే ఆ దివ్యతేజస్సును చూచేసరికి అవ్యక్తంగా, ఆసురంగా ఆమె రమించటం ప్రారంభిస్తుంది. ఆసురంగా రమించడం ఎలా అంటే - రాముణ్ణి చూచి, కన్నులపండువుగా దర్శించి కన్నులు మూసికొని ఆనందించారు ఋషులు. ఆ రాక్షసి కన్నులు తెరిచి చూసి అందముగా వున్న ఆ రాముణ్ణి భౌతికంగా అనుభవించాలి అనుకొంటోంది ఇది ఆసురమైన, ఇంద్రియప్రేరితమైన లక్షణం. ఆనందాన్ని ఇంద్రియ సుఖంగా వాంఛిస్తోంది దివ్యదర్శనాన్ని దేహ దృష్టితో చూస్తోంది; ఇది తమఃప్రవృత్తి లక్షణం. రాముడు దీనికి అందడు. అందుకని రాముడూ, లక్ష్మణుడూ కలిసి చక్కని నాటకం ఆడతారు. రాముడు అంటాడు: 'నీవా యింత పెద్ద ఆకారము కలిగిన దానివి, నేనా యింత చిన్నవాణ్ణి.'

"పిల్లి యెలుక మగనిఁ బెండ్లాడ నేటికి?
పులియు దుప్పిరాజుఁ బొందనేల?
అగ్నిశిఖయు దూది నభిగమింపగ నేల?
అయిన మగడు లేదొ అప్పడంబు".

(రామాయణ కల్పవృక్షం)

'నన్ను ఎందుకు ఈ విధంగా ఆశ్రయిస్తావు' అని చెప్పి ఊరుకోకుండా మరీ ఇలా అంటాడు. 'నేనా భార్యతో కూడుకొని వున్నాను. అగ్ని సాక్షిగా ఈమెను వివాహం చేసికొన్నాను. నలుగురిలో మా పెండ్లి అయింది. నా భార్య నావెంట వచ్చింది. ఈమెను వదిలిపెట్టడం న్యాయం కాదు. నా తమ్ముడు పాపం ఇప్పటికి 13 ఏళ్ళబట్టి భార్యా సంపర్కం లేకుండా వున్నాడు. అతగాడు ఎర్రగా వుంటాడు. నేను

నల్లగా వుంటాను. వాణ్ణి నువ్వు ఆశ్రయించు' అని ప్రేరేపిస్తాడు. అతనివైపు చూస్తే అతడు కూడ ఎర్రగా, పుల్లగా ఉన్నాడు. అతని దగ్గరకు పోతుంది శూర్పణఖ. రాముడు పంపించిన వైఖరి గమనిస్తాడు లక్ష్మణుడు. నిపుణంగా సమాధానం చెప్తాడు - 'రాముడు ప్రభువు. అన్ని నిర్ణయాలు ఆయనే తీసుకొంటాడు నేను సేవకుణ్ణి. ఆయనమీద ఆధారపడవలసినవాణ్ణి. ఆయన పెడితే అన్నం లేకపోతే లేదు. నిన్ను నేను భార్యగా స్వీకరిస్తే, నీ మహోదరాన్ని నింపటానికి కనీసం ఒక ఏనుగునయినా ప్రతిపూటకు నేను చంపి తీసుకొని రావాలి. ఇక నీకు ఆహారాన్ని సంపాదించటంతోనే నా పని సరిపోతుంది. నేను సేవకుణ్ణి. బ్రతికేదేదో సేవకుని భార్యగా ఎందుకు బ్రతకడం. రెండవ భార్యగా రాముని వెంటనే వుండు' అని నచ్చచెప్తాడు. శూర్పణఖ మళ్ళీ రామునివద్దకు వెళ్ళుతుంది. అతడు కాదంటాడు. తిరిగి లక్ష్మణుని వద్దకు వస్తుంది అతడు కాదు పొమ్మంటాడు. ఇలా రాముని వద్దకు, లక్ష్మణుని వద్దకు తిరుగుతూ వుంటుంది. రాముడు ఎంత చమత్కారంగా మాట్లాడుతాడంటే - ఈ సీత వున్నది కాబట్టి నిన్ను వివాహం చేసుకోలేకపోతున్నాను అన్నట్లుగా సూచిస్తాడు. పిల్లికి చెరలాటం ఎలుకకు ప్రాణసంకటంలా అవుతుంది శూర్పణఖ పరిస్థితి. రామునికీ ఆమెకూ నడుమ సీతయే అడ్డంగా ఉన్నదని భావించి రాక్షసి సీతమీద విరుచుకుపడుతుంది.

"త్రాడువోలె వచ్చి దబ్బనమును బోలెఁ
దేలునట్టి యంత తెలివి గలవు
ఇంక నెంతదాన వీవు కాకుండిన
విఱిచి మగని వలను వేసికొంటి?"
"భర్త వెంబడి కానకు వచ్చుటేల?
ఆ మఱఁదిభార్య తా వచ్చెనా వచింపు?-" (కల్పవృక్షం)

'భర్తను వశపరచుకొని ఆయనను బొంగరంలా ఆడిస్తున్నావు. లక్ష్మణుని భార్య వచ్చినదా అరణ్యానికి? నీ వెందుకు వచ్చావు? నిన్ను

అడ్డం తీస్తే తప్ప నాకు రాముడు దొరకడు' అని ఆమెను మ్రింగ డానికిపోతుంది. రాముడు సంజ్ఞ చేస్తాడు. లక్ష్మణుడు విజృంభించి ఆమె ముక్కు, చెవులు కోస్తాడు. ఆ బాధతో అరుచుకొంటూ ఆకాశమార్గాన ఎగిరిపోతుంది. 'నేను ఒంటరిదాన్ని అనుకొంటున్నారేమో. నా అన్న రావణుడున్నాడు. సమీపంలో జనస్థానంలో ఖరుడు, దూషణుడు నా అన్నలు వున్నారు. వారిని పిలుచుకొని వచ్చి నీకు బాణాలతో సమా ధానం చెప్పుతాను' అని కేకలు వేసుకొంటూ వెళ్ళిపోతుంది. శూర్పణఖ రామునిలో కొంత హాస్యాన్ని కల్పించే పాత్రగా వున్నా రామాయణ మంతా ఆవిడమీద ఆధారపడివుంది.పంచవటికి వెళ్ళిన తరువాత రాముడు చేయవలసిన తరువాతి కార్యక్రమం ఏది? రామాయణం పంచవటితో ఆగి పోయింది. కథాకార్యం నిలిచిపోయింది. మరల క్రొత్త కార్యం ప్రారంభం కావాలి అంటే ఏదో ఒక ప్రారంభం, ఒక అంకురార్పణం జరగాలి. ఆ అంకురార్పణ శూర్పణఖ స్వామి అంటారు - 'శూర్పణఖ కామం, మంథర క్రోధం. వీరు ఇరువురే మన జీవిత రామాయణానికి కారకులు. రామాయణంలో చాల స్వల్పమైన పాత్రలుగా కనపడతారు. మంథర, శూర్పణఖ, వీరులేనిది అసలు రామాయణం లేదు. అయోధ్య నుండి రాముడు బయటపడాలంటే మంథర కావాలి. దండకనుంచి లంకకు చేరాలి అంటే అక్కడ శూర్పణఖ కావాలి. రామాయణంలో జీవభూతములైన అంశములనే ఒక పెద్దమరలో ఆయువుపట్టులో వున్న స్ప్రూలులాగా వీరిద్దరూ నిలిచారు.'

ఈ శూర్పణఖ పాత్ర చాలామంది రామాయణకర్తల యొక్క ఆదరభావాలను చూరగొన్నది శూర్పణఖ లేనిది రామాయణం లేదు కదా! కంబ రామాయణంలో శూర్పణఖకు కామవల్లి అని పేరు పెట్ట బడింది కామానికి ప్రతీక కాబట్టి. ఎళుత్తచ్చన్ అధ్యాత్మ రామాయ ణంలో, కామవల్లి అనే పేరుతోనే కథను సాగిస్తాడు. పద్మపురాణంలో ముక్కు, చెవులు శ్రీరాముడే కోశాడనే కల్పనం చేయబడింది. రఘు

వంశంలో మరొక కల్పనం చేశాడు కాళిదాసు. రామునిచేత, లక్ష్మణుని చేత తిరస్కృతురాలయిన శూర్పణఖను చూచి సీత నవ్వుతుందట. వారు తిరస్కరించినందుకు కాదు శూర్పణఖకు కోపం ఆమె నవ్వి నందుకు. మహాభారతములో దుర్యోధనుని చూచి ద్రౌపది నవ్విన నవ్వు ఎలా యుద్ధానికి హేతుభూతమైందో అలాగే రఘువంశములో సీత నవ్వు కారణమౌతుంది. రామాయణంలో శూర్పణఖ వికృతమైన ఆకారంతోనే వస్తుంది. తదితర రామాయణాలలో రాముని అందమయిన ఆకృతిని చూచిన తరువాత ఈ వికృతమైన ఆకారంతో వెళ్ళితే వరిం చదని అపూర్వమైన సౌందర్యవతిగా మారివస్తుంది, ఆమె కామచారిణి కాబట్టి. శక్తిభద్రుడు జైన రామాయణంలో ఆ కల్పనను తీసికొన్నాడు. ఆమె సౌందర్యాన్ని చూచి లక్ష్మణుడు కొంత చలిస్తాడట. ఆ చలిం చిన లక్ష్మణుని భుజంమీద ఎక్కించుకొని వెళ్ళుతుంది శూర్పణఖ. కొంత దూరం వెళ్ళిన తరువాత దాని ముక్కు, చెవులు కోసివేసి, ఆమె పట్టునుండి విడిపించుకొని ఇవతలకు వస్తాడు. ఇంకా చాలా కల్పనలు చేశా డాయన. మాయా సీతను కల్పించాడు. శూర్పణఖ మాయాసీత వేషం వేసుకొంటుంది. మాయారాముని వేషం రావణుడు వేసికొంటాడు. రావణునియొక్క సుతుడు మాయాలక్ష్మణుని రూపం ధరిస్తాడు. ఈ కథ సీతాపహరణ ఘట్టంలో ఆయన చెప్పుతారు. రాముడు మారీచుని చంపి వస్తూవుంటే, మాయాసీత వేషం వేసుకొని శూర్పణఖ రాముని దగ్గరకు వస్తుంది. ఇక్కడ రావణుడేమో మాయా రాముని వేషం వేసికొని వస్తాడు. భరతునికి ఏదో విపత్తు వచ్చేసింది, నిన్ను తీసుకురమ్మంటున్నారని చెప్పి, రథంమీద కూర్చోపెట్టుకొని వెళ్ళుతాడు. సగం దూరం వెళ్ళిన తరువాత ఆమె శిరోజములను తాకు తాడు. తాకంగానే నిజాకారం బయటపడుతుంది. అలా నాటకం మార్చాడు. భవభూతి మొదలైనవారు అసలు ఈ శూర్పణఖకూ, మంథరకూ ఏదైనా అంతరమైన సంబంధం లేకపోతే రామాయణ కథ ఎలా నడుస్తుంది? అని భావించి, మాల్యవంతుని ప్రేరణం వలన

శూర్పణఖ మంథర వేషం వేసికొని కైకేయి అంతఃపురంలో ప్రవే శించి, దశరథుడేమో రామ పట్టాభిషేకానికి ప్రయత్నం చేస్తూవుంటే, కైక దగ్గరనుంచి రాముణ్ణి అరణ్యానికి పొమ్మనే ఒక లేఖను తీసికొని వచ్చి రామునికి అందిస్తుంది. ఇలా మంథర కూడ శూర్పణఖయొక్క అపరావతారమే అని భవభూతి మహావీరచరిత్రములో కల్పనం చేసి నట్లుగా కనపడుతుంది. మురారి అనర్ఘరాఘవ నాటకంలో రావణ ప్రేరితయైన శూర్పణఖ మంథరాకృతిని దాల్చి కైకను ప్రోత్సహించి సీతారాములను అరణ్యానికి పంపినట్లు, అరణ్యానికి పంపిన తరువాత రాముని, సీతను విడగొట్టటానికి ప్రయత్నం చేసినట్లు కల్పనం చేసి చెప్పుతాడు.

స్వామి యీ ఘట్టాన్ని రచిస్తూ, ఏ రామాయణంలోనూ కల్పనం కాకుండా వున్న ఒక చిత్రమైన ముద్రను కల్పించారు. సీత మీదకు శూర్పణఖ వస్తూవుంటే రాముడు లక్ష్మణునితో సూటిగా 'లక్ష్మణా! ఈమెను శిక్షించు' అని అనడు. నాలుగు చేతివేళ్ళను పైకి చూపి, బొటనవ్రేలుచేత ఆ నాలుగు వ్రేళ్ళను స్పృశిస్తాడట! స్వామి రామాయణ కథారసవాహినిలో చెప్పారు. బొటనవ్రేలుతో నాలుగు వ్రేళ్ళను స్పృశిస్తున్న ఈ ఘట్టంలోని అంతరార్థం ఏమిటి? నాలుగు వ్రేళ్ళు అంటే నాలుగు వేదాలు, వాటికి శ్రుతులు అని పేరు. శ్రుతి అంటే చెవి. హస్తము మీదకు చూపుతున్నారు కాబట్టి ఆకాశము. ఆకాశమునకు శబ్దం గుణం. అది బ్రహ్మం. చేయి నాకమార్గాన్ని చూపిస్తున్నది కాబట్టి, నాకము అంటే ముక్కు అని అర్థము వున్నది కాబట్టి శ్రుతిని, నాకమును రెండింటిని తెగవెయ్యి అని రాముడు ముద్రాత్మకమైన భాషతో లక్ష్మణునికి సూచించటం జరుగుతుంది.

స్వామి ఇంకొక విశేషం తెలిపారు. చెవి, ముక్కు తెగిపోయిన తరువాత, ఖరాదులు సంహరింపబడిన తరువాత, ఈ శూర్పణఖ రావణుని దగ్గరకు పోయి మొరపెట్టుకొంటూ వుంటే కుంభకర్ణుడు

ఒక ప్రశ్న వేశాడట. 'ఏమే! అంతా బాగుంది చెల్లెలూ, నీవు ఇన్ని తెలివితేటలు కలదానవు కదా! ఆ లక్ష్మణుడు, పొట్టెగాడు ముక్కు, చెవులు కోయడమేమిటి? ఒకవేళ కోసినా ముక్కు, చెవులు ఒకచోట లేవే, కత్తి యిక్కడ పెట్టిన తరువాత మళ్ళీ అక్కడ పెట్టాలి కదా, ముక్కు కోసి మళ్ళీ చెవుల దగ్గరకు కత్తి తీసుకువెళ్ళేవరకు నీవు నిద్రపోతున్నావా ఏమిటి?' అని అడిగాడట. అప్పుడు శూర్పణఖ చెబుతుంది - 'అన్నా, ఏమని చెప్పను? ఆ లక్ష్మణునియొక్క, రాముని యొక్క శరీరస్పర్శ తగిలినతోడనే నేను ఒక దివ్య తాదాత్మ్యాన్ని పొందుతూన్నాను. వాడు ముక్కులే కోశాడో, చెవులే కోశాడో నాకు తెలియదు. నన్ను ఆవలకు నెట్టిన తరువాత ముక్కు, చెవి పోయి నట్లుగా తెలిసినది తప్ప, వాడి శరీరం అంటినపుడు ముక్కు కోసినా తెలియలేదు. చెవి కోసినా నాకు తెలియలేదు. అంత దివ్యానుభూతి ఆ శరీర స్పర్శవలన కలిగింది' అని కుంభకర్ణునికి చెప్పుతుంది. కుంభ కర్ణుడు ఎంత తమోగుణుడైనా రాతిలో జలము, అందులో కప్ప ఎలా వుంటుందో కుంభకర్ణుని హృదయంలో దివ్యతేజస్సులను గ్రహించే సాత్త్వికగుణం అలా వుంటుంది. 'నిజమే నిజమే, నిజమే. అటువంటిది కూడ వుంటుంది' అని అతడు అన్నాడట! తమోగుణం కూడ దైవత్వ ప్రభావానికి గురియై తన్మయత్వాన్ని పొందుతుంది. కాని, దైవలక్షణం దానికి తెలియదు. ఆ తత్త్వాన్ని స్వామి యీ కథనంలో వివరించారు.

రాముడు ఓంకారానికి ప్రతీక; రావణుడు అహంకారానికి ప్రతీక. అహంకారం అంటే ఏమిటి? నాదోపాసకులు ఓంకారము, అహంకారము అని చెప్పుతారు. ఓంకారము పరబ్రహ్మ. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ.' ఈ ఏకాక్షరము బ్రహ్మ. మరి అహమ్? అకారముతో మొదలై హకారము వరకు వ్యాపించి వున్నటువంటి అక్షరసముదాయానికంతటికి అహమ్ అనే మాట సంజ్ఞగా భాసిస్తుంది. ఈ అక్షరం సర్వశాస్త్ర జ్ఞానానికీ, సర్వ మంత్రజ్ఞానానికీ, సర్వకళాజ్ఞానానికి ప్రతీక. నాదోపాసకులు

చెప్పే లక్షణం యిది. వేదాంతులు చెప్పే లక్షణము అహమ్ - నేను. నేను కానిదానియందు నేను అన్న భ్రమ కలిగివుండటమే అహంకారం. అహంభావం అంటే - శరీరానికి భిన్నమయినది ఆత్మ; ఆ ఆత్మయే నేను అని అనుకోవటం. కాని, శరీరమే నే ననుకోవటం అజ్ఞానం. ఉదాహరణకు - స్వామి అప్పుడప్పుడు చెబుతూ వుంటారు. ఎవరినైనా దగ్గరకు పిలిచి నీవు ఎవరివిరా అంటే, నా పేరు 'సుందరరావు' అంటాడు. అతని తలమీద కొడితే అబ్బా, నా తల నొప్పి పుడుతోంది అంటాడు. సుందరరావు అన్నప్పుడు నఖశిఖపర్యంతము ఉన్న శరీరాన్నంతా చూపి నేను సుందరరావును అన్నాడు. అతని తలమీద కొడితే నా తల నొప్పి అన్నాడు. చేతిమీద కొడితే నా చెయ్యి నొప్పి అన్నాడు. కాలిమీద కొడితే నా కాలు నొప్పి అన్నాడు. ఏ అంగము మీద కొట్టినా, చివరకు గుండెకు నొప్పి వచ్చినా నాగుండెకు నొప్పి వచ్చింది అన్నాడు తప్ప నాకు నొప్పివచ్చింది అనలేదు. శరీరంలో సర్వాంగాలు, భౌతికమైన ప్రతి అంగము కూడ, నా, నా అని సంబంధషష్ఠితో కలిపి చెబుతున్నాడు. నాయొక్క తల, నాయొక్క నోరు, నాయొక్క గుండె నాయొక్క ప్రాణము, నాయొక్క అంటే నీవు వేరు ఆ వస్తువు వేరు. ఆ నీవు ఎవడవు? ఆ ఎవడవో వాడవు నీవు. తదితరములైనవి నీవి, నీకంటె భిన్నమైనవి. సర్వ శరీర సంఘాతము నీకంటె భిన్నమైనది. ఇందులో చైతన్యభూతమైనటువంటి జీవుడు, ఆత్మ, నేను అని చెప్పదగినటువంటి పదార్థము. ఎవడైతే ఈ పాంచభౌతికమైన శరీరమును ఆత్మగా భావిస్తాడో, ఈ శరీరాన్నే నేను అని భావిస్తాడో వాడు అహంకారి. ఎవడు ఆత్మనే తానుగా భావిస్తాడో, అట్టి ఆత్మ పరమాత్మకంటె భిన్నం కాదు అని తెలిసికోంటాడో అతడు నిరహంకారి, జ్ఞాని.

ఈ దండకారణ్యంలో మనకు కనపడుతున్న యీ శూర్పణఖ, ఖరదూషణులు మొదలైనవారందరూ రాక్షసులు. వీరందరికి ఆ రావణుని యొక్క అంశ వుంది. రావణుడు మహా తపస్సు చేశాడు. పంచభూతాలను జయించాడు. అష్ట దిక్పాలకులను తనవశం చేసికొన్నాడు.

గాలి అతడు ఆడమంటే ఆడతాడు. అగ్ని అతడు వెలగమంటే వెలుగుతాడు. పాంచ భౌతికమైన ప్రకృతి నంతా ఇంత శాసించి ఆరువేళలా సహస్రలింగార్చనం చేయగలిగినటువంటి మహాభక్తుడు అనిపించుకొన్న అపూర్వ సిద్ధుడు. అతని దృక్పథము ఏమిటి? అతడు బ్రహ్మను ఇలా కోరాడు: నాకు ఒక్క నరులు- వానరులు తప్ప తదితరులు ఎవరిచేత కూడా చావు లేకుండా వరము ఇవ్వమన్నాడు. భౌతికమైన దృక్పథం కలిగిన వానికి ఎప్పుడూ శరీరం మీద ఎక్కువ మమకారం కలిగిన వాడికి, అనుక్షణం చావుయొక్క భయం వెంటాడుతుంటుంది. ఎప్పుడు నా శరీరానికి పతనం ఏర్పడుతుందో, ఎప్పుడు చావు వస్తుందో అని భయం. ఈ శారీరక స్పృహ కలిగినటువంటి అహంకారులకు ఎప్పుడూ మృత్యువు అంటే భయం. వాడు ఏమి చేస్తాడు? శరీరాన్ని తపింప చేస్తాడు. తపించి తపస్సు చేస్తాడు. ఇంతగా తపిస్తున్నాడు అని బ్రహ్మ పాపం ప్రత్యక్షమవుతాడు. నాకు చావులేకుండా వరం యివ్వమంటాడు. చావు ఏమిటి? అసలు చావు వున్నది అని అనుకోవడం అజ్ఞానం. చావు దేనికి? శరీరానికి. ఆత్మకు చావు లేదు. అంటే ఆత్మజ్ఞాని అయినవాడు నాకు చావు లేకుండా వరం ఇవ్వమని అడగడన్నమాట. రావణుడు ఆత్మజ్ఞాని కాడు. శరీరస్పృహ కలవాడు. శరీరమే తాను అనుకొన్న అహంకారి. తాను అని అనుకొన్న శరీరం రేపు చచ్చిపోతుందేమోనని భయపడి బ్రహ్మచేత వరాన్ని పొందాడు. మరి అష్టదిక్పాలకులను ఓడించి, పంచభూతాలను జయించిన రావణుడు ఒక చోట వున్నాడు. శరభంగమహర్షి మరొకచోట వున్నాడు. ఆ మహర్షి కూడా పంచ భూతాలను జయించినవాడే. తన శరీరాన్ని అగ్నిలో పారవేశాడు. మోక్షానికి వెళ్ళిపోయాడు శరభంగమహర్షి. అతడు రావణునివలె పాంచ భౌతికమైన ప్రకృతి విజయం సాధించినవాడే కాని అతనికి శరీరంమీద స్పృహలేదు. కాని, రావణునికి శరీరంమీద స్పృహవుంది. ఎవడు శరీర స్పృహ కలిగివుండి ఆ శరీరమే ఆత్మ అని భ్రమించి, అజ్ఞానం, అవిద్య అన్న మాయచేత ఆవృతుడై, అహంకరిస్తాడో అతడు

రావణుడు. ఇట్టి పాంచభౌతికమైన శరీరస్పృహ కలిగిన రాజుకు సంతానం ఉంటుంది; బంధువులుంటారు. వారందరికీ శరీరమే ప్రమాణం. ఆ రావణుని సోదరి అయిన ఈ శూర్పణఖకు మరి ఇంక ఏ ప్రమాణం ఉంటుంది? శరీర స్పృహ కలిగినటువంటివారికి బ్రహ్మానందం ఇలా వుంటుంది, ఆత్మానందం ఇలా వుంటుంది అని ఎలా చెప్పాలి? ఏదైనా ఒక తెలియని విషయాన్ని చెప్పవలసి వచ్చినపుడు తెలిసిన విషయముయొక్క పోలికతో చెప్పడం లోకమర్యాద. అతని ముఖం చంద్రబింబమువలె వుంటుంది. చంద్రబింబము అన్నది మనకు తెలుసు. ముఖం చూడగానే ఆహ్లాదకరముగా వుంటుంది అని చెప్పబోతున్నాడు.

అలాగే ఆత్మానందం ఎలా వుంటుంది? బ్రహ్మానందం ఎలా వుంటుంది? రెండు ప్రమాణాలు లోకములో చెప్పారు. స్త్రీ పురుషుల యొక్క సంభోగమునందు కలుగు రతి సౌఖ్యమును కనుక నీవు ప్రమాణంగా తీసికొన్నట్లయితే దానికంటె ఎన్నిరెట్లు ఎక్కువగా వుంటుందో చెప్పటం ఒకటి. రెండవ ప్రమాణం - సుషుప్తిలో పొందుతున్న ఆనందము. ఆ ఆనందాన్ని నీవు ప్రమాణంగా తీసికొన్నట్లయితే దానికంటె ఎన్ని రెట్లు అధికంగా వుంటుందో చెప్పటం. జీవితంలో అందరికీ తెలిసినవి ఈ రెండే ఆనందాలు. మొదటిది ఇంద్రియానందము, రెండవది సుషుప్త్యానందం. ఈ రెండింటిని ప్రధానంగా తీసికొని ప్రమాణం చెప్పుతారు. ఇంకొకటి వుంది - రసానందం. కావ్యాన్ని చదివినపుడు, నాటకాన్ని చూచినపుడు మనం పొందే ప్రాతిభాసికమైన ఆనందం. అది ఒక ప్రమాణం. ఇట్టి ప్రమాణాలతో చెబుతూవుంటారు. శారీరక స్పృహ కలిగినటువంటి వాడికి బ్రహ్మానందాన్ని తెలుసుకోవాలి అంటే అతిసన్నిహితమైన ప్రమాణం ఏది? ఇంద్రియ సుఖం. శరీర స్పృహ కలిగినటువంటి ఈ శూర్పణఖ రాముణ్ణి చూచింది. అపూర్వమైనటువంటి ఆనందం కలుగుతోంది. అది జీవ సహజ లక్షణం. ఆనందాన్ని దేనితో కొలవాలనుకొంటోంది? ఇట్టి ఐంద్రికమైనటువంటి కామ

సుఖంతో కొలవాలనుకొంటోంది. ఇట్టి కామస్పృహ శరీర దష్నమైనటు వంటి అభిమానంవలన ఏర్పడుతోంది; అజ్ఞానంవలన ఏర్పడుతోంది. రావణుని సోదరి కాబట్టి రాముణ్ణి తనూసంగసౌఖ్యం కోసం కోరింది. పాంచభౌతికమైన అనుభూతియే రామునివల్ల తాను పొందదలచుకొన్న అపూర్వమైన అనుభూతికి మొదటి ప్రమాణంగా ఎంచుకొన్నది. ఇట్టి పాంచభౌతికమైన స్పృహతో కూడుకొన్న, అహంకార ప్రేరితమైన కామ ప్రవృత్తికి రావణుని సోదరి అయిన శూర్పణఖ నిదర్శనంగా కనపడుతుంది మొత్తము మీద రావణుని యొక్క అహంకార ప్రవృత్తి దండకారణ్యంలో వ్యాపించి రామునిదగ్గర మొదటి రేఖగా, సీమగా కనపడింది శూర్పణఖ.

ఈ శూర్పణఖ ప్రేరణవలన ఖర దూషణాదులు రాముని మీదకు దండెత్తివస్తారు. 14 వేల మంది సైన్యంతో వస్తారు. వారంద రిని ఒకటిన్నర ఘడియలలో చంపివేస్తాడు రాముడు. ఘడియ అంటే 24 నిమిషాలు వేసుకొన్నప్పటికి 36 నిమిషాలలో 14 వేల మందిని, తరువాత 5 వేల మందిని, తరువాత 12 వేల మందిని చంపుతాడు. అంతటితో జనస్థానంలో రావణుని ప్రతినిధులుగా ఉన్న రాక్షసులు ఎవ్వరూ మిగలకుండా చనిపోతారు. దండకారణ్యం నిష్కంటకమై పోయింది. ఋషులకు నిర్విఘ్నంగా యజ్ఞ యాగాదులను, తపస్సును సాగించుకోడానికి అనువైన ప్రదేశంగా ఏర్పడింది. ఈవిధంగా దుష్ట శిక్షణము, శిష్ట రక్షణము అన్న వ్రతాన్నిపూని సత్యపరాక్రమాన్ని ప్రదర్శించుకొంటూ, మహర్షులకు రాక్షస బాధను తొలగించే ప్రథమ యత్నం చేసి, రాక్షసులకు అల్పమైన దండాన్ని విధించి, తన సత్య పరాక్రమాన్ని ప్రదర్శించిన ఘట్టాన్ని యీ అరణ్యకాండలో ఒక భాగంగా ఇప్పుడు మనం అనుశీలించుకొన్నాం. రాబోయే ఉపన్యాసంలో సీతాపహరణం అన్న ఘట్టాన్ని తీసికొని, అందులో వున్న తాత్త్వికమైన ప్రతీకాత్మకమైన ప్రవృత్తులను గురించి పర్యాలోచనం చేద్దాం.

సాయిరామ్!

# సీతాపహరణం

భగవాన్ శ్రీ సత్యసాయి పాదపద్మాలకు ప్రణామము.
సాయి కుటుంబసభ్యులకు నమస్కారము.

**పాట**

రమణి సీతను వలచినాడు - రావణుడు
రామశరమును పిలిచినాడు.
మాయలేడిని పంపినాడు - రావణుడు
స్వీయ జనమును చంపినాడు.
సీతయెదుటకు తరలినాడు - రావణుడు
చింతనిప్పుల పొరలినాడు.
మాయ నెత్తుక పోయినాడు - రావణుడు
మంటలో పడిపోయినాడు.
రాము నార్తిని ముంచినాడు - రావణుడు
యముని సన్నిధి కాంచినాడు.
అహముతో మిన్నంటినాడు - రావణుడు
ఇహములో మన్నంటినాడు.

రామాయణంలో సీతాపహరణ ఘట్టం ఉపనిషత్ రహస్యం లాంటిది. రామతత్త్వాన్ని, సీతాతత్త్వాన్ని అవగాహనము చేసికొనడం ఎంత దుష్కరమో యీ ఘట్టం చదివితే మనకు తెలుస్తుంది. పైకి చూస్తే చాలా సులభంగానే వుంటుంది. లోతు ఎంత దిగినా అగాధంగా భాసించే యీ ఘట్టాన్ని ఎందరో తాత్త్వికులు ఎన్నో విధాలుగా వ్యాఖ్యానించి ఉపాసించారు.

లంకా నగరంలో రావణుడు సభ తీర్చి ఉన్నాడు. సర్వ సంపదలకు ఆలవాలమైన ఆ లంకా నగర వైభవం ఇంద్రుని నగరాన్ని

మించి వుంది ఖరదూషణాదులు చనిపోయిన తరువాత ఆ సైన్యంలో మిగిలిన అకంపనుడు రావణుని దగ్గరకు వెళ్ళాడు. 14 వేల మంది సైన్యాన్ని ఒక ముహూర్తకాలంలో రాముడు సంహరించిన వీర కృత్యాన్ని వివరించి వర్ణించాడు. దూషణ సంహారాన్ని వివరించాడు. మహాకపాలుడు, స్థూలాక్షుడు, ప్రమాథి, త్రిశరుడు సంహరింపబడిన విధానాన్ని వివరించాడు. ఆ మీద ఖరుని వధ చెప్పాడు. రామ పరాక్రమాన్ని వివరిస్తూ అకంపనుడు 'సత్యం మనోహారి చ దుర్లభం వచః' అన్నట్లు శ్రీరాముని మహత్వాన్నీ సత్యపరాక్రమత్వాన్నీ సత్యదూర కాకుండా వివరిస్తాడు రావణునికి.

'నహి రామో దశగ్రీవ! శక్యో జేతుం త్వయా యుధి
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనై రివ.
న తం వధ్య మహం మన్యే సర్వైర్దేవాసురై రపి
అయం తస్యవధోపాయ స్తం మమైక మనా శ్శృణు.
భార్యా తస్యోత్తమా లోకే సీతానామ సుమధ్యమా
శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్నభూషితా.
నైవ దేవీ న గంధర్వీ నాప్సరా నాఽపి దానవీ
తుల్యా సీమంతినీ తస్యా మానుషీషు కుతో భవేత్.
తస్యాపహర భార్యాం త్వం ప్రమథ్యతు మహావనే
స తయా రహితః కామీ రామో హాస్యతి జీవితమ్.'

'రాముని గెలవటానికి, సంహరించటానికి ముల్లోకాలలో ఎవరికీ సాధ్యం కాదు. ఆయనను జయించాలంటే ఒకే ఉపాయం నాకు తోస్తున్నది. ఆయనకు అత్యుత్తమురాలైన సీత అనే భార్య వుంది. సమవిభక్తాంగమైనటువంటి ఆమె శరీరం త్రిలోకసౌందర్యాన్ని భజిస్తోంది. దేవ వనితలలో, గంధర్వవనితలలో, అప్సరసలలో, దానవ వనితలలో కూడ అటువంటి సుందరాంగి లేదు. అట్టి సీమంతిని మనుష్యులలో వుండటం దుర్లభం. త్రిలోకాలలో కూడ అటువంటి సౌందర్యవతిలేదు. అపూర్వమైన ఆ సౌందర్యవతిని నీవు అపహరిస్తే

కామియైన రాముడు సీతావియోగంతో మరణిస్తాడు. పరాక్రమంచేత నీవు రాముని సంహరించటం కల్ల; అసాధ్యం. సీతను నీవు గ్రహిస్తే భార్యా వియోగతప్తుడైన రాముడు అబలుడవుతాడు. అప్పుడే నీవు అతనిని జయించగలుగుతావు' అని సలహా చెప్పాడు.

అకంపను డిచ్చిన సలహాను రావణుడు లెస్సగా ఆలోచించాడు. మారీచుని దగ్గరకు వెళ్ళాడు. తాను సీతను అపహరించటానికి ఉద్యుక్తుడయినాడని చెబుతాడు. మారీచుడు - 'నీకు ఈ సలహా చెప్పిన వాడు ఎవడో శత్రువు అయి వుండాలి. సుఖంగా నిద్రపోతున్నవాని తల పగులకొట్టినట్లుగా వుంది ఈ దుష్టమైన ఆలోచనం. రాముని జయించటం సాధ్యంకాదు. రాముడు మదపుటేనుగు వంటివాడు. సింహము వంటివాడు. బడబానలం వంటివాడు. నిద్రపోతున్న ఆ సింహాన్ని నీవు మేల్కొల్పకు. అతడు సీతతో ఈ దండకారణ్యము నందు వసించనీ. నీవు సుఖంగా లంకలో వసించు. కొరివితో తల గోక్కోబోకు' అని సలహా చెప్పాడు. ఇదీ నిజమే అన్పించింది రావణుడు లంకకు తిరిగి వెళ్ళుతాడు.

ఆ లంక సముద్ర మధ్యంలో వున్న ద్వీపం. సంసారమగ్నుడైన జీవునివలె కనపడుతూ వుంటుంది ఆ లంక. ఆ లంకను పరిపాలిస్తున్న రావణునికి దశకంఠుడు, దశగ్రీవుడు అనే పేర్లున్నవి. అవి సార్థకాలు కూడా. గ్రీవమంటే 'గిరత్యనయా అన్నాదిక మితి గ్రీవా-గౄ నిగరణే' - దీనిచేత అన్నాదులు మ్రింగబడును కాబట్టి దానికి గ్రీవము అని పేరు. గ్రీవముకలినవాడు గ్రీవుడు; అన్నాదులను మ్రింగువాడు అని అర్థం. ఇతనికి దశేంద్రియ భోగేచ్ఛ అధికం భోగాలను అనుభవింపవలయునన్న కాంక్ష గ్రీవాశబ్దంలో సూచింపబడుతోంది. అతడు విషయ సుఖాలయందు ఆసక్తి కల జీవుడు. ఆతని పదితలలు దశేంద్రియ సంఘాతానికి ప్రతీకలు. దశేంద్రియాల ద్వారా విషయ భోగాలను అనుభవించవలయును అన్న ఆకాంక్ష అత్యంతముగా కలిగిన జీవుడు రావణుడు. ఈ అనుభవేచ్ఛ అహంకార ప్రేరితం. ఇట్టి

లహంకారముచేత ప్రేరేపింపబడిన దశేంద్రియ భోగేచ్ఛ కలిగిన జీవుడు అహంకారానికి ప్రతీక.

అహంకారి ముల్లోకాలను జయించినా ప్రకృతిని మాత్రం జయించలేడు. ప్రకృతియే తాను అని భ్రమించి అహంకరిస్తూ వుంటాడు. భగవద్గీతలో చెప్పినట్లు—

'ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే.' (3-27)

ప్రకృతియొక్క గుణాల మూలంగానే కర్మలు పూర్తిగా ఆచరింపబడుతూ వున్నవి. కాని, అహంకారం వలన మతిభ్రమలో తగుల్కొన్నవాడు నేనే దీనికంతా కర్తననుకొంటాడు. ఇలా అనుకొనే జీవి రావణుడు. అహంకారం త్రిగుణాలతో కూడి వుంటుంది.

'సత్త్వా త్సంజాయతే జ్ఞానం, రజసో లోభ ఏవచ
ప్రమాద మోహౌ తమసో, భవతోఽజ్ఞాన మేవచ' (14-17)

సత్త్వగుణంలోనుంచి జ్ఞానం ఉద్భవిస్తుంది. రజోగుణంలోనుంచి లోభం ఉద్భవిస్తుంది తమోగుణంలోనుంచి ప్రమాదం, మోహం, అజ్ఞానం పుట్టుకొని వస్తాయి. అహంకారజీవి అయిన ఈ రావణునికి త్రిగుణాలు తోడైనవి. ఈ త్రిగుణాత్మక ప్రవృత్తులతో కూడుకొన్న సచివులలో సత్త్వగుణశోభితుడైనవాడు మారీచుడు 'నీవు రామునితో ఎందుకు విరోధం పెట్టుకొంటావు? అతడు సామాన్యుడు కాడు. త్రిలోకాలను జయింపగలిగిన నారాయణ తత్త్వం మూర్తి కట్టినవాడు. అతనితో విరోధం కోరి తెచ్చుకొనుటం నీ వంశనాశనాన్ని నీవే కొనితెచ్చుకొనటం?' అని సాత్త్విక గుణపూరితమైన, ఉత్తమమైన సలహాను చెప్పినవాడు మారీచుడు. అందువలన సత్త్వగుణానికి అతడు ప్రతీకగా భాసిస్తున్నాడు. అకంపనుడు రజోగుణానికి ప్రతీకగా భాసిస్తాడు 'రాముడు రాక్షసులకు అజేయునిగా కనపడుతున్నాడు. రాక్షసమాయను జయించాడు. అతనిని హుటాహుటిగా, ఎదురుగా, ధర్మమార్గంలో జయించటం సాధ్యం కాదు. నీవు మాయోపాయంచేత ఆ రాముని జయించు'మని ధర్మమార్గాన్ని తప్పించి కార్యసాధనకు

అనువైన అర్థ ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని రజోమూర్తి అయిన అతడు రావణుని ప్రేరేపిస్తున్నాడు. ఇక మూడవ గుణం తమోగుణం. తమోగుణమునకు ప్రతీకగా శూర్పణఖ కనపడుతుంది. శూర్పణఖ అన్నలోని అహంకారాన్ని, కామాన్ని ప్రేరేపిస్తుంది. సీతను హరించ మంటుంది. అకంపనుడు మాయోపాయంచేత సీతను హరించుమని చెప్పితే, శూర్పణఖ 'నీవు వీరుడవైతే రాముని, లక్ష్మణుని సంహరించి, సీతను గ్రహించు. అనాధ అయిన సీతను నీవు గ్రహించు' అని వీరోచితమైన పద్ధతిలో రామ, లక్ష్మణులచేత తాను అవమానం పొంది వున్నది కాబట్టి, ఖరదూషణాదుల ఎదుట వేడినురుగులతో పొంగారు తున్న రామలక్ష్మణుల యొక్క నెత్తురు త్రాగుతానని శపథంచేసి వున్నది కాబట్టి, ఇట్టి పాశవికమైన ప్రవృత్తిచేత ప్రేరేపింపబడి, రామలక్ష్మణ సంహారాన్ని మొదట సాధింపమంటుంది. ఆ తరువాత అనాధ అయిన సీతను బలవంతంగా గ్రహించుమని ప్రేరేపిస్తుంది. ఈ త్రిగుణములచేత ప్రేరేపింపబడిన అహంకారమూర్తి రావణుడు. మరల శూర్పణఖచేత ప్రేరేపింపబడి తాను మారీచుని దగ్గరకు వస్తాడు.

'ఎందుకయ్యా మళ్ళా వచ్చావు?' అని మారీచుడు అంటాడు. 'రాముడు నా చెల్లెలికి అవమానం చేశాడు. నా సైన్యాన్ని చంపాడు. అంతేకాక నీ తల్లి తాటకను చంపాడు. దీనికి ప్రతీకారంగా రాముని భార్యను, దేవకన్య వంటి సీతను నేను ఎత్తుకొనిపోవాలి ఇది మాయా మార్గంతో సాధించాలి. నీవు మారీచుడవు. (వెనుక మనం అనుకొన్న ట్లుగా మరీచిక లంటే ఎండమావులు. భ్రాంతిని కల్గించే మాయ మరీచి. అందువల్లనే మాయా మార్గాన్ని ఆశ్రయింప వలసివచ్చినపుడు రావణుడు మారీచుడిని ఆశ్రయిస్తున్నాడు.) నీవు వెండిచుక్కలు కలిగిన బంగారు లేడివై సీతను ఆకర్షించాలి. ఆమె నిన్ను కోరాలి. ఆమె కోర్కెమీద రామలక్ష్మణులు నీవెంట పడాలి. రామలక్ష్మణులు దగ్గరలేని ఆ సీతను చంద్రప్రభను రాహువు గ్రహించినట్లుగా నేను హరిస్తాను రాముడు భార్యావిరహకర్శితుడవుతాడు. అట్టి శోకమూర్తి అయిన రాముని నేను

సంహరిస్తాను' అని రావణుడీ మాటలు అన్నపుడు - రామాయణంలో ప్రసిద్ధమైన శ్లోకం మారీచుడు అన్నది యిది:

'రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవా ఇవ.
కథం త్వం తస్య వైదేహిం రక్షితాంస్వేన తేజసా
ఇచ్ఛసి ప్రసభం హర్తుం ప్రభామివ వివస్వతః.'

'రాముడు ఆకృతి దాల్చిన ధర్మము వంటివాడు. పరమ సాధువు, సత్యపరాక్రముడు, సర్వలోకాలకు రాజయినవాడు. దేవతలలో ఇంద్రుని వంటివాడు. నీకు అతని భార్య వైదేహి ఎందుకయ్యా? అతడు తన తేజస్సుచేత తన భార్యను రక్షించుకొంటున్నాడు. నీవు సీతను గ్రహింప తలచుకోవటం సూర్యునియందున్న రస్మిని సూర్యునినుండి వేరు చేయడానికి ప్రయత్నం చేసినట్లుగా వుంది. అది అసాధ్యం' అని చెప్పతాడు. 'రాముడు అగ్నిహోత్రునివంటివాడు. నీ లంకను, నీ బల గాన్నీ దహిస్తాడు రాముడు యముని వంటివాడు. విశ్వామిత్ర యాగ రక్షణం చేస్తున్నపుడు సుబాహుని చంపాడు నా మీద వేసిన బాణానికి పది వేల యోజనాల దూరం పోయి పడ్డాను. మృత్యుసన్నిభమైన ఆ అస్త్రము యొక్క తాకిడి యిప్పటికీ నా గుండెను పీడిస్తోంది నన్ను కావాలని బ్రదికించినట్లుగా కనపడుతోంది. ఆ బాణము యొక్క దెబ్బకు భయపడి నేను దండకారణ్యానికి వచ్చి, మరల రాముని యెదుట పడకూడ దని తపస్సు చేసుకొంటున్నాను. మరల నన్ను వెతుక్కుంటూ వచ్చాడా అన్నట్లు రాముడు దండకకే వచ్చాడు. వచ్చాడు కదా పగ తీర్చుకొందామని ఇద్దరు స్నేహితులను కలుపు కొని దుప్పులవేషాలలో వెళ్ళి కొమ్ములతో రాముని పొడవటానికి ప్రయత్నం చేశాను. అతడు బాణం వేశాడు. చిక్కకుండా తప్పించు కొంటూ ఆవలకు వచ్చాను. చావు తప్పి కన్ను లొట్టపోయింది. మరల రెండవసారి రాముని యెదుట పడకూడదు. ఇంద్రియ నిగ్రహంతో నే నిప్పుడు తపస్సు చేసుకొంటున్నాను. మరల రాముని యెదుట నేను

పడ్డానా - యిది మూడవసారి, ఇక క్షమించడు. నేను వాని యెదుట పడితే చనిపోతాను. ఆ తరువాత నీవు కనపడతావు. నీవూ చనిపోతావు అందువల్ల నేను రాముని యెదుట పడకుండా రాముణ్ణే జపిస్తున్నాను' అని మారీచుడు వివరిస్తాడు. రామభయంచేత విచిత్రంగా మారీచుని హృదయంలో వింతయైన భక్తి జనించింది. దీనిని భయభక్తి అన వచ్చునేమో! భగవంతుని చూచి భయపడి భక్తిని పెంచుకోవడం భయభక్తి అతని సంస్కారం ఎంత విచిత్రంగా వున్నదో చూడండి. రావణునితో అన్న మాటలివి:

'ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః
వృక్షే వృక్షేచ పశ్యామి చీనకృష్ణాజినాంబరమ్.
గృహీత ధనుషం రామం పాశహ స్తమివాంతకం
అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ!
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే
రామ మేవహి పశ్యామి రహితే రాక్షసాధిప!
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః
రకారాదీని నామాని రామత్ర స్తస్య రావణ!'

'నేను తాపసవృత్తిలో ఉన్నాను. నే నేవైపు చూచినా, ప్రతి చెట్టులో ప్రతి గుట్టలో కోదండరాముడు మృత్యుపాశం చేతపట్టుకొని నిలుచున్న యమునిలా గోచరిస్తున్నాడు. ఎక్కడ చూచినా రాముడే. ఈ అరణ్య మంతా రామభూతమై భాసిస్తోంది. ఆ శూన్యమునందు పైకి తల ఎత్తి చూచానా - ఆకాశమంతా రామమయమై భాసిస్తోంది. ఒకవేళ నిద్రలో స్వప్నమునందు నాకు రాముడు కనపడ్డాడా, గుండెలవిసి నేను నిద్ర మేల్కొంటున్నాను. చివరకు ఇప్పుడు ఎంతవరకు వచ్చానంటే 'రా' అన్న మాట వినపడితే చాలు రమణి, రథము, చివరకు రావణుడు అన్నా రామునివలె నాకు భాసిస్తున్నారు. ర కార ఆదియైన పదము వింటే చాలు - రాముడే నాకు స్ఫూర్తియందు నిలుస్తున్నాడు' భయము అనే ప్రాతిపదికతో సర్వ ప్రకృతియందు రామతత్త్వాన్ని దర్శిస్తున్న

మారీచుడు రామశరనిహతుడై ముక్తిని పొందటానికి తగిన చిత్తపరిపాకాన్ని సంపాదించుకొన్నాడు.

'రాముని సంహరించాలంటే రాముని ప్రాణంకంటె అధికమయిన సీతనే అపహరించాలి. అంతకంటే మరొక మార్గం నాకు లేదు. ఆ కార్యం దుష్కరమే. సాహసంతో కూడుకొన్నదే. అయినా సాధించాలి. నీవు సహాయం చేసిపెట్టాలి. చేసిపెడితే నా రాజ్యంలో సగం నీకు ఇస్తాను' అని రావణుడు మారీచుని లోభపెడతాడు. మారీచుడు అతనికి ఎన్నో బోధలు చేస్తాడు. 'రామునితో పగ పెట్టుకోబోకు; ఈ పగవలన నీ వంశనాశనం అవుతుంది' అని చివరకు హెచ్చరిస్తాడు. 'ఒకవేళ నేను నీవు చెప్పినట్లుగా రాముని మాయామృగవేషంతో ఆకర్షించటానికి ప్రయత్నం చేస్తాననుకో. ఈ తప్పిదం నా పట్ల కాకతాళీయం. ఈ తప్పిదం చేయటానికి నన్ను ప్రేరేపించిన నిన్ను ససైన్యంగా రాముడు చంపుతాడు. నేను రామదర్శనం చేసి చచ్చిపోతాను. సీతను అపహరించి నీవు సబాంధవంగా సంహరింపబడతావు. చివరకు రాక్షసులూ మిగలరు; లంక కూడ మిగలదు.'

మారీచుని హితవు రావణుని చెవులకెక్కదు. పైగా, కర్కశంగా మాట్లాడుతూ 'నేను రాజును, నీవు మంత్రివి. నేను కార్యాన్ని చేయుమని శాసిస్తున్నాను చేయకపోతే నా కత్తితోనే నిన్ను చంపుతాను' అని బెదిరిస్తాడు. 'రావణునిచేత చనిపోయేదానికంటే రాముని చేత మృతి పొందటం మేలని తలచి మారీచుడు రావణుని పన్నాగానికి అంగీకరిస్తాడు. వెళ్ళుతూ రావణునితో ఇలా అంటాడు: 'ఆప్తులైన వారి వాక్యాలు అంత్యకాలం దాపురించినప్పుడు విషతుల్యంగా భాసిస్తాయి. నీకు కాలం సమీపించినట్లుగా వుంది నేను వెళ్ళుతున్నాను' అని నిష్క్రమిస్తాడు.

రావణుని హృదయంలో విషయసంగంచేత కామం ఉద్భవించింది. ఆ కామంవలన క్రోధం జనించింది. ఆ క్రోధంవలన సమ్మోహం వ్యాపించింది. దాని వలన మతి విభ్రమం కలిగింది. ఆ పైన బుద్ధి

నాశనం ఏర్పడింది. ఇలా అయినవారు "బుద్ధినాశాత్ ప్రణశ్యతి" అని భగవద్గీత చెబుతోంది. ఇది అందరికీ వర్తించే సత్యమే.

రావణునియందు ఆసురప్రవృత్తి అధికంగా వుంది. ఆసుర ప్రవృత్తి అంటే ఏమిటి? దైవాసుర సంపద్విభాగ యోగంలో ఆసురీ ప్రవృత్తిని గురించి భగవద్గీత ఇలా చెప్తోంది:

'దమ్భో దర్పోఽభిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పద మాసురీమ్.' (16-4)

డంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము మొదలైన గుణములు ఆసురీసంపదకు సంకేతములు.

'అహంకారం బలం దర్పం కామంక్రోధం చ సంశ్రితాః
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః.' (16-18)

అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము- వీటిని ఆశ్రయించి అహంకారులు తమ దేహాల్లోనూ, ఇతర దేహాల్లోనూ వున్నటువంటి నన్ను ద్వేషిస్తూ వుంటారు. వారికి నేను అంటే అసూయ. స్వీయ దేహమునందు, పర దేహము నందు ఉన్న పరమాత్మాంశను ద్వేషించే ప్రవృత్తి; అహంకారాన్ని, బలమును, దర్పమును, కామమును, క్రోదమును, ప్రకటించు ప్రవృత్తి ఆసురమైన అహంకార ప్రవృత్తి. దీనికి ప్రతీకగా కనపడతాడు రావణుడు.

అసురమైన అహంకారాన్ని ఎలా దండకారణ్యంలో ప్రపంచిస్తున్నాడు? అతని జీవితంలో ప్రపంచిస్తున్నాడు? అన్న విషయం అతని చర్యలవలన గమనించవచ్చు. రావణునికి యజ్ఞయాగాదులను ధ్వంసం చేయటం, హోమాన్ని నాశనం చేయటం, బ్రహ్మహత్య చేయటం ప్రధానచర్యలు. యజ్ఞం అంటే ఏమిటి? యజ్ఞములను ధ్వంసం చేయడమంటే ఏమిటి? స్వామి చెప్పారు - జ్ఞానము అన్న అగ్నిలో కోరికలు అనే ఆహుతులను వేయడమే యజ్ఞం. అగ్నిముఖంగా కోర్కెలను దైవాయత్తం చేయడమే యజ్ఞం.

'అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్
మన్త్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహం హుతమ్.'(9-16)

భగవంతుడు గీతలో-"నేనే క్రతువును, నేనే యజ్ఞమును, నేనే మంత్రమును, నేనే అజ్యమును,నేనే హుతమును, నేనే యజ్ఞస్వరూపుడను" అని చెప్పాడు. యజ్ఞంద్వారా పూజించబడే దేవతలు నీకు ఇష్టమైన కోర్కెలనిస్తారు. ఇష్టభోగాలను కల్పిస్తారు. దేవత లిచ్చిన వాటిని మరల దేవతలకు అర్పించకుండానే తానే స్వీకరించినట్లయితే వాడు దొంగ అనబడతాడు అని భగవద్గీతలో చెప్పబడింది. నిజంగా దేవతలకు దొంగ, ధర్మానికి దొంగ అయినట్లే. దేవతలకు అర్పింపబడుతున్న హవిస్సులను హరించువాడు, నేను యజ్ఞభోక్తను అని గర్వించేవాడు, అహంకారి అయిన రావణుడు. యజ్ఞభోక్త పరమాత్మ అయితే యజ్ఞభోక్తను నేను అంటాడు. అహంకరిస్తాడు రావణుడు. దేవతలకు అందవలసిన హవిస్సులమ నేనే దేవతను అని గ్రహిస్తాడు. జ్ఞానతప్తులైన యోగుల యొక్క శరీరాలను హింసిస్తాడు. ఇట్టి యజ్ఞధ్వంసం చేసే ప్రవృత్తితో రావణుడు ఆసురమైన అపకారాన్ని, ఆసురమైన ప్రవృత్తిని లోకంలో ప్రవర్తింపచేస్తూ దైవానికి ధర్మానికి అపకారం చేస్తూవున్నాడు.

సీతను అపహరించటానికి ప్రయత్నం చేస్తున్న రావణునిలో కూడా యజ్ఞాన్ని ధ్వంసంచేసే ప్రవృత్తివుంది. సీతారాములు అరణ్యవాసం చేస్తున్నారు. గార్హస్థ్య ధర్మం నిర్వహిస్తున్నారు. గార్హస్థ్య యజ్ఞంలో భార్య అగ్ని. దానియందు ఉంచబడే మంత్రపూతమైన హవిస్సు ధర్మబద్ధమైన కామం. అమృతతుల్యమైన సోమం సతీ ప్రణయం. యజమాని సతి అనెడి అగ్నిలో ధర్మబద్ధమైన కామమును హవిస్సుగా అర్పించి సతీప్రణయమనే సోమరసాన్ని త్రాగుతాడు. సీతారాముల దాంపత్య జీవిత మాధుర్యంలో ఆ తత్త్వం ఇమిడివుంది. రాక్షసుడైన రావణుడేమి చేస్తున్నాడు? ధర్మదాంపత్య యజ్ఞంలోని అగ్నిని మోహజలంతో ఆర్పాలని యత్నిస్తున్నాడు. రాక్షసుడు చేసే పని అది. భార్య అనే అగ్నియందు మోహమనే జలాన్ని, రక్తాన్ని కురిపిస్తాడు. ఆ అగ్ని ధ్వంసమవుతుంది. ఆ అగ్నియందు పుట్టవలసిన ఫలం పుట్టదు. యజమానిని సంహరిస్తాడు. యజ్ఞం పూర్తి కాదు. అలా

భగ్నమైన యజ్ఞ భాగాన్ని తాను అనుభవించటానికి ప్రయత్నం చేస్తాడు. ఇది సీతాపహరణంలో రావణుడు చేయదలచుకొన్న పని.

అగ్నిర్ముఖా వై దేవతాః. దేవతాముఖమైన అగ్ని భార్య. భార్యద్వారా దైవికమైన గార్హస్థ్య ధర్మకార్యాన్ని నిర్వహిస్తున్నాడు రాముడు. ఇట్టి రామకృతమైన, ధర్మబద్ధమైన గార్హస్థ్య యజ్ఞాన్ని భగ్నం చేస్తున్నాడు రావణుడు. అగ్నిని యజమానినుండి దూరం చేయాలనుకొంటున్నాడు. ఇక్కడ అగ్ని సమాహితమైవుంది. నీళ్లు చల్లినట్లయితే, దానిని కదిలించినట్లయితే, సమాహితంగా ప్రజ్వలిస్తున్న అగ్ని విక్షేపాన్ని పొందుతుంది మాయామృగం అన్న విక్షేపంచేత ఆ సమాహితమైన అగ్నిజ్వాలను కదిలింపదలచుకొన్నాడు రావణుడు. అలా మారీచుని, గార్హస్థ్యాశ్రమమనే యజ్ఞాన్ని నిర్వహిస్తున్న రాముని ఆశ్రమపదం దగ్గరకు పంపుతాడు. సీత మొదట చూస్తుంది. అపూర్వమైన మృగం. ఆ మృగం కనుక తనకు వుంటే తాను అయోధ్యకు పోయినపుడు లక్ష్మణ భరత శత్రుఘ్నుల భార్యలకు లేనటువంటి ఒక విశేషమై వస్తువు తన అంతఃపురంలో వుంటుంది అని భావిస్తుంది. అరణ్యవాసం చేసివచ్చినందుకు విలువైన ఒక గుర్తుగా వుంటుంది అని భ్రమపడుతుంది. సీత మృగాన్ని చూస్తుంది. ఆశ్చర్యపడుతుంది. రాముని, లక్ష్మణుని కేక వేస్తుంది. లక్ష్మణుడు వస్తాడు. 'ఇటువంటి మృగం సృష్టిలో వుండటానికి వీలులేదు. దీని వైఖరి, దీని చూపులు, దీని గిట్టలు రాక్షసంగా వున్నవి. సామాన్యంగా మృగవేషం ధరించి వచ్చేవాడు మారీచుడు. ఇది మారీచుని జిత్తులా కనపడుతోంది' అని అంటాడు. మనకు లక్ష్మణుడు మహర్షిలా కనపడుతాడు. ఆసురీ తత్త్వాన్ని విడమరచి చెప్పాడు. మరిది ఈ మాట చెప్పిన తరువాత వదినగారు 'అవునా, ఇది రాక్షస మాయయా? ఏమండీ! ఇది రాక్షస మాయయా?' అని రామునితో అనవలె కాని అలా అనలేదు. పైపెచ్చు-

'ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః
ఆనయైనం మహాబాహో! క్రీడార్థం నో భవిష్యతి.'

'అభిరామమైన మనోహరమైన ఈ మృగం నా మనస్సును హరించింది. మహాబాహువులు కలిగిన ఓ రామా! నేను క్రీడించటానికి అనువుగా నీవు దీనిని తప్పకుండా తీసుకొనిరావాలి. ప్రాణాలతో తెచ్చినా సరే, లేదా చంపి తోలును అయినా తీసుకొనిరా నీవు కూర్చుండే దర్బాసనం మీద ఈ తోలును వేసి ఆ మెత్తని తోలు మీద మనమిద్దరం కూర్చొందాము. నాథా! తనకు కావలసినది చేసిపెట్టుమని ఇల్లాలిగా పెనిమిటిని ఆజ్ఞాపించటం సిజంగా ఘోరమే, తప్పిదమే. ఏ స్త్రీ అయినా తన భర్తను యిలా తొందర చేయటం సరియైన పని కాదు, కాని, ఈ జింక తోలు నన్ను విస్మయపరచింది. నా మనస్సును ఆకర్షించింది. నేను ఏమి చేసేది?' అని భర్తను కోరుకొంటుంది. రామునితో అరణ్యవాసానికి వచ్చేటప్పుడు ఆ తల్లులు, ఆశ్రమ పదాలలో ఋషిపత్నులు, అపూర్వంగా భర్తవెంట వస్తున్న సీతను చూచి, 'ఆమె ఏది కోరితే అది కాదనకుండా చేసి పెట్టవయ్యా' అని రామునితో మరీ మరీ చెప్పారు. అయితే, చేయకూడని పని ఆమె కోరడం, ఈతడు చేయడం అనేది ధర్మమా? అధర్మమా? అన్న మాట అలా అట్టిపెడదాము. సీత కోరింది. వాల్మీకి అంటాడు:

'ఏవం సీతా వచశ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతం
లోభిత స్తేన రూపేణ సీతాయా చ ప్రచోదితః
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః.'

లక్ష్మణుడు మాయ అంటున్నాడు. మాయ గీయ సంగతి నాకు తెలియదు. నాకు ఆ మృగాన్ని తెచ్చిపెట్టాలి అని భార్య అంటోంది. రాముడు ఏమి అనాలి? ఈతడు కూడా ఆ మోహసౌందర్యాన్ని చూసి మోహించాడు. లక్ష్మణుని పిలిచి——

'పశ్య లక్ష్మణ! వైదేహ్యాః స్పృహాం మృగగతా మిమామ్
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి.'

'జానకి హృదయం ఆ మృగమునందు ఆకర్షింపబడివుందయ్యా!' అటువంటి మృగం లోకములో 'నభూతో నభవిష్యతి' అనుకొంటాను.

తాను కోరే కోరికను ఏ ఆలోచనా లేకుండా తనకు కావలసిన విధంగా సంపాదించుకొనడమే కోరిక కోరేవారి లక్షణం. సీత అలా కోరింది. తాను అనుకొన్నది సాధించుకోవాలి ఏవిధంగానయినా. అందువల్లనే రాజనీతిలో, అర్థశాస్త్రంలో కూడ ఏవిధంగానయినా సంపాదించుకొన్న ప్రయోజనాన్నే అర్థం అని అంటున్నారు. సీత కోరిన ఈ అర్థాన్ని ఏవిధంగానయినా నేను సంపాదించి తీసుకొని వస్తాను' అని రాముడు అస్త్రాలను తీసికొని బయలు దేరుతాడు. లక్ష్మణుడు 'అన్నా! అతడు మారీచుడు అనే రాక్షసుడు' అని జ్ఞాపకం చేస్తాడు 'అవును, నీవు మారీచుడని అన్నావు. మారీచుడు వాతాపి వంటివాడు. ఇటువంటి వాణ్ణి చంపివేయవలసిందే. అతడు నిజంగా రాక్షసుడే అయితే, అతనిని చంపి, అతని చర్మాన్ని తీసికొని వస్తాను' అని బయలుదేరుతాడు.

వాల్మీకి యిక్కడ ఒక గొప్ప శ్లోకం వ్రాశాడు:

'ఇహత్వం భవ సన్నద్ధో యన్త్రితో రక్ష మైథిలిం
అస్యా మాయత్త మస్మాకం యత్కృత్యం రఘునందన!'

'తమ్ముడా! నీవు ధనుఃకవచాదులతో సన్నద్ధుడవై యీ మైథిలిని జాగ్రత్తగా కనిపెట్టుకొని యిక్కడే వుండు. ఇకముందు మనము చేయవలసిన దంతా ఈ సీత కోసమే.' వాల్మీకి రామాయణంలోని ఈ ఒక్క వాక్యం అధ్యాత్మ రామాయణానికి ఆయువుపట్టు. ఇక ముందు మన జీవితమంతా అర్థసాధనమయమే. అక్కడ అర్థం సీత. ఆమెను రక్షించుకోనడమే పరమార్థం అని ఒక అర్థము. ఇకముందు రామాయణమంతా సీతవలన నడిచే కథే. ఇక మనం సీత కోరిక వెంట నడిచేవారమే తప్ప మన కోరిక వెంట నడిచేది కాదు సీత. ఈ అర్థంలో వున్న గాంభీర్యం తరువాత చెప్పుకొందాం.

మారీచుడు పరుగెత్తుకొని వెళ్ళుతాడు. ఎంత సేపటికీ చిక్కక పోతే బాణాలతో రాముడు కొడతాడు. అయ్యో సీతా, లక్ష్మణా అని రాముని కంఠంతో అరుస్తూ మారీచుడు వికాకృతితో మృతుడై పోతాడు. రామునికి ఇది రాక్షసమాయ అని అప్పుడు స్పష్టమవుతుంది. సీతకు

వినపడేటట్లు రాముని కంఠస్వరంగా, దీనారావంగా సీతా, లక్ష్మణా అని పిలిచాడు ఆ మారీచుడు. మొదటి కేక సీతా, తరువాత లక్ష్మణా. ఆ పిలుపును సీత విన్నది. 'ఆపద వచ్చినప్పుడు రాముడు ముందు నన్నే స్మరిస్తూన్నాడు. నేను ఆయన రక్షణను గురించి ముందు ఆలోచించాలి. తరువాతనే లక్ష్మణుడు' అన్న అభిమానం ఆమెకు స్ఫురిస్తుంది. ఆర్త రావం విన్న తరువాత కూడ లక్ష్మణుడు నిబ్బరంగా నించొనివుంటాడు. ఈమె కంగారు పడిపోతుంది. 'లక్ష్మణా! నీ అన్నగారి కేక విన్నావా? వెంటనే పరుగెత్తు, ఆయనకు ఏదో ఆపద వచ్చింది' అని తొందర పెడుతుంది. లక్ష్మణు డిలా అంటాడు: 'అమ్మా! నేను యిందాకనే చెప్పాను. అది రాక్షస మాయ. రాక్షసమాయను జయించటం రామునికి అవలీల. ఆ కేక వేసినది రామునిగొంతు కాదు. అసువులు పోయినా దీనుడై రాముడు నన్ను రక్షించండని ఎవరిని అడగడు. సర్వలోక రక్షకుడైన రాముడు అబలను రక్షించుమని అడుగుతాడా? ఆయన శక్తియే శక్తి. ఆయన నన్ను రక్షించుమని అడుగుతాడా? ఎందుకమ్మా నీకు ఈ మాయ? నీవు అనవసరంగా భయపడుతున్నావు' సీత మనస్సులో భయం నుండి అనుమానం జనించింది. దానితో మరదిని అనరానిమాట లనటం ప్రారంభించింది. 'సౌమిత్రీ! నీవు మిత్రరూప మున నున్న శత్రువువలె కనపడుతున్నావు. నీ అన్నకు అపకారం కలిగితే నీవు హర్షిస్తున్నావు. నాకు తెలిసిందయ్యా నీ అభిప్రాయం. నాయందు నీకు లోభం వున్నట్లుగా ఉన్నది' అని, సీతయందు లక్ష్మ ణునికి మోహభావం, కామభావం వున్నట్లుగా శంకించి ఆ తల్లి ఆ మరదిని అనకూడని మాట అన్నది. అతడు ఆ మాట విని అగ్ని బాణం చెవులో గ్రుచ్చుకొన్నట్లుగా విలవిల బాధపడ్డాడు. కాని, నిబ్బ రించుకొన్నాడు. ఆమె మనస్సు వికలమయి వుంది; మోహావిష్టమై వుంది. తనను అపార్థం చేసుకొంటున్నది అపార్థం చేసుకొంటున్నదని ఆమెను తృణీకరించరాదు. ఆమెను కాపాడుమని రామశాసనం. ఆమె నప్పుడు మానసికంగా కాపాడాలి. మోహావిష్టమైన హృదయానికి జ్ఞాన

బోధ చేయాలి. 'రాముడు సాక్షాత్తు నారాయణుడమ్మా! పరమాత్మ అమ్మా! ఆయనకు ఏమి బాధ?' అంటే ఆమె హృదయం వినలేదు. శుద్ధసత్త్వగుణ సమాన్వితురాలైనట్లయితే ఆ మాట అర్థమయ్యేది. ఆమె మోహావిష్టమైనది. ఒక అడుగు క్రిందకు జారింది. అందువలన లోక ధర్మాన్ని చెప్పి ఒప్పించటానికి ప్రయత్నించాడు. 'రాముడు నిన్ను న్యాసంగా నా దగ్గర అట్టిపెట్టాడు. భద్రంగా కొంత కాలం ఒకరి దగ్గర దాచిపెట్టుకొన్న ధనాన్ని న్యాస మంటారు. అతడు మరల తిరిగి వచ్చిన తరువాత ఆ ధనాన్ని ఇవ్వాలి. నీవు నా వద్ద న్యాసంగా వుంచబడిన ధనము వంటిదానివి కాబట్టి రాముడు వచ్చేంతవరకు నిన్ను కాపాడడం నా కర్తవ్యం. నేను యిక్కడే కూర్చొంటాను' అని లక్ష్మణుడు ఆమెకు నచ్చచెప్పటానికి యత్నిస్తాడు. ఆమె కా మాటలు విపరీతార్థంతో స్ఫురిస్తాయి. నిష్ఠురంగా మరదిని మందలిస్తుంది. నీవు నన్ను కామిస్తున్నావని నిందిస్తుంది. అది భరతలక్ష్మణులిరువురు కలిసి చేసిన పన్నాగమని శంకిస్తుంది. తిట్టడం మొదలుపెట్టింది.

'అనార్యాఽకరుణారంభ! నృశంశ కులపాంసన!
అహం తవ ప్రియం మన్యే రామస్యవ్యసనం మహత్'

అని లక్ష్మణుని దూషిస్తుంది. రామునికి కీడు కలిగితే సంతోషించే హీనునిలా అతనిని సంభావిస్తుంది. తన హృదయాన్ని యిలా స్పష్టం చేస్తుంది:

'కథ మిందీవరశ్యామం పద్మపత్రనిభేక్షణం
ఉప సంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్
సమక్షం తవ సౌమిత్రే! ప్రాణాం స్త్యక్ష్యే న సంశయః
రామం వినా క్షణ మపి న హి జీనామి భూతలే.'

'ఇందీవర శ్యాముడు, పద్మపత్ర నిభేక్షణుడు అయిన ఆ రాముని వదిలి నేను అన్యుని కామిస్తా నని అనుకొంటున్నావా? ఒకవేళ రామునికి విపత్తు కలిగితే, నీవే నన్ను కోరితే, నా ప్రాణాన్ని అయినా త్యజిస్తాను తప్ప నేను నీకు వశం కాను, రాముని వదిలి నేను ఒక్క క్షణం కూడ జీవించలేను. నాకు భయంగా వుంది. రాముడు రాకపోతే నేను గోదా

వరిలో పడతాను, ఉరిపోసుకొంటాను, విషం త్రాగి చస్తాను, అగ్నిలో దూకుతాను. రాముని తప్ప నేను అన్యుని కాలితోనైనా స్పృశించను' అని వెక్కి-వెక్కి ఏడుస్తుంది. దారుణంగా దుఃఖిస్తున్న ఆ సీతనుచూచి లక్ష్మణుడు ఆర్ద్రుడై వదినను ఓదార్చబోతాడు. ఆమె నిరాకరిస్తుంది. అతనివైపు చూడదు. మాట్లాడదు. ఇంత వైమనస్యాన్ని ప్రకటిస్తున్న ఆ వదిన దగ్గరకు వెళ్ళడానికి భయపడ్డాడు. చివరకు ఆ తల్లికి నమస్కారం చేసి వెనక్కి తిరుగుతూ, గ్రుడ్ల నీరు గ్రుడ్ల కుక్కుకుంటూ, శోకమూర్తియై, 'కర్తవ్యాన్ని నిర్వహించలేదని అన్న కోప్పడతాడు, ఇక్కడవుంటే నా శీలాన్ని నా వదిన శంకింస్తోంది' అని అతడు భయ విహ్వాలుడై వెళ్ళిపోతాడు.

రాముడు, లక్ష్మణుడు ఆశ్రమపదాన్ని వదలిపోలున సమయం దొరికింది. పరివ్రాజక వేషంతో రావణుడు వస్తాడు. శనైశ్చరుడు చిత్తానక్షత్రాన్ని చేరినట్లుగా సీతను సమీపిస్తాడు. తృణాచ్ఛన్నమైన బావివలె ముని వేషంతో ఆ పాపాత్ముడు సీతను సమీపిస్తాడు. సీత యొక్క అపూర్వ సౌందర్యాన్ని వర్ణిస్తూ 'రాక్షసమయమైన యీ దండ కారణ్యంలో ఎందుకు ఒంటరిగా నీవు వుంటున్నావు' అని సీతను ప్రశ్నిస్తాడు. తాపసి అని బావించి సీత అతనికి అతిథి సత్కారాలు చేస్తుంది. 'రాముడు యిప్పుడే వస్తాడు. లక్ష్మణుడు యిప్పుడే వస్తాడు. వారిద్దరూ వచ్చిన తరువాత మీకు భోజనం కూడ పెడతాను, వుండ' మంటుంది. మనం వెనక చెప్పుకొన్నాం. అనసూయాదేవి ఆమెకు ఒక పసుపు పచ్చని పట్టుచీర నిచ్చిందని. ఆ చీర నారోజున కట్టుకొని వున్నది సీత. ఆమె యిచ్చిన ఆభరణాలు పెట్టుకొని వుంది. అనసూయ పాతివ్రత్య ధర్మానికి రక్షగా ఏ చీరను, ఏ ఆభరణాన్ని, ఏ మైపూతను ఆ తల్లికి యిచ్చిందో వాటినన్నింటినీ కవచాలుగా ధరించి వున్న సమయాన, సాక్షాత్తు లక్ష్మీదేవివలె వున్నది అని శ్రీరాముడే మోహపడిన ఆ మూర్తిని రావణుడు చూస్తాడు. ఇట్టి మూర్తిని నా లంకకు తీసుకొని వెళ్ళాలి అని, అపహరించాలి అని దృఢంగా సంకల్పం చేసుకొంటాడు.

'మీరు ఎవరమ్మా?' అని అడిగిన ప్రశ్నకు సీత తన చరిత్రనంతా దండ కారణ్యానికి వచ్చినంతవరకు చెబుతుంది. వయస్సుతోసహా చెబుతుంది. రామగుణ కీర్తనం చేస్తుంది. తన వృత్తాంతాన్నంతా చెబుతుంది. రావణుడు అప్పుడు నిజాభిప్రాయాన్ని బయటపెడతాడు. 'నాకు వేల మంది భార్యలున్నారు. నిన్ను చూసిన తరువాత, వారిమీద నా మనసు పోవడం లేదు. వారందరికంటే మిన్నగా నిన్ను పట్టమహిషిని చేస్తాను. నీవు ఈ తాపసవేషంతో వున్న రాముని ఆశ్రయించి ఈ ఆశ్రమంలో వుండటం ఎందుకు? త్రిలోకవైభవాలతో కూడుకొన్న లంకలో పట్ట మహిషిగా బ్రతుకు' అని ఆహ్వానిస్తాడు.

సీత ఆ మాటలకు భయపడుతుంది. ఆమెకు కోపమూ వస్తుంది. రాముని పరాక్రమంముందు నీవు నిలువగలవా? అని రావణుని మందలిస్తుంది. అతడు మహావటవృక్షము వంటివా డంటుంది పంచవటిలో ప్రధానమైన వటవృక్ష ప్రసక్తి సీత ఇక్కడ తీసుకొనివస్తుంది. 'అతడు వటవృక్షము వంటివాడు. తనను ఆశ్రయించిన వారికి ఎందరికో ఆశ్రయమివ్వగలిగినవాడు. అతనితో నీవు శత్రుత్వాన్ని పెట్టుకోకు. నీవు నన్ను ఆశించటం నక్క ఆడుసింహాన్ని కోరుతున్నట్లుగా వున్నది. సూర్యగోళాన్ని చేతులతో పట్టుకోవడానికి ప్రయత్నం చేసినట్లుగా వుంది. మందరగిరిని చేతితో ఎత్తడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా వుంది. సూదులతో కన్నులు పొడుచుకొన్నట్లుగా వుంది. కత్తితో నాలుక తెగ కోసికొన్నట్లుగా వుంది. ఆ రాముడెక్కడ? నీ వెక్కడ? నాగలోక మెక్కడ? నక్క ఎక్కడ? సింహ మెక్కడ? గుంటనక్క ఎక్కడ? మహాసముద్రమెక్కడ? చిన్నచెలమ ఎక్కడ? బంగారమెక్కడ? సీస మెక్కడ? మంచిగంధ మెక్కడ? ఎర్రబురద ఎక్కడ? మదపు టేనుగు ఎక్కడ? జంగుపిల్లి ఎక్కడ? గరుత్మంతుడు ఎక్కడ? కాకి ఎక్కడ? నెమలి ఎక్కడ? నీరుకాకి ఎక్కడ? రాముడు వచ్చేలోపల ఒకవేళ నన్ను అపహరించి తీసుకొని వెళ్ళినప్పటికి నేయి త్రాగిన ఈగ వలె నీవు నన్ను అనుభవించకుండానే చచ్చిపోతావు' అని బెదిరిస్తుంది.

రావణుడు సీతను తన భోగాలతో ఆకర్షింప యత్నిస్తాడు. తన లంకలో వున్న దేవేంద్ర భోగాలన్నీ వర్ణించి చెప్పుతాడు. పంచభూతాలను జయించి తాను సాధించుకొన్న వైభవాన్ని ప్రదర్శిస్తాడు. తాను చేసిన దండయాత్రలన్నీ, తాను సాధించిన విజయాలన్నీ చెప్పుకొంటాడు. సీత అప్పుడు అంటుంది: 'ఇంద్రుని భార్య అయిన శచీదేవినయినా అప హరించి నీవు బ్రతకవచ్చును. కాని, రాముని భార్యనైన నన్ను అప హరించావా - నీవు అమృతం త్రాగినా బ్రతకడం కష్టం.'

ఆ మాట అన్న తరువాత అభిమాన ధనుడైన ఆ రావణుడు ఆమె కేశపాశాన్ని ఎడమచేతితో పట్టుకొంటాడు. కుడిచేతితో ఆమెను ఎత్తుకొంటాడు. రథాన్ని పిలుస్తాడు. పిశాచముఖాలు కలిగిన ఏడు గాడిదలు కట్టబడిన బంగారపు రథం సమీపిస్తుంది ఆ బంగారపు రథాన్ని దూరంగా నిలబెట్టి వచ్చాడు. ఆ రథం వచ్చింది. ఆమెను రథముమీదకెక్కించుకొని తొడమీద కూర్చోపెట్టుకొనిపోతాడు. ఆమె ఎగసిన త్రాచు పామువలె అతని తొడమీద చేరకుండా అధోపరిభాగ ములో పొరలి దుఃఖిస్తూ వుంటుంది 'రామా! లక్ష్మణా! రావణుడు నన్ను అపహరించాడు అన్న వార్త మీకు ఎలా తెలియాలి? నేను బహుశః ఈ రావణుని చేతిలో చనిపోతాను. నేను రాముని, లక్ష్మణుని స్మరిస్తూ చనిపోయానన్న వర్తమానం మీకెలా తెలియాలి?' అని తన దీనమైన రోదనను వినే నాథుడు లేక ఆమె అలమటించిపోతుంది. రావ ణుడు ఆ వనంలో ప్రవేశించిన సమయంనుండి గోదావరి నయితం ప్రవ హించటానికి భయపడుతోంది. ప్రకృతి అంతా స్తంభించిపోయింది. ఇంత దారుణం జరుగుతున్నా ప్రకృతిలో ఒక వస్తువూ చలించటం లేదు. స్తంభీభూతమై కన్నులవెంట నీరు కారుస్తున్నది ప్రకృతి అంతా. సీత కనపడ్డ ప్రతి వస్తువుకూ చెబుతున్నది - 'ఓ ఆశ్రమపదములారా! ఓ వృక్షములారా! ఓ పక్షులారా! మా రాముడు వస్తే యీ రావణుడు నన్ను బలవంతంగా తీసికొని వెళ్లాడని చెప్పండి. ఈ వర్తమానం ఒక్కటి రామునికి చెప్పితే చాలు- అతడు ఏ విధంగానయినా వచ్చి యీ

రాక్షసుణ్ణి సంహరించి నన్ను విడిపించుకొంటాడు' అని ఆక్రందిస్తోంది. ఈ ఆక్రందనంతో రథం ఆకాశంలోకి ఎగుస్తోంది.

ఆ పంచవటిలో ఒక వటవృక్షం మీద 16 వేల సంవత్సరాల వయస్సు కలిగిన జటాయువు వృద్ధుడు, వార్ధక్యంతో కనురెప్పలు సయితం కనులమీద వాలిపోగా కనులు మూసుకొని కూర్చుని ఉన్నాడు. రామా! లక్ష్మణా అని ఆర్తనాదం వినపడుతోంది. అతడు కన్నులు తెరచాడు. సీత అతనిని చూచింది. జటాయువును సంబోధించి ఆక్రందించింది. జటాయువు రెక్కలు విదిల్చి రావణునితో ఇలా అన్నాడు: 'పరభార్యాపహరణం రాజధర్మం కాదు ఓ రావణా! ఖరదూషణాదులను సంహరించాడని రాముని మీద ప్రతీకారం తీసుకోడానికి ప్రయత్నం చేస్తున్నావేమో! ఖర సంహారానికి ధర్మబద్ధమైన హేతువు వుంది. నీవు చేస్తున్న ఈ పని న్యాయంగానీ, ధర్మంగానీ కాదు. సీతను అపహరించి నీవు సాధిస్తున్నదేమిటి? కొంగున విషసర్పాన్ని మూట కట్టుకొంటున్నావు. కాలపాశాన్ని కంఠానికి తగిలించుకొంటున్నావు. మోయలేని బరువు ఎత్తుకొంటున్నావు. కీర్తిలాభంలేని పని చేస్తున్నావు నాకు 16 వేల సంవత్సరాల వయస్సు. నేను లేవలేకుండా వున్నాను. ఒక్క క్షణం ఆగు. భీరువువలె రాముడు లేనప్పుడు సీతను తీసికొనివెళ్ళడం కాదు. ఒక్క క్షణం ఆగితే రాముడు వస్తాడు. రాముడు వస్తే ఖరునికి పట్టిన గతే నీకూ పడుతుంది. ఆగరా! ఆగవా - నాతో యుద్ధంచేసి గెలిచి మరీ వెళ్ళు, నిన్ను ప్రాణాలతో వదలిపెట్టను' అని అడ్డం పడతాడు. రావణుడు అతనిని తృణీకరించి వెళ్ళబోతాడు. కాళ్ళ గోళ్ళతో రావణుని గీరుతాడు. గాయాలు చేస్తాడు. రావణుడు వేసే బాణాలను, ధనువును కాళ్ళతో విరుగకొడతాడు. రావణుడు మరొక ధనువును తీసికొని అతని మీద యుద్ధాన్ని సాగిస్తాడు. మరల అతని ధనువును విరుగకొడతాడు; కవచాన్ని పగులకొడతాడు. నొగలు విరుగకొడతాడు. సారథిని చంపుతాడు. రథాన్ని కూలగొడతాడు. ఛత్రాన్ని విరగకొడతాడు. చివరకు ఆ గాడిదలను కూడ చంపుతాడు.

విరథుడైన రావణుడు సీతను కుడిచంకన నిమిడ్చికొని ముందు భూతలం మీదకు దూకాడు. ఇంతలో మరల రావణుని మీద జటాయువు విజృంభించాడు. అతనికి, ఇతనికి ద్వంద్వయుద్ధం ఘోరంగా జరుగుతుంది. సీత ఎదుట తనకింత అవమానం జరుగుతోందని రావణుడు కృద్ధుడై తన ఖడ్గంతో జటాయువు రెక్కలను తెగకొడతాడు. కొనఊపిరితో నేలమీద పడిపోతాడు జటాయువు. అంతటి జనక మహారాజు నగరంలో పుట్టి, అంతటి దశరథ మహారాజు అయోధ్యకు మెట్టి॰ అంతమంది బలగం వున్న ఆ సీత, భర్తా మరదీ కవచాలుగా తనను రక్షిస్తూంటే భద్రంగా ఉన్న ఆ సీత, అప్పటి తన స్థితిని అనాథస్థితివలె భావిస్తూవుంటే, అంత దారుణమైన ఏకాంత స్థితిలో, బంధువులా ఆదుకొని ఆమెను శత్రువునుండి, రక్షించటానికి ప్రయత్నం చేశాడు జటాయువు. న్యాయం ప్రకారం స్త్రీని ఆపదనుండి రక్షించినవాడు తండ్రి వంటివాడు ఏడు విధములైన గురువులను చెబుతారు స్త్రీలకు. ఆపదలనుండి రక్షించినవాడు తండ్రివంటివాడు. కావున, జటాయువు సీతకు తండ్రివంటివాడు. అప్పుడు జనకుడు లేడు కాని జటాయువున్నాడు. ఈ విధంగా జటాయువు తన తండ్రివలె భాసిస్తూ వుండగా ఆ సీత జటాయువును వెళ్ళి కౌగిలించుకొంటుంది. ఆర్తయై దుఃఖిస్తుంది. రావణుడు ఆమెను సమీపించబోతాడు. ఆమె వెళ్ళి ప్రక్కన నున్న చెట్టును కౌగిలించుకొని 'రామా!, లక్ష్మణా!' అని రోదిస్తూ వుంటుంది ఆమె జడను పట్టుకొని గుంజుతాడు రావణుడు. సీతను చంకన యిరికించుకొంటాడు. ఆకాశమార్గాన వెళ్ళిపోతాడు.

ఈ విధంగా సీతను చంకన ఇరికించుకొని వెళ్ళిపోతే బ్రహ్మదేవుడు ఒక్కడు మాత్రం సంతోషించాడట - 'ఇప్పటికి దేవకార్యం నెరవేరింది' అని. సర్వప్రకృతి విషన్నమైవుంటే బ్రహ్మదేవుడు సంతోషించాడు. గాలిలో ఎగిరిపోతున్న ఆ రావణుడు భగభగమండుతున్న కొండలాగా కన్పించాడు. సీత పట్టపగలే ఉదయించిన చంద్రబింబంలా భాసించింది. వేగంగా వెళ్ళుతుండటంచేత తోకచుక్క పట్టపగలే

ఆకాశమంతా మెరిసినదా అని అన్పించింది. సీత యొక్క నగలు ఆ వేగానికి ఒక్కొక్కటి రాలి క్రిందపడిపోతున్నాయి. అందె క్రింద పడింది. చంద్రహారం క్రింద పడింది. ఈ విధంగా ఒక్కొక్క ఆభరణం క్రింద పడిపోతూవుంటే నక్షత్రాలు రాలుతున్నట్లుగా వుంది. తోకచుక్క కనపడటం, చుక్కలు రాలటం రావణుని పతనానికి సూచకంగా నున్నవి.

సీత రావణుని నిష్ఠురంగా నిందించటం ప్రారంభించింది. 'నీవు వీరుడవేనా? భర్తలేని సమయంలో నన్ను రహస్యంగా తీసికొనిపోతు న్నావు- ఇది వీరలక్షణం కాదు' అని ఎన్ని విధాల రావణుని నిందించి నప్పటికీ ఎక్కడ రాముడు వచ్చి తన పైన దాడి చేస్తాడో అన్న భయంతో వాయువేగంతో అతడు లంకవైపు పరుగెత్తుతూ వుంటాడు. కొంతదూరం పోయేసరికి ఎత్తయిన ఒక పర్వతం కనపడుతుంది. ఆ పర్వతం మీద అయిదుగురు వానరులు సీతకు కనపడతారు. రాముడు బహుశః నన్ను అన్వేషించుకొంటూ వస్తే, నన్ను రావణుడు తీసికొని వెళ్ళాడన్న అంశానికి గుర్తుగా ఆ వానరులు రామునికి అందించడానికి తన కొంగున ఆభరణాలన్ని మూటకట్టి సీతాదేవి ఆ ప్రదేశంలో వదిలి పెడుతుంది. అదే ఋష్యమూక పర్వతం. సుగ్రీవాదులున్న పర్వతం. అక్కడ ఆభరణాల మూటను సీత వదిలిపెడుతుంది.

సముద్రాన్ని దాటుతూ లంకవైపు రావణుడు పోతున్నాడు. అప్పుడు సిద్ధచారుణులు ఇంతటితో పీడ పని సరి అనుకొంటారు.

రావణుడు లంకకు చేరుతాడు. సీతను తన అంతఃపురంలో దింపుతాడు. రాక్షస వనితలను పిలిచి ఆమెకు ఉపచారాలు చేయ మంటాడు. వెంటనే తన రాజసభకు వెళ్ళి ఎనిమిది మంది గూఢచారు లను పిలిచి జన్మస్థానంలో రామలక్ష్మణుల చర్యలను గమనిస్తూ వుండ వలసినదని ఆజ్ఞాపించి దండకారణ్యానికి పంపుతాడు. తరువాత తాను ముస్తాబవుతాడు. సీత యెదుటకు వచ్చి, ఆమెను అనునయిస్తూ ప్రలోభ పెట్టటానికి యత్నిస్తాడు. 'సీతా! ఎన్నో వేలమంది ఉత్తమాంగనలు

నా భార్యలుగా వున్నారు. వారందరికి నీవు ఈశ్వరివిగా వుండవచ్చు. నేను కామాగ్ని తప్తుడను, నన్ను అనుగ్రహించు, దేవతలు నీకు పరిచారకులుగా వుంటారు' అని సీత పాదములపైబడి నమస్కరించటానికి సిద్ధపడతాడు. 'లోకంలో ఎన్నడూ నేను ఎవరినీ యిలా కోరలేదు. కాని, నీ దగ్గరనే నేను ఈ శిరస్సును వంచుతున్నాను. నన్ను నీవు వరించటంవల్ల ధర్మలోపమవుతుందని అనుకొంటున్నావేమో - అలా శంకించకు. చేతకాని మొగుణ్ణి వదిలి సమర్థుణ్ణి చేపట్టడం ఆర్షసమ్మతమైన ధర్మమే. నీకు దాసునిగా, నీకు వశవర్తునిగా నేను వుంటాను. ఇంతవరకూ రావణుడు ఎవరికి నమస్కరించలేదు అంటూ సీతకు రావణుడు నమస్కరిస్తాడు. ప్రియురాలిని సుముఖంగా చేసుకోటానికి వాత్స్యాయన కామసూత్రాల్లో చెప్పిన మంత్రమిది. చిట్టచివరకు దండంతో దాసుని తప్పులు అన్నీ క్షమింపబడతాయి. దాన్నికూడ ప్రయోగించాడు రావణుడు. కాని, సీత ప్రసన్నురాలు కాలేదు, రావణునితో ముఖాముఖీ మాట్లాడకుండా ఒక గడ్డిపోచను అడ్డం పెట్టుకొని యిలా అన్నది: 'రామునితో వైరం అసాధ్యం. నీ స్థితి యూప స్తంభానికి కట్టిన వధ్య పశువులాగా ఉంది. ఇక నిన్ను రాముడు చంపడం తప్పదు. నా దేహం కట్టెవంటిది. నన్ను బంధిస్తే బంధించు. లేకపోతే భక్షించు. నా దేహాన్ని, నా ప్రాణాన్నీ కాపాడుకోటానికి నేను ప్రయత్నం చేయటంలేదు. కాని, పృథ్విలో అపవాదును మాత్రం నేను భరించలేను' అని నిష్ఠురంగా మాటలంటున్న ఆ సీతను చూచి రావణుడిలా అంటాడు. 'ఇంతమంది ఆడవాళ్ళను నేను చూచాను కాని, నీవంటి స్త్రీని నేను చూడలేదు. నీవు కఠినంగా మాట్లాడుతున్నావు. నీకు 12 నెలలు గడువిస్తున్నాను. ఈ 12 నెలల లోపల నాకు అనుకూలవతివై వశవర్తినివైతివా సరి-లేదా 12 నెలలు గడిచిన మరునాటి ఉదయం మా రాక్షసులు నా ప్రాతర్ భోజనంలో నీ మాంసం వండి వడ్డిస్తారు' అని గద్దించి, అశోకవనంలో యీమెను వుంచండని రాక్షస వనితల నాజ్ఞాపిస్తాడు. సీతాపహరణ ఘట్టానికి సంబంధించినంతవరకు కథ యిలా సాగుతుంది.

వాల్మీకి రామాయణంలో సీతాపహరణం ఋజుమార్గంలో జరుగదములేదు. మాయోపాయంచేత సాధింపబడుతోంది. రాక్షసులు చేసిన ఆలోచన ఏమిటి? రావణుడు చేసిన ఆలోచన ఏమిటి? రాక్షససంహారం చేసిన రాముని ప్రాణం ఎక్కడ వుంది? ధర్మంలో వుంది. ఆ ధర్మం ఎక్కడ వుంది? సీతారాముల గార్హస్థ్యధర్మంలో వుంది. సీత పతివ్రతా ధర్మంలో వుంది. ఆ పతివ్రతాధర్మమే రామునికి రక్ష. తులసీ జలంధరుల వృత్తాంతంలోకూడా తులసి యొక్క ప్రాతివత్యమే జలంధరునికి ప్రాణరక్షగా నిలచింది. అలాగే, శ్రీరామునికి ప్రాణరక్ష సీతశీలం. అట్టి సీతా శీలాన్ని అపహరిస్తే రాముని ప్రాణం రాక్షసులకు దక్కుతుంది. అతనిని చంపటం తేలిక అవుతుంది. ఇది అకంపనుడు చెప్పాడు. శూర్పణఖ సూచించింది. రాత్రల్లా రావణుడు ఆలోచించాడు. కాబట్టి సీతాశీలభంగమే రాముని ప్రాణభంగానికి మూలం. ఇది మాయా మార్గంలో నిర్వహింపవలయును కాబట్టి మారీచుణ్ణి ప్రయోగించాడు రావణుడు.

రావణుడు మరియు ఇలా ఆలోచించాడు - 'రాముడు కామి అన్నాడు అకంపనుడు. రాక్షస మాయలకు లొంగాడా - రాముడు దేవుడు కాడు. రాముని చరిత్రను చూస్తే ఆడుదాని మాటలకు లొంగి వనవాసానికి వచ్చాడు. ఇది పరాక్రమవంతుడు చేసే పనికాదు. ఇక్కడ సీతకు వశపరుడై వున్నాడని మా రాక్షసులు చెబుతున్నారు. అందువల్ల ఆడుదాని మాటలకు లొంగిన ఈ రాముడు పౌరుషవంతుడని నేను నమ్మను. నా మాయకు లొంగితే అతడు దైవపురుషుడు కాడు. ఒకవేళ సీత నా మాయకు లొంగిందా, ఆమె నా కామానికి కూడ లొంగుతుంది. లక్ష్మణుడు నా మాయకు లొంగాడా - అతడు వివేకవంతుడు కాడు. అంధానుకారి. రాముని వెంట కళ్లు మూసుకొని నడిచేవాడు అని చెప్పవచ్చును. మాయను ప్రయోగిస్తున్నాను. సీతా, రాముడూ, లక్ష్మణుడూ ఈ మాయ అనే ఉచ్చులో పడతారా పడరా, చూడాలి' అని ఈ మాయ అనే ఉచ్చును మారీచుని ద్వారా ప్రయోగిస్తున్నాడు. మృగంగా వెళ్లేది

మారీచుడు ఒకవేళ చస్తే మారీచుడు చస్తాడు. తాను భద్రంగానే వుంటాడు. తన పన్నుగడ విఫలమయితే మారీచునికి అపాయం కలిగే టట్లు, మారీచుని పన్నుగడ సఫలమయితే తాను లాభించేటట్లు పథకం పన్ని విశిష్టంగా మాయోపాయాన్ని సాగిస్తాడు రావణుడు.

రావణుడు వేసిన పన్నుగడకు సీతారామ లక్ష్మణులు -అందరూ వశపరులైనారు అని చెప్పాలి. సీత మాయామృగమును చూచింది. లక్ష్మణుడు రాక్షసమాయను గుర్తించాడు. సీత మాయామృగాన్ని కావాలని గట్టిగా కోరింది. రాముడు సీతను తృప్తిపరచడానికి మాయా మృగం వెంట వెళ్లాడు. లక్ష్మణుడు చెప్పినట్లు మాయలేడి మారీచుడయితే సంహరిస్తానన్నాడు. ఇలా వెళ్లిన రాముడు కామమోహితుడుగా కనపడతాడు. కాని, ఈ ఘట్టంలో సీతారామలక్ష్మణుల పాత్రలను మనం ప్రతీకాత్మకంగా అర్థం చేసుకొనే విధానం ఒకటి వుంది. రాముడు ఆత్మ. ప్రజ్ఞానం దాని లక్షణం. సీత మనస్సు. ప్రకృతి. మోహం దాని లక్షణం. అది మాయచే ఆకృష్టమవుతుంది. లక్ష్మణుడు బుద్ధి, విజ్ఞానం. వివేకం దాని లక్షణం. ఆత్మ మోహావృతమై బుద్ధిని శాసించింది. బుద్ధి వివేకాన్ని ప్రకటించినా ఆత్మ దానిని మన్నింపలేదు. దీనికి కారణం ప్రారబ్ధమనో లేక కర్మఫలమనో మనము చెప్పాలి. నిజానికి అవతార పురుషులకు పూర్వజన్మ వాసనలనేవి ఏమి వుంటాయి? ఉన్నా వాటి స్వరూపం ఏమిటి? రాముడు నారాయణుని అవతారం. నారాయణుడు రామునిగా అవతరించేటప్పుడు రావణుని సబంధుకంగా సంహరించే ప్రతిజ్ఞ చేశాడు. నిజానికి రామునికి పూర్వజన్మ వాసనలంటూ వుంటే రావణ సంహారాన్ని గురించిన మానసిక చైతన్యమే అతని పూర్వజన్మ వాసనై వుండాలి. ఆ కార్య చైతన్యాన్ని కల్గించటానికి సీత ప్రేరణ. మనస్సు మోహావేశం కాకుండా బుద్ధి అనే లక్ష్మణుడు కాపలాగా వుంటాడు. బుద్ధివివేకాన్ని మోహం శంకిస్తుంది. బుద్ధి నిర్లిప్తత భజిస్తుంది. బుద్ధి మనస్సును వదిలి పరమాత్మవైపు పయనిస్తుంది. ఇది - సీత లక్ష్మణుని శంకించడం, లక్ష్మణుడు సీతను

వదిలి రామునివైపు వెళ్ళటం అనే కథార్థాలలోనున్న తాత్పర్యం. మనస్సు ఆత్మ చైతన్యాన్ని ప్రతిబింబించుకొన్న బుద్ధిని శంకించి మోహాన్ని భజిస్తుంది. మోహమగ్నమైన మనస్సును కామం హరిస్తుంది. బుద్ధి గడియారంలోని పెండ్యులంలాంటిది. ఆత్మ, మనస్సుల మధ్య అల్లల్లాడుతూ వుంటుంది. మనస్సు శంకించింది. మనస్సును రక్షించనందుకు ఆత్మ కోపగించింది. లక్ష్మణుని స్థితి యిదే. బుద్ధిస్థానీయుడైన లక్ష్మణుడు అటు రాముని ఆజ్ఞ, యిటు సీత ఆజ్ఞ ఆత్మ, మనస్సుల మధ్య అల్లాడుతాడు. మనస్సు బుద్ధిని శంకిస్తోంది అంటే. సీత లక్ష్మణుని శంకిస్తోంది. బుద్ధి మనస్సుని వదిలి పరమాత్మవైపు వెళ్ళుతుంది. మనస్సును కష్టసమయంలో రక్షించవలసిన బాధ్యత బుద్ధికి వున్నది అని పరమాత్మ నిర్దేశం. అలా మనస్సుని రక్షించనందుకు, అంటే ఆ సమయంలో పీడిరాకుండా రక్షించనందుకు, ఆత్మస్వరూపుడైన రాముడు కోపగిస్తాడు అలా, లక్ష్మణుడు బుద్ధిస్థానీయుడై అటు ఆత్మ మనస్సుల మధ్య తన పాత్రను నిర్వహించటానికి విచిత్రమైన పరిస్థితులలో నించుంటాడు. ఇది యీ ఘట్టంలో వున్న ప్రతీకాత్మకమైన ప్రవృత్తి.

రావణుడు సీతారామలక్ష్మణులను ఒక విధంగా తన అహంకార వలయంలో బంధించాడు అని చెప్పాలి. రావణుని తామసాహంకార ప్రవృత్తి క్రమంగా సీతారామలక్ష్మణుల మీద యీ ఘట్టంలో స్పష్టంగా కనపడుతుంది. సీత రాముని శాసించడంతో రాజసాహంకారాన్ని ప్రకటించింది లక్ష్మణుని శంకించటంలో తామసాహంకారాన్ని ప్రదర్శించింది. రాముడు సీతను మన్నించి మృగం వెంట వెళ్ళటంలో సాత్త్వికాహంకారాన్ని ప్రకటించాడు. 'మాయను చేజిక్కించుకొంటాను లేదా సంహరిస్తాను' అని అనటం ప్రజ్ఞాన లక్షణం. ఇట్టి ప్రజ్ఞాన లక్షణం ప్రదర్శితమవుతున్నది కాబట్టే శ్రీరామునిది సాత్త్వికాహంకారమని చెప్పాలి. లక్ష్మణుడు నిందను భరించలేక సీతను వదలడం రాజసాహంకార లక్షణం. నిందాస్తుతులకు అతీతమైన నిరహంకార స్థితియం

దుండక, నిందకు భయపడి ఆత్మాభిమానాన్ని ప్రదర్శించినటువంటి లక్ష్మణుని యొక్క ప్రవృత్తి రాజసాహంకారానికి ప్రతీకగా అన్వయించుకోవలసివస్తుంది. ఇక రావణుడా - తామసాహంకార ప్రవృత్తికి ప్రతీక. తామసాహంకార ప్రవృత్తిని ప్రకటించిన సీతను ఆసుర ప్రవృత్తితో అపహరించగలగటం అతని పాత్రయొక్క విశిష్టత. తామ సాహంకార ప్రకటనము చేసిన సీతను మాయోపాయంతో రావణుడు గ్రహించగలిగాడు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు ఈ ఘట్టంలో ప్రతీకాత్మకమైన తాత్త్వికవ్యాఖ్యానం రామకథా రసవాహినిలో చెప్పారు: 'ప్రకృతిని విశ్వసించి పరమాత్మను వేరు చేసినపుడు ఆనందం అందుకోలేము. కామత్యాగాన్ని రామాయణం మనకు నిరూపణ చేసినది. సర్వ సుఖములు త్యజించిన సీత కామమును త్యాగము చేయుట చేత రామునితో పోవటానికి అవకాశము కలిగినది. తిరిగి త్యాగము కామముగా మారింది. మధ్యలో బంగారు లేడిపై కామము కలిగినది. అప్పుడు రాముడు దూరమైపోయాడు. ఇట్టి పవిత్ర అంత రార్థాన్ని బోధించింది రామాయణము. కాని, అది ఏదో **Family fight** కాదు' అని స్వామి యీ ఘట్టాలలో వున్న తాత్త్వికమైన రహస్యాన్ని మనకు ప్రకటించారు.

భారతీయులకు రామాయణం ఆదర్శగ్రంథం. అందులో సీతా రామ లక్ష్మణ పాత్రలు ఆదర్శపాత్రలు. వారి ప్రవర్తనల్లో కాని, ప్రవృత్తుల్లో కాని ఎటువంటి లోపమున్నదని భావించినా, భారతీయుల హృదయాలు సహించలేవు. అందువల్ల ఈ కథార్థాలలో ఔచిత్యం ఎంతవరకు వున్నది అని కొంతమంది చర్చ చేసి, ఔచిత్యపోషణం కోసం కథార్థాలో మార్పులు చేసి, అన్యథా కల్పనలు కూడా చేశారు. లక్ష్మణునికా భ్రమలేదు. రామునికా భ్రమ వుండకూడదు. రాముడు ఆ మృగంవెంట పోకుండా దానిని బాణాలతోనే బంధింపవచ్చునుకదా! దానివెంట ఆయన అంత దూరం ఎందుకు పోయినాడు? రాముని గొంతుకతో మారీచుడు పిలిచినపుడు లక్ష్మణుడు భ్రమపడలేదు. సీత

భ్రమపడింది. అయితే, సీతను వదిలిపోయేటప్పుడు లక్ష్మణుడు సీతను కూడ తనతో ఎందుకు తీసికొనిపోలేదు? అలా తీసికొనిపోవచ్చును కదా! లేదా రాక్షసులను సంహరించగలిగినటువంటి అస్త్రాన్ని ఏదైనా అభిమంత్రించి ఆమెకు రక్షగా నిలుపవచ్చు కదా? మరొక ప్రశ్న. రావణుడు సీతాపహరణం చేస్తున్నపుడు సీతను స్పృశించాడా? ఒక వేళ అతడు ఆమెను స్పృశించగలిగినట్లయితే ఆమె పాతివ్రత్య మహిమ ఏమైనది? ఇలాంటి ప్రశ్నలు ఎన్నో రామాయణ కథార్థాలలో పెక్కు మంది హృదయాలను ఆలోచనామయం చేసినవి. వీటన్నింటికీ 'విధి బలీయ'మని ఒక సమాధానం చెప్పవచ్చు. కాని, కార్యకారణ సంబద్ధమైన కథార్థాలను కల్పించటంలో నేర్పు కలిగినటువంటి కవులు గాని, రసికులు కాని ఈ సమాధానాన్ని అంగీకరింపరు. కార్యకారణ సంబద్ధమైన కథాకల్పనల్లో పాత్రల శీలములు దెబ్బతినకూడదు. అందువల్ల కొందరు ఈ ఘట్టంలో కొన్ని కథార్థాలను వాల్మీకి రామాయణంలో వున్నదానికంటె అన్యధా కల్పించారు.

రామ లక్ష్మణ పాత్రల ఔదాత్త్యాన్ని పోషించటానికి భాసుడు ప్రతిమా నాటకంలో శ్రాద్ధకర్మలను కల్పించాడు. దశరథ మహారాజు శ్రాద్ధ దినం వస్తుంది. రాముడు పితృదేవతలకు పిండాల నివ్వడానికి యత్నిస్తూ వుంటాడు. యోగ్యుడైన పురోహితు డెవడైనా దొరకుతాడేమో అని అన్వేషిస్తూ వుంటాడు. రావణుడు బ్రాహ్మణవేషంతో అక్కడకు వస్తాడు. శ్రాద్ధ కర్మలు చేస్తున్నపుడు పితృదేవతలకు కాంచన మృగ మాంసము కనుక పిండాలుగా అర్పించినట్లయితే వారికి ఉత్తమ గతులు లభిస్తాయని చెప్పుతాడు. అటువంటికాంచన మృగాలు హిమవత్ పర్వత ప్రాంతంలో వుంటాయని సూచిస్తాడు. అంతలో మారీచుడు కాంచన మృగ వేషం ధరించి ఆ ప్రాంతంలో తిరుగుతూ వుంటాడు. రాముడు అదే సమయమున ఆ మృగాన్ని పట్టి, ఆ మృగ మాంసాన్ని పితృదేవతలకు అర్పించవచ్చునని భావించి, ఆ మృగాన్ని చంపడానికై దానివెంట వెళ్ళుతాడు. అయితే, ఆ సమయంలో

లక్ష్మణుడు ఆశ్రమంలో లేడు. కులపతులకు ఆహ్వానం చెప్పడానికి దూరతీర్థానికి వెళ్ళివుంటాడు. అందువలన, లక్ష్మణుడు ఆశ్రమంలో లేని సమయం, రాముడు కాంచన మృగ మాంసముకోసం వేటాడ వెళ్ళిన సమయం చూచి రావణుడు సీతను అపహరిస్తాడు. ఈ కల్పనం వలన రామపాత్ర, లక్ష్మణపాత్ర విశుద్ధమైనటువంటి శీలములతో ప్రకాశించడం జరుగుతుంది. ఆ పాత్రలలో ఎటువంటి లోపము ఏర్పడకుండా పోయింది.

అలాగే సీతయొక్క పాతివ్రత్య మాహాత్మ్యాన్ని పోషించటానికి అధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం మొదలైన రామాయణాలు ఎన్నో కల్పనలు చేసినవి. అధ్యాత్మ రామాయణం మాయా సీతా కల్పనము చేసింది. నిజ సీత అగ్ని గర్భంలో ప్రవేశిస్తే, మాయా సీత మాత్రమే ఆశ్రమ పదంలో వుంటుంది. రావణుడు అపహరించినది మాయా సీతను కాని సత్యసీతను కాదు. ఆ మాయా సీతను కూడ రావణుడు కరస్పర్శ తగులకుండా మట్టిపెళ్ళతోసహా పెకలించి తీసికొని వెళ్ళాడు. సీతామహాదేవి మాయా రూపములో వున్నా ఆ తల్లి శరీర స్పర్శను రావణుడు పొందకూడదు అని అధ్యాత్మ రామాయణం సీత పాతివ్రత్యాన్ని పోషించటానికి ఈ కల్పనంలో ప్రయత్నించింది. ఆనంద రామాయణము మరొక అడుగు ముందుకు వెళ్ళింది. సీత తన ఆకృతిని మూడు గుణాలను ఆశ్రయించి మూడు రూపాలుగా మార్చుకొంటుంది. సత్త్వరూపంగా వున్న సీత రాముని వామపార్శ్వంలో నిలుస్తుంది రజోరూపంలో వున్న సీత అగ్నియందు ప్రవేశిస్తుంది. ఛాయా మాత్రంగా వుండే తమోరూపమైన సీత ఆశ్రమంలో వుంటుంది. దీనిని బట్టి రాముని వామపార్శ్వంలో వున్న సీత సత్త్వగుణ ప్రధానురాలైన సీత. అగ్నియందు ప్రవేశించిన సీత రజోరూపమైన సీత రావణునిచేత అపహరింపబడిన సీత తమోరూపమైన సీతగా తెలుస్తున్నది. ఆనంద రామాయణ కల్పనలో మరొక ఔచిత్యం మనము చూడవచ్చు. సీతను

వదిలిపెట్టి లక్ష్మణుడు వెళ్ళుతున్నపుడు సీతచుట్టూ మంత్ర పూతము లైనటువంటి నాలుగు గిరులను గీచి వెళ్ళినట్లు అందులో చెప్పబడింది. ఈ నాలుగు గిరులను దాటి సీతను రావణుడు చేరుకోలేకపోతాడు. సీతను భిక్ష పెట్టటానికి గిరులు దాటి రమ్మనమంటాడు. ఆమె దాట టానికి అంగీకరించదు. 'అతిథి దేవోభవ' అన్న న్యాయాన్ని చూపించి దైవస్వరూపుడైన అతిథిని అర్చించటానికి నీవు వెనుకంజ వేస్తున్నావు అన్న అభాండాన్ని వేస్తాడు. ధర్మభంగమవుతుందని సీత ఆ గీతలను దాటి రావణునికి భిక్ష పెడుతుంది. గీతలు దాటిన సీత రక్షావలయాన్ని దాటి ఇవతలకు వచ్చిన సంగతి తెలుసుకొని ఆమెను అసుర మాయతో రావణుడు గ్రహించి తీసుకొనిపోతాడు. ఈ కల్పనం లక్ష్మణుడు సీతను వదలి తాను రాముని వద్దకు పోతూ సీతకు ఎటువంటి రక్ష కల్పించ కుండా వెళ్ళాడన్న అపనిందను పొందకుండా ఉండటానికి తోడ్పడు తుంది.

కంబ రామాయణం సీతాస్పర్శను రావణుడు చేశాడు అన్న కల్పనను తొలగించి సీతను ఆశ్రమంతో సహా ఎత్తుకొని పోయినట్లుగా చిత్రిస్తుంది. ఈ విధంగా సీత పాతివ్రత్యాన్ని సమర్థించటానికి వివిధ రామాయణాలు ఎన్నో కల్పనలు చేసినవి. రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ సత్యనారాయణ గారు మరొక విచిత్రమైన కల్పన చేశారు. రావణుడు సీత కరాన్ని పట్టుకొని లాగుతాడు. అతనియొక్క కర స్పర్శ తగులకుండా ఆమెను గాజులు రక్షించాయి అని. ఆ ఘట్టాన్ని యిలా వర్ణించారు శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో :

మంజరి - 'దశకంతు చేతుల ధరణీ జాహస్త
జలజాతముల పదిజతలైన గాజు
లందున నొక్క యాయమ భద్రపరుప
గాజులు చిట్లి తత్కరములు పెట్లి
నెత్తురు కారుచు ధారుణీసుత కెంలా
నొవ్వైన సీతాతనూస్పర్శ దైత్య

కరతలంబునయందుఁ గానట్టి స్థితికి
తల్లి సంతోషించెఁ దా మనస్సునను.'

గాజులు చిట్లి చేయి పెట్లి నెత్తురు కారుతూ తనకు ఎంతో బాధ కలిగి నప్పటికి ఆ సీతామాత తనకు ఆ రావణ కరస్పర్శ తగలలేదన్న సంతృప్తితో ఎంతో సంతోషించిందట. ఆధునిక రామాయణాల్లో కూడ రావణ స్పర్శ తగులకుండా సీతాపాతివ్రత్యాన్ని రక్షించటానికి సహృదయులు, భక్తులు అయిన కవులు ఎన్నో విధాలైన కల్పనలు చేశారు అన్నదానికి ఈ రామాయణ కల్పవృక్ష కల్పనం తార్కాణంగా నిలుస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో రామ, రావణ పాత్రలు విశిష్టంగా పోషించబడ్డాయి. రాముడు తాను పరబ్రహ్మ స్వరూపుడు అను ప్రత్యభిజ్ఞ కలవాడు.

"అథ రామోఽపి తత్సర్వం జ్ఞాత్వా రావణ చేష్టితం
వా చా సీతా మేకాంతే శ్రుణు జానకి! మేవచః
రావణో భిక్షు రూపేణ ఆగమిష్యతి తేఽంతికం
త్వంతు చ్ఛాయాం త్వదాకారాం స్థాపయి త్వోటజే విశ
అగ్నౌ వదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మయాజ్ఞయా
రావణస్యవధాం తే మాం పూర్వవ త్ప్రాప్యసే శుభే.
శ్రుత్వా రామోదితం వాక్యం సాపి తత్ర తథాఽకరోత్
మాయా సీతాం బహిః స్థాప్య స్వయ మంతర్ధదేఽనలే."

ఈకల్పనంలో రావణుడు బిక్షుకవేషములో వచ్చి,సీతను అపహరిస్తాడని తెలిసినవాడు రాముడు ఆసత్యమును సీతకు చెప్పినవాడు రాముడు. నిజాకారాన్ని అగ్నిలో దాచి మాయారూపంతో ఆశ్రమంలో నిలువుమని రాముడే సీతను ఆదేశిస్తాడు. రాముని ఆదేశం ప్రకారమే సీత నిజా కారాన్ని అగ్నిలో వుంచి తన మాయాకారాన్ని ఆశ్రమంలో వుంచు తుంది. బిక్షుక వేషంలో వచ్చే రావణునికోసము ఆమె ఎదురు చూస్తున్నదన్నమాట. సీతారాములిద్దరూ స్వీయమైన ప్రత్యభిజ్ఞతో తెలిసి

ఆడిన నాటకమే అధ్యాత్మ రామాయణంలోని యీ ఘట్టం. ఇక రావణుడా-జ్ఞాని. నారాయణుడే రాముడనీ, లక్ష్మియే సీత అనీ తెలిసి నటువంటి జ్ఞాని.

"జానామి రాఘవం విష్ణుం లక్ష్మీం జానామి జానకీం
జాత్వైవ జానకీ సీతా మయానీతా వనా ద్బలాత్.
రామేణ నిధనం ప్రాప్య యాస్యా మీతి పరం పరం
పరానందమయీ శుద్ధా సేవ్యతే యా ముముక్షుభిః
తాం గతిం తు గమిష్యామి హతో రామేణ సంయుగే
ప్రక్షాళ్య కల్మషాణీహ ముక్తిం యాస్యామి దుర్లభాం.
క్లేశాది పంచగతరంగ యుతం భ్రమాఢ్యం
దారాత్మజాప్త ధనబంధు ఝషాభియుక్తం
ఔర్వానలాభ నిజరోష మనంగజాలం
సంసారసాగర మతీత్య హరిం వ్రజామి."

రాముని చేతిలో చావు మోక్షపదమని నమ్మిన భక్తుడు రావణుడు. సంసార సాగరాన్ని తరించటానికి శ్రీరాముని వలన మృతియే తరణోపాయమని తెలిసిన జ్ఞాని.

అధ్యాత్మ రామాయణంలో రావణుడు, సీతను మాతగా భావించాడు.

'స్వాంతఃపురే రహస్యే తా మశోకవిపినే క్షిపతు
రాక్షసీభిః పరివృతాం మాతృబుద్ధ్యా స్వపాలయత్'

అశోకవనంలో సీతామాతను బంధించినా, రాక్షసీ వనితలచేత ఆమెను పరిరక్షింపచేస్తూ వున్నా ఆమె యందు మాత్రం రావణుడు మాతృ బుద్ధినే ప్రకటించాడని అధ్యాత్మ రామాయణం విశేషించి చెప్పుతోంది. రావణుడు సీతను కామియై గ్రహించినవాడు కాడు. సీతను మాతగా తెలిసి, మహా మాయగా తెలిసి, లక్ష్మీదేవిగా తెలిసి ఆమెను ఉపాసించ టానికి తీసికొని వచ్చిన భక్తునిగ మనకు కనపడతాడు. రావణుడు సీత నిలచిన నేలగడ్డను పెళ్ళగించుకొనిపోతాడు అధ్యాత్మ రామాయణంలో.

ఛాయాసీతకుకూడ స్పర్శ దోషం సోకకుండ అధ్యాత్మ రామాయణ కర్త కాపాడాడు. అధ్యాత్మ రామాయణంలో రాముడు పరమాత్మ,సీత మహా మాయ. రావణుడు భక్తుడు. రావణుడు సీతను మాతగా భావించాడు. ఈ కల్పనలలో సీతారామ పాత్రలేకాక రావణ పాత్ర కూడ ఉదాత్తీకరింపబడింది.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు అధ్యాత్మ రామాయణ కల్పనలను గ్రహించి తత్త్వవ్యాఖ్యానం చేశారు, తమ రామకథా రసవాహినిలో. "మనమొనర్చు ప్రతి చిన్న కార్యము సంసారికి ఆదర్శవంతమైనట్టిదిగా వుండవలెను. సతీపతుల సభ్యతలకు ఎట్టి అవాంతరములు వాటిల్లక, సత్యధర్మములకు విరుద్ధముగాక, శాస్త్రసమ్మతమైన మార్గాన్ని వీడక, సామాన్య మానవ మాత్రులకు ఆదర్శవంతమైన జీవితమును అందించుచూ రావణ రాక్షస సంహారము వరకు మనమీ నాటకమును ఆడవలసివున్నది. అంతవరకు నీ దివ్యరూపాన్ని అగ్నిలో ప్రవేశపెట్టి సామాన మాయా మానుష విగ్రహకారివై సంచరించుము. కారణము లేని కార్యము లోక విరుద్ధము." ఈ మాటలు శ్రీరాముడు సీతాదేవితో అంటాడు. రామునికీ, సీతకూ తాము ఏ కార్యాన్ని ఉద్దేశించి దండకారణ్యానికి వచ్చారో వారికి తెలుసు. తెలిసి లోకానికి వాస్తవంగా కనపడడానికి వారిద్దరూ కలిసి ఆడిన నాటకంగా బాబా వారీ సన్నివేశములోని తాత్త్వికార్థాన్ని వ్యాఖ్యానం చేశారు. అధ్యాత్మ రామాయణ తత్త్వము రామాయణ సన్నివేశంలోని పరమార్థమని భగవాన్ బాబా వారి నిష్కర్ష.

ఇక్కడ మరోవిషయం మనం గమనించాలి. అధ్యాత్మ రామాయణం చేసిన తాత్త్వికమైన వ్యాఖ్యానానికి ఆధారం వాల్మీకి రామాయణంలోనే వుంది. మాయామృగం వెంటవెళ్ళుతూ శ్రీరాముడు లక్ష్మణునితో యిలా అంటాడు:

'అస్యా మాయత్త మస్మాకం యత్కృత్యం రఘునందన!'

'ఇక మనం చేయవలసిన పని అంతా సీతకోసమే' అని దీని అర్థం. ఇక జరగబోయే కథ అంతా సీత ననుసరించే నడుస్తుందనీ, సీతకోసమే

భావి కార్యం ప్రవర్తితమవుతుందనీ, సీతాకథయే భావి కథయనీ, యిందులో వాల్మీకి రాముని పాత్ర ద్వారా సూచిస్తున్నాడు. ఈ సూచనను ఆధారం చేసికొని పరమాత్మ స్వరూపుడైన రామునిలో రావణ సంహారరూపమైన చైతన్యాన్ని ప్రకోపింపచేస్తున్న శక్తి స్వరూపిణి సీతగా అధ్యాత్మ రామాయణంలో కల్పింపబడుతుంది.

"రామం విద్ధి పరంబ్రహ్మ సచ్చిదానంద మద్వయం
సర్వోపాధి వినిర్ముక్తం సత్తామాత్ర మగోచరం.
ఆనందం నిర్మలం శాంతం నిర్వికారం నిరంజనం
సర్వవ్యాపిన మాత్మానం స్వప్రకాశ మకల్మషం....
మాం విద్ధి మూలప్రకృతిం సర్గస్థిత్యంతకారిణీం
తస్యసన్నిధి మాత్రేణ సృజామీద మతంద్రితా
తత్సాన్నిధ్యా న్మయా సృష్టం తస్మి న్నారోప్యతేఽ బుధైః."

ఈ సీత మాటలు అందుకు సాక్ష్యాలు. రామకథా రసవాహినిలో భగవాన్ బాబా వారు శ్రీరామునిచేత సీతతో పలికించిన మాటలు అధ్యాత్మ రామాయణ తత్త్వదృష్టికి ఉదాహరణలుగా కనపడతాయి. 'నీవు, అగ్నిలో ప్రవేశించి, రాక్షస సంహారమున నీవును నా కార్యములో భాగము వహించవలసి వుంటుంది. నీవు నిమిత్తమాత్రంగా సామాన్య రూపంలో రావణుని ఆధీనములో వుండినా నీ శక్తి అగ్నియందు వుండుట చేత ఆ అగ్నిరూపమైన నీవు లంకను భస్మము కావింపవలసివుంటుంది. లంకను అగ్ని కాదు భస్మము కావించుట నీవే. అనగా సీతయే లంకను కాల్చెను. రాముడే రావణుని సంహరించెను అన్న సత్యమును లోకానికి అర్థమగునట్లు చేయవలసి వున్నది. ఈ చమత్కారములు లక్ష్మణునకు తెలియరాదు. లక్ష్మణుడు మన పరికరమే తప్ప అన్య శక్తికి సంబంధించడు.' రాముని ఈ వాక్యాలలో భగవాన్ బాబావారు పరమాత్మ స్వరూపుడైన శ్రీరాముని తత్త్వాన్నీ, మూల ప్రకృతి రూపయైన సీతా మహాదేవి తత్త్వాన్నీ చక్కగా, తాత్త్వికంగా వ్యాఖ్యానించి చెప్పారు.

దీన్నిబట్టి రామాయణంలోని కథార్థాలకంటె అందులో మనం గమనించవలసిన పరమార్థానికే ప్రాముఖ్యం వుందని తెలుస్తున్నది. మన దేశంలో రామాయణ కథ కంటె అధ్యాత్మ రామాయణ కథ ప్రాచుర్యంలో వుంది. రామాయణం రసమార్గానికి సంబంధించినది. ఆదర్శ దృక్పథంతో నిర్మింపబడింది. ఇందులోని పాత్రలు అన్నీ ఆదర్శ పాత్రలు. అధ్యాత్మ రామాయణం ప్రతీకాత్మక ప్రవృత్తితో ఆధ్యాత్మిక దృక్పథంతో నిర్మింపబడింది. అందులోని రామాది పాత్రలన్నీ అధ్యాత్మిక దృక్పథంతో అవగాహనం చేసికోతగిన ప్రతీకాత్మక పాత్రలు. అందులోని రాముడు ఆత్మారాముడు. రాముడు ఆత్మారాముడు అని తెలిసికొనడమే బ్రహ్మానంద సిద్ధి. శ్రీరాముడే, శ్రీసాయి రాముడే పరబ్రహ్మం. ఆయనే మనకు పరమార్థం. ఓం శ్రీసాయిరామ్!

# సీతాన్వేషణం

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము.
సాయి కుటుంబ సభ్యులకు నమస్కారము.

## పాట

పల్లవి : శ్రీకరా! చిన్మయరూపా! శివా!
శ్రితజనపాలా-ఉభవా! సాయీశ్వరా!

అనుపల్లవి: సుందరా! సీతానందకరా!
నందితపవనాత్మజా! రామేశ్వరా!

1. ధర్మము నీవే - బ్రహ్మము నీవే
భక్తియు నీవే - శక్తియు నీవే
భవసాగరమును దాటుటకొరకై
వరయోగమనే వారధి నీవే
పావనా! ప్రేమస్వరూపా! ప్రభో!
పర్తివిహరా! విభో! సాయీశ్వరా!

2. చరణము లంటితి - శరణము వేడితి
సర్వము నీవని - సన్నిధి కోరితి
శబరిని నేనై సాగిల పడితిని
హనుమను నేనై అంకిత మైతిని
మాధవా! ప్రణవస్వరూపా! ప్రభో!
మధురాద్వైతా! విభో! సాయీశ్వరా!
శ్రీకరా! చిన్మయరూపా! శివా!
శ్రితజనపాలా! ఉభవా! సాయీశ్వరా!

శ్రీమద్రామాయణంలో సీతాన్వేషణఘట్టం మధురాద్వైత తత్త్వాన్వేషణం. సీత అంటే నాగేటిచాలు. ఈ నాగేటిచాలు ఏమిటి? సనాతన ధర్మమార్గం. సీతాన్వేషణం అన్న సమాసానికి రెండు విధాలుగా అన్వయం చెప్పుకోవచ్చు. 1.సీత కొరకైన అన్వేషణం. 2.సీతయొక్క అన్వేషణం. సీతకొరకైన అన్వేషణం చేసినది శ్రీరాముడు. భరించేవాడు భర్త కాబట్టి భార్యను రావణుడు ఎత్తుకొనిపోతే, ఆమె ఎక్కడ, ఏ స్థితిలోవుందో తెలిసికొని, ఆమెను తనతో చేర్చుకొనడం శ్రీరాముని ధర్మం. ఆ విధంగా స్వీయధర్మ నిర్వహణార్థమై సీతను అన్వేషించిన విధానాన్ని సీతాన్వేషణంగా చెప్పుకోవచ్చు. మరి సీత యొక్క అన్వేషణ మేమిటి? రాముడు అవతారకార్యాన్ని నిర్వహించటానికి భువిపై వెలసినాడు రావణసంహారం చేస్తానని దేవతల ఎదుట నారాయణుడు ప్రతిజ్ఞ చేశాడు. అతడు మానవాకృతిని ధరించి దేవతలకు అసురబాధ తొలగించటానికై రావణాసుర సంహారం ఎలా చేయాలి? ఆ మార్గాన్ని ఎలా ఆవిష్కరించాలి? సీత శ్రీరాముని యొక్క అవతార కార్య నిర్వహణంకోసం మార్గాన్ని అన్వేషించి సాయపడే పద్ధతిని సీతయొక్క అన్వేషణంగా మనం భావించవలసి వుంటుంది. ఈ అన్వేషణకు మార్గం ఏమిటి? రాముడు కిష్కింధగుండా వెడలి సముద్రాన్ని దాటి, లంకకు చేరడం ఈ అన్వేషణ మార్గం. రావణుడు సీతను తీసుకొని పోతున్నప్పుడు, రావణుడు తనను అపహరించి తీసుకొనిపోతున్నాడన్నసంగతి శ్రీరామునికి తెలియటానికై సీత కొన్ని సంజ్ఞలను, కొన్ని గుర్తులను ఆ మార్గంలో వేస్తూ వెళ్ళింది. జటాయుసంహారం ఒక గుర్తు. ఋష్యమూక పర్వతంమీద తన నగలను మూటకట్టి సీతమ్మవారు వేసినది మరొక గుర్తు. ప్రధానంగా సీత గమించిన మార్గాన్ని అన్వేషించటానికి ఈ రెండూ ముఖ్య సంకేతాలుగా రామునకు తోడుపడుతాయి. రామ అయనంలో కిష్కింధ ఒక మజిలీ. సుందరకాండ మరొక మజిలీ. ఈ రెండు మజిలీల విశేషాలను తెలుసుకొనడమే కిష్కింధ, సుందరకాండలలో వున్న తత్త్వం.

మనం ఇంతవరకూ భావిస్తున్నట్లుగా రామాయణం మూడు నగ రాల చరిత్ర. ఆ మూడు నగరాలలో కిష్కింధ లేదు మిథిల,అయోధ్య, లంక అన్నవి మూడు నగరాలుగా మనం పేర్కొన్నాం. కిష్కింధ కూడ ఒక నగరమే కదా! దీనిని కలుపుకొని నాలుగు నగరాలుగా మనం భావించవచ్చును కదా! అని చర్చించవచ్చును. కాని, కిష్కిం ధకు ఒక ప్రత్యేక ప్రతిపత్తి లేదు. ఒకవైపునుండి చూస్తే, అయోధ్యకు కిష్కింధ ఒక అనుబంధ నగరం. మరొకవైపునుండి చూస్తే రావణ స్రామాజ్యానికి చిట్టచివరి ఎల్లగా కనపడుతుంది. రామ, రావణ స్రామాజ్యాల సంగమసీమలాగా కిష్కింధ మనకు తోస్తుంది. అది ఎలాగో సంగ్రహంగా గమనిద్దాం

రాముడు కిష్కింధకు చేరుకునే సమయానికి వాలి కిష్కింధను పాలిస్తున్నాడు వాలి రావణ స్వభావానికి ప్రతినిధి. సుగ్రీవుని భార్యను బలవంతముగా హరించి సుగ్రీవుణ్ణి దేశముల మీదకు తరిమి, అతని నామరూపాలు లేకుండా చేయాలని ప్రయత్నిస్తున్నాడు వాలి. రావ ణుడు సీతను హరించి రాముని నామరూపాలు లేకుండా చేయాలని ప్రయత్నిస్తున్నాడు. ఇట్టి రావణుని స్వభావానికి అనుగుణమైన వ్యక్తిగా, రావణునికి ప్రతిబింబ రూపంగా వాలి కిష్కింధను పాలిస్తు న్నాడు. నిజానికి రావణుని ప్రభావం కిష్కింధపై అప్పుడప్పుడు బలంగా వుంది. సుగ్రీవుడా - అమాయకుడు. భ్రాతృభక్తి, గురుభక్తి కలవాడు. ఎక్కడా రక్షణ లేకపోతే మతంగ మహర్షి వాలికిచ్చిన శాపం ప్రకారం ఋష్యమూక పర్వతం క్షేమముగా వుంటుంది కాబట్టి నలుగురు మంత్రులతో ఆ పర్వతంమీద నివసిస్తూ వున్నాడు. అవకాశం దొరికితే, దైవం అనుకూలిస్తే, ధర్మవిజయాన్ని సాధించటానికి ఆయన కంకణం కట్టుకొని వున్నాడు. దైవంమీద భారంవేసి, పురుష యత్నాన్ని సాగిస్తున్న నిర్మలుడైనవాడు సుగ్రీవుడు. ఈ సుగ్రీవునితో శ్రీరామునికి స్నేహం కలుగుతుంది. వాలిని సంహరించి కిష్కింధను సుగ్రీవునికి పట్టం కట్టటానికి రాముడు శపథం చేస్తాడు.

వాలి పాలించే కిష్కింధ లంకకు లెంకగా వుండేది. సుగ్రీవుడు పాలించే కిష్కింధ అయోధ్యతో స్నేహాన్ని సాధించుకొనేది. లంకేశ్వరునికి లెంకగా వున్న ఈ కిష్కింధను భరత రాజ్యంలో భాగంగా మార్చాడు రాముడు. ఇదే, కిష్కింధలో ప్రత్యేకించి రాముడు చేసిన పరివర్తనం. అసురమైన ప్రవృత్తి ఏ పట్టణంలో రాజ్యం చేస్తున్నదో, ఏ రాజు రాజ్య ధర్మం కంటే స్వీయ ధర్మం ప్రబలమని భావించి, స్వీయమైన అహంకారానికి అనుగుణంగా తన తమ్ముని సహితం నానా అగచాట్లుపాలు చేస్తున్నాడో, బలవంతుడు అధర్మాన్ని ఆచరించినా, ధర్మంగా చెలామణి చేసె నిరంకుశ ప్రవృత్తి ఏ రాజు తన రాజ్యంలో ప్రబలింప చేస్తున్నాడో అట్టి రాజ్యాన్ని అంతం చేసి, రామరాజ్య భావానికి అనుగుణమైన చిత్తప్రవృత్తిని కలిగిన ఒక రాజును అక్కడ ప్రతిష్ఠాపనం చేయడం శ్రీరాముడు కిష్కింధలో ప్రదర్శించిన లీల. రామరాజ్యానికి సుగ్రీవుణ్ణి ప్రతినిధిగా నిలిపాడు. ఆ సుగ్రీవుడు రామ కార్యానికి కార్యక్షేత్రంగా కిష్కింధను మార్చాడు. అందువల్ల శత్రు నగరాన్ని మిత్ర నగరంగా మార్చి, ఆ మిత్ర నగరంలో భక్తిప్రపత్తిని రేకెత్తింపచేసి. ఆ భక్తిని శక్తిగా పరిణమింపచేసి, తన కార్యాన్ని సాధించుకొన్న ప్రభువు శ్రీరామచంద్రుడు.

వాలి రావణుని నిర్జించిన బలశాలి. రావణుని సహితం జయింప గలిగిన వాలిని ఒక్క బాణంతో సంహరించి, రావణుడు అనుసరించిన అధర్మ మార్గాన్ని సమూలంగా నాశనం చేసి, తాను లంకలో చేయ బోతున్న ధర్మప్రతిష్ఠాపనానికి నాందిగా, రామ రావణ యుద్ధ నాటకానికి ప్రస్తావనగా వాలి సంహారాన్ని, సుగ్రీవ పట్టాభిషేకాన్ని రాముడు చేసి చూపించాడు. వీరుడైన వాడు వీరునికి బాణంతో తనను తాను పరిచయం చేసికొంటాడు. పరభార్యను దొంగిలించిన రావణునికి ఏ గతి పడుతుందో వాలికి ఆ గతిని పట్టించి, అట్టి బాణ పరాక్రమం చేత రాముడు తన సత్యపరాక్రమత్వాన్ని రావణునికి తెలియపరుస్తు న్నాడు. అందువల్ల భావి రామాయణ కథా నాటకానికి సుగ్రీవ పట్టాభి

షేకం, అంటే విభీషణ పట్టాభిషేకానికి సుగ్రీవ పట్టాభిషేకం నాంది. ఇది సీత చూపిన బాటలో రాముడు సాగించిన ధర్మ విజయ ప్రస్థానం. ఇది ముముక్షువులకు ఒక అద్వైత దర్శనాన్ని కలిగిస్తుంది.

రామాయణం ఒక దర్శనం. ఈ ఘట్టం ప్రత్యేకించి ఒక అద్వైత ప్రస్థానం. ఎవరు రామాయణాన్ని రచించటానికి పూనుకొన్నా, చెప్పడానికి పూనుకున్నా తమదైన బుద్ధి దర్శనంతో దానిని విలక్షణంగా దర్శించి చెబుతూ వచ్చారు. వాల్మీకి అలా చెప్పాడు. వేద వ్యాసుడు అలా చెప్పాడు రామాయణము, అధ్యాత్మ రామాయణము రెండూ రెండు విశిష్ట దర్శనాలకు రెండు మార్గాలుగా లోకంలో వెలసి వున్నాయి. వాల్మీకిది రస మార్గం. ఆదర్శ దృక్పథం. వ్యాసునిది తత్త్వమార్గం, అధ్యాత్మిక దృక్పథం. స్వామి వాల్మీకి నుండి ఆదర్శ దృక్పథాన్ని స్వీకరిస్తారు. వ్యాసుని నుండి అధ్యాత్మిక దృక్పథమును స్వీకరిస్తారు. మానవునికి కావలసిన యీ రెండు విశిష్టమైన దృక్పథాలను తీసికొని రామాయణ రథాన్ని రెండు చక్రాల మీద నడిపిస్తారు.

'ఆత్మారామం' మొదటి దివ్యోపన్యాసంలో స్వామి యిలా ప్రవచించారు: "రామాయణమునందు రాముని కేవలము మానవ ఆదర్శ జీవిగా నిరూపిస్తూ వచ్చాడు వాల్మీకి. అధ్యాత్మ రామాయణమునందు రాముడు కేవలం భగవంతుడని స్పష్టంగా ప్రతిపాదిస్తూ వచ్చాడు వేదవ్యాసుడు. ఈ రెండింటియందున్న తారతమ్యము ఏమనగా, వాల్మీకి రామాయణము ప్రేక్షకుల ఆనందాన్ని నిరూపిస్తుంది. వేద వ్యాసుని రామాయణము తెర వెనుక ఉన్నవారు గ్రహించిన రహస్యాన్ని నిరూపిస్తుంది."

ఈ తెర వెనుక తత్త్వం ఏమిటి? స్వామి అధ్యాత్మ రామాయణ తత్త్వాన్ని ఆత్మారామం 12 వ దివ్యోపన్యాసంలో యిలా మనకు వివరించారు: "జ్ఞానము అనేటటువంటి సీత ధర్మము అనేటటువంటి రాముని వరించింది. ఎప్పుడు ఈ విధంగా జ్ఞానము ధర్మమును వరించినదో, అప్పుడు కొన్ని రకములైన అవాంతరములు జగత్తులో

ప్రారంభమవుతాయి. మంచిదానికి అనేక రకములైన కష్టములు, యిక్కట్లు కూడను వెంటాడుతూ వుంటాయి. నేను అప్పుడప్పుడు చెబుతూ వుంటాను - Pleasure is an interval between two pains అని. ఈ యొక్క బాధలు లేకుండా, ఈ ఆనందమునకు ఏమాత్రమూ కూడ విలువ వుండదు. ఈ జ్ఞానము అనే సీతను దుర్మార్గము అనే టటువంటిది అపహరించింది. అనగా స్వార్థము, అహంకారము అనే టటువంటి రావణుడు సీతను అపహరిస్తాడు. మానవునిలో స్వార్థము, అసూయ, అహంకారము చొరబడెనా- అతనికి ఉన్న జ్ఞానము కూడా ఊడిపోతుంది. స్వార్థ, అసూయ, అహంకారపరుడైన రావణుడు జ్ఞానము అనే సీతను అపహరించాడు. ఈ జ్ఞానము అనేటటువంటి సీతను అన్వేషించడం కోసమని ధర్మం అనే రాముడు అర్థ, కామ ములు అనేవాటితో బయలుదేరుతాడు. అందులో లక్ష్మణుడు మనస్సుగా రూపొందినాడు. మనస్సు అనే లక్ష్మణునితో చేరి ధర్మము అనే రాముడు జీవితము అనే అరణ్యములో జ్ఞానము అనేటటువంటి సీతను అన్వేషించుటకు ప్రారంభించినాడు. ఆ సమయమున దీనత్వము, వివేకము అనేటటువంటి వాలి, సుగ్రీవులకు అక్కడ వాదోపవాద ములు జరుగుతున్నవి. ఆ సందర్భమున వివేకము అనే సుగ్రీవునితో చెలిమి చేసి దీనత్వము అనే వాలిని సంహరించినాడు. ఈ ధర్మము అనే రామునికి వివేకము అనే సుగ్రీవుచెంత ధైర్యము అనే హనుమంతుడు కూడ నిలిచాడు. ఈ ధైర్యము అనే హనుమంతునితో వివేకము అనే సుగ్రీవునితో చెలిమి చేసుకొని సీతాన్వేషణ సాగించే టప్పటికి మోహమనేటటువంటి సముద్రము అడ్డము వచ్చింది. ధైర్య మనేటువంటి హనుమంతునితో ఆ మోహ సాగరాన్ని దాటాడు. ఈయొక్క మోహసాగరము దాటేటప్పటికి తిరిగి అటువైపున రజస్తమ స్సాత్త్వికములనే అన్నదమ్ములు ఎదురైనారు. వారిలో రావణుడు రజోగుణము. తామసికము కుంభకర్ణుడు, సాత్త్వికము విభీషణుడు. ఈ రాజసిక, తామసిక గుణాలు అనేటటువంటి రావణుణ్ణి, కుంభకర్ణుణ్ణి

హతమార్చి సాత్త్వికమనే విభీషణునికి పట్టాభిషేకం చేశాడు. విభీషణుని పట్టాభిషేకోత్సవం జరిగిన తరువాత, అనుభవజ్ఞానమనే సీతను దర్శించాడు. పూర్వము బ్రహ్మ జ్ఞానము తరువాత అనుభవజ్ఞానము. అనుభవజ్ఞానమైన సీతను చూచేటప్పటికి సహస్రారపద్మమనేటువంటి హృదయ పీఠముపైన రామునియొక్క పట్టాభిషేకం జరిగినది. ఇదే అధ్యాత్మ రామాయణము. ఇట్టి అధ్యాత్మిక రామాయణాన్ని అనుసరించినప్పుడే ఆత్మతత్త్వము కూడాను మనకు కొంతవరకు అర్థమవుతుంది."

ఆదర్శ తత్త్వాన్నీ అధ్యాత్మిక తత్త్వాన్నీ మనకు అందించటానికి స్వామి రామాయణాన్ని ఆత్మారామ తత్త్వంగా వివరించి చెప్పారు. శ్రీరాములవారి లాగానే స్వామి అవతార పురుషులు. వారి జీవితం సత్యం, శివం, సుందరం అన్న గ్రంథంలో మనం చూడవచ్చును. ఇప్పటికిని సజీవంగా నడుస్తున్న ఉజ్జ్వలమైన ఒక దివ్య ప్రస్థానం అది. దానినికూడ మనం రామాయణంలాగా ఆదర్శ, ఆధ్యాత్మిక తత్త్వాలతో వ్యాఖ్యానించుకొంటూ చెప్పుకోవాలి. దానికి రామాయణం ప్రాతిపదిక అవుతుంది. బహుశః రామాయణం అయిపోయిన తరువాత స్టడీ సర్కిల్‌గా ప్రారంభమైన ఈ ఉపన్యాస పరంపరలో స్వామియొక్క సత్యం శివం, సుందరాన్ని కూడ భగవదవతార తత్త్వానికి అనుగుణంగా వ్యాఖ్యానించి,వారియందు రామతత్త్వము, శివతత్త్వము, కృష్ణతత్త్వము శక్తితత్త్వము ఎలా ప్రతీయమాన మౌతున్నవో, వేదములయందు చెప్పబడిన పరమ తాత్పర్యానికి స్వామి ప్రేమతత్త్వానికి వున్న తాదాత్మ్యము ఏమిటి? ఆధునిక సమాజానికి ప్రేమతత్త్వం ఎలా విశ్వజనీనమైన మంత్రోపదేశమో - ఇటువంటి విషయాలను మనం పర్యాలోచించుకోడానికి వీలు వుంటుంది.

అవతారతత్త్వాన్ని స్వామి 'ఆత్మారామం' లోని రెండవ దివ్యోపన్యాసంలో యిలా పేర్కొంటున్నారు: "అవతారములన్నీ మానవోద్ధరణ నిమిత్తమై, ధర్మోద్ధరణ నిమిత్తమై, మానవ ఆదర్శ నిమిత్తమై తాము చేసి, ఇతరులచేత చేయించటానికి పూనుకోవటం పరిపాటి. ఈ

విధంగా అవతారము మానవ స్వరూపం ధరించినప్పుడే మానవులకు సన్నిహితమై, ప్రేమప్రదమై, ఆదర్శవంతమై కొంతవరకు అనుకూలములు కలిగింప చేస్తుంది. మానవునికీ మానవునికీ మధ్యనున్న సన్నిహిత బాంధవ్యాన్ని కూడను గుర్తుచేస్తుంది."

సమాజ చైతన్యంలో దైవ తత్త్వాన్ని ప్రదీప్తం చేసి, దానిని ఆస్వాదనీయంగా, మధురంగా మార్చి, అనుభవింపచేసి, దానివలన కలిగే ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేయటమే అవతారము యొక్క తత్త్వం. అవతారపురుషుడు తనంతట తాను సాధించుకొనేది ఏమీ లేదు. ఆయన సిద్ధపురుషుడు. సిద్ధపురుషుడై నటువంటి ఆ సూర్యుని తేజస్సు నుండి ఎన్నో గోళాలు కాంతిని గ్రహించాలి. జీవితాన్ని పుంజించుకోవాలి సమాకాలీన సమాజంలో వున్న దైవికమైన తత్త్వాన్ని జాగృతం చేసి, నరులను తన బంధువులుగా చేసుకొని, నరుల మధ్య నడయాడుతూ, వారిలో తన దివ్య చైతనాన్ని పంచిపెట్టి, సమాజ చైతన్యంలాగా తన చైతన్యాన్ని పొంగించడమే అవతార తత్త్వం. వ్యక్తిగతంగా భాసిస్తున్న ఒక దివ్యతేజస్సు సమాజపరంగా అంకితం కావటమే అవతార తత్త్వం. స్వామి ఒక పిక్నిక్ ఉదాహరణం చక్కగా చెప్పారు మనం ఒక పిక్నిక్‌కి వెళుతామనుకోండి అరణ్యములోకి. అక్కడ మూడు రాళ్ళను పొయ్యిగా పెట్టుకొని, దానిమీద పాయసాన్నం వండుకుంటామనుకోండి. స్వామి తమ అన్వయంలో జీవితం అనేది అరణ్యమన్నారు. అందులో పొయ్యికున్న మూడు రాళ్ళు త్రిగుణములన్నారు. దానిమీద పెట్టే పాత్ర మన దేహం అన్నారు. అందులో పోసే బియ్యం మన కోర్కెలు- **Desires** అవి ఉడకటానికి మనము పోసే నీరు ప్రేమ అన్నారు. దాని క్రింద వుంచే నిప్పు **Wisdom** అన్నారు. సాయి తత్త్వానికి కనుక దీన్ని అన్వయించుకొన్నట్లయితే- అదే సాయి పాయసమైతే, సాయి తత్త్వం అందులోని పాలు. సాయిభక్తి, ఆ అన్నంలో మనం రుచి చూచే మాధుర్యం. స్వామి పిక్‌నిక్‌కోసం ఈ భూమిమీదకు వచ్చారు. అందులో తమ దివ్యపాయసాన్ని వండి

మనకందరికి పెడుతున్నారు. ఈ దివ్యపాయసాన్ని ప్రతి అవతారం లోను అందించినట్లుగనే స్వామి ప్రస్తుతావతారంలో కూడా మనకు సాయితత్త్వాన్ని పాయసంగా అందిస్తున్నారు. యుగములు వేరయినా, ఉపాధులు వేరయినా, కథలు వేరయినా, మహిమలు వేరయినా అవతారమూర్తుల తత్త్వంలో మాత్రము అంతర్లీనమైన సత్యం ఒక్కటే. రామాయణంలో సీతారాములు, నేడు, ఈ యుగంలో సాయి రాముడు. సీతారామతత్త్వం సాయిరామునిలో మధురాద్వైత స్థితిని పొంది మాన వాకృతిగా నిలచి, దివ్య ప్రతీకగా తేజస్సును వెలారుస్తున్నది.

"వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతఃపితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ"

అన్న కాళిదాసుని శ్లోకంలో వాగర్థ రూపులుగా పార్వతీపరమేశ్వరులు రూపింపబడినారు. మనం మాట్లాడే మాటలలో కూడ శబ్దార్థాలున్నవి. శబ్దము స్త్రైణమైనది. అర్థము పౌరుషమైనది. ఓమ్ అని మనము ఉచ్చ రిస్తున్నాము. ఈ ఓమ్ అనే శబ్దము స్త్రైణమైనది. ఆ ఓంకారవాచ్యు డైన పరబ్రహ్మం పౌరుషమైనది. రామాయణానికి దీనిని అన్వయించు కొంటే ఓంకార శబ్దం సీత; రాముడు ఓంకార వాచ్యమైన పరబ్రహ్మ తత్త్వం. ఆ రామ తత్త్వాన్ని వ్యక్తీకరించేది సీత. సీత శబ్దం. అర్థం రాముడు. సాహిత్యానికి లోకవ్యవహారానికి సంబంధించినంత వరకు యిలా చెప్పుకోవచ్చును.

లోకంలో నాదోపాసన కూడ వుంది. స్వర సంభరితమైన నాదాన్ని మనం అందులో ఉపాసిస్తూ వుంటాము నాదానికీ శబ్దానికీ ఒక భేదం వుంది. శబ్దానికి నిర్దిష్టమైన అర్థం వుంది లోక వ్యవహారంలో. నాదానికి అట్టి అర్థం లేదు. కాని, అవ్యక్తమైన అర్థం స్ఫురిస్తూ వుంటుంది. వ్యక్తమైన అర్థాన్ని యిచ్చేది శబ్దము. అవ్యక్తమైన అర్థాన్ని యిచ్చేది నాదం. సీతతో కూడుకొన్న రాముని మనం దర్శిస్తూ వుంటే అర్థవంతమైన శబ్దాన్ని ఉపాసిస్తున్నట్లుగా వుంటుంది. సాయి రాముని ఉపాసిస్తూ వుంటే నాదబిందువైన ఆ ఋతంభర తత్త్వాన్ని ఉపాసిస్తు

న్నట్లుగా వుంటుంది. ఋతంభరమైన నాదతత్త్వంలో పరమాత్మ వున్నాడు, పరాశక్తి వుంది. అదే సాయిరామావతార విశేషం. ఇప్పటికి ఎన్నో అవతారాలను గమనించాం. ఆ అవతారాలలోని తత్త్వాన్ని కనుక చూచినట్లయితే పురుష పరంగానే అర్థం చెప్పుకొనడానికి వీలున్నది. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, పరశురామాది అవతారాలను కనుక తీసికొన్నట్లయితే పరబ్రహ్మ రూపంగా చెప్పుకోడానికి మాత్రమే వీలుంది. కాని, మన స్వామిని సాయిమాతా, సాయీశ్వరీ అని పిలుస్తాము. మనకు ఎబ్బెట్టుగా తోచదు. రామేశ్వరి, కృష్ణేశ్వరి అన్నప్పుడు విరుద్ధంగా తోస్తుంది ప్రేమ స్వరూపుడైన సాయి అవతారములో వున్న విశిష్టమైన తత్త్వం యిది. నాదమధురమైన యీ తత్త్వంలో శక్తితత్త్వం పురుషతత్త్వం రెండూ విశిష్టంగా మేళవించుకొని వున్నాయి. తల్లిగా చూస్తే స్వామి తల్లిగా కనపడతారు. తండ్రిగా చూస్తే ఆయన తండ్రిగా కనపడతారు, 'సాయి ప్రేమతత్త్వము - పరమాత్మ తత్త్వము మరియు పరాశక్తి తత్త్వము' అని చెప్పుకోడానికి వీలుంది. రామాయణంలో రామ శబ్దానికి యీ శ్లేష వుంది. రామ అంటే రాముడు అనీ, రామ అంటే సీత అనీ అర్థం చెప్పవచ్చు. కాని, శ్లేషలో నిబంధింపబడిన ఆ అర్థాన్ని జీవితంలో అద్వైతంగా చూపెట్టిన గౌరవం మన సాయి అవతారానికే దక్కుతోంది. ఈ విధంగా రామాయణంలో రామాయణం అని చెప్పుకున్నా సీతాయణం అని చెప్పుకున్నా, రామపరంగా చెప్పుకున్నా, సీతాపరంగా చెప్పుకున్నా రామాయణ తత్త్వం ఎలా అన్వయిస్తుందో, సాయి కథను మనం మాతాపరంగా అన్వయించుకొన్నా, పరమాత్మపరంగా అన్వయించుకున్నా సన్నిహితంగా మనకు సమన్వయం దొరుకుతుంది.

సుందరకాండలోని రాముడు సాయిరామ తత్త్వానికి చాల సన్నిహితుడు. సీత ఎక్కడో లేదు, మనలోనే వుంది. కామం, అహంకారం అనే రూపంలో మనలో వున్న రావణుడు ఆ సీతను అశోకవనములో

ఒంధిస్తాడు. ఆత్మజ్ఞానాన్ని కామమునుండి అహంకారమునుండి తొలగించి ప్రేమతత్త్వము వైపు ఆకర్షించేటువంటి ఉద్యమమే మన సాయి రాముడు చేస్తున్న ఉద్యమం. నిజానికి రాముడు సీతాన్వేషణ సాగించినట్లుగా, కామ మోహ స్వార్థ దూషితమైన ఆధునికనాగరక ప్రపంచంలో రావణ సదృశమైన అహంకారంచేత సంగ్రహింపబడిన ఆత్మజ్ఞానాన్ని తనవైపు ఆకర్షించి, తనలో లీనం చేసుకొని రామతత్త్వాన్ని జాగృతం చేయటానికే సాయిరాముడు తన ఉద్యమాన్ని ముందుకు సాగిస్తూవున్నారు.

సీత త్యాగభావంతో రామునివెంట అరణ్యానికి వచ్చింది. కనకమృగంమీద కామం కలగడంచేత ఆమె రామునికి దూరమైంది. కాముడున్న చోట రాముడు ఉండడు, రాముడు ఉన్న చోట కాముడు ఉండకూడదు అని స్వామి అన్నారు. రామునికి సన్నిహితురాలై, రాముడు తప్ప నాకు అన్యథా శరణం లేదు అన్న శరణాగత ప్రపత్తితో భజించి, త్యాగాన్ని వెలార్చి, రాముని సన్నిధానాన్ని పొందిన సీత ప్రమాదవశాన రామునికి దూరమైంది. ఆనంద రూపుడైన ఆత్మారాముని సన్నిధానంలో మనం వసిస్తూవున్నా ప్రమాదవశాన ఒక్కొక్కసారి లౌకిక స్పృహతో ఆత్మారామునికి దూరం కావచ్చును. ఇలా దూరమైన వారిని రాముడు వదిలిపెట్టడు. తన తప్పిదాన్ని తెలుసుకొని 'రామా! నీకంటే నాకు శరణ్యం లేదు, అహంకారమనే యీ రావణుని నేను గ్రహించను, భోగమయమైన యీ అశోక వనంలో నేను ఉన్నా నీకోసమే పరితపిస్తున్నాను' అని భగవంతుని కొరకు అనన్య చిత్తంతో, ఏకాగ్ర భక్తితో ఆర్తిని భజించినట్లయితే, రాముడు మరల ఆ భక్తుణ్ణి ఉద్ధరించటానికి ప్రయత్నం చేస్తాడు. సీతాన్వేషణ ఘట్టం అటువంటిది.

అధ్యాత్మ రామాయణంలో పార్వతి పరమేశ్వరుని ఇలా ప్రశ్నిస్తుంది: 'రాముడు పరమాత్మ స్వరూపుడు కదా, సీతావియోగ సందర్భంలో పామరునివలె ఎందుకు దుఃఖించాడు? దాని అర్థం ఏమిటి? మనం ఎలాగ అన్వయించుకోవాలి?' నిజానికి, రామతత్త్వాన్ని సాయి

తత్త్వాన్ని సమన్వయించుకొని రామాయణాన్ని అవగాహనం చేసు కొంటున్నప్పుడు స్వామి భక్తులను ఉద్ధరించే మార్గాలు ఎన్నో మన అనుభవానికి సన్నిహితంగా వున్నాయి. తనయందు అనన్యచింతతో భక్తిని భజిస్తున్న ఒక భక్తుడికి పక్షవాతం వస్తే దానిని స్వామి తమ మీదకు తీసుకొంటున్నారు. గుండెపోటు వస్తే తాము స్వీకరిస్తున్నారు. మరణోన్ముఖుడైన భక్తుని మరణావస్థను తమమీదకు స్వీకరిస్తున్నారు. ఈ లీలలు అత్యద్భుతాలు 'అన్యథా శరణం నాస్తి' అని గజేంద్రుని వలె మొరపెట్టి ఆర్తిని భజించే భక్తునియొక్క సర్వ దుఃఖాలను తన యందు స్వీకరించే పరమ కారుణ్యమూర్తి అవతారమూర్తి. రాముడు పరమానందమూర్తియైయుండి, సీతకోసం పరితపించాడు అంటే అర్థం లేదు. వాల్మీకిరామాయణంలో ఆదర్శపురుషుడుగా, జీవితములో భార్యను కోల్పోయినప్పుడు భర్త ఎంత ఆర్ద్రచిత్తుడై వ్యవహరించాలి అన్న దానికి ఆదర్శ భావంగా రామశోకం వుండవచ్చును. స్వామి దీనిని ఆధ్యాత్మిక దృక్పథంతో చూడమంటున్నారు.

స్వామి తత్త్వంతో రామతత్త్వాన్ని అన్వయించుకొంటే ఇలా ఉంటుంది: సీత రామునికోసం దుఃఖిస్తోంది. ఆ సీతా దుఃఖాన్ని రాముడు తనమీద వేసుకొన్నాడు. 'క్షణం కూడా రాముణ్ణి వదిలిపెట్టి నేను జీవించను' అని చెప్పిన సీత మరి రావణుని దగ్గరకుపోయి ఎలా జీవింప గలిగినది? హనుమంతుడు సుందరకాండంలో అంటాడు సీతను చూచి—'సీతయొక్క ఆకృతి సాక్షాత్తు రామునియొక్క ఆకృతివలె ఉన్నదే; ఈమె ఆయనకు తగిన భార్య. ఆయన ఈమెకు తగిన భర్త. కంటికి కనపడకపోయినప్పటికి హృదయంలో అనవరత రామనామ స్మరణం చేత ఆ మూర్తిని తనయందు ఆవేశింపచేసుకొన్నటువంటి భక్తిమూర్తి సీత. ఆకృతిలో స్త్రీ అయినా అనవరత రామనామ స్మరణం చేత 'యద్ భావం తద్ భవతి' అన్న న్యాయం చొప్పున ఈ రామ రామునిగా మారింది. ఆ రాముడు అనవరత సీతాస్మరణం చేత సీతా రూపుడుగా భాసించాడు.' చివరకు హనుమంతుడే అను

కొంటాడు—'నా పిచ్చి గాని రాముడు ఒకడు, సీత మరియొకరునా? రెండు వేరా? కాదు- ఈ ఇద్దరూ ఒక్కటే. రావణ సంహారార్థమై రెండుగా చీలారే తప్ప తత్త్వమునందు ఒక్కరే.' ఇది సుందర కాండంలో భార్యాభర్తల రూపసామ్యంగా జీవేశ్వర, పరమేశ్వరుల యొక్క మధురాద్వైత దర్శనానికి హనుమంతుడు చెప్పిన సారభూత మైన సుందర తాత్పర్యం. అట్టి సుందర తాత్పర్యం భక్తులయందు భగవంతుడు భజించేటప్పుడు ఎలా ప్రపంచిస్తాడు? భక్తుని శోకాన్ని తనమీద వేసికొంటాడు. అవతార పురుషుడు చేసే పనే అది. ఆర్తితో పిలిస్తే అతని ఆర్తిని పంచుకోడానికి భువిమీదకు దిగి వస్తున్నాడు అవతారమూర్తి. ఇప్పుడు సాయిమూర్తి భక్తుల యొక్క దుఃఖాన్ని తాను పంచుకొంటూ, వారికి సుఖాన్ని, జీవితానికి అమృతత్వాన్ని ప్రసాదిస్తున్న అవతార లీలయే శ్రీరామునికి అన్వయించుకొంటే శ్రీరాముడు సీతాదుఃఖాన్ని తనయందు పంచుకొని, ఆమె దుఃఖాన్ని కూడ తాను భజిస్తూ ఉండేవాడని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. భక్తులను ఉద్ధరించటంలో ఏ భగవత్ తత్త్వమయినా, విశిష్టాద్వైత సంప్రదాయాన్ని అనుసరించి రెండు విధాలుగా ప్రసరిస్తూ ఉంటుంది.

1. మార్జాలకిశోరన్యాయము. పిల్లి పిల్లలు పెడుతుంది ఒకచోట. ఆ ప్రదేశం భద్రంగా లేకపోతే సురక్షిత స్థలాన్ని వెదకి, ఆ పిల్లలను తాను నోట కరచుకొని భద్రమైన స్థలానికి తీసికొని వెళ్ళుతుంది. ఆ పిల్లిపిల్లలు మాత్రం కదలవు. అవి తల్లికోసమే అరుస్తూ ఉంటాయి.

2. కపి కిశోర న్యాయము. కోతి తన బిడ్డలను పొట్టకు అంటించు కొంటుంది. ఆ బిడ్డ పొట్టకు గట్టిగా కరచుకొని ఉంటుంది. తల్లికోతి సురక్షితమైన ప్రదేశానికి ఎగురుతూ వుంటే ఆ కోతితోపాటే ఈ బిడ్డ కూడ సురక్షితమైన ప్రదేశానికి చేరగలుగుతుంది. భగవంతుడు భక్తుణ్ణి ఉద్ధరించేటటువంటి మార్గాలు యీ రెండు. భక్తులు భగవన్నామ స్మరణం చేస్తూ 'నీవే తప్ప అన్యథా శరణం లేదు' అని ఆకలి అవుతున్న బాలవలె దుఃఖిస్తూవుంటే, తల్లివలె దగ్గరకు వచ్చి సురక్షిత

మైన ప్రదేశానికి తీసికొనివెళ్ళి దివ్యప్రేమామృతాన్ని మనకు ఇవ్వడం సాయీమాత తత్త్వం. 'Whereever you are you are mine. I will not give you up,' అని స్వామి అంటారు. మార్జాల కిశోర న్యాయాన్ని అనుసరించే భక్తులను ఉద్ధరించటానికి చెప్పే మాట ఇది. మరి కపి కిశోర న్యాయాన్ని అనుసరించి చెప్పేమాట—'However you are you are mine. I will not give you up.' తత్త్వం ఒక్కటే. స్వామి ఇంగ్లీషులో చెప్పినా రాముడు సంస్కృతంలో చెప్పినా రెండు ఒక్కటే. మన జీవితానికి అత్యంత సన్నిహితంగా రామాయణాన్ని అన్వయించి చెప్పుకోమనే స్వామి మనకు బోధిస్తోంది. స్వామి మనకు దివ్యసన్నిధానం ప్రసాదించినపుడు మనం ఈవిధంగా అన్వయించుకోవాలి.

జటాయు వున్నాడు రామాయణంలో. జటాయువు సరే. మనలో కూడ జటాయువులు ఉన్నారు. శ్రీరాముని కార్యం కొరకై శరీరాన్ని సైతం పరిత్యజింప గలిగేటటువంటి త్యాగమూర్తులైన భక్తులకు జటాయువు ప్రతీక. శ్రీరామ భక్తికి ప్రతీక అయిన సీతను సంరక్షించటానికి, శ్రీరాముని బహిఃప్రాణమైన సీతను రక్షించటానికి, అహంకారికి అడ్డుపడి అసువులను కోల్పోయిన త్యాగజీవి జటాయువు. మాతృదేశాన్ని రక్షించటానికి సరిహద్దులలో శత్రువులతో పోరాడి ప్రాణాన్ని కోల్పోయిన ఒక సిపాయి ఎంతటి త్యాగశీలియో, ఒక పవిత్ర ఆధ్యాత్మిక తత్త్వాన్ని ప్రచారం చేస్తూ ఆ దైవతత్త్వం కోసం అసువులను కోల్పోయిన ఒక భక్తుడు కూడా అంత విలువైనవాడు. నిజానికి దేవుడు అటువంటి భక్తుని తండ్రిగా గౌరవిస్తాడు. దశరథునికి రాముడంత్యక్రియలు, కర్మలు చేయలేదు. తన తండ్రివలె భావించి జటాయువుకు తత్కర్మలు స్వయంగా తన చేతులతో చేశాడు. అందువల్ల స్వామి దివ్య ప్రస్థానంలో అనవరతం కృషి చేసి, ఈ తనువు ఆ మార్గములో పతనమైపోయినట్లయితే, స్వామి బహుశః తమ చేతులతో మనలను మోసుకొని వెళ్ళతారు. అంత దివ్య కరుణ వుంటుంది. ఇటువంటి త్యాగశీలురైన భక్తులకు జటాయువు ప్రతీకగా కనపడతాడు.

'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం', 'అద్వైత దర్శనం జ్ఞానం' అని స్వామి 8 వ దివ్యోపన్యాసంలో చెప్పారు. "శ్రీరామచంద్రుడు లక్ష్మణుడు లేనిచో తన కార్యాలను నిర్వహింపగలిగి వుండేవాడు కాదు. ఎట్లనగా, ఎంత పరమాత్మస్వరూపుడు అయినప్పటికీ, Positive ఎంత Powerfull గా వున్నప్పటికీ, Negative కూడానూ సరియైన కండిషన్‌లో వుండినప్పుడే ఆ Positive యొక్క పవిత్రత కాని, ఫలితంకాని అందుకోవడానికి వీలు అవుతుంది." Positive, Negative అను ఉపమానాలచేత మనకు లక్ష్మణుని యొక్క పాత్రను వ్యక్తీకరింప చేశారు స్వామి. రామాజ్ఞను ప్రశ్నించకుండా ఆతడు చూపించిన బాటలో తలవంచుకొని ధర్మానికి అంకితమై నిస్వార్థ, నిర్మోహ భక్తితో జీవితాన్ని గడిపిన భక్తుడు లక్ష్మణుడు.

రాముడు దుఃఖిస్తూ వుంటే లక్ష్మణుడు రామునికి ధైర్యం చెప్పుతాడు. వాల్మీకి రామాయణంలో అది ఒక విధమైన అన్వయం. రాముడు మోహావిష్టుడై వుంటే లక్ష్మణుడు బుద్ధిలాగ రామునియందు పరాక్రమాన్ని ప్రజ్వలింపచేస్తాడు. స్వామి చెప్పిన కథనం మరోలా ఉంది. సీత దగ్గరేమో 'మనమిద్దరం ఒక నాటకము ఆడదాము, రావణుణ్ణి సంహరిద్దాము' అనీ, 'ఇది లక్ష్మణునికి తెలియకూడదు సుమా' అనీ రాముడు సీతతో కుటీరంలో చెప్పాడు. కాని, శ్రీరాముని శోకాన్ని చూసి లక్ష్మణుడు ఆక్రందుడయితే తన బహిః ప్రాణమైన అతనికి తన నాటకాన్ని గురించి చెప్పకుండా వుండలేకపోయాడు. 'లక్ష్మణా! యిది మేము ఆడుతున్న నాటకమయ్యా! నీవు కూడ యీ నాటకములో ఒక పాత్రవు, రా' అని తాను ఆడుతున్న దివ్య నాటకంలో లక్ష్మణుని కూడ ఒక దివ్య పాత్రగా పైకి తీసికొని వచ్చాడు.' పైకిచూస్తే సాయి చెప్పిన రామకథలో పరస్పర విరుద్ధంగా కనపడే అంశ మిది. కాని, స్వామి ప్రేమతత్త్వాని కిది సహజ ప్రతిబింబం. తాము ఏ దివ్య సందేశాన్ని ఈ లోకానికి ఇవ్వదలచు కొన్నారో, తాము ఏ దివ్యపథంలో నడిపించటానికి ఈ లోకాన్ని పైకి

తీసుకొని వెళ్ళదలచుకొన్నారో, ఆ మార్గంలో తత్త్వ రూపంగా వ్యాపించి వున్న పరమ జ్ఞానాన్ని ఇదిగో నీకు ఇస్తున్నాను అని సాయి తమ ప్రేమతత్త్వ రహస్యాన్ని ఏ భక్తునికి దర్శనరూపంగా ఇస్తారో ఆ భక్తుడు లక్ష్మణునివంటివాడు.

ఇక కబంధుడు వున్నాడు. కబంధుడు ఆహారము, స్వార్థము మూర్తీభవించినవాడు. ఇతనికి తల, నోరు, కడుపు అంతా ఒక్కటే. ఈతడు అన్నజీవి. అన్నమయకోశానికి పరిమితమైన ప్రవృత్తి కల వాడు. వట్టి పార్థివ ప్రాణము. అట్టివారు ఈ లోకంలో ఇప్పుడూ వున్నారు. **Pure metearialists.** చేతులకు అందినటువంటి ఆహారాన్ని తినడమే వారి వృత్తి. కబంధుడు యోజనం పొడవున్న చేతులను చాస్తాడు. చేతికి అందిన వస్తువులు తింటాడు. ఇది ఆ జీవియొక్క లక్షణం. ఇటువంటి పాశవిక ప్రవృత్తి కలిగిన భక్తులుకూడ, తామసిక భక్తులుకూడ లోకంలో వుంటారు. వీరిని కొరత భయపెట్టి, శిక్షించి అన్నమే కాదు, 'అన్నములో బ్రహ్మము వున్నాడు' అని చూపించి, పశుబలానికి ప్రతీకలైన బాహువులను ఖండించి, కళ్ళను తెరిపించి, గర్భము నందున్న దైవత్వాన్ని మేల్కొలిపింప చేసే ప్రవృత్తిని కబంధరాక్షస సంహార తత్త్వంలో రాముడు ప్రపంచించాడు. సాయి రాముడుకూడ అటువంటి అనాగరక ప్రవృత్తులను లేక భౌతిక ప్రవృత్తులను ఎందరినో సాత్త్విక దైవ ప్రవృత్తులుగా మార్చిన సన్నివేశాలు వారి జీవిత చరిత్రల్లో సువర్ణాధ్యాయాలుగా చెప్పబడివున్నాయి.

శబరి చాలా విచిత్రమైన పాత్ర. శబరి భక్తురాలు. అనాథ. నాకు అనిపిస్తుంది - స్వామి మందిరం ముందు ముగ్గులు పెట్టడం, స్వామికి దండలు అల్లడం, స్వామికి కుంకుమార్చన చేయటం, స్వామికి పాయసాన్నం వండి యివ్వడం, ఫలాలను నివేదించటం మొదలైన ముగ్ధభక్తి మార్గాలను ప్రపంచించే ప్రమదామణుల భక్తిశీలంలో శబరి మూర్తి కట్టుకొన్నది. ఆమె పంచమకుల; కాని, రాముడు ఆమె పెట్టిన పళ్ళు తిన్నాడు. మతంగమహర్షి ఆశ్రమంలో ఋషులకు బట్టలు ఉతకడం, ఆశ్రమ సంభారాలను సిద్ధం చేయటం, ఇల్లు ఊడ్వటం,

ముగ్గులు వేయటం- ఇటువంటి గురు సేవ చేసిందామె ఎప్పుడైనా సరే మనం చేసిన గురుసేవ గాని, దైవ సేవ కానీ వృధా పోదు. ఒకవేళ మనం సగంలో కన్నుమూసినా, వచ్చే జన్మలో అక్కడి నుండే మొదలై ఫలం లభిస్తుంది. మతంగ మహర్షి పోతూ 'నీవు గురుసేవ చేశావు, నీకు దైవ ఫలం దక్కుతుంది. శ్రీరాముడు ఇక్కడకు వస్తాడు. అప్పుడు నీకు పరిపూర్ణ ఫలం సిద్ధిస్తుంది' అని శబరితో చెప్పి తన శరీరాన్ని పరిత్యజించాడు. అప్పటినుంచి, వాల్మీకి ఏవిధంగా రామమంత్రాన్ని విన్న తరువాత సర్వజీవనాడులయందు రామనాదాన్ని పండించుకొన్నాడో, నాదమయుడుగా తాను మారిపోయినాడో, అలాగే శబరి రామనామ కీర్తనం చేస్తూ నాదమూర్తిగా మారిపోయింది. స్వామి కూడ మనలను రామనామ స్మరణంతో నాదబ్రాహ్మలుగా మారండని ప్రబోధించారు.

"చక్కెరకంటె తీపి; ఘనసారముకంటెను రుచ్యమౌను; పెం
పెక్కిన తేనె కన్న అతిరుచ్యము; నోటను పల్కపల్కగా
మిక్కిలి కమ్మనౌ అమృతమే యనిపించును; కాన నిత్యమున్
చక్కగ దాని మీరు మనసా స్మరియింపుడు రామనామమున్."

స్మరణ సేవా భక్తిమార్గాలను ముగ్ధభక్తిలో సంగమింప చేసికొన్న భక్తి ప్రయాగ శబరి రామ దర్శనంకోసం అహోరాత్రాలు తపిస్తూ వేచి యున్న వృద్ధురాలామె. ఆమెను కరుణించటానికే రాము డామార్గాన నడిచాడు. ఆమె తపస్సు ఫలించింది. రామదర్శనం లభించింది; ఆమె రామునితో సంభాషించింది; రామపాదాల నంటి పునీతమై పోయింది. భక్తులకు స్వామి-'దర్శనం పాపనాశనం; సంభాషణం సంకట నాశనం; స్పర్శనం కర్మవిమోచనం' అన్నారు. ఆ మూడూ శబరికి లభించాయి.

శబరిభక్తిని తన్మయత్వంతో కీర్తించని రామాయణ కర్త లేడు. విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షంలో శబరి కథా ఖండాన్ని పర మార్ధశ్రీంగా చిత్రించారు. పాలు, పండ్లు తెచ్చి రామపాదాల చెంత నుంచి ప్రణమిల్లిన ఆ ముగ్ధభక్తురాలి శరణాగతభావాన్ని గమనించండి;

"చేతు లునికికి పూలు తెచ్చితిని స్వామి!
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి!
సతను వగుటను నేను వచ్చితిని స్వామి!
చిత్త ముండుట నూహ చేసితిని స్వామి!"

చేతులారంగ శివుని పూజించిన పుణ్యమూర్తి శబరి; ప్రకృతి ఫలాన్ని పరమాత్మ కర్పించిన భక్తిమూర్తి శబరి; తనువును దివ్యస్పర్శతో ధన్యం చేసికొన్న సుకృతి శబరి; మనస్సును మాధవున కర్పితం చేసిన మహితమూర్తి శబరి.

భక్తులంటే భగవంతున కెంత ముచ్చటో! పరిహాసాలాడుతూ పరమార్థాన్నందిస్తాడు! వరుగైన ఆ వృద్ధురాలంటే రాముని కెంత వాత్సల్యమో! అవ్వతో నవ్వులాటలు మొదలు పెట్టాడు. శబరి యెంత చమత్కారియో! స్వామి అడిగిన ప్రశ్నలకు స్వానుభవంతో సమాధానాలు చెప్పి సాధువాదాల నందుకొన్నది. కల్పవృక్షంలో రాముడు శబరిని ముచ్చటగా మూడు మాటలతో పలకరిస్తాడు, వినండి:

"అవ్వ! నివ్వరివెన్నులయట్లు ముగ్గు
బుట్టవలె నయ్యె నీ శిరంబున ననంగ
ప్రభువ! నీ యాత్మ వాకిట రంగవల్లి
నినుచుటకు నింతగాగ పండిన దటంచు"

'అవ్వా! నీ తల యెందుకమ్మా నివ్వరివెన్నుల్లాగా తెల్లగా పండిపోయింది?' అని రాముడంటే, 'స్వామీ! నీ హృదయమందిరముందు రంగవల్లులు తీర్చటానికి సహజంగా ముగ్గు బుట్ట తయారయిందయ్యా!' అని శబరి సమాధానం చెప్తుతుంది.

"అవ్వ! యెంతో తపించి నీ యాయువెల్ల
నార్చి నీ పిట్టు లెండి యేకైతి వనగ
ప్రభువ! స్నేహంబుచేత నార్ద్రింబు చేసి
యింత దివ్వెగా వెలిగించవే యటంచు."

'అవ్వా! నీ వింత తపస్సు చేసి, నీ ఆయువునంతా యెండబెట్టుకొని, దూది యేకులాగా మారావెందుకమ్మా?' అని రాముడడిగితే- 'ప్రభూ! నీ స్నేహంతో ఈ దూదేకును తడిపి వత్తిగా నిలిపి వెలిగించు; నేను దివ్వెలా వెలుగుతాను' అని శబరి వేడుకొంటుంది.

"అవ్వ! నీకిట్లు తీవ్రవ్రతాభిషంగ
మునను ప్రాణాలు గూళ్ళుపట్టిన వనంగ
ప్రభువ! నీయింత తీవ్రదయాభిషంగ
మునకు ప్రాణమ్ము గూడఁ జేరిన దటంచు"

'ఏవమ్మా! తీవ్ర వ్రతాలవల్ల నీ ప్రాణాలు గూళ్ళుపట్టినవేమిటి?' అని రాముడు ప్రశ్నిస్తే 'అవును స్వామీ! నీ తీవ్రదయాభిషంగాన్ని పొంది అద్వైతసిద్ధిని పొందటానికి నా ప్రాణం కూడజేరినదయ్యా!' అని విన్నవించుకొన్నది.

పైకి చూస్తే ఈ మాటలు ముగ్ధభక్తురాలి ముచ్చటైన పలుకులు. లోనచూస్తే భక్తితత్త్వాన్ని ప్రవచించే తేటగీతలు.

"అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!"

అనే జీవుని వేదన కివి త్రిశరణాల వంటి వాక్యాలు. 'నీ సేవ చేసుకొనే సన్మార్గంలో నన్ను నడువనీ స్వామీ! నా బ్రదుకును వత్తిగా చేసికొని నీ దివ్యజ్యోతిని వెలిగించు స్వామీ! నా ప్రాణాన్ని నీ దివ్యాత్మ చైతన్యంలో లీనం చేసికొని అద్వైతామృతపదాన్ని ప్రసాదించు స్వామీ!' అని శబరి ప్రభువును వేడుకొన్నది. స్వామి ప్రత్యక్షమైతే ప్రతి సాత్త్విక హృదయం స్పందించే విశ్వజనీన భావాంజలికి శబరి మాటలు స్వర్ణోదాహరణాలు!

శబరివంటి ముగ్ధ భక్తులకు జ్ఞాన మవసరం లేదు. స్వామి యొక్క పరమ కరుణాస్వరూపాన్ని మనస్సులో భావించి పత్రం, పుష్పం, ఫలం, తోయం-తన కున్నది స్వామికి భక్తితో అర్పించి తృప్తిపడటం సహజలక్షణం. ఆ ప్రవృత్తితో భజిస్తే ఎంత అధమ

జీవినైనా స్వామి స్వయంగా నడిచివచ్చి కరుణిస్తాడు. శబరి తాను రుచి చూచిన పండ్లను రాముని కర్పించిందనీ, వాటిని రాముడు గ్రహించి ఆప్యాయంగా ఆరగించాడనీ కొన్ని కథలున్నాయి. అందులో 'ఆత్మవత్ సర్వభూతాని' అని భావించే మధురాద్వైతతత్త్వం ఇమిడి ఉంది. సాయిరాముని లీలల్లో కూడా ఇటువంటి సన్నివేశాలెన్నో కన బడతాయి. సేవాభావంతో సమర్పించే పదార్థాలను ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ స్వామి స్వీకరించి, మాతృమూర్తులవంటి మహిళా మణుల్ని స్వామి కరుణించిన ఘట్టాలు సాయిభక్తులు చెప్పగా నేను స్వయంగా ఎన్నో విన్నాను; స్వయంగా కన్నాను. శబరి రామాయ ణంలో చదివి తెలుసుకొనే పాత్ర కాదు; నిత్యజీవితంలో స్మరణ సేవా భక్తులతో స్వామి కరుణను సాధించే సాత్త్వికభక్తి ప్రపత్తికి సజీవో దాహరణం. ఇలా రామాయణ పాత్రలమ మన జీవితాలకు ప్రతీకాత్మ కంగా అన్వయించుకొని ఆత్మారాముణ్ణి అందుకోమని చెప్పే అమర సందేశమే సాయిరామ సూక్తం!

కిష్కింధకాండ, సుందరకాండ - ఈ రెండింటి స్వరూప స్వభావాలనూ మనం భావించాలి. కిష్కింధ భక్తుల బలగం; సుందర భక్తుని బలం. ఈ రెండింటికీ మూలం రామభక్తి; ఆత్మారామశక్తి. కిష్కింధలో ఉన్నవారు వానరులు. వారు శాఖామృగాలు; చంచల హృదయులు. వారికి సమాహితం (Concentration) లేదు. బహు శాఖల మీద, నానావిధ విక్షేపాలతో తిరగటం వారి స్వభావం. రాముడు వచ్చి ఏంచేశాడు కిష్కింధలో? శాఖామృగాలకు సమాహితం నేర్పాడు. సుగ్రీవాజ్ఞ ప్రకారం రామకార్య నిర్వహణైక లక్ష్యంతో వానరులు సాగారు. కొమ్మలమీద తిరిగే కోతులు కోదండరాముని సేవలో నిలిచాయి. పరిచ్ఛిన్నమైన మానసిక ప్రవృత్తులు పరమాత్మ సేవకు అంకితమైపోయాయి. అదే రాము డిచ్చిన సమాహితం. సమా హిత ముంటే చాలు, ఎంతటి శక్తినైన సాధించటానికి వీలవుతుంది.

సుగ్రీవుడు విచిత్రమైన భక్తుడు. లోకంలో భగవంతునిమీద నమ్మకం ఉన్నవారుంటారు. పురుషకారం చేస్తుంటారు. దైవము కనపడాలి, తమకు సాయం చేయాలి అని అనుకుంటుంటారు. దేవుడు వరమిస్తే బాగుంటుందని భావిస్తూ ఉంటారు. 'స్వామీ! నీవు నా కోర్కె తీరిస్తే నిన్ను భగవంతుడవని నమ్ముతాను. నేను నీకు భక్తుణ్ణవుతాను' అని భగవంతునికే పరీక్ష పెట్టి, వరమిచ్చినవాడే భక్తవరదుడని పరి పరి విధాల బహు రూపాలను సేవిస్తూ ఉంటారు. ఇటువంటి వారిని సకామభక్తులంటారు. సకామభక్తికి సుగ్రీవుడు ప్రతినిధి. 'రామా! నీవు నా భార్యను నాకు కూరిస్తే, నీ భార్యను వెదకి నీకు కూరుస్తాను' అన్న కట్టడితో రాముని శరణు వేడుతాడు. అయినా రాముని శక్తిమీద పూర్ణవిశ్వాసం అతనికి మొదట్లో లేదు. 'రామా! వాలి రావణుని జయించినవాడు; అతన్ని నీవు జయింపగలవో లేవో! కాస్త నీ పరాక్ర మాన్ని ప్రకటించి చూపిస్తావా? ఆ దుందుభి శవాన్ని కాలితో మీటు తావా? సప్తతాళాలను బాణంతో కూలుస్తావా?' అని అడుగుతాడు. సకామభక్తులకు అనుమానా లెక్కువ. వారికి అనుమానాలు తీరితేతప్ప అవతారమూర్తిని నమ్మరు. వారి మనస్సు కుదుటపడి సమాహితాన్ని భజించరు. అందుకై అవతారమూర్తి అద్భుతాలు ప్రకటిస్తుంటాడు. నిష్కామ నిర్మోహ భక్తులకు మహిమలు, అద్భుతాలు అవసరంలేదు.

మనలో కూడ సుగ్రీవు లెందరో ఉన్నారు. ఆ సకామ భక్తుల చిత్తాలను సమాహితపరచటానికే స్వామి మహిమలు ప్రకటిస్తారు. కోరిన కోర్కెలు ముందు తీరుస్తారు. 'నేను నీ పని చేసిపెడితే నీవు నా పని చేసిపెడతానన్నావుగా. రా. నాకంటూ నీ వేమిటో చేసిపెట్ట వలసిం దేమీ లేదు. ప్రేమతత్త్వాన్ని నీ జీవితంలో ఆచరించు; మానవ సేవయే మాధవసేవగా భావించి, సేవించి, తరించు' అని స్వామి మనల్ని అడుగుతారు. అయినా యీ పద్ధతిలో భక్తునికీ, భగవంతునికీ ఉండే సంబంధం 'ఇచ్చుకుంటు వాయనం; పుచ్చుకుంటు వాయనం'లా సాగుతుంది. వంతుకు వంతు సరిపోతుంది. చివరకు మనకంటూ

మిగిలేది ఏమీ ఉండదు. అర్థప్రధానమైంది సకామభక్తి. స్వార్థం పరార్థంగా మారితే స్వామి సర్వరక్షకుడుగా భక్తుల యోగక్షేమాలను వహిస్తాడు.

వానరులందరిలో హనుమంతుడు శక్తిమంతుడు. రాముని నామాన్ని సర్వ జీవాణువులయందు పొంగించుకొన్న భక్తిపూర్ణ కుంభం. ఆ రామనామ నాదమే పంచభూతములందు వ్యాపించి విశ్వ రూపాన్ని ప్రకటింప చేసింది. 'రామదూత' అన్న పేరుతో సుందర కాండను తీసికొని రాబోయే ఉపన్యాసంలో హనుమత్తత్త్వాన్ని సమాలోచించుకొందాం.

శబ్దాన్ని ఆశ్రయించి అర్థం తెలిసికోవాలి. ప్రకృతిని ఆశ్రయించి పరమాత్మను తెలిసికోవాలి. సీతను చూచి రాముని తెలిసికోవాలి. శబ్ద బ్రహ్మాన్ని నాదబిందువు చేరబోతోంది. శబ్దమునందు నాదరూపంగా భాసిస్తున్న రామనామాన్ని చూచి సీతయే రాముడు, రాముడే సీత అన్న అభేదప్రతిపత్తిని సాధించుకొన్న నాదయోగి పవనాత్మజుడు. మధురా ద్వైత సిద్ధిని సీతారాములయందు దర్శించిన ద్రష్ట హనుమంతుడు.

ఒక్కమాట: రామాయణానికి పూర్వం కావ్యం లేదు భాగ వతంలో శ్రీకృష్ణగోపికాతత్త్వంలో మనకు మధురాద్వైతసిద్ధి గోచరి స్తుంది. పరమాత్మ పురుషుడు: జీవాత్మ స్త్రీ. భార్యాభర్తలయందుండే మధురమైన ప్రేమగా భక్తి తత్త్వాన్ని ప్రపంచించే మధురాద్వైతభావం మొదటిసారి రామాయణంలో సుందరకాండలో కనపడుతుంది. సర్వ భక్తి మార్గాలలో ఇది మధురమైన మార్గం; సుందరమైన మార్గం. ఇట్టి మధురాద్వైత తత్త్వాన్ని దర్శించిన యోగి హనుమ. సీతారాముడు, సాయిరాముడు-నామభేదమే కాని తత్త్వం ఒకటే. సీతాన్వేషణం జ్ఞానా న్వేషణం! మధురాద్వైతానుభవాన్వేషణం! ఇదే సాయితత్త్వం. సాయిరామ్!

# రామదూత

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము.
సాయికుటుంబ సభ్యులకు నమస్కారము.

## సుందర గీత

1. అశోకవనిలో సీతామాతను హనుమంతుడు చూచెన్
అద్వైతామృతసిద్ధి నందుకొని ఆనందము నొందెన్.
2. యోజనశత విస్తీర్ణ సముద్రము యోగమూర్తి దాటెన్
ఉజ్జ్వల కుండలినీ ప్రసారమును ఊర్ధ్వముఖంబున మీటెన్.
3. రావణ లంకా వైభవ సారము రాకానిశిలో గాంచెన్
రాత్రించర మోహాంధకారమున రవ్వలచూపుల నుమిసెన్.
4. రావణ భాషణ భీషణ కీలల రాజసంబు నెంచెన్
రామవిరహజ్వాలాగ్నితప్త యగు రమణిని సీతను గాంచెన్.
5. రామకథామృత వేదసారమును రాగలోలుడై పాడెన్
రామదూత యని సీత మెచ్చగా రాఘవముద్రిక నిచ్చెన్.
6. రాముడె సీతయు, సీతయె రాముడు రహస్యమిదియని తెలిసెన్
రక్తిగొల్పు నీ మధురాద్వైతము రామాంకిత మని తలచెన్.
7. రాక్షసవీరుల దునిమిన పావని రామబాణమై వెలిగెన్
రావణసభలో రాయబారిగా రామమంత్రమై నిలిచెన్.
8. దూతను కాల్చిన దుష్టరాక్షసుల దుర్నీతికి మండెన్
దూదికొట్టముగ లంకానగరిని బూదిచేసి పొంగెన్.
9. చూచిరమ్మనిన కాల్చివచ్చెనను సూక్తికి ప్రాణముపోసెన్
చూడామణితో రామహృదయమున సుందరతేజము నింపెన్.

10. రామశబ్దమున బీజాక్షరములు ర-అ-మ-అమరున్
రాముడు సూర్యుడు సీత చంద్రుడగు రామదూత శిఖియౌన్.

11. రామభక్తియును రామశక్తియును రామదూత హనుమాన్
రామమంత్రమును రామతత్త్వమును రామదూత హనుమాన్.

12. సుందరకాండము సుందర మంత్రము సుందరుడే హనుమాన్
సుందరమూర్తులు సీతారాములు సుందర మేమనినన్.

"యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారి పరి పూర్ణ లోచనం
మారుతిమ్ నమత రాక్షసాంతకమ్."

"మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి."

సుందరకాండ రామాయణ రత్నహారంలో నాయకమణివంటిది. రామాయణాన్ని అంతా చదివినా, చదవకపోయినా సుందరకాండను ఒక్కదానిని మాత్రమే చదివినా, విన్నా రామాయణాన్నంతా చదివిన ఫలం, రామాయణంలో చెప్పబడిన రామతత్త్వసారం మనకు కరతలామలక మవుతుంది. రామాయణంలో బాలకాండ, అయోధ్యా కాండ, అరణ్యకాండ, కిష్కింధకాండ - యిలా ఆయాకాండలలో వున్నటువంటి కథను ప్రధానంగా గ్రహించి ఆ పేర్లు పెట్టటం మనం చూస్తాం. హనుమంతుడు సీతాన్వేషణం చేసిన యీ కథా ఘట్టానికి సుందరకాండ అని వాల్మీకి పేరు పెట్టాడు. ఇందులో కథార్థాన్ని ప్రధానంగా చేసి సుందరకాండ అని పేరు పెట్టడం లేదు. ఈ సుందరుడు ఎవరు? ఈ సుందరి ఎవరు? ఈ సౌందర్యము ఎవరు? అని మనలను ఆలోచింప చేసేటట్లుగా సుందరకాండ అని పేరు పెట్టాడు.

ముందుగా సుందరకాండలో నున్న కథార్థాలను సంగ్రహంగా గమనిద్దాం. మహేంద్ర పర్వతం మీద హనుమంతుడు సముద్రాన్ని

లంఘిస్తాడు,లంకవైపు వాయువేగంతో వెళ్ళుతూ వుంటాడు. మైనాకుడు ఎదురు పడతాడు అతని ఆతిథ్యాన్ని స్వీకరించినట్లుగా అమృత హస్తంతో స్పృశించి హనుమ ముందుకు సాగుతాడు. తరువాత సురస అడ్డం వస్తుంది దాని గర్భములోకి చొచ్చి బయటపడతాడు. ఆ తరువాత సింహిక అడ్డం వస్తుంది. దాని హృదయాన్ని చీల్చి దానిని చంపుతాడు లంకకు చేరుతాడు. లంకిణి అడ్డం వస్తుంది. దానిని ఒక గుద్దుతో సంహరిస్తాడు ఎడమపాదాన్ని లంకలో పెట్టి లోనికి ప్రవేశిస్తాడు. సీతకోసం లంకలోనున్న మహాపురుషుల అంతఃపురాలన్నింటిని అన్వేషిస్తాడు. రావణాంతఃపురాన్ని చూస్తాడు. మండోదరిని చూచి సీత యని భ్రమిస్తాడు. కాదని తెలుసుకొని నిర్వేద పడతాడు. అశోక వనాన్ని చూస్తాడు. చైత్రప్రాసాద గృహాన్ని సందర్శిస్తాడు. శింశుపా వృక్షం మీద కూర్చొని అశోకవనంలో శోకమూర్తియైవున్న సీతను దర్శిస్తాడు. రావణుడు, సీత - వీరియిరువురి మధ్య జరిగిన సంభాషణం వింటాడు. రావణుని దౌష్ట్యాన్ని తెలిసికొంటాడు. సీత పతివ్రతా హృదయాన్ని అర్థం చేసికొంటాడు. రావణుడు రెండు నెలల గడువునిచ్చి వెళ్ళటాన్ని గమనిస్తాడు. ఆ తరువాత, రాక్షస స్త్రీల బాధలు, బోధలు సీతను ఏవిధంగా వ్యధ పెట్టాయో గమనిస్తాడు. సీత ఆత్మహత్యా ప్రయత్నం చేసికోటానికి ప్రయత్నం చేస్తూవుండగా ఆమెకు శుభ శకునాలు కొన్ని కలగడం, రాముని స్మరిస్తూ ఆమె వుండటం చూస్తాడు. తాను సీతాదేవికి యెలా పరిచయం చేసుకోవాలి అని ఆలోచించి హనుమంతుడు రఘువంశ కీర్తనాన్ని మృదుమధురంగా వాయులీనంగా విన్పించేటట్లు పాడతాడు.

అలా రఘువంశకీర్తనాన్ని చేస్తున్న గొంతుక ఎవరిదో, యిది కలయా లేక యిలయా? అని సీత అనుకొని ఆ కొమ్మలచాటులలోనున్న హనుమంతుని చూడటం, అప్పుడు హనుమంతుడు క్రిందకు దిగటం, రామముద్రికను యివ్వటం, రాముని సీతావిప్రలంభ దశను వివరించి చెప్పటం, సీత హనుమంతుని శక్తిపై అనుమానాన్ని

ప్రకటించటం, సీతను తన వీపుమీద తీసికొనివెళ్ళి శ్రీరాముని చేరుస్తానని హనుమ చెప్పటం, నీకు అంత బలం వుందా అని ప్రశ్నిస్తే తన మహా దాకారాన్ని చూపించటం, రాముడు వచ్చి తీసుకొని వెళ్ళటమే న్యాయ మని సీత చెప్పటం, చూడామణి నిచ్చి, అనవాలుగా కాకాసుర వృత్తాం తాన్ని చెప్పి వెళ్ళిరమ్మనమని సెలవివ్వటం, ఆకలవుతున్నది తల్లీ, నేను కొన్ని ఫలాలను తినటానికి అనుమతి నిమ్మని హనుమ సీతను అడుగగా ఆమె అనుమతించటం, ఆ నెపముగా అశోకవనాన్ని ధ్వంసం చేయటం, రాక్షసులను, కింకరులను, జంబుమాలిని, ఏడుగురు మంత్రి కుమారులను, అక్షుని- వీరందరిని సంహరించటం, చివరకు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రానికి హనుమ బద్ధుడు కావటం, రావణుని సభను సందర్శిం చటం, తనను రామదూతగా పరిచయం చేసికొనటం, 'వాలిని ఏవిధంగా చంపాడో నిన్నూ ఆ విధంగా చంపుతాడు, రాముని శరణువేడు' మని హనుమ రావణునికి హితవు చెప్పటం, రావణుడు కృద్ధుడై యీ దూతను వధించండని ఆజ్ఞాపించటం, విభీషణుడు దూత వధ కూడదు, అవ మాన పరచిన చాలునని చెప్పటం, దూతను నిర్బంధించండని రావ ణుడు ఆజ్ఞాపించటం, రాక్షసులు తోక కంటించిన నిప్పుతో లంకాపురిని హనుమంతుడు దగ్ధం చేయటం, ఇంత తొందరపాటుతో ఈ లంకాపురిని అంతా దగ్ధం చేశానే, సీత కూడ బహుశః యీ మంటలపాలయి పోయిందేమోనని విచారించటం, కాని, సీత క్షేమంగా వుందన్న వార్త తెలిసికొని సంతోషించి, మరల సీతను సందర్శించి ఆమె దగ్గర మరొక ఆనవాలు తీసికొని మరలటం, అరిష్ట పర్వతంమీద నిలబడి కుప్పించి సముద్రం యీవలివైపుకు రావటం, వానరులకు సీతను చూచానన్న వృత్తాంతాన్ని చెప్పటం, వారందరూ కలిసి మధువనాన్ని ధ్వంసం చేసి, సీతను చూచామన్న వర్తమానాన్ని రామునికి తెలియచెప్పి రాముని దర్శించటం, శ్రీరామునికి సీతా క్షేమ వార్తాకథనం చెప్పి అతని హృద

యాన్ని అలరింపచేయటం, - ఇవి సంగ్రహంగా మనకు సుందర కాండలో కనపడే కథాంశాలు.

సుందరకాండలో ఇతర కాండలలో వలె రాముడు కనపడడు. ఇది విశేషం. కాని, రామదూత కనపడతాడు. ఇతర కాండలలో రాముడు కనపడుతూ వచ్చిన కథాఘట్టాలను గమనించిన మనకు రాముని స్థానంలో రామదూత కనపడుతున్న ఘట్టం ఈ సుందరకాండలో గోచర మౌతుంది. హనుమంతుడే నాయకుడా అన్నట్లు ఈ కాండ మనకు భాసిస్తుంది.

హనుమంతునికి కొన్ని విశిష్ట లక్షణాలున్నాయి. ఆయన పవ నాత్మజుడు. వాయువు సర్వాంతర్యామి. ప్రాణస్థానీయుడు. పృథివ్యాప స్తేజోవాయురాకాశములనన్నింటినీ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధా దులతో కలిసి వ్యాపింపగలిగే శక్తి వాయువుకుంది. పంచభూతాత్మక మైన ప్రకృతినంతా తనంతట తాను వ్యాపించే లక్షణం ఒక్క వాయు వుకే వుంది. ఇట్టి వాయువుయొక్క ఆత్మజుడు కాబట్టి పంచ భూతాత్మకమైన విశ్వమునంతా వ్యాపించి తన ఆకృతిని విస్తృతం చేయగలిగిన మహిమ యీతని యందున్నది. అందువల్లనే 10 యోజ నములు, 100 యోజనముల మేరకుకూడా ఆకృతిని పెంచగలిగాడు. పంచభూతములయందు వాయువును పూరించటంచేత అవి విస్తృత మవుతాయి. ఇట్టి విస్తృతమైన పంచభూతముల యొక్క ఆకృతిని తన ఆత్మలక్షణంగా పందించుకొన్న వాడు హనుమంతుడు. ఈ పంచ భూతాలు సుందరకాండలో ఇలా మనకు భాసిస్తాయి- రాముడు ఆకాశం, వాయువు హనుమంతుడు, తేజస్సు లక్ష్మణ సుగ్రీవులు, నీరు సము ద్రుడు, పృథివి సీత, పృథివినుండి ఆకాశము వరకు వ్యాపించే వాయు ప్రసారం పవనాత్మజుని తత్త్వం.

హనుమంతుడు నాదోపాసకుడు. నాదబిందువు శబ్దోపాసనం చేస్తుంది. ఈ శబ్దోపాసనంచేత ఆకాశాన్ని వాయువుతో పూరిస్తుంది. ఆకాశానికి శబ్దం సహజ లక్షణం. నాదం శబ్దమయంగా, మారునటు

వంటి నాదయోగాన్ని పవనాత్మజుడైన హనుమంతుడు ప్రపంచిస్తాడు. శబ్దము సీత. ఆ శబ్ద వాచ్యుడైన పరబ్రహ్మం శ్రీరాముడు. ఇట్టి శ్రీరామ తత్త్వాన్ని తెలిసికోడానికి వాయువు అనునటువంటి యీ నాదము చేసిన ప్రయత్నమే ఈ సుందరకాండలో మనకు కనపడేది.

హనుమంతుని జన్మవృత్తాంతాన్ని కనుక మనము గమనించి నట్లయితే అగ్నిగర్భమైన శివతేజస్సువలన పుట్టినటువంటివాడు అని పురాణాలు చెప్పుతున్నాయి. అగ్ని మోసుకొనివచ్చినటువంటి శివుని యొక్క తేజస్సు వాయువు గ్రహించి అంజనాదేవి గర్భంలో వుంచుతాడు. అంటే అగ్నిగర్భ అయిన శివునియొక్క తేజస్సు వాయువుచేత అంజనాదేవికి యివ్వబడిందన్నమాట. అలా పుట్టినవాడు కాబట్టి అగ్నిగర్భుడైన శివతేజము హనుమంతుడుగా మనకు కనపడుతాడు. అందువల్లనే సుందరకాండలో హనుమంతుడు శివ స్వరూపుడు అని ఉపాసకులు భావిస్తారు. అగ్నిగర్భుడైన శివస్వరూపుడు. మూడవ కన్ను తెరచినట్లయితే అగ్నిజ్వాలలు సృష్టింపగలిగిన రుద్రాత్మ కలిగినవాడు అతడు.

స్వామి చెప్పిన పాయస విభాగాన్ని గురించి రెండవ ఉపన్యాసంలో మనం తెలిసికొన్నాం. దశరథుడు పాయసాన్ని మూడు విభాగాలుగా చేశాడు. కౌసల్యకు ఇచ్చాడు. తరువాత కైకేయికి ఇచ్చాడు. తరువాత సుమిత్రకు ఇచ్చాడు. మన స్వామి చెప్పిన విభాగాన్ని బట్టి చూచినట్లయితే మొదటిది బ్రహ్మాంశ, రెండవది విష్ణ్వంశ, మూడవది రుద్రాంశగా కనపడుతుంది. ఇట్టి రుద్రాంశ అయిన భాగాన్ని సుమిత్రకు యివ్వగా ఆ సుమిత్ర ప్రమాదవశాత్తున, అక్కడ పాయసాన్ని పెట్టి తలదువ్వుకొంటూవుంటే, గరుత్మంతుడు వచ్చి ఆ పాయసభాగాన్ని తీసికొనిపోతాడు. ఇది స్వామి చెప్పిన కథ. రుద్రాంశచేత హనుమంతుడు జన్మించాడనీ, సుగ్రీవుని దగ్గరకు తీసుకొని పోవడానికి రాముడు, లక్ష్మణుడు అనునటువంటి పాయస తృతీయభాగాన్ని బుజములమీద మోయగలిగినటువంటి శక్తి హనుమంతునికి యిందువలన ఏర్పడిందని

మనం చెప్పుకొన్నాం. ఈ విధంగా మనం అన్వయం చెప్పుకొంటే రుద్రాంశతో కూడుకొన్న పాయసభాగం వలన జన్మించిన మహితాత్ముడు ఈ పవనాత్మజుడు.

శక్తితత్త్వముతో రామకథను అన్వయించేవారు ఇలా చెప్పుతారు: శక్తి త్రిమూర్తులయందు ప్రవేశించి ఆయా కార్యాలను నిర్వహింపచేస్తుంది. త్రిమూర్తులకు సృష్టి, వహన, సంహరణ కార్యాలయందు తోడ్పడునటువంటి మూలశక్తి ఏ శక్తియో అదే బ్రహ్మం. రాముని యందు బ్రహ్మచైతన్యాన్ని విష్ణుచైతన్యాన్ని, రుద్రచైతన్యాన్ని కలిగింపచేసే మూలశక్తి సీత. రావణ సంహరణార్థమై తనను తాను నాలుగు రూపాలుగా విభజించుకొని జన్మించుటకు కారణభూతమైనటువంటి శక్తి రామునియందు బ్రహ్మచైతన్యాన్ని ప్రవేశపెట్టింది. ఆ తరువాత విశ్వామిత్ర యాగ సంరక్షణందగ్గర నుండి యింతవరకు ఋషులను సంరక్షించి, శిష్టులను రక్షించే బాధ్యత స్వీకరించి విష్ణ్వంశగా ఆమెయే ఆతనియందు భాసించింది. రావణ సంహారం అన్నది రుద్రాంశతో జరగాలి. ఇట్టి రుద్రచైతనాన్ని పంచవటిలో మేల్కొల్పింది. రావణుడు సీతను గ్రహించటంతో శ్రీరామునియందు ఆ శక్తి రుద్రచైతన్యాన్ని ప్రవేశపెట్టింది. ఇట్టి రుద్రచైతన్యానికి దూతగా పనికి వచ్చినవాడు యిట్టి రుద్ర తేజం కలిగిన హనుమంతుడు. ఈ విధంగా రామునియందు రుద్రాంశ చైతన్యాన్ని భజింపచేసిన మాయ సీతగా శాక్తేయులు అన్వయం చెప్పుతారు.

కుండలిని యోగమంతా హనుమంతునిచర్యల్లో సుందరకాండలో ప్రపంచించి వాల్మీకి చెప్పాడు. కుండలినిని జాగృతం చేయాలి. అది బ్రహ్మాండ చైతన్య శక్తిని పిండాండ చైతన్య శక్తిగా తనయందు సంవదించుకొని మన శరీరంలో నున్న శక్తిరూపం. చుట్టు చుట్టుకొని పడుకొన్న పాామువలె యోనిస్థానంలో యీ కుండలిని శక్తి వుంటుంది. దానిని మేల్కొల్పాలి మేల్కొల్పితే షట్చక్రముల ద్వారా అది పైకి వెళ్ళుతుంది. మూలాధారం, స్వాధిష్ఠానం. మణిపూరం, అనాహతం,

విశుద్ధం, ఆజ్ఞాచక్రందాటి సహస్రారంలో అది ఫలిస్తుంది. వెన్ను పూసను ఆశ్రయించి సుషుమ్న నాడి వుంటుంది. తామరతూడువలె వుండే ఆ మార్గంద్వారా యీ కుండలిని శక్తి ప్రసారమవుతుంది. ఇడ పింగళ అనే నాడులు ఎడమ, కుడి భాగాలలో వుంటాయి. ఇవి చంద్ర, సూర్యశక్తులకు ప్రతీకలు, గ్రంథి స్థానాలు. ఈ రెండూ మెలికలుగా తిరుగుతూ వెళ్ళి ఆజ్ఞాచక్రంలో సుషుమ్నలో యోగిస్తాయి. ఇది కుండలినియోగంలో చెప్పే లక్షణం. దీని ప్రస్థానం ఇలా వుంటుంది 'లం' అనే బీజాక్షరం పృధ్వీబీజం. ఈ పృధ్వీబీజం మూలంగా, మూలాధార చక్రమునుంచి కుండలిని శక్తిచైతన్యం ప్రారంభమవుతుంది. 'లం' పృధ్వి. పృధ్వీపుత్రి సీతకు సంకేతం. సీతను గురించి అన్వేషించే సంకల్పంతో హనుమంతుడనే కుండలిని శక్తి మేల్కొల్పబడింది. జాంబవంతునిచేత హనుమంతుడు ప్రబోధితుడవుతాడు. ఆ ప్రబోధింపబడడం అనేది కుండలినీ శక్తిని మేల్కొల్పడం. ఇది పృధ్వి తనయ అయిన సీతను సంకల్పించి ప్రస్థానం సాగిస్తోంది. తరువాత 'వం' జల బీజం. హనుమంతుడు సముద్రాన్ని దాటడంలో, స్వాధిష్ఠాన చక్రంలోని సుషుమ్నానాడి ప్రయాణంగా మనకు భాసిస్తుంది. మణిపూరంలోని 'రం' అనే అగ్నిబీజముంది. ఈ అగ్ని బీజ ప్రస్థానం మనకు లంకాదహనంలో భాసిస్తుంది.

అనాహత చక్రంలో 'యం' అనే వాయుబీజం వుంది. ఈ వాయుబీజం హనుమంతుడు సీతను దర్శించి, ఆమె యెదుట విశ్వవ్యాప్తిని భజించునటువంటి ఆకృతి అతడు లంకలో ప్రదర్శించే వైఖరిని మనకు వ్యక్తం చేస్తుంది. తరువాత విశుద్ధ చక్రంలో 'హం' బీజం వుంది. ఇది ఆకాశబీజం. హనుమంతుడు తిరిగి ఆకాశమార్గాన వచ్చిన ఘట్టం దీనివల్ల తెలుస్తుంది. ఆజ్ఞాచక్రంలో హంస ఉంది. హంస అంటే శక్తితో కూడినటువంటి శివుడు. సీతా క్షేమ వార్తతో రాముని సంతోష పెట్టిన ఘట్టాన్ని మనము 'హంస' అని గ్రహించాలి. ఈ శక్తితో కూడుకొన్న పరమశివ తత్త్వం రామునియందు మనకు భాసిస్తుంది.

తరువాత సహస్రారం. సహస్రారములో మనకు అ, మ అనునటువంటి బీజాక్షరాలు ఉంటాయి. రామశబ్దంలోని ర-అ-మ అనే బీజాక్షరాలలో ర-సూర్యబీజం. అ-చంద్రబీజం. మ-అగ్నిబీజం రామునియందు సీతా జ్ఞానము తెలిసిన సమయంలో భాసిస్తున్న పరమ చైతన్యం ఈ సహస్రార చక్రంగా మనము భావించాలి. ర=రాముడు; అ=చంద్రబీజము సీత; మ=అగ్నిబీజం హనుమంతుడు. సీతా వార్తను తీసికొని వచ్చిన హనుమంతుడు అ మ అను బీజాక్షరంతో తుల్యుడు. ఆ వార్తతో సంతోష భరితుడైన రాముడు 'ర' అన్న బీజాక్షరంతో తుల్యుడవుతున్నాడు. ఈ విధంగా రామ శబ్దము హనుమంతునిచేత తెలియబడిన సీతాజ్ఞానము చేత ప్రజ్ఞానుడైన పరమాత్మ ప్రకాశించు విధానాన్ని తెల్పుతోంది ఇదే మనకు బ్రహ్మ రంధ్రం మీద సహస్ర సూర్యకాంతులతో ప్రకాశించే తేజస్సుగా యోగులు చెప్పుతారు. అట్టి తేజస్సే రాముడు. ఈ విధంగా కుండలిని యోగ ప్రస్థానాన్ని అంతా వాల్మీకి ఇందులో ప్రస్తరించి చూపించాడు. ఇట్టి యోగమార్గం ద్వారా మనం సహస్రారచక్రంలో నున్న కాంతిని చూడవచ్చును.

ఇక్కడ రాముడు హనుమంతుని కిచ్చి పంపినది ముద్ర, ముద్రిక. సీత మరలా యిచ్చి పంపినది చూడామణి. కుండలినీ శక్తి జాగృతం కావాలంటే ఏదైనా ఒక ముద్ర కావాలి. అదే యోగాసాధనం. ఈ ముద్రతో అది జాగృతము అవుతుంది. రాముడు ఇచ్చినది ముద్ర. దానితో కుండలిని జాగృతం చేశాడు. చివరకు భాసించేది యిక్కడ చూడామణి. ఇట్టి చూడామణిని సీత హనుమకిచ్చి రామునికి పంపింది. అందువల్ల కుండలినీ చైతన్యం జాగృతం కావడం, అది సహస్రారంలో తేజస్సుగా భాసించటం జరిగింది. సీత యిచ్చిన సంకేతం రాముడనే సహస్రారములో భాసించే తేజస్సు. రాముడిచ్చిన ముద్రిక కుండలిని యొక్క జాగృతికి చిహ్నం. ఇలా కుండలిని యోగాన్నంతా మనము సంవదించుకోవచ్చును. ఇందులో ఆజ్ఞా చక్రంలో ఇడా పింగళ నాడులు సుషుమ్నలో కలుస్తాయని చెప్పుతారు. హనుమంతుని యొక్కయు, సీత యొక్కయు తత్త్వాలు ఈ సుషు

మ్నలో రామునియందు లయిస్తాయి. సీత వార్తను రామునికి చెప్పిన ఘట్టం అటువంటిది. అక్కడ బీజాక్షరములు హంస. హంసః బయట నుంచి చూస్తే సోఽహం. హంస అంటే జీవుడు. దీనిని లోపలనుంచి కనుక చూస్తే స్వామి అన్నారు 'సోఽహం.' బయటనుంచి చూచిన ట్లయితే హంస. హనుమంతుడు చూడామణిని తెచ్చాడు, సీత వార్తను రామునకు అందించాడు అని, బాహిరమైన దృష్టితో చూచినట్లయితే యిది జీవుని కథ. ఆత్మారామంగా కనుక దీనిని చూచినట్లయితే సోఽహం అన్న తత్త్వం దర్శనమిస్తుంది. ఈ సోఽహం అన్న తత్త్వ మును అధ్యాత్మ రామాయణములో తనకు సీతా వార్తను కొనివచ్చిన హనుమంతునికి రాముడు కౌగిలిని అందిస్తాడు. 'నీవు చేసిన ఉపకారా నికి నీకు ఏమి ప్రతికృతిని యివ్వగలను, ఇదిగో నా కౌగిలిని తీసుకో' అని హనుమంతుణ్ణి బిగిగా కౌగిలించుకొంటాడు రాముడు. అక్కడ అధ్యాత్మ రామాయణం ఇలా అంటుంది:

"యత్పాద పద్మయుగలం తులసీదళాద్యైః
సంపూజ్య విష్ణు పదవీం అతులాం ప్రయాంతి
తే నైవ కిం పున రసౌ పరిరబ్ధమూర్తి
రామేణ వాయుతనయః కృతపుణ్యమూర్తి."

లోకంలో తులసీదళాలు మొదలైన పూజా ద్రవ్యాలతో ఆ విష్ణుచరణా లను పూజించి, పూజించి పరమునందు మనం ఆ విష్ణుపదములను చేరుతూ వుంటాము సామాన్యంగా. కాని, ఈ హనుమంతుడు శ్రీరాముని యొక్క కౌగిలిని పొంది ఇహమునందే ఆ పరాన్ని చేరాడు. ఎంత అదృష్టవంతుడు! అనే ఈ శ్లోకంలో అధ్యాత్మ రామాయణంలో సుందరకాండ ముగుస్తుంది. ఇది నిజానికి సోఽహం అన్న తత్త్వమే. పరమాత్మ, జీవాత్మలయొక్క సంయోగ స్థితిని భజింపచేసే లక్షణం. బహిర్దృష్టికి హనుమంతుడు 'హంసః' - జీవుడు రామదూత. అంతర్ దృష్టికి సోఽహం - జీవన్ముక్తుడు - రామ పరిష్వంగంలోని హనుమం తుడు - అద్వైతసిద్ధికి ప్రతీక.

హనుమకు మారుతి అనే పేరుంది. మారుతి అంటే వాయు దేవుని కుమారుడు అని అర్థం. మా+రుతి అనికూడ చెప్పవచ్చు. రుతి అంటే ధ్వని, మా అంటే లక్ష్మి, స్వర్గము, మోక్షము, మోక్షమును కూర్చిన ధ్వని ఓంకారము అనే అర్థాలున్నాయి. మా=లక్ష్మి. లక్ష్మి అంశ సంభూతురాలైన సీత. మా-రుతి అంటే సీతను గూర్చిన ధ్వని, సీతయొక్క ధ్వని. ఈ విధంగా సీతా తత్త్వాన్ని తెలుసుకోడానికి అతడు సాగించిన యోగ మార్గం సీతా సందేశాన్ని రామునికి విన్నవించిన దూత కార్యం. అతడే యోగిగా, ఓంకారంగా తన ప్రస్థానాన్ని సాధించిన విధం మారుతి శబ్దం చేత సుందరకాండలో ప్రతీయమానమవుతున్నాయి.

హనుమంతుడంటే హనువులు కలవాడు. హనువులు అంటే వెలి దవడలు. 'హంతి భక్ష్యం హనుః' భక్ష్యమును నమలునది అని దానికి అర్థం. ఏదైన తినడానికి పెడితే నమలటానికి ఉపయోగపడేది కాబట్టి దానికి హనువు అని పేరు వచ్చింది నమలుట, నెమరువేయుట మొదలైన లక్షణాలు కలిగినవే హనువులు. ఇట్టి హనువులు కలిగిన వాడు హనుమంతుడు. ఏమి నమలుతాడు? పుట్టగానే సూర్యుని మ్రింగటానికి ఎగిరాడు. సూర్యుడు కాంతిపుంజం. జ్ఞాన ప్రతీక. జ్ఞానాన్ని ఒకేసారి మ్రింగటానికి, నమలటానికి ప్రయత్నం చేసినటువంటి యోగి ఈతడు. అందువలన మూతి కాలి, కొంతవరకు ఒకేసారి జ్ఞానాన్ని అంతా మ్రింగేయటానికి వీలులేదు. కొంచెము కొంచెముగా దీన్ని స్వీకరించాలి అని తెలిసికొన్నాడు. ఆ సూర్యుని కొడుకు అయిన సుగ్రీవుని దగ్గర సేవ మొదలుపెట్టాడు. ఈయన సుగ్రీవు దనే గురు సేవ చేస్తూ వుండగా, సాక్షాత్ 'ర' అనే సూర్య బీజమునకు ప్రభువైన రాముడు ప్రభువై నిలిచాడు. ఆయనకు దౌత్యము చేశాడు. దూతగా వెళ్ళి రాముని తెలిసికోవాలంటే మార్గమైన సీతను తెలిసికొన్నాడు. ఆ తరువాత రాముని పరిష్వంగాన్ని పొందాడు. ఈ విధంగా రామ తత్త్వాన్ని, హరి తత్త్వాన్ని, నారాయణ తత్త్వాన్ని కొలది కొలదిగా నమలుతూ ఆ సారాన్ని మ్రింగి, ఆ రామ నామ తత్త్వాన్ని తన

శరీరమంతా పండించుకొన్న నాదయోగి, భక్తిని శక్తిగా ప్రపంచింప కలిగినటువంటి గొప్ప ప్రాజ్ఞుడు.

భక్తిని శక్తిగా భక్తుడు ఎలా మారుస్తాడు? స్వామి ఏదైన మనకు ఆజ్ఞ యిచ్చారు. మనం దానిని చేయగలమో లేదో అనే అనుమానం, అహంకారం వుండకూడదు. నేను ఏమిటి మళ్ళీ? ఆజ్ఞ యిచ్చారు అమలుపరచటమే. ఆజ్ఞ యిచ్చినది స్వామే, శక్తి స్వామే అని తలంచి, నేను అన్న అహంకారాన్ని అడ్డం రానివ్వకుండా స్వామియే నేను, నాలో వున్న శక్తే స్వామి అని చూపగలిగిన భక్తుడు ఒక్క హనుమంతుడు. 'ఈ కార్యము చేయుశక్తి నాలో లేకున్న నన్ను ఆజ్ఞాపించి ఉండేటువంటివాడు కాడు. నాలో తన ఆజ్ఞను చేర్చినాడు కనుక రాముడే శక్తి నిచ్చి నాచేత కార్యము సాధింప చేయిస్తాడు' అని హనుమంతుడు అనుకొన్నాడు. ఈ దృఢమైన విశ్వాసమే హనుమంతుని యొక్క దృఢమైన భక్తికి నిదర్శనం. కనుకనే ఆతని తత్త్వము సుందరకాండలో చక్కగా వర్ణిస్తూ వచ్చారు" అని స్వామి ఆత్మారామం నాలుగవ దివ్యోపన్యాసంలో హనుమత్ తత్త్వాన్ని వివరించారు.

హనుమంతుడు లంకలో ప్రవేశించిన తరువాత ఎవరైనా 'నీవు ఎవరవు?' అని అడిగితే 'నేను రామదూతను' అని సమాధానం చెప్పాడు. దూత ఎవరు? 'స్యాత్ సందేశహరో దూతః' - సందేశాన్ని తీసికొనివచ్చేవాడు. 'సందేశం హరతీతి సందేశహరః'. నోటి మాటలతో సందేశాన్ని తెచ్చేవాడు అని మరొక అర్థం కూడ వుంది. 'దూయతే అనేన పర ఇతి దూతః రూఙ్ పరితాపే' వీనిచేత శత్రువు తపింప చేయబడును. ఎవనిచేత శత్రువు తపింపచేయబడునో అతడు దూత. ఇక్కడ రాముని యొక్క సందేశాన్ని తీసికొనివచ్చినవాడు, సీతయొక్క సందేశాన్ని తీసికొనివెళ్ళినవాడు రెండు వైపులా రామ శబ్దం పనికివస్తుంది కాబట్టి ఈతడు రామదూత. శత్రువైన రావణుని తపింపచేసినవాడు హనుమంతుడు. అధ్యాత్మలో రామతత్త్వాన్ని రావణునికి ప్రబోధించి 'నీవు అహంకారాన్ని పరిత్యాగం చెయ్యి' అని అతనిలో వున్న జీవుని

వేదనను రేకెత్తింప చేసినటువంటివాడు, అతని లంకను దహింపచేసి తపింపచేసినవాడు, చూచిరమ్మంటే కాల్చి వచ్చినవాడూ హనుమంతుడే. చూచి రమ్మన్నది మొదటి అర్థం. కాల్చి వచ్చినది రెండవ అర్థం. దూత అన్న శబ్దంలో ఈ రెండూ వున్నవి. కాని, చూచి మాత్రమే వచ్చినవాడు దూత కాడు. వట్టి యంత్రబ్రహ్మ. కాల్చి వచ్చినవాడే దూత అవుతాడు. శ్రీకృష్ణుడు కూడ భారతంలో చూచి రమ్మంటే కాల్చి వచ్చాడు. పాండవదూత అనిపించుకొన్నాడు. అలాగే యిక్కడ హను మంతుడూ అటువంటివాడే.

హనుమంతుడు సముద్ర లంఘనం చేసినపుడు ఆ సముద్రమును సంసారంగా మనము చెప్పుకొన్నాము. ఆ సంసారంలో త్రిగుణములు వున్నవి. ఈ త్రిగుణములను జయించటానికి స్వామి చెప్పిన మంత్ర మేమంటే సేవాధర్మం. ఈ సేవాధర్మంలో Discipline Devotion, and Duty అనే మూడు డకారాలు ముఖ్యం. యోగి కాబట్టి హనుమకు Discipline వుంది. రామ తత్త్వాన్ని తనయందు నామరూపంగా పండించు కొన్న భక్తుడు కాబట్టి Devotion వుంది. రాముడు చెప్పిన పని నా ధర్మము అని భావించి చేసే సేవాధర్మం అతనిలో వుంది కాబట్టి duty వుంది. ఈ మూడు మూర్తికట్టినవాడు కాబట్టి యీ మూడింటిని సాధించినవాడు, సంసారము అన్న సముద్రాన్ని అవలీలగా దాటి మాయను తెలిసికొని మాయాతీత పురుషుణ్ణి కూడ అందుకోగలుగుతాడు అని స్వామి చెప్పిన మాట.

స్వామి మూడు యఫ్‌లు కూడా చెప్పారు. 1. Follow the Master -ఇది అధ్యాత్మిక చైతన్యం. 2. Face the devil -ఇది నైతిక చైతన్యం. 3. Finish the 'Game' ఇది ధార్మిక చైతన్యం. రాముడు పొమ్మన్నాడు. రామాజ్ఞ శిరసావహిస్తానని (Follow the Master's order) వెళ్ళాడు. వెళ్ళినచోటల్లా devils ఎదురుగా వచ్చాయి. రాక్షసులు ఎదురుగా వచ్చారు. Face the devil- నిర్భయంగా వాటిని

ఎదుర్కో. Finish the Game నీకు ఏ కార్యమయితే చెప్పామో ఆ కార్యాన్ని సఫలంగా చేసికొని రా. ఈ 3F లను పండించుకొన్నటువంటి భక్తుడు హనుమంతుడు. అంతేకాదు, హనుమంతుడు త్రిగుణాలను జయించాడు. సముద్రంలో మైనాకుడు హనుమకు అపకారం చేయ దలచినవాడు కాడు. ఉపకారం చేయదలచిన వాడైన ఈతడు సాత్త్విక గుణానికి ప్రతీక. అతనిని చేతితో స్పృశించి అనుగ్రహించాడు హనుమ. తరువాత సురస నాగమాత, యీతనిని మ్రింగటానికి వచ్చింది. మ్రింగకుండా పోనివ్వనన్నది. 10 యోజనాలు శరీరాన్ని పెంచాడు. ఆమె 20 యోజనాలు పెంచింది. ఈతడు 90 యోజనాలు పెంచాడు. ఆమె నూరు యోజనాలు పెంచింది. వెంటనే అంగుష్ఠ మాత్రంగా ఆకృతిని కుంచించుకొని ఆమె నోటిలోపలకువెళ్ళి, ఆ నోరంతా మూసేసరికి బయటకు వచ్చేశాడు. ఆమె కోరిక తీరింది. ఇతని కార్యం సాధితమయింది. ఆమె రజోగుణానికి ప్రతీక. సింహిక - ఛాయాగ్రాహి. నీడ పడితే చాలు- ఆ వ్యక్తి శక్తిని ఆకర్షిస్తుంది హనుమ ఆమె గుండెలోకి చొచ్చి గుండెను పిండిచేసి చంపాడు. విశ్వనాథ సత్యనారాయణగారు అంటారు.

"గుండె యాగి చత్తురుగాని గుండెలోన
చట్టుపొడి యయి చచ్చిన చావులేదు;
దాని చచ్చిన చావు సంద్రంబునందు
పాములకు తెప్పయైన శవమ్ము చెప్పు."

ఈ విధమైన చావు చావడం మనం ఎక్కడా చూడం. సింహిక తమోగుణానికి ప్రతీక. సాత్త్వికాన్ని మన్నించటం, రజస్సును నిపుణంగా తొలగించటం, తమస్సును నిర్దాక్షిణ్యంగా రూపుమాపటం అనే తత్త్వాన్ని హనుమ యిచ్చట ప్రదర్శించాడు.

"సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః-"

అనే తత్త్వం కూడా సుందరకాండలోని హనుమంతుని చరిత్రలో గోచర మవుతుంది. రామలక్ష్మణుల యొక్కయు, సుగ్రీవాదుల యొక్కయు, అంగదాదుల యొక్కయు సహవాసం సత్సంగతి. సత్సంగత్వం హనుమంతునికి మొదట సిద్ధించింది. తరువాత సముద్రాన్ని దాటటంతో నిస్సంగత్వం సిద్ధించింది. లంకలో సీతాన్వేషణం చేయటంలో నిర్మోహత్వం, రాక్షసులను సంహరించినపుడు నిశ్చలత్వం, తరువాత రాముని పరిష్వంగసుఖాన్ని పొందటంలో నిర్వాణత్వం సిద్ధించింది.

లంకలో ప్రవేశించగనే హనుమకు లంకిణి ఎదురుపడుతుంది. లంకలో వున్న విశేషమేమంటే- అక్కడ నరులు కాని వానరులు కాని లేరు. తదితరులు అందరూ వున్నారు. వానరుడు ప్రవేశించినపుడు ఇటువంటి వానరుడు ఎక్కడనుండి వచ్చాడు అని లంకిణికి ఆశ్చర్యం వేస్తుంది. రావణుడు కూడా తనకు మృతి కలిగితే వానరుని వలన కలగాలి, లేకపోతే నరునివలన కలగాలి అని వానరులను భేదోపాయంచేత తనమీదకు రాకుండా చేసికొన్నాడు. వానరులలో గొప్పవాడు వాలి. వాలి, సుగ్రీవుడు వీరిద్దరూ కనుక ఏకమైనట్లయితే రావణుని గెలవడానికి వీలు వుంది. అందువల్ల వాలికి, సుగ్రీవునికి భేదోపాయాన్ని కలిగించి, వారిరువురిని వేరు చేశాడు. ఈ భేదోపాయంచేత వానరులను రావణుడు జయించినట్లుగా మనం భావించవచ్చు. ఇక నరులలో శ్రేష్ఠుడు రాముడు ఇట్టి రాముని నిగ్రహించాలంటే రామునిలో వున్న శక్తి సీత కాబట్టి ఆ సీతను రామునినుంచి తొలగించినట్లయితే రాముడు బలహీనుడు అవుతాడు అని భేదోపాయాన్ని నరులయందు ప్రపంచించాడు. నరులయందు ప్రపంచించిన భేదోపాయానికి, అంటే సీతను తొలగించి రాముని బలహీనుని చేయాలి అన్న రాజనీతికి - విరుగుడుగా రాముడు హనుమంతుని ప్రయోగించాడు. ఈతడు రావణుని నుండి విభీషణుని వేరు చేస్తాడు. ఈ విధంగా రావణుని బలంలో భేదోపాయాన్ని కల్పిస్తాడు. లంకిణి వానరునిచేత ఎప్పుడు మృత్యువును పొందుతుందో అప్పుడు లంకకు చేటు మూడుతుంది అని బ్రహ్మశాపం వుంది.

ఆవిధంగా లంకిణి హనుమంతుని ప్రేరేపించి, 'ఇక రాక్షసులకు ఆప త్కాలం సంభవించింది. నీవు యథేచ్ఛగా లంకానగరంలో విహరించు' మని చెప్పుతుంది. అధ్యాత్మ రామాయణంలో లంకిణి అశోకవనంలో సీత వున్నది అన్న సంగతి కూడ చెప్పినట్లున్నది. చనిపోయేటప్పుడు లంకిణికి రాఘవస్మృతి కలుగుతుంది. 'దాశరథి నాకు ముక్తిని కలి గించాలి' అన్న ఆర్తితో ఆ జీవి కన్నుమూస్తుంది. లంకానగరంలో లంకిణి సంహారం అయిన తరువాత హనుమంతుడు ప్రవేశిస్తాడు.

అది పూర్ణిమ. చంద్రబింబం నిర్మలంగా ప్రకాశిస్తోంది. ఆ వెన్నెల రాత్రిని వాల్మీకి చాల విపులంగా వర్ణించాడు. ఆ రాత్రి నిర్మలమైన దైవ సహాయానికి ప్రతీక. హనుమంతుడు సీతను దైవసహాయంతో అన్వేషిస్తు న్నాడు. విశ్వనాథవా రీఘట్టాన్ని రమణీయంగా చిత్రించారు. మచ్చు కొక పద్యం-

"లంకలోన కలదు లావణ్యనిధి సీత
ప్రతిఫలించె నామె వదనసీమ
యాకసంపు నరసియం దన్నయట్లుగాఁ
జెలగె మింట కలువచెలిమికాఁడు."

ఈ లంకలో సీతామ్మవారు వున్నది అని చెప్పడానికి ఆ సీతామ్మవారి ముఖం ఆకాశం అనే సరోవరమునందు ప్రతిబింబించినట్లుగా ఆ చంద్రుడు భాసిస్తున్నాడట. హనుమంతుడు లంకా నగరంలో తిరుగుతున్నాడు. రాక్షసు లందరూ మద్యం త్రాగి కైపెక్కి విహరిస్తున్నారు. రావణ సంపద అనంతంగా వుంది. భూలోకంలో తాను అంతవరకు అటువంటి సంపద ఎన్నడూ చూడలేదు. దేవతల సంపదనంతా కొల్లగొట్టికొనివచ్చి రావణుడు తన నగరంలో నింపాడు కుబేరుని పుష్పక విమానం దానికి ప్రాతినిధ్యం వహిస్తోంది. హనుమ ప్రతి యింటికీ వెళ్ళేవాడు. అక్కడ వెతికేవాడు. రాక్షసులయొక్క మోహావృతమైన చేష్టలు అక్కడ కన పడుతుండేవి. తప్పత్రాగి విలాసభరితులై వున్నారు. కాని, ఒక

యింటిలో మాత్రం వింత అయిన చైతన్యం. హరినామస్మరణ. విభీషణుని యిల్లు అది.

స్వామి, రామాయణంలో లేనిది, అధ్యాత్మ రామాయణంలో లేనిది, ఒక సన్నివేశాన్ని చెప్పారు. హనుమంతుడు లంకలో వెదకుతూ వుంటే హరి నామం చెక్కబడిన ముఖద్వారం కలిగిన ఒక యిల్లు కనపడింది. 'లంకలో హరినామమా' అని ఆశ్చర్యపడి హనుమ లోపలకు వెళ్ళాడు. అప్పుడే హరి నామస్మరణం చేస్తూ ఒక వ్యక్తి శయ్యమీద నుండి లేస్తున్నాడు. అతడు విభీషణుడు. 'లంకలో హరిభక్తుడా!' అని ఆశ్చర్యపోయాడు హనుమ. ఈతని తత్త్వాన్ని తెలిసికోవాలని తాను బ్రాహ్మణాకారాన్ని ధరించి ఆ విభీషణునికి దర్శనమిస్తాడు. అతడా బ్రాహ్మణుని పూజిస్తాడు. 'నరుడు ఎలా వచ్చాడిక్కడకు?' అని అనుమానం అతనికి కలుగుతుంది. 'ఎవరవు నాయనా, యీ లంకలోకి ఎలా రాగలిగావు?' అని అడుగుతాడు. 'నేను రామదూతను సీతాన్వేషణ కోసం వచ్చాను' అంటాడు హనుమ. విభీషణుడు సంతోషించి సీతా వృత్తాంతాన్ని చెప్పి, తానూ, తన భార్యా, తన కూతురూ సీతయొక్క యోగక్షేమాలను విచారిస్తున్నామని చెప్పి, 'ఆ రాముడు ఎక్కడున్నాడయ్యా, నాలాంటి వాళ్ళు వచ్చి శరణు వేడితే ఆయన మాయందు దయ చూపుతాడా?' అని రాముని కరుణామయత్వాన్ని గూర్చి ప్రశ్నిస్తాడు. 'కోతులమైన మాకే శరణిచ్చిన ఆ రాముడు మీకు ఇవ్వడా? ఆయనకు హృదయం కాని కులం కాదు, అధికారం కాదు ప్రధానం' అని చెప్పి, హనుమ విభీషణునికి రామతత్త్వాన్ని బోధించి, అతనివల్ల సీతావిషయాన్ని తెలిసికొని, తాను మరల అన్వేషణకు వెళ్ళినట్లుగా స్వామి తమ రామాయణ కథనంలో చెప్పారు.

హనుమంతుడు రావణుని అంతఃపురంలో ప్రవేశించాడు. ఒక మహా సర్పం పుట్టలో బుసలు కొడుతూవుంటే ఎలా వుంటుందో, ఆడ పాములతో కలిసి వుంటే ఎలా వుంటుందో, ఆ అంతఃపురంలో విపుల

మైన శయ్యాపై ఇరవై చేతులు, పది తలలు కలిగిన ఆ రావణుడు నిద్రపోతూ వుంటే చాల భయంకరంగా వుంది. స్త్రీలందరూ విలాస భరితలై నిద్రాముద్రితలై వున్నారు. హనుమ ప్రతి వనితనూ చూసే వాడు. ఎవరు సీత? కనుగొనటం కష్టం వేలకొద్ది వనితలు ఉన్నారు. అందరినీ చూశాడు. సీత కనపడలేదు, ఒక మూల ప్రత్యేకమైన శయ్యాపై మండోదరి వుంది. సీతను కనుక్కోడానికి ఏది మూల సూత్రం? హనుమంతుడు ప్రతి వ్యక్తి దగ్గరకు వచ్చేవాడు. రామ నాదం ఏ శరీరంలో వినపడితే ఆమె సీత; లేదా రాముని తేజస్సు వంటి తేజస్సు ఏ వ్యక్తిలో కనపడితే ఆమె సీత. తాకకుండా చెవికే,కంటికే ఈమె సీత అని తెలియాలి. మండోదరిని చూశాడు, భ్రమించాడు సీత యేమో అని. దగ్గరకు వచ్చాడు. ఆమెలో రావణ శబ్దం తప్ప రామ శబ్దం వినపడలేదు. ఈమె సీత కాదు అనుకొన్నాడు. ఇక రావణుడు నిద్రిస్తున్న ఈ మంటపంలో సహస్రాంగనలు పడివుండగా వీరిలో లేని సీత మరి యింక ఎక్కడ వుంటుంది? సీతను తెలిసికొనేది యెలా? అప్పుడు, హనుమకు ఒక అనుమానం కలుగుతుంది. 'నేను యింత మంది అంతఃపుర కాంతులను చూస్తున్నాను. యిది దోషం కాదా?' అప్పుడు అనుకొంటాడు. రామాయణంలో ఇది గొప్ప శ్లోకం:

"మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే
శుభాశుభ స్వవస్థాసు తచ్చమే సువ్యవస్థితమ్"

'ఇక్కడ యింతమంది అంతఃపుర వనితలను చూస్తున్నపుడు ప్రమాణం ఏమిటి? నా మనస్సు. నా మనస్సు చలించి చూచినట్లయితే దోషము. కాని, సీతామాతను అన్వేషిస్తూ చూశాను. ఇందులో దోషం లేదు. శుభాశుభములకు మానసికవికారములే నిదర్శనలు. అయినా, నేను వెదుకుతున్నది స్త్రీనే. ఆమె స్త్రీలలో గాక పురుషులలో వుంటుందా? నా మనస్సు వికారం చెందలేదు. కాబట్టి యిందులో దోషం లేదు' అని నిశ్చయించుకొని సీతను గుర్తించేది ఎలా అని మధనపడుతూ వుంటాడు. ఇక్కడ సత్యనారాయణగారు ఒక మంచి కల్పనం చేశారు.

హనుమ కనులు మూసి ధ్యానమగ్నుడై వున్నాడట. ఆయన మనస్సులో శ్రీరామ మూర్తి వుంది. మరి కాసేపటికి నల్లని మేఘం వెంట మెరుపులా మరొకమూర్తి కనపడింది. విరిసిన చెందమ్మిని చేతిలో ధరించిన అప్యంతలావణ్యమూర్తి. అయితే ఆ పురుషవేషంలో, ఆ స్త్రీ వేషంలో పై వేషమేతప్ప భేదం లేదు, లోపల తత్త్వమంతా ఒకటిగానే భాసిస్తోంది. మెరుపులా మెరిసి సీత అంతర్ధానమై పోయింది. ఈయన మళ్ళీ కళ్ళు తెరచి చూశాడు.

'అంతలో దేవి అంతర్హితంబైన, నిలిచె రామమూర్తి నీరజాక్షుడంత హనుమ యెఱిగెనాత్మలోపలి, తన రామమూర్తి కాదు రామమూర్తి' రామమూర్తి అంటే రామునియొక్క మూర్తి, రామమూర్తి అంటే స్త్రీ మూర్తి. ఇంతవరకూ నా హృదయములో పురుషమూర్తి అయిన రాముడు వున్నాడు. దీనినే స్త్రీ మూర్తిగా నేను భావిస్తాను. ఆమె సీత అవుతుంది. ఇది గుర్తుగా మనసులో పెట్టుకొంటాను. హనుమ అశోకవనిలో మొట్ట మొదటిసారిగా సీతను చూసినపుడు-

"అస్యాదేవ్యా యథారూప మంగప్రత్యంగ సౌష్ఠవం
రామస్య యథారూపం తస్యేయ మసితేక్షణా."

ఈ దేవి అంగప్రత్యంగ సౌష్ఠవం, ఆ రాముని అంగప్రత్యంగ సౌష్ఠవం అంతా ఒక్కమాదిరిగానే వున్నది. సీతారాములకు అభేదప్రతిపత్తిని భాసింపచేసే ఒక చైతన్యం, ఒక తేజస్సు అద్వైతమధురరూపంగా హనుమంతుడు దర్శించాడు భార్యాభర్తల రూపంగా విడివడిన అద్వైత చైతన్యమే అది యని అప్పుడు అనుకొన్నాడు. విశ్వనాథవారి మాటల్లో సీతను తెలిసికోకపోతే రాము దర్థం కాదు:

"చేతమునందుఁ బూర్వమున శ్రీరఘురాము నెఱింగినట్లుగా
నే తలపోసినాడ; నిపు డీయమఁ గాంచినయంత సర్వమ
జ్ఞాతముగాఁగ నుండె ననుసంగతి నా కెఱుఁగంగ నయ్యెడున్;
సీత నెఱుంగకుండ రఘుశేఖరుఁ డర్థముకాడు పూర్తిగా."

"ఈ యిద్దరి నయ్యో విడఁ
దీయఁగ యత్నించునట్టి తెలివి తెలివియా?
కాయమ్మును జీవితముతోఁ
బాయఁగ జేసికొను వ్యర్థభావన కాకన్."

(రామాయణ కల్పవృక్షం)

ఈ పరమాత్మను, ప్రకృతిని యీ యిద్దరినీ విడదీసే ప్రయత్నం తెలివిలేని పని. శరీరాన్ని, ప్రాణాన్ని విడదీసుకొనే వ్యర్థ భావనయే అవుతుందని రావణుని సీతాపహరణ యత్నాన్ని మనస్సులో గుర్తిస్తాడు హనుమ. సీతా స్వరూపాన్ని చూచి అనుకొంటాడు - 'రాముడు సీతను గురించి అంతగా విరహపడుతున్నాడంటే నాకు అక్కడ అర్థం కాలేదు. ఈమె దివ్య సౌందర్యాన్ని చూసినటువంటివాడు త్రిలోక వైభవాన్ని కూడా త్రోసిరాజంటాడు.

"రాజ్యం వా త్రిశోకేషు సీతా వా జనకాత్మజా
త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలామ్"

త్రిలోక రాజ్యము హెచ్చా, జనకరాజసుత హెచ్చా అని అడిగితే, 'త్రిలోక రాజ్యం సీతాదేవిలో ఒక వీసంపాలు కూడ కాదు' నిఅ ఆ సీతా సౌందర్యాన్ని, ఆ సీతా తేజస్సును చూచి హనుమంతుడు భావిస్తాడు.

హనుమ అశోకవనములోని శింశుపా వృక్షాన్ని ఎక్కుతాడు. సీతా దర్శనం అవుతుంది. రాక్షస వనితల మధ్య మబ్బుల మధ్యనున్న చంద్రరేఖవలె కృశించినా, తేజస్సమన్వితయై, సీత శోకమూర్తియై భాసిస్తోంది. ఈమె సీతయేనా అని పరీక్షించి చూస్తాడు. రాముని యొక్క ఆకృతిని చూచి సీతయేనని నిర్ధారించుకొంటాడు. ఇటువంటి సమయంలో రావణు డక్కడికి వస్తాడు. రావణుని రూపం చూచేసరికి హనుమంతుడికి భయం వేసింది.

"ఇది యననుభూత పూర్వము
మది భయమొదవె ననుమాట మారుతి కిదియే
మొదలు తుదికూడ నిదియే
యది కోపము తెచ్చె హృదయమందున కపికిన్."

(రామాయణ కల్పవృక్షం)

'పుట్టిన నిముసమున గూడ మార్తాండ దేవునింగాంచి వెనుదీయ లేదు. బ్రహ్మాదులఁగాంచి యాశ్చర్యపడలేదు. శ్రీరామచంద్రుని గాంచి నివ్వెరపోలేదు. మాయాప్రథమస్వరూపమైన ఈ భయము పరమ యోగి అయిన తనయందు స్ఫురింప చేసినవానియందు మారుతి జుగుప్స' వహించాడు. మహా మాయకు ప్రథమ స్వరూపం భయం. అట్టి భయాన్ని కలిగించే గుణం తనయందు మూర్తికట్టినవాడు రావణుడు. అది అహంకారంచేత ప్రజ్వరిల్లింది. అహంకార ప్రజ్వలిత మైన భయానక రూపాన్ని ప్రదర్శిస్తున్న రావణుని చూచి మొదటి సారి భయాన్ని పొంది, తన ఆకృతిని కుంచించుకొని ఆకుల చాటున దాక్కొన్నాడు హనుమ. మారుతికి పుట్టిననాటినుండి భయమన్నది తెలియదు. రావణుని చూచిన క్షణంలో భయం ఒక్క మెరుపులా మెరిసింది అతని హృదయంలో. అదే దానికి మొదలు, అదే చివరకూడా.

రావణుడు అశోకవనంలో ప్రవేశించాడు. సీతతో అహంకారో ద్వేగ పూరితమైన మాటలతో సంభాషింప నారంభించాడు. హనుమ వింటున్నాడు.

"నన్నున్ మించినవాఁడు పండితుఁ డనంతన్ లేడు; వేదార్థముల్
నన్నున్ సుంతయు మించి లేవవి నెలంతా! నేను వేదోక్తు లి
వ్విన్ని వ్విన్ని యటంచు లెక్కయిడితిన్; వేదార్థ మేమందునా
అన్నా! కామము చూడ సృష్టి ప్రథమాహంకారమే జానకి!
ప్రేమయె సృష్టికంతయును బెద్ద; సరోజభవాది దేవతల్
ప్రేమకు లోకు; వద్ది ప్రభవిష్ణువు; విష్ణువు ప్రేమ; నీ పయిన్
ప్రేమ యఖండమైనది విభీతమృగాయతనేత్ర! నాకు నీ
ప్రేమను గాదటంచు పలవించుట దుఃఖనిదాన మంగనా!

తెచ్చెద లేడినంచు చని, తెచ్చెనె?-తెచ్చుట యంత సాధ్యమా?
తెచ్చెనొ యేమొ! ని న్నిటకు తెచ్చితి; నీవట లేని వేళలో
తెచ్చెన యంద; మే నిటకు తెచ్చితి ని న్నని నేర్వఁ; డేమియా
తెచ్చుట?-ఏది యేమగునొ తెల్వియొకింతయు లేని తెచ్చుటా?
భ్రాజితమైన ఈ సకల వైభవముం దృజియించి, యొక్కనీ
తోఁ జనుదెంతు నేరికిని దోపని సీమల; నీవు దేవతా
భ్రాజితమూర్తి; నేను పదవారిజసేవకుఁడన్; భవత్కటా
క్షాజిరరంగవల్లులకు నద్దినదౌ మృగనాభి కల్పుఁడన్.

సీత యడిగెను దైత్యుఁడు సేయలేద
యన్న పల్కుదృవిల్లిన నబల! నిరయ
భాజనుఁడ నౌదు; నీ పదవారిజముల
మీద శపథంబు చేసెదనే దయాబ్ధి!
నీ వఖిల భవాంభోనిధి
నావవు నే నుప్పునీళ్ళ నాసాకంత
వ్యావల్గువులుగ నుంటిఁ గృ
పావేత్రము నిచ్చి, యొడ్డు పట్టింపఁగదే!"

(రామాయణ కల్పవృక్షం)

'నేను వేదాలను చదివాను, వివేచించాను, వింగడించాను. సృష్టికి ప్రథమాహంకారం కామమని తెలిసింది. నేను నీయందు ప్రేమను కోరుతున్నాను. ప్రేమయే విష్ణువు. అట్టి అఖండ ప్రేమ నీయందు అర్థిస్తున్నాను. అట్టి ప్రేమను ప్రసాదిస్తే దుఃఖం తొలగిపోతుంది. మృగాన్ని తెస్తానని వెళ్లాడే ఆ రాముడు- అది సాధ్యమా? ఒకవేళ తెచ్చాడోయేమో తెలియదు. నేను నిన్ను యిక్కడకు తెచ్చిన తరువాత కూడ ఎక్కడకు నేను నిన్ను తీసుకొని వచ్చానో అతడు తెలుసుకోవాలి కదా? ఇంతవరకు తెలుసుకొన్నాడా? తెలుసుకొనడం సాధ్యమైన విషయమా? అట్టి అసమర్థుని, జడదారిని వదిలి, పంచభూతాలను శాసిస్తూ సర్వ విశ్వాన్ని రావణమూర్తినై పరిపాలిస్తున్న నన్ను నీవు స్వీకరించు. నీకు అఖిల భోగములను తెప్పించి పెడతాను. నీవు అడగడమే తరువాయి,

నేను కల్పించకపోతే నాది దోషం. సీత అడిగింది రావణు డివ్వలేదు అని తరువాత ఎవ్వరూ అనకూడదు' అని, చివరకు 'నా సర్వైశ్వర్యమూ నీ పాదాలయందుంచుతాను. నీవు భవాంబుధిని దాటింప చేయటానికి నావ వంటి దానవు నేను నీ ప్రేమ సముద్రంలో ముక్కుల వరకు మునిగాను. నీ దయ అన్న ఆధారాన్ని యిస్తే నేను యీ సముద్రమునుంచి పైకి వస్తాను, నన్ను ఉద్ధరించు' అని ప్రార్థిస్తాడు. ఈ సంభాషణ కడు విచిత్రమైనది. ఒక కాముకుడు ప్రేయసిని అడిగినట్లుగానూ వుంటుంది, మాతను భక్తుడు కోరుతున్నట్లుగానూ వుంటుంది. ఇది ఆ రావణుని జీవమునందున్న విశిష్టమైన లక్షణం. అతడు సీతను కామదృష్టితో చూస్తున్నాడా లేక తనకే తెలియనటువంటి ఒక దైవికమైన చైతన్యంతో ఆమె నొక శక్తిగా చూస్తున్నాడా? ఈ ద్వంద్వార్థంతో కూడుకొన్న జీవశక్తి మనయందు ఉద్బుద్ధమవుతున్నది.

చూడండి. స్వామిని చూడాలి అన్న కోరిక మనలో ఉద్బుద్ధమవుతున్నది. స్వామిని చూస్తున్నాము. ఈ కోరిక మనం సంకల్పించుకొంటే వచ్చిందా లేక స్వామి ప్రేరణవలన కలిగిందా? నేను సంకల్పించుకొన్నాను అంటే మన అహంకారం స్వామిప్రేరణ వలన వచ్చింది అని తెలిసికొంటే జ్ఞానము. రావణుడు సీతద్వారా తాను పొందదలచుకొన్నటువంటిది ఏదో తాను పొందడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఆమెను తీసికొనివచ్చి అశోకవనంలో ఎందుకు ఉంచాలి? సంవత్సరపు గడువు ఎందుకు పెట్టాలి? మరొక అన్వయం కూడ ఇక్కడ కొందరు చెప్పుతారు. హనుమంతుడు వచ్చిన రాత్రి తెల్లవారుతుండగా అంత పెందలాడే రావణుడు ఎందుకు వచ్చాడు అశోకవనానికి? హరిదూతయైన ఒక కపి వచ్చిందని అతనికి స్వప్నంలో స్ఫురించింది. 'వచ్చిన ఆ హరిదూతకు తన విషయం తెలియాలి. అతడు పోయి రామునికి చెప్పాలి. ఆ రాముడు రావాలి, నన్ను జయించాలి, నన్ను కృతార్థుని చేయాలి' అన్న సంకల్పంతో వచ్చి, ఆ రోజు క్రూరంగా సీతతో మాట్లాడాడట!' అంటే రావణుని చేష్టలకు ఒక అన్వయం చెప్పుకోవాలంటే భౌతికమైన కారణం కంటే ఏదో జీవచైతన్య ప్రేరితమైన

ఒక అధ్యాత్మిక ప్రేరణం భాసిస్తోందని తెలియాలి. ఆ జీవచైతన్యానికి అన్వయం చెప్పేదే అధ్యాత్మరామాయణం. రామాయణ కల్పవృక్షం.

ఈ విధంగా రావణుడు మాట్లాడుతూ వుంటే సీత ప్రత్యక్షంగా అతనికి బదులు చెప్పదు తనకూ అతనికీ నడుమ ఒక గరికపోచను అడ్డం పెట్టుకొంటుంది. దానితో అంటోంది:

"సాధుబోధ మన్నట్టి వర్షంబు లేక
చటుల దౌరాత్మ్యమన్న వేసంగి కెండి
సూదివలె కాలియందు గ్రుచ్చుకొనకమ్మ!
శశిరమ్యదు వశోకచ్ఛాయఁ జెందినావు."

'ఓ ఎండిన గడ్డి పరకా!' అని రావణుని సంబోధిస్తోంది సీత. 'నీకు మంచి వారి బోధ అనేటటువంటి వర్షం లేదా? దౌష్ట్యము అనేటటువంటి వేసంగి చేత బాగా ఎండిపోయినావా? సూదివలె కాలికి గుచ్చుకొంటున్నావు. చల్లనైన ఈ అశోకచ్ఛాయలో, ఆనంద చ్ఛాయలో వుండి కూడ యిలా బాధపెడుతున్నావు నన్ను.' సీత తృణీకరిస్తోంది. రావణుడు రాగ భావంతో సీతను లాలించబోయి యిలా అంటాడు:

"నేను తృణమనైన నీవు సీతాకోక
చిలుక వౌచు నెగురు మలకహరిత
ఏటవాలుగాగ నెగురవే మద్భుజా
పంజరంబునందు పంజరశుకి!"

కామమోహితమైన క్రౌంచంలా కూస్తున్నాడు, సీతను సమీపిస్తున్నాడు రావణుడు. శుచిమతియైన సీత అతని మాటలకు చేష్టలకు మండిపడి ఇలా మందలిస్తుంది:

"రక్కసి! మీదిమీదికిని రాకుము; కాకుము బూది ప్రోవుగా;
ఎక్కడి కట్లు వచ్చెదవు? నే నెవరన్? రఘురాజు కోడలన్
దిక్కుమొగంబుతోడ కనిపించిన నైనను దిక్కులేనియ
ట్లొక్క పతివ్రతామహిమ యున్నది శాపసమర్థ మిచ్చటన్."

ఆ రఘురామచంద్రుఁ డిటకై చనుదెంచు; విదీర్ణకార్ముక
క్రూరశిలీముఖంబులను గుండియ వ్రచ్చును నిన్ను; రక్తధా
రారమణీయమై చను ధరారమసంజలవన్నె గాగ; నే
నోరిమి తాల్చెదన్ రఘుకులోద్వహు కీర్తిపతాక యానగా.

తాను రాముఁడు సాలంబు నేను లతను;
తాను రాముఁడు వీణియ నేను తీఁగ
తాను పతి వార్షు కాభ్రంబు నేను మెఱుపు
తాను పతి సూర్యదేవుఁడు నేను వెలుగు!

(రామాయణ కల్పవృక్షం)

'నేను ఏదో దీనురాలిగా వున్నానని చెప్పి నామీద ఉసికొల్పుతూ వస్తున్నావా? ఓ గడ్డి పరకా! నా పతివ్రతా మహిమవలన నిన్ను దగ్ధం చేయగలను. ఆ రాముడు వచ్చి తన సాయుధ పరాక్రమం ప్రకటించి నిన్ను సంహరించటానికి వదిలిపెడుతున్నాను కాని నిన్ను బూది చేయటానికి నా పతివ్రతామహిమ చాలు. నేను నీకు లోబడుతానని అనుకోబోకు. రాముడు మద్దిచెట్టు, నేను లతను; రాముడు వీణియ, నేను తీగను; ఆయన వార్షుకాభ్రం, నేను మెరుపును; ఆయన సూర్యదేవుడు, నేను వెలుగును. మా యిరువురిని విడదీయటానికి నీకు చేతకాదు' అని హెచ్చరిస్తుంది. రావణసంహారాన్ని సూచిస్తున్న సీతమాటలు వినలేక ఆమెను చంపటానికి ముందడుగు వేస్తాడు రావణుడు. రావణుని భార్యల్లో ఒకతె వారిస్తూ ఇలా అంటుంది: 'ఎందుకీ మానవాంగన నీకు, నీవు పూనుకొంటే ఈ మానవాంగన భరించలేదు. నీ దగ్గర దేవాంగనలెందరో వున్నారు, రండి' అని అతనిని బలవంతంగా అంతఃపురానికి తీసికొని వెళ్ళుతుంది. అక్కడ కాపలా వున్న రాక్షస వనితలకు చెప్పి వెళ్ళుతాడు. 'రెండు మాసాలలో సీత నన్ను అంగీకరించిందా సరి, లేదా ఆ గడువు దాటగానే ఈమెను ముక్కలు చేసి, వండి ప్రాతర్భోజనంలో నాకు వడ్డించండి, ఆమెకు శాయశక్తులా బోధించండి' అంటాడు.

రాక్షస వనితల బోధలు చిత్రంగా వుంటాయి. వారు నయాన భయాన సీతకు నచ్చచెప్పే యత్నం చేస్తారు వాటినన్నింటిని చెప్పడం

లేదు. ఒక రాక్షసి ఇలా అంటుంది 'సీతా! నీవలన యీ లోకంలో ఎవరు సుఖపడ్డారు? నీవయినా సుఖపడటం నీకు తెలుసునా?

"శివమహాకార్ముకచ్ఛేత్త యెవ్వాఁ డని
కన్నతండ్రికిని దుఃఖంబు తొలుత;
శివమహాకార్ముకచ్ఛేత్త వీడంచు భా
ర్గవరామునకు దుఃఖంబు పైని
తగ మహాటవిఁ జంకతాళివి మఱి తాళి
కట్టినవాని దుఃఖంబు మఱియు
నీ వన్నఁ దల మున్కలౌ వలపైన రా
క్షసరాజునకు దుఃఖంబు పెచ్చు
ఇంక మా మాట చెప్పగా నేల రేపు
వరుగు తినిపించెదవు మమ్ము పరమదుఃఖ
మయి విచిత్రతలోకేశ్వరీ! మాయవై సు
ఖంబు చూపించెదవును దుఃఖంబు నెఱపి."

(రామాయణకల్పవృక్షం)

'నీవు పుట్టావు. నీతండ్రి కొక సమస్యవైనావు. శివధనుస్సును వంచిన వాడు కదా నీకు పతి కావలసింది? అట్టివాడు ఎక్కడ దొరుకుతాడా అని కొన్నేళ్ళు మీ నాన్నగారు దుఃఖించారు. ఎలాగైతేనేం శివధనుస్సును విరిచిన రాముడు దొరికాడు. కాని, శివధనుర్భంగంవలన పరశురామునికి దుఃఖం కలిగినది. అలా ఆయనకు దుఃఖం కలిగించావు. సరే, నీవు అయోధ్యకు వచ్చావు భర్త అరణ్యానికి వస్తూ వుంటే నీవూ చంకతాళిలాగ అతనివెంట వచ్చావు. నీవు రావడమువలన కదా రాముని కీ దుఃఖం యిప్పుడు? నీ మీద నిండైన వలపుతో రావణుడు నిన్ను ఇక్కడకు తీసికొనివచ్చాడు. వానికి సుఖమున్నదా? ఒక్క నిమిషం సుఖం కూడా వానికి యివ్వడం లేదు. ఇంక రెండు నెలలు నీకు సేవ చేస్తే మాకు మిగిలేది ఏమిటి? అప్పటికి నీవు మరీ ఎండి పోతావు. మా దవడ క్రిందకు కూడ పనికివచ్చే ఒక్క కండముక్క

కూడా నీలో దొరకదు. ఎవరిని సుఖపెట్టటానికమ్మా నీవు? ఎవరిని సుఖపెట్టావు? ఒకసారి ఆలోచించుకో. నీవు రావణుని వరిస్తే కనీసం అతడయినా ఒక క్షణకాలం సుఖపడతాడు-" అని యిలా బోధలు చేస్తుంది.

సీత రాక్షస వనితలతో ఇలా అంటుంది - 'మీరు అల్పజీవులు, మీకు నా తత్త్వం తెలియదు, అయినా కరుణతో చెబుతున్నాను వినండి. "నేను తొల్లి సావిత్రినై యమునకు ధర్మసూక్ష్మంబు నుపదేశించితిని; శ్రీమతినై కపిలునకు నా తత్త్వంబు కరతలామలకంబు గావించితి; దమయంతినై శివభక్తిఫలంబు నలున కొనగూర్చితిని; నే నిపుడు సీతనై అనుస్యూతముగా వచ్చు పాతివ్రత్యంబునకు పరమప్రమాణంబు కల్పించుచుంటిని' అని సీతావతారతత్త్వాన్ని ఆమె నివేదిస్తుంది. త్రిజటా స్వప్నం వలన రామునికి విజయం కలుగుతుంది, రావణునికి మరణము తప్పదు అని తెలుస్తుంది. రాక్షసవనితల బాధలు భరింపలేక సీత తనంతట తాను ప్రాణత్యాగం చేసికోడానికి సిద్ధమై శింశుపా వృక్షం దగ్గరకు వస్తుంది. ఆ సందర్భములో ఆమెకు శుభశకునాలు కనపడతాయి. హనుమంతుడు సీతను పలకరించాలి. ఎలా? రఘుకుల కీర్తనం చేస్తాడు. 'ఎక్కడిది? వాయువులో రామకథ వినపడుతోందే! ఈ మధురమైన స్వరం ఎమిటి?' అని సీత తలయెత్తి చూస్తుంది. ముందు భయంకరాకారునిగా హనుమ కనపడతాడు. తరువాత కపి బ్రహ్మచారిగా కనపడతాడు. 'కోతి కలలో కనపడితే చాల కీడు కలుగుతుందని సాముద్రికశాస్త్రం చెప్పుతుంది. ఇది కలయా?యిలయా?' సీతకు నిద్రలేదు. కాబట్టి కలకాదు. కంటితో చూసిం దాకపిని. కపిని చూచి యిక ఏ కీడు మూడనున్నదో నాకని భయపడుతుంది. కాని, ఇలయే కాబట్టి, ఈ కపి రాముని కీర్తనం చేస్తున్నాడు కాబట్టి శుభమే కలుగవచ్చును. ఇలా అనుకొంటూ వుండగా కపి క్రిందకు దూకుతాడు.

'నీవు నిజంగా కపివేనా?' అని సీత అడుగుతుంది. 'నేను కపినే నమ్మా! నాకు ఈ భయంకరాకారం కపిజాతి లక్షణం వలన వచ్చింది. నాకు ఈ వాగ్వైఖరి పెద్దలను సేవించటంవల్ల అలవడింది. అయినా నిన్ను ఒకమాట అడుగుతాను, చెప్పు—

"ఆ యొకమాట చెప్పకదవమ్మ మరిన్ రఘురాము భార్యవే
నా? యఙనార్ద్ర లాంగల ముఖాగ్ర ధరావివృతి ప్రసూతివే
నా? అల శైవచాప దళనాద్భుత కార్యఫలాయితోర్మివే
నా? అవు నన్న జన్మ చరితార్థముగా తలపోసికొందునే."

సీత తానే సీతనని, రఘురాముని ధర్మపత్నినని హనుమంతుని కెరుకపరిచి, అతనిని 'నీ వెవర'వని ప్రశ్నిస్తుంది. 'రామదూత'నని మారుతి నివేదిస్తాడు

"అహం రామస్య సందేశా ద్దేవి! దూత స్తవాగతః
వైదేహి! కుశలీ రామ 'స్త్వాంచ కౌశల మబ్రవీత్'"

నేను రాముని సందేశాన్ని తెచ్చిన దూతను. రాముడు కుశలంగా వున్నాడు. తన క్షేమవార్త నీకు చెప్పమని అడిగాడని వివరిస్తాడు.

రాము డంటే ఎవరో తెలియగలిగిన వాడు సమాధానం చెప్పగలిగినటువంటి మౌలికమైన ప్రశ్నలు వేస్తుంది హనుమను. 'నీవు శ్రీరామచంద్రుని ఎక్కడ కలుసుకొన్నావు? లక్ష్మణుడు నీకు ఎట్లా తెలుసు? మానవులకు, వానరులకు నడుమ మైత్రి ఎట్లా సంఘటిల్లింది?' ఇంతవరకు ఎవరైనా సమాధానం చెప్పవచ్చును ఆకాశగమనములో చూచివచ్చిన వారయినా సమాధానం చెప్పవచ్చును. 'రామలక్ష్మణుల స్వభావం ఎట్టిది? వారి అవయవ నిర్మాణం ఎటువంటిది?' అని కూడా అడిగింది. ఇక్కడ హనుమంతునికి గట్టి పరీక్ష. హనుమంతుని సమాధాన వాక్యాల్లో వీటిని గమనించండి:

"పడతి సీత పాము, పడగ శ్రీరాముండు,
తోకతొక్కినాడు దుష్టదసుర
ఫణముమీది రత్నపటలి కాంతులు కోటి
చంద్రమండలమున సంచరించు."

మీరు కుండలినీ యోగాన్ని యిక్కడ అన్వయించుకొంటే సరిపోతుంది. పడతి సీత పాము, పడగ శ్రీరాముండు. ఆ పడగపైనున్న రత్నము తత్త్వము. ఇది మధురాద్వైత తత్త్వము. ఈ ఉపమానముతో చెప్పగలిగినవాడు యోగి అయివుండాలి. రావణుడు చెప్పలేడు. మరొకటి—

"అన్నిటికంటె చిత్రమయినట్టిది స్వామిమొగంబు చూచుచు
న్న న్నయనంబు వేరువలనన్ మలయించుకొనంగ లేమ; ఆ
చెన్నుననే రమించెదమ చిత్తములో తిరుగుళ్ళుపొందు చా
యున్నది యున్నిగా, దెలియకుండగ నెవ్వరొ చెప్పునంతకున్."

దివ్యపురుషుని చూస్తే ఇటువంటి అనుభవం మనకు కలుగుతుంది. ఆ దివ్యమైన ముఖారవిందాన్ని దర్శిస్తున్నప్పుడు మన సర్వ జీవాణువులు దానియందు రమిస్తాయి. మరి ఎవరో వచ్చి మనలను తట్టి, నీవు తన్మయత్వాన్ని భజిస్తున్నావని చెప్పేంత వరకు మన కన్నులు ఆ మూర్తినుంచి యీవలకు రావు అట్టి మందహాస సుందరమైన రాముని ముఖాన్ని నే నెరుగుదున'ని హనుమ స్వానుభవంతో నివేదించాడు. స్వామి ముఖ సందర్శనము వలన మనకు కలిగేటటువంటి దివ్యానుభవాన్నే అతడు సీతకు చెప్పాడు. ఇది అనుభవించిన వాడు చెప్పగలిగిన మాట కాని, భక్తుడు చెప్పగలిగిన మాట కాని, మరొకటి కాదు. అలా రామకథనంతా చెబుతాడు. తనను నమ్మమని వేడుకొంటాడు. నమ్మించుకొంటాడు. సీత చివరకు అడుగుతుంది. రాముని తత్త్వాన్ని గురించి, ఒక చక్కని ప్రశ్న వేస్తుంది. 'ఏమయ్యా! పురుషుడు స్త్రీని ప్రేమించటంలో రెండు రకాలుంటాయి. 1.స్వామ్యత్వం 2. స్వాత్మత్వం. స్వామ్యత్వంలో భర్తకు భార్య తనది అన్న అధికార భావం మాత్రమే వుంటుంది ఆమెయందు ప్రీతి వుండదు స్వాత్మత్వంలో ఆమెయే నేను, నేనే ఆమె అన్న తత్త్వం భర్తకుంటుంది. ఈ రెండింటిలో రాముని యందు నీకు ఏమి కనపడిందయ్యా?' అని సీత అడిగితే హనుమ రాముని యందు స్వాత్మత్వం గోచరించిన లక్షణం చెప్పతాడు. కల్పవృక్షంలో విశ్వనాథ వారీమాటలను హనుమనోట అనిపించారు. 'అమ్మా! రాముడు విరహవేదనచేత ఆ కొండ శిలలమీద పండుకొనేవాడు. ఆ రాత్రి పండు

కొని అవలకు వెళ్ళితే, ఆ పండుకొన్నచోట ఎలా వుంటుందో అని నేను పోయి పండుకొంటూండే వాణ్ణి. ఆ శిల కాగిపోతూ వుండేది. ఆయన అప్పుడప్పుడూ మా కనుమరిపించి ఏకాంతంగా ఎక్కడికో వెళ్ళిపోతూ వుండేవాడు. ఆ కొండ కోనలలోకి వెళ్ళిపోయేవాడు. ఎక్కడకు వెళ్ళారా అని మేము వెదకుతూ వుండేవారం. దూరంగా సీతా, సీతా అన్న ఆర్తనాదం వినపడుతూ వుండేది. కొండలు అన్నీ మారుమ్రోగుతూ వుండేవి. దాన్నిబట్టి తెలుసుకో- రాముని యొక్క విరహవేదన ఎటువంటిదో! సీత నా భార్య, నేను ఆమె అధికారిని అని గర్వి అయి వున్నాడో! సీత, నా నుండి విడివడిన ఒక శిఖ అని భావిస్తున్నాడో!' ఈ మాట అనేసరికి సీతమ్మ కరిగిపోయింది. 'మారుతీ! అమృతంవంటి మాట విన్పించావు కాని, విషం కలిపి తినిపించినట్లుగా వుంది నాకు. నన్ను గురించే రాముడు స్మరిస్తున్నాడని చెప్పితే అమృతంలా వుంది కాని, రాముడు అంత దుఃఖపడుతున్నాడంటే నాకు సహింపరాని బాధ కలిగించే విషంలా వుం'దని వాపోయింది. 'అమ్మా! నీకు అంత వేదన ఎందుకు? నా భుజంమీద ఎక్కు, తీసికొని వెళ్ళుతాను.' 'నీకు శక్తి చాలుతుందా నాయనా?' 'ఇదిగో చూడు' అని తన మహాకారాన్ని చూపించాడు. శ్రీకృష్ణుడు అర్జునునికి విశ్వరూపం చూపించినంత విస్తృతిని చూపించాడు. వాయువును విస్తృతం చేస్తే ఆకాశరూపు డయిన రాముని తత్త్వం ఎంత విస్తృత మవుతుందో మాయ అయిన సీత గమనించింది. నీవు రామదూతవు- నమ్మాను, నన్ను తీసికొని వెళ్ళవచ్చును. కాని, ఆ రాముడు నిన్ను తీసికొని రమ్మనమని అన్నాడా? అది అలా ఉండనీ. నేను పరపురుషుణ్ణి స్పర్శించను. అయినా నీ వేగానికి అబలను నేను తట్టుకోలేక సముద్రంలో పడిపోయినా, రాక్షసు లెదిరించినా విపత్తు రావచ్చు. రాముడే రావాలి, నన్ను గొనిపోవాలి.

"అమ్మ నాకును కనిపించెనంచు జెప్ప
మంతకంటె నభిజ్ఞాన మనవసరము
అమ్మఁ గొనిరాకపోతివా యనిన, నీవు
కొంచురమ్మంటివా యను మంచితముగ"

అని నర్మగంభీరంగా పలుకుతుంది. హనుమంతుడు సీతను చూచినట్లు ఆనవాలొకటి యిమ్మని ప్రార్థిస్తాడు. ఆమె శిరోమకుటంగా భాసించే చూడామణిని ఆనవాలుగా అందిస్తుంది.

"నేను చనిపోయి యిచట నున్నానటంచు
చెప్పుమీ యిద్ది స్వామికిఁ జేతికిచ్చి
మరల బ్రతికించుకొమ్మను మణి నొసంగి
మాతృపదసమారాధనామహితబుద్ధి!"

ప్రాణతుల్యమైన శిరోరత్నాన్నిస్తూ అన్న మాట లివి. సీత బ్రతకాలంటే అతడే ఆ రత్నాన్ని - సీతను గ్రహించి శిరస్సుపై అలంకరించాలి అంటుంది. అయినా మరో అనుమానం. శిరోరత్నం ఎంతైనా భూషణమే. నగను తెచ్చినంత మాత్రాన రాముడు నమ్మకపోవచ్చు. నమ్మిక కుదురటానికి అంతరంగికమైన మరొక ఆనవాలు కావాలి. హనుమ వేడగా సీత విశ్వాసంతో కాకాసుర వృత్తాంతాన్ని చెప్పుతుంది

సీతామ్మవారి దుఃఖం చిత్రంగా వుంటుంది. కాకాసురుడు తనను బాధిస్తే ఒక తృణాన్ని విసిరి బ్రహ్మాస్త్రంగా ప్రయోగించిన రాముడు అక్కడ నుండి ఒక గడ్డిపోచ విసిరేస్తే లంక దహనం కాదూ! ఇంత శక్తిమంతులైన రాముడు, లక్ష్మణుడు నన్ను ఎందుకు ఉపేక్ష చేస్తున్నారు? లక్ష్మణుని ఆ రోజు ఆ మాట అన్నందుకేనేమో! ఆమాట రామాయణంలో వాల్మీకి వాచ్యంగా అన్పించదు. "ఏదో ఒక మహాపాపాన్ని నేను చేసి వుంటాను. ఆ పాపాన్ని కట్టికుడిపిస్తున్నారిప్పుడు. లేకపోతే వారిద్దరు వుండి నన్ను యింత ఉపేక్ష చేస్తారా? నా తప్పును మన్నించి, నన్ను క్షమించుమని చెప్పు. నన్ని చెరనుండి తప్పించి, తనతో జేర్చుకొనుమని మరీమరీ వేడినట్లు, స్వామి హృదయాని కెక్కేటట్లు చెప్పు" మని దీనంగా హనుమంతుని కోరుతుంది. మారుతి సీతకు ధైర్యం చెప్పుతాడు.

"స్వామి వచ్చునమ్మ! స్వామి తప్పక వచ్చు
స్వామిఁ దెత్తు నా భుజాలమీద
రాద యేని స్వామి రమణి! నన్నింతగా
నేల పంపు? నింత యేల సేయు?"

నని, త్వరలో సీతారామ పునస్సమాగమాన్ని సూచించి, ఆశాజ్యోతిని సీతామాత హృదయంలో వెలిగిస్తాడు. తిరుగు ప్రయాణానికి సీతయొద్ద అనుమతిని పొందుతాడు.

ఇంతటితో దూత చేసే మొదటి పని అయిపోయింది. సందేశాన్ని అందించాడు, సందేశాన్ని గ్రహించాడు. ఇక రెండవ పని ఉంది. అది శత్రువును తపింప చేయటం. అంటే సీతను చూడాడు - ఇక లంకను కాల్చాలన్నమాట. ఉత్తమ రాయబారి ఉభయ ప్రయోజనాలను సాధించాలి. అందుకై మారుతి తన దృష్టిని శత్రువువైపు మళ్ళించాడు. రావణుని చూడాలి; అతని అంగబలాన్నీ, అర్థబలాన్నీ అంచనా వేయాలి: ఆయువుపట్టులు తెలిసికోవాలి; రామబలాన్ని చవి చూపించాలి; రామమంత్రాన్ని ప్రదర్శించాలి. ఈ పన్నుగడలో మొదటి యెత్తుగా అశోకవనాన్ని ధ్వంసం చేస్తాడు. ఎదిరించిన కింకరులను జయిస్తాడు; రావణు డంపిన జంబుమాలిని, అక్షకుమారుని చంపుతాడు; ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి బద్ధుడౌతాడు రావణసభలో బందీగా ప్రవేశిస్తాడు. రావణుని నిండుకొలువులో చూస్తాడు. అతని రూపాన్ని చూచి అబ్బురపడతాడు; అతని లోపాన్ని భావించి జాలి పడతాడు. రావణుడు క్రుద్ధుడై హనుమను చూస్తాడు. పరుషంగా మాట్లాడతాడు. హనుమంతుని గూర్చి ప్రహస్తుని చేత అడిగిస్తాడు. మారుతి తాను 'రామదూత' నని పరిచయం చేసికొంటాడు.

"దూతోఽహ మితి విజ్ఞేయో రాఘవస్వామి తేజసః
శ్రూయతాం చాపి వచనం మమపథ్య మిదం ప్రభో!"

అని ఆరంభించి రావణునికి నయానా భయానా నీతులు బోధిస్తాడు. వాలి వధ వృత్తాంతాన్ని చెప్పి రామపరాక్రమాన్ని తెలిపి రావణుని మంద

లిస్తాడు. సీతను రామునికి తిరిగి ఇచ్చివేసి శరణు వేడుమని హితవు చెప్పుతాడు.

"ఆమెను గొంచుపోయి వెస నాయన కిమ్ము మటీవు కొంచు(బో
గా మొగమోట మైనయెడ క్ష్మాసుత నేనును గొంచు(బోదు( గా
నీ మటి మంత్రులందు నొకనిన్ వెస బంపుము నాదువెంట, నా
రాముని మెప్పుకో లదియు రావణ! బాధ్యత నేను బూనెదన్."

రావణ ప్రవృత్తిని లోకవృత్తితో వ్యాఖ్యానించి ముంజేతి కంకణంలో మొగాన్ని చూపినట్లు ప్రవచిస్తాడు రామాయణ కల్పవృక్షంలో.

"ఉరువౌ కొండొక తీవ్రకామముబడిన్ వ్యూహంబు నిర్మించుకొం
దురు తామే తమచుట్టు కొందరు మఱెందుం ద్రోవలేకుండ; ని
ర్భరమున్ దుర్భరమైన యాస్థితికి నే భంగంబు వాటిల్లినన్
మరణం బెంతయు బుద్ధిపూర్వకము(గా మన్నించుటే మార్గమై."

అధ్యాత్మరామాయణంలో మారుతి రావణునకు విష్ణుభక్తి మాహాత్మ్యాన్ని, మోక్ష సాధనోపాయాన్ని చెప్పి, రాముని శరణు వేడుమని ప్రబోధిస్తాడు.

"అతో౽హ మాత్యంతిక మోక్షసాధనం
వక్ష్యే శృణు ష్వావహితో మహామతౌ
విష్ణోర్భక్తిః సువిశోధనం ధియః
తతో భవేత్ జ్ఞాన మతీవ నిర్మలమ్.
విశుద్ధ తత్త్వానుభవో భవే త్తతః
సమ్యగ్విదిత్వా పరమంపదం వ్రజేత్
అతో భజస్వాద్య హరిం రమాపతిం
రామం పురాణం ప్రకృతేః పరం విభుమ్॥
విసృజ్య మౌర్ఖ్యం హృది శత్రుభావనాం
భజస్వ రామం శరణాగతప్రియం
సీతాం పురస్కృత్య సపుత్ర బాంధవో
రామం నమస్కృత్య విముచ్యసే భయాత్.

రామం పరాత్మానమ భావయం జనో
భక్త్యా హృదిస్థం సుఖరూప మద్వయం
కథం పరం తీర మవాప్నుయా జ్జడో
భవాంబుధే ర్దుఃఖతరంగమాలినః."

రావణునికి రామతత్త్వబోధ బూడిదలో పన్నీరవుతుంది. దూతవధకు పూనుకొన్న రావణుని విభీషణుడు వారిస్తాడు. దూత నవమానింపుడని దశకంఠు డాజ్ఞాపిస్తాడు. వానరానికి వాల మలంకారం కాబట్టి తోకకు నిప్పంటించి ఊరేగదీయమంటాడు. రాక్షసులు మారుతి వాలాగ్రంలో గుడ్డలు చుట్టి నిప్పంటించి లంకానగరవీథుల్లో ఊరేగిస్తారు. హనుమ లంకానగర వివరాలను గ్రహిస్తాడు. కాయాన్ని పెంచి బంధాలను త్రెంచుకుంటాడు. కుప్పించి యెగసి లంకాదహనం చేస్తాడు. సీత కీవిషయం తెలుస్తుంది. అగ్నిదేవుని ప్రార్థిస్తుంది. ఆమె ప్రార్థన వలన అగ్ని హనుమను బాధింపడు కాని లంకను సహస్రజిహ్వాలతో కమ్ముకొని దగ్ధం చేస్తాడు. రావణ దేహాభిమాన దాహానికి ప్రతీకగా లంకా దహనం భాసిస్తుంది.

"కాంచితి సీత; బాష్ప కలికావళి కాంతకపోల; రామనా
మాంచిత నిత్యకంపితసితాధర, భీకరదైత్యకామినీ
సంచయ భర్త్సనోక్తి చయ సంచలలోచన వారిజాతప
త్రాంచల; విప్రయోగ దహనాగ్ర శిఖామయదేహ-లంకలో"

అని శ్రీరామునకు సీతాసందర్శన వృత్తాంతాన్నంతా మారుతి నివేదిస్తాడు. సుగ్రీవాదులు నిండియున్న సభలో మారుతి చెప్పిన మాటలు విని తృప్తిపడక, రాముడు హనుమను ఏకాంతస్థలంలో సీతనుగురించి ఎన్నో విషయా లడిగి తెలిసికొంటాడు. సీత యింకా ఏమన్నదని గ్రుచ్చిగ్రుచ్చి అడుగుతాడు రాముడు.

"రావణుడు దొంగ; దొరసుమీ రామచంద్రుఁ;
డేను నీవెంట వచ్చిన నేమి యగును?
దొర యయిన రామచంద్రుడు దొంగ యగును
ఆతఁ డయిన గాకున్న నే నగుదునయ్య!"

అని సీత అన్నదని మారుతి నివేదిస్తాడు. అప్పుడు నీవేమన్నావని అడుగుతాడు రాముడు. 'రామప్రభువు కపిసేనలతో దండువెడలి వస్తున్నాడమ్మా! వనవాసం కూడా పూర్తి కావచ్చింది. ఆ అరిందముడు నిన్ను రావణుని చెరనుండి విముక్తి చేసి, త్వరలో సీతో కలిసి అయోధ్యలో పట్టాభిషిక్తుడౌతాడమ్మా! అంతవరకు ధైర్యంతో ఉండు; నామాట నమ్ము!' అని మాట యిచ్చివచ్చానని హనుమంతుడు పేర్కొంటాడు. మారుతి వాక్యం రామునితో రావణవధోత్సాహాన్ని పొంగింపచేసింది. 'రావణుని సంహరిస్తాను, సీతను తెచ్చుకొంటాను' అని కృతనిశ్చయుడౌతాడు రాముడు.

సీతావార్తను చెప్పిన హనుమంతుణ్ణి ఆప్యాయంగా ఆలింగనం చేసికొంటాడు రాముడు. అంతటి ఉపకారం చేసిన ఆత్మీయునికి ఆలింగనం కంటె ప్రత్యుపకారం మరొకటి చేయలేనంటాడు రాముడు. హనుమంతుడు అంతకంటె మహద్భాగ్యం మరొకటి లేదనుకొంటాడు. ఆ ఆలింగనంలో స్నేహార్ద్రం లోకధర్మంగా గోచరిస్తుంది. కాని, ఆధ్యాత్మికదృష్టిలో అది అద్వైతసిద్ధికి అమలోదాహరణంగా దర్శనమిస్తుంది. అధ్యాత్మ రామాయణం ఆధ్యాత్మిక దృష్టితో ఈ ఘట్టాన్ని చిత్రించింది. రాము దన్నమాటలు గమనించండి:

"ఉపకారం న పశ్యామి తవ ప్రత్యుపకారిణః
ఇదానీం తే ప్రపచ్ఛామి సర్వస్వం మమ మారుతే!
ఇత్యాలింగ్య సమాకృష్య గాఢం వానరపుంగవం
సార్ద్రనేత్రో రఘుశ్రేష్ఠః పరాం ప్రీతి మవాపసః
హనూమంత మువా చేదం రాఘవో భక్తవత్సలః
పరిరంభో హి మే లోకే దుర్లభః పరమాత్మనః
అత స్త్వం మమభక్తోఽసి ప్రియోసి హరిపుంగవః"

రాముడు పరమాత్మనని ప్రకటించుకుంటూ, తన పరిష్వంగలాభం సామాన్యంగా ఎవ్వరికీ లభించదని పేర్కొంటూ, పరమప్రీతిని

కలిగించే తదనుభవాన్ని భక్తశేఖరుడైన పవనాత్మజునికి పరమకరుణా మయుడై ప్రసాదించాడు. జీవాత్మల అద్వైతసిద్ధియే ఆ పరిష్వంగ పర మార్థం!

భగవాన్ శ్రీ సత్యసాయి అవతారతత్త్వాన్ని అనుభవిస్తున్న భక్తులకు సుందరకాండ మరింత సుందరంగా దర్శనమిస్తుంది. స్వామి మానవాకృతితో మనమధ్య అవతరించి తమ భక్తుల కేర్పడే ఆపద లను, అనారోగ్యాలను తమవిగా భావించి, వాటిని తాము కొంత అను భవిస్తూ, భక్తుల కాబాధలనుండి విముక్తిని ప్రసాదిస్తున్న వింతలూ, విశేషాలూ వాస్తవాలుగా చూస్తున్నాం. భక్తుల బాధల నెన్ని మీద వేసి కొన్నా స్వామి నిత్యానందమూర్తిగా నిలిచి భక్తులకు ఆనందామృతాన్ని అందిస్తున్నారు. ఈ తత్త్వాన్ని సుందరకు అన్వయించుకొందాం. అపూర్వ సమన్వయం ఒకటి దొరుకుతుంది.

ఆధ్యాత్మ దృష్టితో చూస్తే రాముడు నిత్యానందుడు; నిత్యానంద ప్రదుడు. రాముని దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించే హనుమంతునకు నిత్యానందస్థితిని రాముడు కల్పిస్తున్నాడు. అయితే, హనుమంతుని కొక అనుమానం మనసులో ఉండేది. ఆనందాన్నిచ్చే రాముడు సీతా వియోగంతో ఎప్పుడూ విషణ్ణుడై ఉన్నాడు. దుఃఖించేవారిని చూస్తే లోకంలో దుఃఖమే కలగాలి: కాని రామునిపట్ల ఈ లోకన్యాయం పని చేయకపోగా విపరీతంగా భాసిస్తోంది. ఈ తత్త్వమేమిటో తెలిసికోవా లని మారుతి మధనపడుతూండేవాడు.

స్వామి అంటారు - 'నే నప్పుడప్పుడూ ఏవో బాధలు పడు తున్నట్లు కనపడుతుంటాను. నాకంటూ ఏ బాధలూ లేవు. నాకు కోరిక లేవీ లేవు కాబట్టి, అసలు నా కేబాధలూ అంటవు. అందువలననే నేనె ప్పుడూ ఆనందంగా ఉంటాను; ఆనందాన్నే అందిస్తాను. నిజానికి నా బాధలు నావి కావు. నా భక్తులవి. వాటిని సహజమైన నా ప్రేమ భావంవల్ల నామీద వేసికొంటాను. భరింపలేని బాధల్లో ఉన్న నా భక్తు లకు కొంత విముక్తి కల్పిస్తాను. పరమాత్మకూ భక్తునికీ ఉండే సంబం

ధంలో ఇది కొంతవరకు తప్పదు. నాలో భాసించే ఒక క్షణం బాధ భక్తులకు ఎన్నోరెట్లు విముక్తిని ప్రసాదిస్తుంది. మానవాకృతితో వచ్చిన అవతారమూర్తి ఇహలోకంలో ఇటువంటి సుంకం కొంత చెల్లించవలసి వస్తుంది. దానిని మీరు నా కంటగట్టకూడదు. ప్రకృతిని జయించిన పరమాత్మ తత్త్వం తెలిస్తే తప్ప దీనిలోని అంతరార్థం కొంతైనా అర్థంకాదు.' ఈ మాటలు సుందరలోని రామునికి ముమ్మూర్తులా అన్వయిస్తాయి.

రాముని వీడి సీత క్షణం బ్రదుకలేదు. అశోకవనంలో సీత అనంతమైన ఆర్తిని భజిస్తోంది. అంతా ఆమే భరిస్తే అంతమైపోవలసిందే. భరింపగలిగినంత ఆమెయందుంచి, మిగిలినదంతా రాముడు తన మీదకు తీసికొన్నాడు. అతని దుఃఖం ఆయన నంటేది కాదు. భక్తుల భారాన్ని తొలగించటానికి మీద వేసికొన్న మిధ్యాచింత. ఈ సత్యం హనుమంతునికి సీతను దర్శించినప్పుడు తెలిసింది; పరమాత్మ దివ్య కరుణాతత్త్వం గోచరించింది.

సీత ఎల్లప్పుడూ రాముని స్మరిస్తోంది. ఆమె శోకావస్థలో ఉంది. శోకాన్నే భజిస్తే మరణమే శరణ్యం. కాని, ఆమె ఆనందరూపుడైన రామబ్రహ్మను స్మరిస్తోంది. 'యద్భావం తద్భవతి.' ఆనందరూప భావనం వల్ల ఆనందానుభూతి అందుతుంది. కాబట్టి, రామస్మరణం వల్ల సీతకు అశోకస్థితి లభిస్తోంది. హనుమంతు డీ సీతాతత్త్వాన్ని గ్రహించాడు సీత హనుమంతుని జీవావస్థతో తుల్యరూపస్థితిని భజిస్తోంది. రాము డెప్పుడూ ఆనందరూపుడే. అతని ధ్యానం ఆనందయోగం. 'అన్యథా శరణం నాస్తి' అన్న శరణాగతభావంతో సర్వం భగవదర్పితం చేయగలిగితే, పరమాత్మయే ఆ జీవుని యోగక్షేమాలను వహిస్తాడు. సీతయొక్క యోగక్షేమాలను రాముడు వహించాడు. 'రాముడే వచ్చి నన్ను విముక్తురాలను చేయాలి; అన్యుల నెవ్వరినీ ఆశ్రయించ' నను ఆర్తి సీతయందు పవనతనయుడు గమనించాడు. తానూ సీతాభక్తిని భజించాలని తెలిసికొన్నాడు; సీత వలెనే తానూ రాముని చేరాలని తెలిసికొన్నాడు. సీతలో మూడవస్థలను గమనించాడు

మారుతి. 1. రాముడు భర్త, సీత భార్య అని భావించటం. 2. రాముడు ఆర్తజనోద్ధారకుడు, తాను ఆర్తురాలనని భావించి తత్కారుణకు పాత్రురాలై అతని సన్నిధానాన్ని పొందటానికి ఆర్తిని భజించటం. 3. రావణ సంహారోద్యమాన్ని నిర్వహించే పరమాత్మ చైతన్యంలో తానూ ఒక భాగమనీ, అందులో సీతారాములకు భేదం లేదని భావించటం.

స్వామి క్రీస్తు జీవితాన్ని అన్వయిస్తూ చెప్పిన ఈ వాక్యాలు గమనించండి. I am the messenger of God అని భావించటంలో ద్వైతం; I am the son of God అనటంలో విశిష్టాద్వైతం; I am God అని ప్రకటించటంలో అద్వైతం క్రమవికాసదశల్లో భాసిస్తున్నవని స్వామి వ్యాఖ్యానం. దీనిని సీతకూ, హనుమంతునికీ అన్వయించుకోవాలి మనం.

సీతాపరంగా I am the wife of Rama - ద్వైతం.
I am the Devotee of Rama - విశిష్టాద్వైతం.
I am Rama - అద్వైతం.

హనుమపరంగా I am the Messenger of Rama - ద్వైతం.
I am the Power of Rama - విశిష్టాద్వైతం.
I am Rama - అద్వైతం.

రామకార్యాన్ని నిర్వహిస్తున్నప్పుడు మారుతి రామదూత. లంకాదహనం చేస్తున్నప్పుడు రామతేజం. రామాలింగనం రామాద్వైతం. ద్వైతం నుండి అద్వైతం వరకు జీవుడు సాగించే ప్రస్థానం సుందరమార్గం.

మధురాద్వైత దృష్టితో సుందరకాండను అన్వయించుకొంటే 'Beauty is God; God beauty' అనే తత్త్వం వ్యక్తమౌతుంది. Beauty=సీత; God=రాముడు. ఈ తత్త్వాన్ని దర్శించిన హనుమ మధురాద్వైత ద్రష్ట.

సుందరలో సౌందర్యతత్త్వం ఉంది. సౌందర్యం అహంకారికి కామాన్ని కలిగిస్తుంది. దీనికి రావణు డుదాహరణం. భక్తునికి సౌందర్యం భగవంతుణ్ణి చూపిస్తుంది. దీనికి మారుతి నిదర్శనం. భగవంతునికి సౌందర్యం తన తత్త్వాన్నే జ్ఞాపకం చేస్తుంది. రాముడు దీనికి రమణీయ ప్రతీక. అహంకారాన్ని చంపుకొని ఆత్మసౌందర్యాన్ని పెంచుకొని

దానిని భగవదర్పణం చేస్తే భగవత్ సాయుజ్యం లభిస్తుందన్న సుందర తత్త్వానికి సీతాచరితం చిరంతనమైన ఉదాహరణం. సుందరకాండ నీవిధంగా భావించటమే సత్యం! శివం! సుందరం!

సుందరకాండ రాము డిచ్చిన ముద్రతో ప్రారంభమౌతుంది. చూడామణి రాముని చేరటంతో ముగుస్తుంది. ఆర్తిగొన్న భక్తునికి (సీతకు) ఇచ్చే అభయహస్తానికి ప్రతీక రామముద్ర. భగవంతునికి భక్తుడు చేసే ఆత్మార్పణకు-లేక - సంపూర్ణ శరణాగతికి 'చూడామణి' ప్రతీక. స్వామి ఎందరో భక్తులకు ఎన్నోవిధాలైన అభయముద్రలందిం చారు. మనం సీతవంటి భక్తులమైతే సాయిరామునికి ఏమి యివ్వాలి? చూడామణుల నివ్వాలి. అవి మణులూ మాణిక్యాలు కావు. ధ్యాన ముద్రలో మనం సహస్రారచక్రంలో పండించుకొన్న భక్తిప్రపత్తిని ఆత్మార్పణంగా సమర్పించాలి. స్వామి తమ భక్తులనుండి ఏ కానుకలూ కోరటంలేదు; మన హృదయాలను, భక్తి చింతామణులను కోరు తున్నారు. వాటిని స్వామి సన్నిధి కెలా పంపించాలి? 'నిస్వార్థ సేవ' అనే హనుమంతుని ద్వారా వాటిని పంపాలి. శ్రీ సత్యసాయి సేవా సమితి తత్త్వమే హనుమత్తత్త్వం. జ్ఞానసాధనయే సీతాతత్త్వం. 'పర మాత్మ స్వరూపులారా!' అని స్వామి మనలను సంబోధించే తత్త్వాన్ని గ్రహించి 'తత్త్వమసి' అని తెలిసి 'అహంబ్రహ్మాస్మి' అనే అద్వైతా మృత సిద్ధిని సాధించటమే సుందరలోని రామతత్త్వం.

"సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనం
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరం కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరః?"

సుందర మంత్రమే భగవాన్ సత్యసాయిబాబావారి ప్రేమతత్త్వం. సాయి తత్త్వాన్ని ఉపాసిస్తున్న మనకు సాయిరాముడు సుందరుడు; సాయి తత్త్వం సుందరం; సాయితత్త్వాన్ని అధ్యయనం చేస్తూ ఆచరణంలో పెడుతున్న భక్తులు సుందరులు; సాయికి సంబంధించిన సర్వం సుందరం; సుందర రామతత్త్వమే సత్యసాయితత్త్వం. ఓం శ్రీ సాయి రామ్!

# శ్రీరామ పట్టాభిషేకం

భగవాన్ శ్రీ సత్యసాయి చరణారవిందాలకు ప్రణామము.

సాయి కుటుంబ సభ్యులకు నమస్కారము.

"వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాభిః పరివృతం రామం భజే శ్యామలమ్."

రామాయణంలోని యుద్ధకాండను పర్యాలోచనం చేసి చూస్తే శరణాగత భక్తి, వైరభక్తి - యీ రెండు మార్గాలను అనుసరించిన భక్తులు పరమాత్మను ఎలా చేరుతారు? లోకంలో దైవీయజ్ఞం ఏ విధంగా నిర్వహింపబడుతుంది? ఆసురీయజ్ఞం ఏ విధంగా ప్రవర్తిల్లుతుంది? వాటి వలన కలిగే ఫలితా లేమిటి? అన్న విశేషాంశాలను మనం తెలిసికోవ టానికి వీలవుతుంది.

శ్రీరాముడు లంకపై దాడి వెడలటానికి అభిజిన్ముహూర్తాన్ని నిశ్చయించి, వానర సేనావాహినులను కదుపుతాడు. రాముడు పుట్టినది పునర్వసు నక్షత్రం. ఉత్తర ఫల్గుణి నక్షత్రంలో యుద్ధ యాత్ర ప్రారంభమవుతుంది. సాధన తార శ్రీరామునివట్ల సుముఖంగా భాసి స్తోంది. శుభ శకునాలు కనపడుతున్నాయి. మహేంద్రపర్వతం దగ్గ రకు సైన్యాలను తీసికొని రాముడు వస్తాడు. సముద్రతీరంలో సైన్యాన్ని విడిది చేయిస్తాడు. రావణుని జయించాలన్న ఉత్సాహం ఉత్కటంగా రాముని హృదయంలో ఉప్పొంగుతోంది. కాని, మహాగంభీరంగా వున్న సముద్రాన్ని ఎలా దాటాలి? అన్న ప్రశ్న కూడ మిగిలివుంది. సముద్రాన్ని తరించే మార్గం ఏమిటి? అని ఆలోచిస్తున్న సందర్భంలో

విభీషణుడు నలుగురు మంత్రులతో శ్రీరాముని శరణు వేడటానికి వచ్చి ఆకాశపథంలో నిలిచి వుంటాడు యుద్ధకాండలో మొదట మనకు కనపడేది విభీషణ శరణాగతి.

విభీషణ శరణాగతిని గురించి విచారించే ముందు - రామాయణానికి గోవిందాచార్యుడు వ్యాఖ్య వ్రాస్తూ - రామాయణంలో పదునెనిమిది తత్త్వాలను సమీక్షించటానికి వీలుందనీ, ఆ అష్టాదశ తత్త్వాలను తెలియటానికి రామాయణం చదవాలనీ నిర్దేశించాడు. అవి ఏమిటి? మొదటిది: వేదోపబృంహణ రూపమైన వేదాంతార్థం రామాయణంలో పొదుగబడి వుంది. దానిని ముందుగా దర్శించాలి. రెండవది: పంచ తత్త్వ ప్రాప్యోపాయాన్ని అనేక అధికార విశేషాలతో ప్రదర్శన రూపకంగా నిరూపించేది, అఖిల ఫల సాధన విధానాన్ని నిరూపించేది అయిన విధానం. మూడవది: భగవత్ ప్రాప్తిరూపకమైన కైంకర్య విధానం ప్రతిపాదింపబడిన పద్ధతి. నాలుగవది: పురుషకారముచేతనే మానవుడు ఫలాన్ని సాధిస్తాడు; పురుషకారము వినా మానవునికి ఫలప్రాప్తి లేదు అన్న సత్యాన్ని ప్రతిపాదించటం. ఐదవది: శేషత్వము. గురుశిష్య భావంతో పరమేశ్వరుని సేవించే పద్ధతి, లక్ష్మణుని ద్వారా దీనిని తెలిసికోవచ్చు. ఆరు: భగవత్ పారతంత్ర్యం. భరతుని ద్వారా దీనిని తెలిసికోవచ్చును. ఏడు: భాగవత పారతంత్ర్యం. ఈ మార్గాన్ని శత్రుఘ్నుని ద్వారా గ్రహించవచ్చును. ఎనిమిది: అర్థపంచక ప్రతిపాదనము కూడ రామాయణంలో వుందని చెప్పారు.

"ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తిశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథాప్రాప్తి విరోధి చ"

అని అర్థపంచకాలను పేర్కొంటారు. ఇందులో రాముడు పరస్వరూపం, బ్రహ్మ; లక్ష్మణుడు ప్రత్యగాత్మ స్వరూపం; శరణాగతి ఉపాయ స్వరూపం; విభీషణాదుల చరిత్రం భగవత్ కైంకర్య రూపఫల స్వరూపం. రావణాదులది విరోధి స్వరూపం. ఈ ఐదు విధాలైన

అర్థములను రామాయణ కథ ద్వారా ప్రపంచించే పద్ధతి ఎనిమిదవ పద్ధతిగా చెప్పారు. 9. ఆకించన్యత్వం అనన్యగతిత్వం. 10. భగవత్ జ్ఞానలాభం ఆచార్యమూలమని చెప్పేతత్త్వం. ఆచార్యుడు లేనిదే భగవద్ జ్ఞానం మనకు కలుగదని చెప్పి హనుమంతునిద్వారా యిట్టి ఆచార్యతత్త్వాన్ని ఉపాసించవచ్చునని నిరూపించారు. 11. అహంకార విషయం అన్న అంశాన్ని ప్రతీకాత్మకంగా రామాయణం ద్వారా మనం తెలిసికోవచ్చును. లంక శరీరం. రావణ కుంభకర్ణులు అహంకార మమకారాలు; ఇంద్రజిదాదులు కామ క్రోధాదులు, విభీషణుడు వివేకం. సీత చేతనం లేక హృదయం. భగవత్ జ్ఞానం ఆచార్యుడు. లంకా దహనం అహంకారమునకు ప్రతీకయైన శరీరాన్ని ధ్వంసం చేయటం ద్వారా అంతర్నిరుద్ధ చేతనోద్ధరణం. 12. 'రామాదివ ద్వర్తితవ్యం-న రావణాదివత్' అన్న న్యాయం చొప్పున రామునివలెనే మనం లోకమునందు వ్యవహరించాలి, రావణునివలె వ్యవహరించకూడదు అన్న నీతిని ప్రబోధించే మార్గాన్ని దీనివలన గ్రహింపవచ్చును. 13. ఉత్తముడు నివసించే దేశంలోనే, భగవత్ భక్తి ప్రవర్తిల్లే ప్రాంతంలోనే మనం కనుక నివసించినట్లయితే తత్ క్షేత్ర మాహాత్మ్యం వలన మనకు ముక్తి కలుగవచ్చునని, భగవత్ సన్నిధానం ముక్తికి ముఖ్యమనీ చెప్పే తత్త్వం. కోసలదేశంలో నివసించిన ప్రజలు రాముని ఎన్ని విధాల స్మరించి, ధ్యానించి, ఉపాసించి ముక్తిని పొందారో, భగవత్ సన్నిధానం వలన మానవునికి కలిగే మహిత ప్రభావాన్ని నిరూపించే మార్గాన్ని రామాయణం చూపుతుందన్నారు. 14 రామాయణాన్ని ఒక దీర్ఘ శరణాగతిగా సమన్వయించుకోమని మరొక తత్త్వం చెప్పారు. 15. గాయత్రి మహామంత్రార్థాన్ని రామాయణ మంత్రం ద్వారా మనం గ్రహించవచ్చునని, గాయత్రీమంత్రతాత్పర్యమే రామాయణకథఫలితమని మరొక మార్గాన్ని చెప్పారు. 16. చార్వాకులు, బౌద్ధులు మొదలైనవారు ప్రపంచించిన దర్శనాలను నిరసిస్తూ, మోక్షమార్గాన్ని ప్రతిపాదించే తత్త్వాన్ని రామాయణం ద్వారా తెలుసుకోవచ్చునన్నారు.

జాబాలి మొదలైనవారు రాముని ముందు ప్రతిపాదించిన చార్వాక సిద్ధాంతాలను రాముడు ఖండిస్తాడు. 17. సంసారమునందు బహు వ్యసనములకు మనము గురియైనా, బహు కష్టములకు గురియైనా, చివరకు రాముని-లేదా - భగవంతుని నమ్మినట్లయితే వీటినన్నింటిని ఏ విధంగా తరించి మోక్షమును పొందుతామో, రామాయణంద్వారా తెలిసికోవచ్చు నని అంటారు. సంసారబంధాలను నిరూపించే నాగ పాశ, బ్రహ్మాస్త్రబంధనము మొదలైనవి-అలా అన్వయం చెప్పుకోమం టారు. 18. లోకంలో చతుష్షష్టికళలు ప్రసిద్ధిచెంది వున్నాయి. రామా యణం చదివితే చతుష్షష్టి కళాపరిజ్ఞానం కూడ అబ్బుతుంది. ఈవిధంగా పదునెనిమిది విధములైనటువంటి తత్త్వాలు, ప్రయోజనాలు రామాయణ పఠనం ద్వారా మనకు లభిస్తాయి.

భగవంతునిముందు భక్తుడు అన్యథా శరణం లేదని శరణు వేడటం శరణాగతి. సర్వము దేహాన్ని, మనస్సును, ఆత్మను మూడు అవస్థలద్వారా భగవంతునికి అర్పితం చేసేపద్ధతి శరణాగతి అంటారు. ఇట్టి శరణాగతి విధానాన్ని ప్రకృష్టంగా రామాయణంలో ఆరంభము నుండే మనం చూస్తున్నాము. లక్ష్మణాదుల దగ్గరనుండే శరణాగతిని మనం గమనించివున్నాము. చిట్టచివరిది, విశిష్టమైనది శత్రుపక్షంనుండి వచ్చిన వివేకవంతుడైన విభీషణుడు రాముణ్ణి శరణు వేడిన ఘట్టం ఉత్తమ శరణాగతిగా రామాయణంలో పరిగణింపబడుతోంది. వివే కము అంటే సదసత్ వివేకము. ఇది సత్, ఇది అసత్ అని వివేచించే బుద్ధిశక్తిని వివేకం అంటారు. ఇట్టి వివేకశక్తికి ప్రతీకగా విభీషణుడు మనకు భాసిస్తాడు. రావణుడు అసత్, రాముడు సత్ అని తెలిసికొన్న టువంటి ఆ వివేకి రావణునికి తనకు తోచినంతవరకు ధర్మమార్గాన్ని ప్రబోధించి, అతను వినకపోతే అతనిని పరిత్యజించి సత్ పదార్థమైన, భగవత్ పదార్థమైన రాముని నాశ్రయిస్తాడు. ఇలా ఆశ్రయించిన బుద్ధి శక్తిగా విభీషణుని జననచరిత్ర గమనిస్తే-కైకసి రాక్షసాంశ సంభూతు లైన పుత్రులేనా నీవలన పుట్టేది అని తన భర్తను కోరుకొన్నపుడు

విష్ణుభక్తి సమన్వితుడు, సాత్త్విక గుణ సంశోభితుడు అయిన విభీష ణుని ప్రసాదరూపంగా యిస్తాడు. తద్ద్వారా ఆయన విష్ణుభక్తుడై లంకలో వుంటాడు. స్వామి సమన్వయం ఇలా ఉంది: లంకా నగరంలో సంసారసాగరమును దాటిన తరువాత హనుమంతునికి ఎదురైనటు వంటివి మూడు గుణములు. సాత్త్విక గుణము విభీషణుడు. రజో గుణము రావణుడు, తమో గుణము కుంభకర్ణుడు. సాత్త్వికగుణము రాముని ఆశ్రయిస్తుంది. మిగతా రెండుగుణములు లంకలోనే వుంటాయి.

హనుమంతుడు లంకను దహించి వెళ్ళినతరువాత కపి పరాక్ర మాన్ని గురించి సమాలోచం చేయటానికి రావణుడు మొదటిసారి సభ తీరుస్తాడు. హనుమంతుడు వెళ్ళినతరువాత లంకలో రావణుడు ఆరు సార్లు సభ చేస్తాడు మొదటి సభలో-హనుమంతుడు ఏవిధంగా రాగలి గాడు? అతని శక్తి ఏమిటి? అతడు చేసిన దారుణమైన కృత్యాలు ఏమిటి? వాటికి ప్రతీకారం ఏమి చేయాలి? అనే అంశాలను గురించి పర్యాలోచనం చేస్తాడు. విభీషణుడు ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. 'సాక్షాత్తు పరమాత్మ అయిన రాముని ధర్మపత్నిని నీవు అపహరించావు. దీనికి కారణం నీ అహంకారం. అహంకార మూలమైన కామం. దాని వలన జనించింది క్రోధం. ఈ క్రోధమూలమైన ప్రవృత్తిని నీవు వదులు కొంటే రాముని నీవు శరణువేడవచ్చును' అని అన్నను మందలించాడు.

"త్యజస్వ కోపం సుఖధర్మనాశనం
భజస్వ ధర్మం రతికీర్తివర్ధనం
ప్రసీద జీవేమ సపుత్రబాంధవాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ."

అని రావణునికి సలహా చెప్పాడు. 'కోపమును వదిలిపెట్టు. ఆ కోపం ధర్మనాశనం చేస్తుంది, నీ సుఖాన్ని నశింపచేస్తుంది. నీవు ధర్మమును భజించు. అది నీకు సుఖాన్ని యిస్తుంది. కీర్తిని ప్రవర్ధమానం చేస్తుంది. నీవు సపుత్రబాంధవంగా జీవించు; క్రోధాన్ని వదిలిపెట్టి బ్రతుకు. దాశరథికి ఆ మైథిలిని ఇచ్చివేయి.' ఈ హితవు రావణునికి కిట్టలేదు. సభను వీడి లోపలకు వెళ్ళుతాడు. రెండవరోజున విభీషణుడు రావణుని

యింటికి పోతాడు. అతని యింటిలో ఒక సభ జరుగుతూ వుంటుంది అందులో పాల్గొని సీతను తీసికొనివచ్చిననాటి నుండి లంకా నగరంలో కనపడుతున్న విపరీతమైన అపశకునముల గురించి వివరిస్తాడు. 'రాక్షసవంశనాశన సూచనలు అన్నీ కనపడుతున్నవి. సీతను తిరిగి ఇచ్చివేయడం మంచి'దంటాడు రావణుడు క్రుద్ధుడై విభీషణుని హిత వును తిరస్కరిస్తాడు. క్రోధంతో రథమెక్కి వెడలి నిండుసభ తీరు స్తాడు. ఆ నిండుసభలో విభీషణుడు మరల హితవు చెప్పుతాడు రావ ణుని మంత్రులందరూ రాముని జయించటం చాల సులభమనీ, తాము ఒక్కొక్కరే వెళ్ళి వానర సైన్యాన్ని అంతా మట్టు పెడతామనీ ప్రగ ల్భాలు పలుకుతూ వుంటే విభీషణుడు విసిగి ఇలా రామబలాన్ని ప్రశంసిస్తాడు:

"నీవెత్తఁ జాలని నీలకంఠుని విల్లు
పుడకకైవడిఁ దున్మి ప్రోవువెట్టె;
నిలఁ గా ర్తవీర్యబాహువులువేయి ద్రుంచిన
పరశురాముని నాజి భంగపఱిచెఁ;
గైలాస మెత్తిన ఘను నిన్నుఁ గట్టిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె;
నీ పుత్రు వధియించి నీ లంకఁ గాల్చిన
హనుమంతు నేలినయతని నేలె
నట్టి రామునితోడ నసమానవైరంబు
పట్టి గెల్తు ననుట పడుచుబుద్ధి
చనదు; సీత నిచ్చి శరణని రఘురాము
గనుట మేలు; చెడక మనుట మేలు"

(భాస్కర రామాయణం)

అని హితవు పలుకుతాడు. రావణుని మంత్రులు 'విభీషణుడు జ్ఞాతి వైరం చేత రావణుని తిరస్కరించి శత్రువైన రాముని పక్షం వహిస్తు న్నా'డని అభాండం వేస్తాడు. రావణుడు 'శత్రువును కీర్తించిన నీ ముఖం నాకు చూపించకు'మని విభీషణుని లంక నుండి బహిష్క

రిస్తాడు. నిండు సభలోనుండి నల్గురు మంత్రులతో ఆకాశానికి ఎగిరి, 'సీతను తిరిగి యివ్వకపోతే నీవూ, నీ లంకా, నీ బంధువులూ, నీ మిత్రులూ, నీ సుతులూ అందరూ నశిస్తారు' అని చివరిసారి హెచ్చరిక చేసి, రాముని శరణు వేడటానికి పయనమౌతాడు.

రాముడు ఆవలి ఒడ్డున సుగ్రీవుడు, అంగదుడు, శరభుడు మొదలైన వారందరూ తన చుట్టూ కూర్చొని వుండగా సముద్రాన్ని ఎలా దాటాలి అని ఆలోచిస్తున్నాడు. అప్పుడు సుగ్రీవునికి విభీషణుడు వచ్చిన వర్తమానం అందుతుంది. మంత్రులనందరిని సమావేశపరచి ఇలా అంటాడు: 'శత్రు నగరంనుంచి వస్తున్న విభీషణుడు శరణు నివ్వటానికి యోగ్యుడు కాడు. ఎంత చెడ్డవాడు అయినా అన్నను ఆపద కాలంలో వదిలి పెట్టి వచ్చినవాడు ఎవరినయినా ఎటువంటి పరిస్థితుల లోనైనా వదిలిపెట్టిపోగలిగిన వాడై వుంటాడు. ఇటువంటివాణ్ణి మనం నమ్మకూడదు. రెండవది: యుద్ధానికి ఆయత్తమై వున్న సమయంలో యింత ధైర్యంతో విభీషణుడు వస్తున్నాడంటే ఏదో మాయోపాయం ఉండాలి. రాముని సైన్యంలోని రహస్యాలను తెలిసికొని, సమయం చూచి రామసైన్యాన్ని మట్టుపెట్టటానికి వస్తున్నాడు తప్ప యీతడు నిజంగా వినీతిభావంతో, భక్తిభావంతో రామునివద్దకు రావడం లేదు. రాజనీతిదృష్ట్యా యితనికి శరణు నివ్వటము న్యాయం కాదు' అని సుగ్రీవాదులందరూ అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తారు. హనుమంతుడు తాను లంకకు వెళ్ళివచ్చినప్పుడు ధర్మాన్ని రావణసభలో ప్రతిపాదించినవాడు విభీషణుడై వుండటం, అతడు హరిభక్తుడై వుండటం, రావణుని మార్గాన్ని అనుసరించకుండా తనదైన ధర్మప్రవృత్తిని ప్రవర్తింప చేస్తూ వున్న యోగ్యుడుగా, సాత్త్విక గుణసమన్వితుడుగా వుండటం గమనించినవాడు కావటంచేత వారి వాదాలనన్నింటిని హేతుబద్ధంగా ఖండిస్తాడు.

ఎవరి వర్తనమునయినాసరే ఇంగితం, ఆకారం, చేష్టలు, భాష అనే నాలుగు ప్రమాణాలతో నిర్ణయించాలి. అతని ఇంగితం ఏమిటి? అతని హృదయంలోని అభిప్రాయమేమిటి? అనేది విచారించ

కుండా విభీషణుడు యోగ్యుడా, అయోగ్యుడా అనేది నిర్ణయించటానికి వీలులేదు. అతనితో స్నేహం చేయనిదే ఇంగితం తెలియదు. రెండవది: అతని ఆకారాన్ని చూడాలి. ఆకారం వినీతంగా ఉన్నదా? భీషణంగా వున్నదా? రావణుని చూశాడు, విభీషణుని చూశాడు హనుమంతుడు లంకలో. రావణుని చూసినపుడు మాయకు ప్రథమ లక్షణమయిన భయం అన్న భావం అతను పొందాడు. విభీషణుని చూచినపుడు దైవికమైన పారవశ్యాన్ని అతడు భజించాడు. ఈ విధంగా ఆకార విశేషం చేతనే అతనియొక్క గుణం వ్యక్తమౌతోంది. తరువాత అతని చేష్టలు, అతని భాష. అతడు మాయావి అయినట్లయితే అతని నోటి నుంచి స్వచ్ఛమైన, ఋజువైన మాటలు రావు. అతను మాట్లాడుతున్న వైఖరి చూస్తే అతడు ఋజువర్తనుడుగా వున్నాడు. ఈ మాటలు అన్నీ విన్న తరువాత రాముడు ఇలా అంటాడు: 'ధర్మాలన్నిటికంటె ఉత్తమ ధర్మం శరణాగత రక్షణం. అట్టి శరణాగత రక్షణాన్ని నేను వదిలి పెట్టటానికి యిష్టపడను అది నా జీవిత వ్రతం.' సుగ్రీవుని చూచి అంటాడు: 'రావణుని తమ్ముడు అని విభీషణుని మనము గర్హిస్తున్నాము. అందరూ నాకు ఉన్నటువంటి తమ్ములవంటివారు వుంటారా? రాక్షసునికి తమ్ముడు అతడు. తనకు అనుగుణం కానటువంటి వాతావరణంలో పెరిగి, సమయం వచ్చినపుడు, ఒక అధర్మ కార్యాన్ని చేయవలసి వచ్చినపుడు, అతడు త్రికరణశుద్ధిగా దానిని చేయజాలక అక్కడనుండి ఇవతలకు వస్తున్నాడు అని చెప్పి,

"నసర్వే భ్రాతర స్తాత। భవంతి భరతోపమాః
మద్విధావా పితుః పుత్రాః సుహృదోవాభవద్విధాః"

లోకంలో వున్న తమ్ములందరూ నా తమ్ముడైన భరతునివంటివారు కారయ్యా! నావంటి పుత్రులు అందరి తండ్రులకు పుడతారని చెప్పడానికి వీలులేదు. నీవంటి మిత్రులు అందరికీ దొరుకుతారని చెప్పలేము. రావణునికి దొరికిన తమ్ముడు అటువంటివాడు. ఇతడు భరతునివంటి వాడు కాదు అతడు రామునివంటివాడు కాదు. రావణుని వదిలి నన్ను శరణు వేడుతున్న యితనిని నేను గ్రహించటం ధర్మం. అంతేకాక—

"అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతద్వ్రతం మమ
ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్త మస్యాభయం మయా
విభీషణో వా సుగ్రీవ! యది వా రావణ స్స్వయమ్"

అభయం కోరిన సర్వభూతములకు శరణు నివ్వటమే నా జీవిత వ్రతం. ఇప్పుడు నేను అతనికి శరణు నిచ్చాను. విభీషణుడే కాదు. ఒకవేళ రావణుడే వచ్చి నన్ను శరణు వేడినట్లయితే నేను అతనికి శరణు నిస్తాను' అని చెప్పగానే రాముడు శరణు ఎప్పుడు, ఏవిధంగా పరీక్షించి యిస్తాడో, తనకు ఎలా శరణు నిచ్చాడో, ఆ రాముడు సర్వభూతములయందు యోగ్యులైనటువంటివారికి శరణు ఎలా యిస్తూ వుంటాడో, పరమాత్మ తత్త్వం ఏమిటో సుగ్రీవుడు గ్రహించాడు. 'రామా! నీ ధర్మబుద్ధిని పరీక్షించటానికి యిలా అన్నాను కాని విభీషణుడు యోగ్యుడు అతడు శర ణివ్వదగినవాడు' అని ప్రతిపాదిస్తాడు. తానే లక్ష్మణ సహితుడై వెళ్ళి విభీషణుని తీసికొని వస్తాడు. రాగానే వినీతుడై రామునికి సాష్టాంగ దండప్రణామము చేసి విభీషణుడు—

"అర్కకులాధినాథ! శరణాగతవత్సల! దేవ! యాజగ
త్కర్కశుడైన రావణుని తమ్ముఁడ నయ్యు, భవత్కటాక్షసం
పర్కమునం గలంకమును బాసితి ధన్యుడ నైతి నింక నీ
యర్కసుతాదులం దొకఁడనైతిఁ గృతార్థుడనైతి"

(భాస్కర రామాయణం)

అని రాముని పాదములమీద పడతాడు. 'విభీషణా! రావణునియొక్క బల విశేషములు ఏమిటో ముందు చెప్పు, అని శత్రువుల బలరహస్యములమ గురించి నివేదించుమని మొదటి ప్రశ్న వేస్తాడు రాముడు. ఆతడు నిస్సంశయంగా, విస్పష్టంగా రావణునియొక్క బలనిరూపణం చేసి చెప్పాడు. ఆయావీరుల బలవిశేషాలను వివరించి, లంకలో ఇప్పుడు 10 వేల కోట్ల రాక్షసులు యుద్ధానికి ఆయత్తమై వున్నారని నివేదిస్తాడు. ఆ సంగతి ముందే హనుమంతుడు తెలిసికొని వచ్చాడు కాబట్టి లంకలో నున్న రాక్షసులకంటె అధికసంఖ్యలో వానర సేనను సమీక

రించాడు రాముడు. వానరులు 10 వేల కోట్ల 80 లక్షలు. ఎప్పుడైతే విభీషణుడు శత్రు రహస్యాలను నిష్కల్మషంగా, నిష్కపటంగా చెప్పాడో రాముడు వెంటనే తమ్ముని పిలిచి 'లక్ష్మణా! సముద్ర జలాన్ని తీసుకొనిరా! విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకం చేస్తా'నని ఆజ్ఞాపిస్తాడు. దీనివలన రెండు ప్రయోజనాలు సాధింప బడుతున్నాయి. విభీషణుడు పట్టాభిషేకాని కంగీకరిస్తే అతడు రామ సహాయాన్ని చిత్తశుద్ధితో అర్థిస్తున్నట్లు స్పష్టమౌతుంది. అతని యింగితం కపివీరుల కర్థమౌతుంది. ఈసందర్భంలో శ్రీరాముని శరణాగతవత్సల భావాన్ని త్యాగవీరాన్ని వ్యక్తం చేసే ఒక చక్కని సంభాషణం, వాల్మీకంలో లేకపోయినా, భాస్కర రామాయణాదుల్లో కనపడుతోంది. వినండి.

"అనఘ చరిత్ర! మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశతబాణజాలముల చోఁకున కోర్వక వచ్చి తా దశా
ననుఁ డభయంబు వేడికొనినం దగ వెట్లగునన్న-నవ్విభుం
డినసుతుఁ జూచి యట్లయిన నిచ్చెద వాని కయోధ్య
(నావుడున్)"

(భాస్కర రామాయణం)

శరణన్న వారిని రక్షించటం రాముని కులవ్రతం, శరణువేడిన విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకం చేశాడే, రేపు రావణుడు కూడా రామ బాణబాధ కోర్వజాలక శరణువేడితే ఏంచేస్తాడు రాముడు? అని సుగ్రీవుని శంక. రావణుడే శరణువేడితే అయోధ్య నిచ్చివేస్తా నని రామ శపథం. రాముని శరణాగత రక్షణవ్రతం అంత ఉదాత్తమైనదని కపి లోకం తెలుసుకొని ఆశ్చర్యపోయింది; రావణుడు శరణువేడేది లేదు రాము డీయవలసిన అవసరమూ ఉండదని మనసులో భావించి ఊరజిల్లింది.

విభీషణ శరణాగతి మరొక విశేషాన్ని స్పష్టం చేస్తోంది. లంకను వీడి వచ్చిన విభీషణుడు తనభార్యనూ, బిడ్డలనూ, సంపదనూ అక్కడే వదిలిపెట్టి వచ్చాడు. రామసేవ కంకితమై పోయాడు. కానల్లో క్రంతల్లో, విపరీత వాతావరణాలలో నివసిస్తూ భగవత్తత్త్వాన్ని ప్రచారం

చేయదలచుకొన్నవాడెట్టి విషమ పరిస్థితుల నెదుర్కొంటాడో అటువంటి అవస్థలకు పాలైన భక్తుడు విభీషణుడు. అన్న అహంకారి; రాక్షసులు తమః ప్రవృత్తులు, క్రూరులు. వారందరూ నారాయణ విరోధులు. లంకలో రావణస్మరణం తప్ప రామస్మరణం లేదు. రామస్మరణం అక్కడ ఒక మహాపాపం. అట్టి విషమ వాతావరణంలో విభీషణుడు తన సాత్త్వికప్రవృత్తిని, రామభక్తిని పరిపోషించుకొన్నాడు. ఇది ఎలా ఉందంటే-నాస్తికులు, హేతువాదులు, స్వార్థపరులు, అవినీతి పరులు ఉన్న వాతావరణంలో ఒక సాయిభక్తుడు నివసిస్తూ సత్యధర్మ శాంతి ప్రేమలనే మానవత్వపు విలువలనూ, దైవచింతననూ తనలో పదిల పరచుకొని స్వామిని శరణువేడినట్లున్నది. ఆ లెక్కకు వస్తే విభీషణుడొకడే కాదు, అతని కుటుంబమంతా రామసేవ కంకితమై పోయింది. సాయిసేవ కంకితమైన భక్త కుటుంబంలాంటి దా విభీషణ కుటుంబం. విభీషణుని భార్య సురమ, కుమార్తె త్రిజట హరిభక్తు రాండ్రు. సీతాసేవ కంకితమైన వారు. సురమ సీతయొక్క యోగ క్షేమాలను చూస్తుండేది విద్యుజ్జిహ్వుని మాయాబలంతో ఖండిత రామ శిఖరాన్ని, ధనువునూ రావణుడు సీతకు చూపించినపు డది రాక్షస మాయ యని తెలిపి, సీతనోదార్చింది. అసుర యజ్ఞం జరుగుతున్న పుడు వానరులకు ఒక మార్గం చూపించింది. త్రిజట సాత్త్విక గుణం చేత స్వప్నాన్ని పొంది రామునికి పట్టాభిషేకం త్వరలో జరుగబో తోందనీ, రావణసంహారం జరుగబోతోందనీ సీతకు చెప్పింది. నాగాస్త్ర బద్ధులై రామలక్ష్మణులు రణరంగంలో పడివుంటే పుష్పకవిమానం మీద పోయి సీతకు వారిని చూపించుమని రావణుడాజ్ఞాపిస్తే త్రిజట యిది సత్యంకాదమ్మా, రాక్షసమాయ అని చెప్పింది. సీతకు ఆసురీ మహిమలయొక్క ప్రభావాన్ని అంతా వివరిస్తూ ఆమెయందు రామ భక్తిని రక్షించటానికి తల్లి కూతుళ్ళిద్దరూ కృషి చేశారు.

గాలి కొడుతున్నపుడు మనం మంగళహారతి నిలవటానికి చేతులు ఎలా భద్రంగా చుట్టూ ఉంచుతామో అలాగే ఆసురీ ప్రభావం సీతయొక్క మనస్సు మీద పడకుండా సురమ, త్రిజట అన్నటువంటి

రెండు చేతులూ నిలిచి వున్నాయి. ఈ విధంగా విభీషణుడు కుటుంబ సహితంగా రామసేవకు అంకితమైనటువంటి సేవాభక్తుడు. విభీషణుని మంత్రులు నలుగురూ కూడ అటువంటివారే. రావణ సేనా రహస్యాల న్నింటినీ పక్షులరూపంగా లంకలోనికి వెళ్ళి తెలిసికొని వస్తూ వుండే వారు. గూఢచార వృత్తి చేసి రామునికి వారు సేవ చేశారు. నిజానికి విభీషణుడు లేకపోతే రామునికి విజయంలేదు. ఇంద్రజిత్తు నికుంభిలా గుహలో యజ్ఞాన్ని పరిసమాప్తి చేసినట్లయితే లక్ష్మణుడు అతనిని జయించగలిగేవాడు కాదు. రావణునియొక్క ప్రాణరహస్యం కనుక విభీషణుడు చెప్పక పోయినట్లయితే రాముడు రావణుని జయించటం దుర్ఘటమయ్యేదేమో! ఈ విధంగా రావణుని యొక్క ఆయువుపట్టు లన్నింటినీ రామునికీ ఆయా సందర్భాలలో చెప్పి, రావణ సంహారానికి సుగమమైన మార్గాన్ని ఏర్పాటుచేసిన సచివోత్తముడు, భక్తిసత్తముడు విభీషణుడు. అటువంటివాడు చివరకు అన్న చనిపోయిన తరువాత దుఃఖిస్తూవుంటే రాముడు ఓదారుస్తాడు. దుష్టుడైన యీ అన్నకు కర్మ చేయనంటాడు విభీషణుడు. రాము డప్పుడు ఇలా బోధిస్తాడు :

"మరణాంతాని వైరాణి నివృత్తం నః ప్రయోజనం
క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ"

'ఎప్పుడూ కూడా లోకంలో వైరం వుంటే అది మరణంతో అంతం కావాలి. మరణించిన తరువాత ఆ వ్యక్తిమీద వైరాన్ని సాధించకూడదు. నా ప్రయోజనమూ అయిపోయింది. ఇప్పుడు దహన సంస్కారం చెయ్యి, రావణుడు నీకు ఎటువంటివాడో నాకూ అటువంటివాడే. మరణాంతమునందు నేను ప్రపంచించే స్నేహభావాన్ని నీవు కూడ స్వీకరించి, అతనికి స్వర్గాదులు కలిగించే ప్రయత్నం నీవు చెయ్యి' అని చెప్పాడు. రాముడు కుంభకర్ణాదుల గురించి ఎట్టి తాపత్రయంపడలేదు. కాని, రావణునికి మాత్రం వెంటనే దహన క్రియలు జరగటానికి ఆయన ప్రయత్నం చేశాడు. ఎందువలన అంటే మనం మొదట అనుకొన్నట్లుగా మూర్తీభవించిన అహంకారం ఆయనది. అహంకారం అన్నది దేహమే తాను అని అనుకొనటంలోనే వుంది. ఆత్మతత్త్వాన్ని తెలిసికోలేక, దేహమే ఆత్మ అని భ్రమిస్తున్నటువంటి ఆ జీవునియొక్క

వేదనంతా ఆ శరీరం భరించింది. ఆ శరీరము వలననే ఆ జీవుడు భగవంతునికి దూరమైనాడు, దాన్ని అగ్నిదగ్ధం చేయమన్నాడు. నాకు అనిపిస్తోంది, యుద్ధమయిన తరువాత మనకు రెండే చితులు కనపడుతాయి. మొదటిది రావణు డెక్కిన చితి, మరొకటి సీత ఎక్కిన చితి. మరి ఎవ్వరూ ఆ చితుల మీద ఎక్కినట్లుగా కనపడదు. రావణాసురుడు ఏ రోజు చచ్చిపోయిన రాక్షసులను ఆ రోజే, ఇంత మంది రాక్షసులు చనిపోయారని కనపడకుండా సముద్రంలోకి దొర్లిస్తూ వుండేవాడట తెల్లవారేసరికి. అందువలన చివరకు ఇంద్రుడు అమృతవర్షం కురిపిస్తే చనిపోయిన వానరులే బ్రతికారు తప్ప రాక్షసులు బ్రతకలేకపోయారు. ఈ విధంగా శరీరాన్ని ఆశ్రయించి వున్నటు వంటి అహంకార శేషాన్ని మిగల్చకుండా, ఇట్టి పాంచభౌతికమైనటు వంటి ఆలంబనాన్ని కనుక అట్టిపెట్టినట్లయితే, ప్రేత రూపంగానైనా ఆ రావణుడు దానిని ఆశ్రయించకూడదని దానిని మొదట దహింప చేయిస్తాడు. సీత అగ్నిప్రవేశమును గురించి మరల చెప్పుకొందాము. ఇలా విభీషణుని యొక్క శరణాగతి శారీరకంగా, మానసికంగా, ఆత్మపరంగా సర్వసంగ పరిత్యాగం చేసి, రాముని ఆశ్రయించిన భక్తిమార్గం. ఆ తరువాత నాకు రాజ్యము వద్దు అన్నాడు విభీషణుడు. కాని, రాముని ఆజ్ఞ చొప్పున స్వీకరించాడు. మోహం లేని, కామం లేని భక్తితో రాముని శరణు వేడిన విభీషణుని శరణాగతి వరకూ కనుక రామాయణాన్ని మనం అన్వయించుకొంటూ వస్తే, రామాయణం ఒక మహాశరణాగతి అని భావించటానికి వీలుంది.

రాముడు సముద్రాన్ని దాటటానికి ఉపాయాన్ని అన్వేషిస్తూ వుంటాడు. విభీషణుడే మార్గం చెప్పుతాడు, సముద్రుని ఆశ్రయించినట్లయితే మార్గం దొరకవచ్చునని. రాముడు సముద్రున్ని ఉపాసిస్తాడు. మూడు అహోరాత్రాలు ఉపాసించినా సముద్రుడు ప్రసన్నుడు కాడు. రామునికి కోపం వచ్చి బ్రహ్మాస్త్రాన్ని ఎక్కుపెడతాడు. సముద్రుడు

ప్రత్యక్షమవుతాడు. 'మీలో నలుడు అనేవాడు ఉన్నాడు. అతడు మయునియొక్క పుత్రుడు. అతడు వారధిని కడతాడు' అని సూచి స్తాడు. అతనిచేత వారథిని కట్టిస్తారు. వారథిని ప్రతీకాత్మక దృష్టితో భావిస్తే నీళ్ళలో మునగని దారి, శిలామయమైన దారి, కఠినమైన దారి, సంసారము అన్నటువంటి సముద్రమునందు మునగకుండా తేలునటు వంటిది అని. తేలటానికి ఉపయోగపడు శక్తి భక్తి. ఆ భక్తిపై ఉంచి నది యోగం. భక్తియోగ మనే మార్గంకుండా గమించి, సంసార సముద్రాన్ని తరించవచ్చు. ఆపైన అహంకారాన్ని జయించవచ్చును. ఆపైన సీత అనునటువంటి మాయను కనుగొనవచ్చును. ఆ మాయను కూడ దహించివేసిన తరువాత పురుషోత్తముని ఆత్మను దర్శించ వచ్చును. ఇలా అహంకార మాయా విజయం సాధించి, పరమాత్మను దర్శించటానికి తోడుపడే సంసార సాగర తరణోపాయమైన భక్తి యోగమే యీ వారధి. దీనినే రామాయణ కథార్థముల కంటె యింకా వివరంగా చెప్పటానికి చాలమంది భక్తులు ప్రయత్నం చేశారు. రామ శబ్దాన్ని ఉచ్చరిస్తూ కపులు రాళ్ళు వేశారట. రామ అన్న శబ్దాన్ని దానిమీద వ్రాసి వేస్తే అవి తేలుతూ వుండేవట. ఈ రామనామ సంతత జపంచేత సాధింపబడిన భక్తియోగాన్ని బహువిధాలుగా ప్రతీకాత్మక కథార్థాలతో ప్రపంచించి చూపించారు. అందువలన భక్తియోగమే, సంసార తరణోపాయమైన భక్తియోగమే వారధి.

రామాయణాన్ని మూడు ముక్కలలో చెప్పమంటే, మనవారు-కట్టె, కొట్టె, తెచ్చె అంటారు. ఈ మూడూ యుద్ధకాండకు సంబంధిం చేవే కాని, మరి ఏ కాండకు సంబంధించినవి కావు. ఏమి కట్టినాడు? వారధి కట్టినాడు. ఏమి కొట్టినాడు? లంకను కొట్టినాడు. ఏమి తెచ్చి నాడు? సీతను తెచ్చినాడు. మొదట రాముడు వారధి కట్టినాడు. ఆపైన లంకను కొట్టడమంటే ఏమిటి?

లంక త్రికూటపర్వతంమీద వుంది. ఆ పర్వతంమీద తెల్లని మబ్బుల గుంపు వ్రేలాడుతున్నట్లుగా ఆ నగరం కనపడుతుంది. ఎత్తయిన పర్వతము. ఆ పర్వతముమీద మేడలు. ఆ మేడలలో ఎత్త

యిన మేడ. ఆ ఎత్తయిన మేడమీద రావణుడు కూర్చొని వుంటాడు. ఇక ఆ లంకానగరం ఎలా రక్షింపబడుతున్నది? మొదట జలదుర్గం. సముద్రమే జలం. ఆ తరువాత నదులు కూడ వున్నవి. సముద్రం, నదులు అనునటువంటి జలంచేత రక్షింపబడుతున్నది కాబట్టి అది జల దుర్గం. ఈ జలాన్ని దాటాలి, లోపలకు వెళ్లాలి. వెళ్ళితే సువేలాపర్వతం. ఆ సువేలాపర్వతం సహజంగా ఏర్పడిన పర్వతదుర్గం. ఆ పర్వతాన్ని దాటాలి. ఆపైన దుర్గమమైన అరణ్యాలున్నాయి. ఈ అరణ్యమును వనదుర్గం అంటారు. ఈ వనదుర్గాన్ని దాటి లోపలికి వెళ్ళాలి. వెళ్ళితే కృత్రిమ దుర్గం, నిర్మిత దుర్గం. త్రికూటంమీద నిర్మితమైన లంకా మహానగరం. ఆ నగరం పొడవు నూరు యోజనాలు, వెడల్పు 30 యోజనాలు. వారధి 100 యోజనాల పొడవు వుంది. 10 యోజనాల వెడల్పు వుంది. అది 100 యోజనాల పొడవు, 30 యోజనాల వెడల్పు. ఇది వారధికంటె పెద్దదిగా మనకు కన్పడుతుంది. ఈ విధంగా మన మనోనేత్రాలకు ప్రత్యక్షం అవుతుంది.

రాముడు వారధిని దాటి సువేలాపర్వత మెక్కి మొట్టమొదటి సారి ఆ లంకను చూస్తాడు. లంకావైభవాన్ని చూచి ఆశ్చర్యపోతాడు. అక్కడనుండి సైన్యవిభాగం చేస్తాడు. తాను స్వయంగా ముందు నడుస్తూ వనదుర్గాన్ని దాటివస్తాడు. ఉడుములు సహితం ఎక్కలేనంత ఎత్తుగా వుంది ఆ నగర ప్రాకారం. క్రింద నిలబడి వున్నాడు రాముడు. దానికి నాలుగు ద్వారాలున్నాయి. ఆ నాలుగు ద్వారాలలో రావణుడు రామ సైన్యాన్ని ఎదుర్కొనటానికి నలుగురు వీరులను పెట్టాడు. తూర్పు ద్వారం దగ్గర ప్రహస్తుడున్నాడు- రాక్షసుల సర్వసైన్యాధ్యక్షుడు. రాముడు కూడ తన సర్వసైన్యాధ్యక్షుడైన నీలుణ్ణి అతనికి ఎదురుగా నిలిపాడు. దక్షిణద్వారం దగ్గర మహోదరుడు, మహాపార్శ్వుడు అనే రాక్షసులను ఉంచాడు రావణుడు. వారికి ఎదురుగా రాముడు అంగ దుణ్ణి నిలిపాడు. పశ్చిమద్వారం దగ్గర ఇంద్రజిత్తుని పెట్టాడు రావ ణుడు. ఆ వైపే హనుమంతుని నియోగించాడు రాముడు. ఉత్తరపు

ద్వారం దగ్గర శుకసారణులను నామమాత్రంగా పెట్టి రావణుడు తానే స్వయంగా నించున్నాడు. రామలక్ష్మణులు తామే ఉత్తర ద్వారానికెదురుగా వెళ్ళారు. లంకా నగర గర్భాన్ని రక్షించటానికి విరూపాక్షుణ్ణి నియమించాడు రావణుడు. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు - వీరు ముగ్గురూ రావణుని లంకా నగరగర్భాన్ని దాడి చేయాలి. ప్రహరీ గోడను దాటి లోపల దాడి చేయాలి, ఇప్పటి వాయుసేన దాడి చేసినట్లు. ఈవిధంగా లంకను నాలుగువైపులా ముట్టడి చేయటానికి, లోపలకూడ దాడి చేయటానికి తగిన సన్నాహాలను రాముడు పూర్తిచేశాడు. రావణుడు ఆ లంకా నగరశిఖరం మీద నిలువబడి రామసైన్యాన్ని అంతా కలయచూశాడు.

త్రికూటాద్రిపై లంక నిలిచింది అంటే అసలు అర్థం మరో విధంగా గ్రహించవచ్చు. ఆ మూడు శిఖరాలు: ఒకడు కుంభకర్ణుడు, రెండవవాడు ఇంద్రజిత్తు, మూడవవాడు రావణుడు. ఈ మూడు శిఖరాలమీద నిలబడిందే లంక. వీరు లేకపోతే లంక లేదు. రామరావణ యుద్ధంలో అందరి యుద్ధం ఒక ఎత్తు- ఈ ముగ్గురి యుద్ధం మరో ఎత్తు.

వారిలో కుంభకర్ణుడు దారుణమైన పొడవు. కుంభకర్ణుని వంటి విస్తృతమైన ఆకృతి కలిగిన రాక్షసుడు లేడు. అతడు నిద్ర లేచి లంకా నగరంలో నడుస్తూ వుంటే ప్రభూతముగా కనపడుతున్న అతని ఆకృతిని చూచి వానర సైన్యం మూర్ఛపోయింది. రాముడు అడుగుతాడు- 'ఎవడు ఈ మహాకాయుడు- విశ్వరూపములాగ కనపడుతున్నాడు, భయంకరంగా కనపడుతున్నాడు?' అని. అతనిని గురించి విభీషణుడు చెప్పుతాడు. అతడు పుట్టినపుడే ఆకలితో పుట్టాడు. చేతికి అందినణ్ణి పదార్థాలను, జీవులను తింటూ వుండేవాడు. ఇదివరకు విరాధున్ని చూచాము. ఇప్పుడు కుంభకర్ణుణ్ణి చూస్తున్నాము. వీడు అన్నమయ కోశం. తింటాడు, నిద్రపోతాడు. జంతువుకు వుండే ప్రధానమైన లక్షణాలు అన్నీ వీనిలో వున్నాయి. తామసిక లక్షణానికి ఇతడు ప్రతీక. రక్తాన్ని త్రాగుతాడు. ఇతని ధాటికి తట్టుకోలేక బ్రహ్మ వీనికి శాపం పెట్టాడు. శాపం పెట్టాడని కొందరంటారు. బ్రహ్మను గురించి తపస్సు

చేస్తూంటే సరస్వతీదేవి యితని నాలుకమీద నిలువబడి ఇంతటివాడు కనుక రోజూ తినటం మొదలుపెడితే ప్రపంచం ఒక నెలరోజులలో అయిపోతుంది అని చెప్పి 6 నెలలు నిద్రపోవాలి, ఒక్కరోజు మేల్కొనాలి, ఆ ఒక్కరోజు తిండి తినాలి అని వరం కోరినట్లు చెప్పుతారు. కొంతమంది 6 నెలలు నిద్రపోతాడు, 6 నెలలు తింటాడు అంటారు. రామాయణంలో ఒక్కరోజు మాత్రమే మేల్కొంటాడని వుంది. రావణుడు మూడవ సభ చేసిన రోజు కుంభకర్ణుడు మేల్కొనివచ్చినాడు. విభీషణుని లంకా బహిష్కారం జరిగే సభ మూడవ సభ మనం ఒకసారి అనుకొన్నాము. కుంభకర్ణుడు శిలవంటివాడు. ఎటువంటి శిల అంటే గర్భవతి అయిన శిల వంటివాడు. ఆ శిలాగర్భంలో జలం వుంటుంది. అందులో ఒక కప్ప వుంటుంది. ఇది పూజకు పనికిరాదు. శిల్పి మొదట శిలను అది గర్భవతియా కాదా అని పరీక్షచేస్తాడు. ఈ కుంభకర్ణుడు అటువంటివాడు. ఇతని గర్భంలో ఉన్నటువంటి తేజస్సు దైవికమైనది. ఇతని శరీరము అంతా తామసికమైనది. రామునియొక్క తత్త్వం ఇతనికి తెలుసు. నారదునివలన విన్నాడు ఇతడు.రావణుని సంహరించటానికి నారాయణుడు భూలోకంలో దశరథ పుత్రుడై జన్మించినాడని. వానరులు మొదలైనవారిచేత రాక్షసులు సంహరించబడతారని. ఈ సంగతిని మనస్సులో పెట్టుకొన్నాడు. సభలో కూర్చొన్నాడు. రావణుడు "నేను సీతాపహరణం చేశాను. రాముడు ఖరాది రాక్షసులను సంహరించి నాకు అపకారం చేశాడు కాబట్టి నేను సీతాదేవిని యిచ్చేది లేదు. సీతాదేవిని ఇవ్వకుండా రామలక్ష్మణులను సంహరించే మార్గం ఏదైనా వుంటే నాకు చెప్పండి" అని అన్నప్పుడు కుంభకర్ణుడిలా సమాధానం చెప్పాడు: 'ముందుగా నీవు సీతను దొంగిలించి తెచ్చావు. అప్పుడు ముందుగా నీవు మమ్మడగ లేదు. నిశ్చయం నీది, కర్మ నీది, దానికి ఫలం నీవే అనుభవించాలి. నీకు బదులు నేను ఎందుకు అనుభవిస్తాను? నీవు రాజువని ఆజ్ఞాపిస్తున్నావు. ప్రజలను రక్షించవలసిన బాధ్యత కలిగిన నీవు, నీ కర్మకు

ఫలం నీవే అనుభవించవలయునా, లేక నీ దుష్కర్మకు ఫలం నీ ప్రజ అనుభవించవలయునా నిశ్చయింపవలసిన వాడవు నీవు. కాదా నీవు రాజువి, శాసిస్తే నేను యుద్ధం చేస్తాను. ధర్మమార్గాన్ని చెప్పుతు న్నాను. చపలబుద్ధి కలిగిన ఒక కొంగ చెరువులోనుండి వున్న ట్టుండి ఒక్కసారి లేచిపోతుంది. దానివెంట కొంగలు అన్ని లేచిపో తాయి. అలాగే చపలుడైనవాడు, ఎరుకలేని మూఢుడైనవాడు తన మంత్రులనందరిని వెంట వేసుకొని వెళ్లుతాడు. అలా వుంది నీ ప్రవృత్తి' అని హితవు బోధిస్తాడు. నారదునివలన తాను విన్న సత్యాన్ని కూడ చెబుతాడు. రావణుడు అతని హితవును త్రోసిరాజంటాడు.

నాల్గవ సమావేశంలో రావణుడు విద్యుజ్జిహ్వునిచేత రాముని యొక్క శిరస్సును, రామునియొక్క ధనుస్సును సృష్టింపజేసి సీతకు చూపిస్తాడు. 'రాముడు చనిపోయినాడు, అతని తల యిది; అతని ధనుస్సు యిది, ఇక రాముడు లేడు; నన్ను వరించు' అని బలవంతం చేయబోతాడు. అదే సమయంలో విజయదుందుభులు మ్రోగిస్తూ వానరు లందరూ లంకా నగరాన్ని ముట్టడిస్తారు. గూఢచారులు వచ్చి ఆ వర్త మానం చెప్పగానే రావణుడు వేగంగా నిష్క్రమిస్తాడు. అప్పుడు త్రిజట మొదలైనవారు అదంతా మాయ అని సీతకు చెప్పుతారు. రావణుడు వెళ్ళగానే రాముని మాయ శిరస్సు, ధనుస్సు అంతర్ధాన మవుతాయి. సీతను వశంచేసుకోడానికి రావణుడు వేయి విధాల యత్నం చేస్తాడు. సీత తనకు వశమైతే రాముడు నిర్వీర్యుడవుతాడని రావణుని సిద్ధాంతం. చిట్టచివరి ఘడియవరకు సీతను వశం చేసుకోడానికి ప్రయత్నాలు ఒకవైపు, రాముని సంహరించటానికి ప్రయత్నాలు మరొకవైపు సాగి స్తూనే వుంటాడు. ఇది రావణుని పాత్రలో నున్న విశిష్టమైన లక్షణం. తరువాత ఇంద్రజిత్తు నాగాస్త్రంతో రామలక్ష్మణులను బంధించినపుడు సీతను పుష్పక విమానంమీద తీసికొనిపోయి చూపించమంటాడు. అప్పుడు సీత శోకాయత్తురాలవుతుంది. రాముడు చనిపోయినాడని భ్రమించి, తనకు వశమతుందని రావణుని భావం. ప్రక్కనున్న సురమా త్రిజటలు నిజానిజాలను వివరిస్తూ సీతకు ధైర్యం కలిగిస్తూ

వుంటారు. ఒక విధంగా విభీషణుడే తన కుటుంబంతో సీతకు ధైర్యాన్ని ఇస్తూ వున్నాడన్నమాట!

ధూమ్రాక్షుడూ, వజ్రదంష్ట్రుడూ, అకంపనుడూ, ప్రహస్తుడూ- వీరందరూ వరుసగా హనుమంతుడు, అంగదుడు, నీలుడూ మొదలైన వారి చేత సంహరింపబడతారు, రావణుడే స్వయంగా రామునిమీదకు వెళ్ళుతాడు. సుగ్రీవుని, హనుమంతుని, నీలుని, లక్ష్మణుని బాణాలచేత బాధిస్తాడు. లక్ష్మణుని బ్రహ్మదత్తమైన శక్తిచేత తాడిస్తాడు. అతడు మూర్ఛపోతాడు, మూర్ఛపోయిన లక్ష్మణుని ఎత్తి రథంలో పెట్టుకొని తీసికొనిపోవడానికి ప్రయత్నంచేస్తాడు రావణుడు. లక్ష్మణుణ్ణి ఎత్తలేక పోతాడు. ఈ సంగతి తెలిసికొన్న హనుమంతుడు రావణుని వక్షంపై తన పిడికిలితో గ్రుద్దుతాడు. అతడు మూర్ఛాక్రాంతుడవుతాడు. అప్పుడు లక్ష్మణుని రామనామస్మరణం చేసుకుంటూ ఎత్తుకొని తీసుకొనివెళ్ళి రాముని దగ్గర అట్టిపెడతాడు. రాముడు క్రుద్ధుడవుతాడు. రావణుని మీద దాడి చేస్తాడు. రావణుని రథాన్ని విరుగకొడతాడు. అతని శరీరాన్ని బాధిస్తాడు. మొట్టమొదటిసారి రాముని చేత రావణునికి పరాజయం కలుగుతుంది. లేవలేని పరిస్థితులలో వున్నప్పుడు 'రావణా! బలహీనుడవైన నిన్ను నేను చంపను, నీవు ఇవ్వాళ విశ్రాంతి తీసుకో, పో!' అని యింటికి పంపిస్తాడు. శత్రువు చంపితే వీరునికి బాధ లేదు కాని అవమానం చేసి అధిక్షేపిస్తే హృదయంలో బాణము గుచ్చుకొన్నట్లుగా బాధ కలుగుతుంది. రావణుడు ఆ రాత్రి యింటికి వెళ్ళి బాధ పడతాడు.

లంకకు తిరిగి వచ్చిన నాటినుండి రావణునిలో ఆత్మచైతన్యం ప్రబుద్ధమాన మవుతుంది. ఆ తరువాత జరిపిన ఆరవ సభలో నిర్వేద మూర్తియై తన జన్మలో తాను పొందిన శాపాలన్నింటిని ఏకరువు పెట్టి రాక్షసులకు వినిపిస్తాడు. అనరుణ్యుడు అనే ఇక్ష్వాకువంశ రాజును నేను బాధించానయ్యా! అతడన్నాడు 'నా వంశంలో ఒక మహాత్ముడు పుట్టబోతున్నాడు. అతనివల్ల నీకు మృత్యువు కలుగుతుంది' అని ఒక

శాపం పెట్టాడు. వేదవతిని నేను బలాత్కారంచేశాను. 'నేను ఏవిధంగా నైనా సరే లంకలో ప్రవేశించి నిన్ను దహింపచేస్తాను' అని ఆమె శపథం చేసింది, ఆమెయేనేమో యీ సీత! నేను కైలాసపర్వతాన్ని కదిలించినపుడు భయకంపితురాలైన ఉమాదేవి 'నీకు స్త్రీ మూలకంగా చావు కలుగుతుంది' అని శాపం పెట్టింది. నందీశ్వరుని నేను అప హాస్యం చేశాను. 'ఒరే! నీకు వానరులచేత చావు కలుగుతుందిరా, నీ లంకకు ముప్పు కలుగుతుందిరా!' అని శాపం పెట్టాడు. రంభను బలత్కారం చేశాను. అతని భర్తవలన నాకు ఒక శాపం కలిగినది. పుంజికస్థలను అవమానం చేశాను. బ్రహ్మ నాకు అప్పుడు శాపం పెట్టాడు- 'ఏ వనితనయినా ఆమె అంగీకరించనప్పుడు నీవు బలాత్క రించినా వంటే నీ శిరస్సు వేయి వక్కలవుతుంది' అని అతని శాపం. అందువల్లనే సీతను నేను ప్రేమిస్తున్నాను కాని, ఆమెను నేను బలాత్క రించలేకపోతున్నాను. మహర్షుల యజ్ఞాల నెన్నింటినో ధ్వంసం చేశాను. వారు ఎన్ని శాపాలు పెట్టారో నాకు తెలియదు. దేవతలను బాధించాను. వారు ఏయే శాపాలు పెట్టారో నాకు తెలియదు. అయినా సీతయందు నాకు లగ్నమైవున్న మనస్సును మాత్రం నేను త్రిప్పుకొన లేకపోతున్నాను' అన్నాడు.

రావణుని వేదన చిత్రమైనది. 'సీతా! నీవు నాకు వశమైతే నాకు ఏడువేలమంది భార్యలున్నారు. వారందరికంటే నీవు పట్టమహిషివి అవుతావు. హనుమంతుడు చూశాడు- విపులమైన రావణాంతఃపురాన్ని. మండోదరి మయబ్రహ్మ కుమార్తె. ఆమె భర్తతో అంటుంది: 'నేను సీతకంటే ఏమి తక్కువ అని ఆమెను కోరుతున్నా' వని. ఏమీ తక్కువలేని ఆ మండోదరి భార్యగా వున్నా ఈతడు ఏడువేలమంది భార్యలను ఎందుకు ఆకర్షించాడు? ఇతని మార్గం ఏమిటి? అయితే కామి అయివుండాలి. అయితే ఆ కామంయొక్క లక్షణం ఏమిటి? వట్టి స్త్రీవిష యక భోగమా? కాదు. ఇతని జీవచైతన్యంలో ఆనందాన్ని అందు కోవాలి అన్న జీవుని వేదన ఉండి వుండాలి. ప్రతిజీవిలోనూ ఉంటుంది

ఈ కామం. స్త్రీ పురుష సంభోగంలో కలిగే క్షణికమైన సుఖంలో భాసించే అనుభవ విశేషం ఆనందానుభూతియొక్క సహస్రాంశం. ఇట్టి సహస్రాంశాన్నే ఆదరువుగా చేసికొని బ్రహ్మానందంవైపు పయనించాలి అన్న ప్రయత్నం చేస్తాడు జీవి. ఇది రెండు మార్గాలలో సాగుతుంది శారీరకమైన అనుభూతి యొక్క విస్తృతిని కలిగించటం ద్వారా కాని, ఆత్మజ్ఞానానికి సంబంధించి దైవిక చైతన్యము యొక్క విస్తృతిని కలిగించటం ద్వారా కాని. రావణుడు దైహికమైన సుఖమునందు భాసించే క్షణికానందాన్ని ఆధారంగా చేసికొని దివ్యమైన అనుభవముకోసం ఒక ప్రస్థానాన్ని సాగించాడు. భోగమయమైన భూముల నన్నింటిని జయించాడు. సర్వలోక వనితలలోని రత్నాలను కొనివచ్చాడు భోగ భూముల నుండి తెచ్చిన వనితలు వీరు. వీరందరూ రావణునికి దైహికమైన ఏదో ఒక తృప్తిని కలిగిస్తున్నారు తప్ప అతనియందు ఉన్న దివ్యతేజస్సును ప్రకోపింప చేయలేకపోతున్నారు. భార్యవలన లేక ప్రకృతిగా భాసించే స్త్రీవలన పురుషుడు కోరేది ఏమిటి? ఇంద్రియపరమైన సుఖమే కాదు, ఇంద్రియపరమైన సుఖం కంటె తన ఆత్మయొక్క ప్రజ్వలనానికి కావలసిన శక్తి ఆమె అందించాలని ఆశిస్తాడు. తాను అగ్నిగా ప్రజ్వరిల్లడానికి ఆమె ఇంధనాలు ఇవ్వాలి. యజమాని అగ్నిహోత్రం చేయటానికి భార్య అగ్నిని అందించటం, నిత్యమూ మన కుటుంబాలలో చూస్తూవుంటాము. పతి అభివృద్ధి చెందటానికి, అతనిలో ఆత్మజ్యోతి వెలగటానికి, అతడు ఆనందమూర్తి కావటానికి, అతనిలో దైవజ్యోతి వెలగటానికి స్త్రీ తోడ్పడాలి. ఇట్టి దైవికమైన తేజస్సును అందించే స్త్రీ అతనికి మూడు లోకాలలో దొరకలేదు. సీత రామునియందు అట్టి దైవికమైన ప్రజ్వల శక్తిని ప్రకోపింపచేస్తున్న శక్తిలా కనుపడుతోంది ...ఆ శక్తిని తాను ప్రసన్నం చేసికోవాలి. ఆమెవలన తనలో దైవిక శక్తిని ప్రకోపింప చేసుకోవాలని అనుకొన్నాడు; తాను ఆనందమూర్తి కావాలని అనుకొన్నాడు రావణుడు. కాని, ఆమెను ఉపాసించే మార్గం అతనికి దొరుకలేదు. ఇంద్రియపరమైనటువంటి దృష్టితో కాక అధ్యాత్మికమైన దృక్పథంతో

స్త్రీని రమించినపుడు పురుషునికి ఆత్మతేజస్సు అభివృద్ధి అవుతుంది. సీతారాముల లక్షణం అటువంటిది.

సీత అగ్ని ప్రవేశాన్ని గురించి అవసరం వచ్చింది కాబట్టి చెప్పేస్తాను. సీతను అగ్నిలో ప్రవేశించుమని రాముడు కోరింది ఎందుకు? 'రావణుని పట్టణంలో నీవు కొంతకాలము వున్నావు కాబట్టి, రావణుని ఒడిలోనుండి క్రిందకు జారినావు కాబట్టి, రావణుని కాంక్ష చేత కొంత కాలం తప్తమైనావు కాబట్టి, నిన్ను నేను ఎలా స్వీకరిస్తాను? నేను కాముకుని కాను' అంటాడు రాముడు. సీతను రాముడు ఉపాసిస్తున్న మార్గం అది. సీతారాములయొక్క తత్త్వాన్ని నీవు భౌతికంగా అర్థం చేసుకొంటే రాముడు కాముకుడు, సీత ప్రణయిని. అధ్యాత్మికంగా వారి ద్దరిని అర్థం చేసుకొంటే రాముడు పరమాత్మ, ఆమె ప్రకృతి. భౌతిక మైన దృష్టిని యోగాగ్నిచేత తప్తం చేసినపుడు నీకు భాసించేది సీతా రాములయొక్క విశుద్ధ తత్త్వం. సీతను రావణుని దృష్టితో చూస్తే తత్కాలమునందు సీతను గ్రహించనున్న రాముడు కాముకుడు. రాముని దృష్టితో గమనిస్తే దేహాభిమానాన్ని యోగాగ్నిలో తప్తం చేసి ఆత్మ తేజస్సుతో భాసించే సీతను అద్వైత భావంతో గ్రహించే పర మాత్మగా, ఆదర్శప్రేమమూర్తిగా రాముడు దర్శనమిస్తాడు. సీతా రాముల మధురాద్వైత దృష్టిని అలవర్చుకోడానికి అనువుగా మనకు తోడ్పడేది చితిరూపంగా ఉన్న యోగాగ్ని. అందువల్లనే సీతను యోగాగ్ని తప్తము చేసి రాముడు స్వీకరిస్తాడు. ఇట్టి యోగాగ్ని లేని వాడు రావణుడు.

చాలమందిమి అనుకొంటాము రావణుడు ఆరువేళలా శివలింగా లను అర్చనం చేస్తూ వుండేవాడనీ, మహాశివభక్తుడని. దానికి కొన్ని కథ లున్నాయి. వాల్మీకి రామాయణం చదివితే లంకలో ఒక్క శివాలయం కూడ మనకు కనపడదు. ఒక్కరోజు కూడ రావణుడు శివాలయానికి పోయిన పాపానపోలేదు. మనకు ఆ లక్షణాలు కనపడవు. తరువాతి వారు కల్పించుకొన్నారు. శైవ, వైష్ణవ మతాలకు సంబంధించిన కల్ప నలు వచ్చినపుడు ఆయనను సాక్షాత్తు శైవమూర్తిగా భాసింపచేశారు.

కాని, అతనికి అట్టి శైవభక్తి ఉన్నట్లుగా కనపడదు. ఉంటే పాపం బాగుపడేవాడు. అందువల్లనే 'ఇట్టి రావణుడు సీతయందలి కామాన్ని పరిత్యాగం చేసికోలేనని ఆ సభలో ప్రకటిస్తాడు. తన శాపవృత్తాంతా లన్నిటినీ వినిపిస్తాడు. మొట్ట మొదటిసారి తన శాప వృత్తాంతాలను చెప్పి ఆత్మవివేకాన్ని ప్రకటింపచేస్తాడు. అప్పుడు కుంభకర్ణుని లేప మంటాడు. అతను లేస్తాడు. అతడు అన్నకు హితవు బోధిస్తాడు. 'నేను నిద్రపోకపూర్వం నీకు ఒకసారి చెప్పాను మళ్ళీ ఇపుడు నన్ను నిద్రలేపావు మళ్ళీ అదే పాట. అయితే అప్పుడు కార్యారంభం చేశావు. ఇప్పుడు కొంతవరకు ఫలాన్ని అనుభవిస్తున్నావు. అయితే, నీవు పొంద వలసిన ఫలాన్ని మాకు కూడ పంచిపెడుతున్నావు. నేను కూడ వెళ్ల తాను. నీకోసం యుద్ధం చేస్తాను' అని తెలిసి - తెలిసి అనగా రావణుని గౌరవించుతాను రాముని చేతిలో చనిపోతానని తెలిసి అతడు యుద్ధా నికి పూనుకొంటాడు పురుషకారంతో తన ప్రయత్నమంతా చేస్తాడు. చివరకు రాముని చేతిలో చనిపోతాడు రాము డాతని కాళ్ళను, చేతు లను, చివరకు శిరస్సును ఖండిస్తాడు. చనిపోయిన తరువాత అతనిలో నుంచి దివ్యతేజస్సొకటి లేచివచ్చి శ్రీరామునిలో లీనమవుతుంది. ఈ విధంగా అప్పటి జయవిజయులలో ఒకడైన ఈ కుంభకర్ణుడు మరల విష్ణుసాయుజ్యాన్ని పొందగలుగుతాడు.

కుంభకర్ణుడు చనిపోయిన తరువాత రావణుడు అపారంగా దుఃఖపడతాడు. నీవులేని లంక నాకు ఎందుకు అని వాపోతాడు. అప్పుడు అతనిలో మరల ఆత్మనిర్వేదం కలుగుతుంది.

"అప్పుడు సర్వకార్యవిదుఁడైన విభీషణుఁ డన్ని భంగులం
జెప్పడె చాటి మీదనగు చేటు; నయజ్ఞులమాట లేటికిం
దప్పు; నవజ్ఞమై నకట ధర్మపరుండగు నట్టివానికే
నొప్పమిసేసి తత్ఫలము నొందితి నిందకునైతి నేమనన్?"

మొదటిసారి విభీషణుడు చెప్పిన మాటలను తాను వినక చెడిపోయా నని రావణుడు నిర్వేదాన్ని ప్రకటిస్తాడు కాని, వెంటనే అతని అహం కారం అతన్ని ఆవరిస్తుంది. కుంభకర్ణుని అస్తమయంతో ఒక శిఖరం కూలిపోయింది.

ఇంద్రజిత్తు మహాశక్తిమంతుడు. ఉత్తరకాండలో అగస్త్యాది మునులు రాముని దర్శించి 'రామా! రావణుని, కుంభకర్ణుని జయించావు. మెచ్చుకోదగిన విషయమే. కాని, ఆ ఇంద్రజిత్తుని జయించటం మాత్రం అనన్యసాధ్య మయిన విషయ'మని అన్నారు. అప్పుడు రాముడు- 'రావణుని కంటె ఇంద్రజిత్తు గొప్పవాడా? అసలు సంగతి ఏమిటో చెప్పం'డని అడుగుతాడు. ఆ విధంగా అగస్త్యాది మునుల చేత అసాధ్యుడని అనిపించుకొన్నవాడు ఇంద్రజిత్తు. ఇంద్రజిత్తుని గొప్పతనం అతని మాయా యుద్ధంలో ఉంది. అటువంటి యుద్ధం లంకలో ఎవరికీ తెలియదు. అతనికిలాగా అదృశ్యుడై యుద్ధం చేసే నైపుణ్యం రాక్షసు లెవ్వరికీ లేదు. అందరూ అందరికి కనపడుతూ వుంటారు. రావణుడు సహితం అదృశ్యమై యుద్ధం చేసినవాడు కాదు. ఇంద్రజిత్తున కాశక్తి బ్రహ్మవరం వలన కలిగింది. ఒకసారి రావణాసురుని ఇంద్రుడు బంధిస్తాడు. ఇంద్రజిత్తుకు మేఘనాథుడు అనేపేరు వుంది. పుట్టగానే మేఘమువలె గర్జించాడు కాబట్టి మేఘనాథుడు అన్నారు. తరువాత ఇంద్రుని జయించాడు కాబట్టి ఇంద్రజిత్తు అని బిరుదుతో పిలిచారు. అతడు ఇంద్రుని జయించి బందీగా కొనివచ్చి లంకలో ఉంచుతాడు. బ్రహ్మదేవుడు వచ్చి ఇంద్రుని విడిపించుకొని పోతాడు. అప్పుడు, కొన్ని వరా లతనికిస్తాడు. ఇంద్రజిత్తును కోరు కొమ్మన్నప్పుడు బ్రహ్మశిరమనే మహాస్త్రాన్నీ, నాలుగు అశ్వములు కూర్చిన ఒక దివ్యరథాన్నీ అడుగుతాడు. బ్రహ్మ వాటిని ఇచ్చాడు ఆ తరువాత తాను అమరునిగా జీవించే వరమివ్వమంటాడు.

'అది సాధ్యమా నాయనా? మీ నాన్నగారికే యివ్వలేదు. అయితే ఒకటిమాత్రం నేనుచేయగలను. అసాధ్యమైన విషయం ఒకటి ఇస్తాను. 12 సంవత్సరాలు ఎవడైతే ఆహారం తినకుండా, నిద్రపోకుండా వుంటాడో వానిచేత నీకు మృత్యువు కలుగుతుంది. అటువంటి నరుడు ఉండటం దుర్లభం కాబట్టి నీకు మృత్యువుకూడా దుర్లభమే అవుతుం' దని బ్రహ్మ అనునయిస్తాడు. ఇంద్రజిత్తు దాని కంగీకరిస్తాడు. రాముని

వెంట నడచివచ్చిన లక్ష్మణుడు అటువంటివాడు. అయోధ్యను దాటి వచ్చిననాటినుండి రాముడు శబరి యిచ్చిన పండ్లనయినా తిన్నాడు కాని లక్ష్మణుడు గంగ కూడ ముట్టుకోలేదు ఇట్టి నిష్ఠాగరిష్ఠుడైనవాడు నిజానికి ఇంద్రజిత్తు వధార్థమే పుట్టాడా? రాముడు లక్ష్మణాంశను తనతో ఎందుకు తీసికొనివచ్చాడు అని మనం విచారిస్తే ఇంద్రజిత్తు సంహారార్థమే అని స్పష్టమౌతుంది.

ఇంద్రజిత్తు సామాన్యుడుకాడు. మహాస్త్ర సంపన్నుడు. నాగాస్త్రం చేత రామలక్ష్మణులను బంధించినవాడు.వారి అవస్థచూస్తే సీతకే కాదు- సర్వ వానర సైన్యానికి కూడా పట్టలేనంత దుఃఖం కలిగింది. రామునికి మూడు నిమిషాలలో మెలకువ వచ్చింది. లక్ష్మణునితోపాటు రాముడు కూడ నాగపాశబద్ధుడై వున్నారు. కదలలేడు. తమ్ముని రక్షించలేడు. అక్కడ అప్పుడు రాము డంటాడు కన్నీటితో-

"శక్యా సీతా సమానారీ మర్త్యలోకే విచిన్వతా
న లక్ష్మణసమో భ్రాతా సచివ స్సాంపరాయికః"

'నాకు సీతవంటి భార్య లోకంలో అన్వేషిస్తే దొరుకుతుంది కాని,లక్ష్మ ణుని వంటి తమ్ముడు నాకు దొరకడు. ఈ లక్ష్మణుడు పోతే, నేను నా తల్లులకు ఏమి సమాధానం చెప్పాలి? భరతుడు అడిగితే ఏమి జవాబు చెప్పాలి?' అని వాపోతాడు. 'లక్ష్మణుడు లేకపోతే నేను ప్రాణ త్యాగం చేస్తా'నంటాడు. 'లక్ష్మణా! నాకు ఎప్పుడు కన్నీరు వచ్చినా ధైర్యం చెప్పి నా యోగక్షేమాలను విచారించేవాడవు, నీయోగక్షేమాల్ని విచారించి నీకు ధైర్యం చెప్పే శక్తికూడ నాకు లేకుండా పోయింది' అని ఆయన విచార పడతాడు. రామలక్ష్మణులను అంత బాధింప కలిగిన అస్త్రశక్తి కలిగినటువంటివాడు అతడు. ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధంలో బ్రహ్మాస్త్రంచేత రామలక్ష్మణులను బంధిస్తాడు. బ్రహ్మాస్త్రం మీద గౌరవంచేత వారు బంధితులవుతారు. అప్పుడు హనుమంతుడు ఓషధి పర్వతాన్ని తీసికొని రావటం, అందులోని సంజీవనీ కరణి అన్న

ఓషధిచేత చనిపోయినవారిని బ్రతికింప చేయటం, విశల్యకరణిచేత గాయాలు మాన్పింపచేయటం, సౌవర్ణకరణిచేత మచ్చలు పోయేటట్లు, సంధానకరణిచేత విరిగిపోయిన అవయవాలను సంధింపచేయటం జరుగుతుంది. రామలక్ష్మణులు తెల్లవారితే విగతజీవులయిపోతారు - అలా కాకుండా హనుమంతుడు సంజీవనితో వారిని రక్షిస్తాడు. జాంబవంతుని నీతిచాతుర్యంచేత అది జరుగుతుంది. ఇంద్రజిత్తు రామలక్ష్మణులకు సహితము ప్రాణాపాయస్థితి కలిగింపగలిగిన మహాపరాక్రమవంతుడని చెప్పటానికి ఈ ఘట్టం చాలు.

ఇంద్రజిత్తు మాయాసీతను రణరంగంలోకి తీసికొనివచ్చి ఆమెను ఖండిస్తాడు. అది చూచి రాముడు వివశుడవుతాడు. లక్ష్మణుడు మూర్ఛితుడవుతాడు. సుగ్రీవాదులందరూ సీత పోయినతరువాత ఇంక ఎవరికోసం యుద్ధం చేయటమని వివర్ణులైపోతారు విభీషణుడు అప్పుడు అంటాడు: 'ఇది అంతా నిజమే అని నమ్ముతున్నారా? సముద్రం ఎండి పోయిందన్న వార్త ఎంత నిజమో సీత చనిపోయిందన్న వార్త అంత నిజం' అని ఆ రాక్షస మాయనుగురించి వివరిస్తాడు. నికుంభిలా దేవాలయంలో ఇంద్రజిత్తు హోమం చేస్తాడు. అతడు హోమాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేస్తే అతనిని జయించేవారు ఎవ్వరూ ఉండరు. అప్పుడు విభీషణుడే లక్ష్మణుని తీసికొని వెళ్ళి యజ్ఞశాలలో లక్ష్మణునిద్వారా బ్రహ్మాస్త్రాన్ని అతనిమీద ప్రయోగింపచేసి, వధింపచేస్తాడు. ఈవిధంగా లక్ష్మణునిచేత సంహరింపబడినవాడు రెండవ శిఖరమైన ఇంద్రజిత్తు. ఈ ఇంద్రజిత్తు మరణంతో రావణునియొక్క పంచప్రాణాలు తావులు తప్పినవని చెప్పుకోవచ్చును.

దానితో సీతను చంపటానికి పోతాడు రావణుడు. అప్పుడు సుపార్శ్వుడు అనే మంత్రి అతనితో అంటాడు - 'ప్రభూ! ఇంత బ్రదుకు బ్రతికావు- చివరకు ఆడదానిమీదనా కత్తి ఎత్తేది? నీవు పౌరుషాన్ని చూపించదలచుకొంటే నీ కోపాన్ని రామునిమీద చూపు.

ఇవ్వేళ చతుర్దశి. రేపు అమావాస్య. రేపటిలోపల రాముని సంహరించు' అని ఉపాలంభిస్తాడు. రావణుడు రోషంతో రామునిమీదకు పోతాడు.

రావణుడు మూడుసార్లు రామునితో యుద్ధం చేశాడు. రెండు సార్లు ఓడిపోయాడు. మొదటిసారి తనంతటతాను రాముడు పొమ్మన మంటే పోయాడు. రెండవసారి రామునియొక్క బాణముల తాకిడికి ఓర్వజాలక మూర్ఛపోతాడు రథముమీద. రథసారథి అతనిని రక్షించ టానికి నగరంలోకి తీసికొనిపోతాడు. అప్పుడు రావణుడు మరీ బాధ పడతాడు. ఇక మూడవసారి బయలుదేరి వస్తాడు. మహాఘోరమైన యుద్ధం జరుగుతుంది. రాము దతని శిరస్సులను ఖండిస్తూ వుంటాడు. ఎన్నిసార్లు ఖండించినా అవి తిరిగి మొలుస్తూనే వుండేవి. అప్పుడు విభీషణుడు రామునితో రావణ ప్రాణ రహస్యం చెప్పుతాడు. రాముడు దివ్యాస్త్రంతో రావణుని సంహరిస్తాడు.

"గగనం గగనాకారం సాగర స్సాగరోపమః
రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ"

అని అనన్వాలంకారానికి అనర్ఘోదాహరణంగా రామ రావణ యుద్ధం సాగిందని వాల్మీకి వర్ణించాడు. అపూర్వమైన ఆ యుద్ధంలో రావణుడు రాముని సత్యపరాక్రమాన్ని, సాత్త్వికతేజాన్ని గమనించినట్లు వాల్మీకం అక్కడక్కడా సూచించింది. అధ్యాత్మ రామునిచేతిలో - రావణుడు మృతినొందటానికే తెలిసి తెలిసి యుద్ధానికి వెళ్ళినట్లు - రామునివలన మరణం భవసాగరతరణం అని భావించినట్లుగా చిత్రిం చింది. ఆధునికులలో విశ్వనాథవారు రావణ పాత్రను జీవునివేదనకు ప్రతీకగా చిత్రించారు. రణరంగంలో రావణుడు రామతేజాన్ని లీలగా దర్శిస్తాడు. చివరిగడియల్లో జీవునికి చిన్మయమూర్తి చిరంతన వాసనా బలం వలన స్ఫురిస్తాడు. రామసైన్యం రావణునికి నారాయణ తరు వుగా, వైష్ణవ కల్పవృక్షంలా దర్శనమిస్తుంది.

"ఇది నారాయణ మూలమౌ తరువు నాయీ రాముఁ డన్పోదద, యొ
ప్పిదమై లక్ష్మణుఁ డన్న పంగయు, మహాభీష్మంబుల్ శాఖలై
ముదివగ్గై చను జాంబవంతుడు మరుత్పుత్త్రుండు సుగ్రీవుఁ డం
గద మైంద ద్వివిదుల్ గవాక్షగవయుల్గా వందలౌ వానరుల్.

ఇది యీ కొమ్మలు సాగకున్న మునుపే యేదీని భేదింపఁగా
మది నూహించితి జానకీహరణమ న్మందుం బ్రయోగించి మొం
డిది యీ చెట్టును కొమ్మలున్ విరిసి నిండెం బూలతోఁ బండ్లతో
జదలున్ సాగర మావరించినది యాశాసంతతిం గ్రుమ్ముచున్."

(రామాయణ కల్పవృక్షం)

ఆ వృక్షానికి మూలం నారాయణుడు. రణరంగంలో రామతరువుగా రావణునికి భాసించింది. అసురుడు సీతాపహరణమనే మందుతో ఆ వృక్షాన్ని విషవృక్షంగా మార్చి దహిద్దా మనుకొన్నాడు. కాని, చావులేని ఆ చెట్టు కొమ్మలు సాచి దిశదిశలు వ్యాపించింది. విషవృక్షంగా రామతరువును మార్చదలచుకొన్న దానవ యత్నం విఫలమైంది. కల్పవృక్షంగా నిలిచి కన్నుల పండువుగా దర్శనమిస్తోంది. ఆ తత్త్వాన్ని భావిస్తూన్న తరుణంలో రామబాణం రావణుని శరీరాన్ని కూలుస్తుంది. రావణునిలోని జీవతేజం రామునిలో లీనమవుతుంది.

రావణునిది వైరభక్తిమార్గం; విభీషణునిది శరణాగత భక్తి మార్గం. ఒక బాట మృతితో అంతమౌతుంది: మరొక బాట అమృతత్వ సాధనంతో అమరమౌతుంది. ఒకటి పరంలో పరంధాముని సన్నిధానాన్నందిస్తుంది; మరొకటి ఇహంలోనే ఈశ్వరుని సాన్నిధ్యాన్ని సమకూరుస్తుంది. ఒకటి వేదనామయమైన మార్గం: మరొకటి సాధనామయమైన మార్గం!

వైరభక్తిస్వరూపం విచిత్రంగా ఉంటుంది. జీవాత్మకు పరమాత్మకూ నడుమ అహంకారాన్ని ఆలంబనంగా చేసికొని మదమత్సరాలనే తెరలు వ్రేలాడుతూ ఉంటాయి. అందువల్ల జీవుడు పరమాత్మను చూడలేక, చూడనిదానిని నమ్మలేక, నమ్మకం లేకపోయినా ఉన్నదనే విశ్వాసం వీడలేక, అందనిదానికై అర్రులు చాస్తూ, అందుకోవాలన్న

వేదనతో వేగుతూ, అందలేదన్న బాధతో దానిపై ద్వేషాన్ని పెంచుకొని, దానిని గురించే విపరీతంగా భావిస్తూ, తనకే తెలియని ఒక సంతత సంస్కార చైతన్యంతో భగవంతుని గూర్చి సాగించే రాజస చింతనం ఈ భక్తిమార్గంలో గోచరిస్తుంది. త్యాగరాజ స్వామి అన్నట్లు మదమత్సరమనే తెరతీస్తే మధుసూదనుడు ప్రత్యక్షమౌతాడు. రావణుడు అహంకారానికి ప్రతీక. మదమత్సరాలు అహంకార జనితమైన అజ్ఞాన యవనికలు. రాముడు నారాయణుడని నమ్మలేని, నమ్మినా నరునిలో నారాయణుని చూడలేని అహంకారం అతనిని రామునికి దూరం చేస్తుంది. మాయను జయించినవాడు నారాయణుడైతే, తానూ మాయను జయించి ఆ స్థితిని సాధింపవచ్చుననే అహంభావం అతనికుంది. మాయా విజయానికి ముందు దేహాభిమాన విజయాన్ని సాధించాలి. రావణుడు దాన్ని సాధించలేని దేహాభిమాని. అతని దేహాభిమానానికి లంక ప్రతీక. త్రిగుణాలనే శిఖరాలమీద లంక నిలువబడి ఉంది. త్రిశిఖరాలు కూలిపోయాయి. అభిమానం ఆధారరహితమైంది. ఆలంబనం లేని అభిమానం మరో ఆలంబనంకోసం ఆరాటపడుతుంది. దాన్ని అందుకోలేక వేదనపడుతుంది. రాముని నాశ్రయిస్తే నిత్యమైన ఆధారం దొరుకుతుంది. కాని, రాముడే తానని తెలిస్తే జ్ఞానంకూడా లభిస్తుంది. ఆధార ఆధేయాలు రెండూ ఒకటి అనే అద్వైతాన్ని గ్రహించటానికి రావణుని అహంకారం అడ్డు నిలిచింది. అయినా, ఆ స్థితికోసం అతని జీవుడు వేదనపడుతున్నాడు. ఆవేదన వైరంగా సాగింది. అందులోనూ రామస్మరణం తైలధారవలె అవిచ్ఛిన్నంగా సాగింది. దేహపతనంతో అహంకారం అణగిపోతుంది: జీవుని వేదన మిగులుతుంది. వేదనయే ఆ జీవునిలోని అవ్యక్తమైన వెలుగు. ఆ వెలుగు వెలుగులో లీనమౌతుంది. భక్తుడు అహంకారాన్ని తనంతట తాను చంపుకోలేక వేదనపడితే దేవుడే వచ్చి దానిని చంపి తరణోపాయం చూపిస్తాడన్న తత్త్వానికి రావణ వైరభక్తిమార్గం మాణిక్యోదాహరణం.

